# వరద స్మృతి

లేఖలూ, వ్యాసాలూ, పత్రాలూ, ఛాయా చిత్రాలూ,
వివిధ రచనలూ-
అబ్బూరి వరద రాజేశ్వరరావు స్వీయకథనంతో

సంపాదకులు

అబ్బూరి ఛాయాదేవి
శీలా వీర్రాజు
కుందుర్తి సత్యమూర్తి

అబ్బూరి ట్రస్ట్

# VARADA SMRITI

Edited by Abburi Chaya Devi
Seela Veerraju
Kundurti Satya Murty.

3rd May 1994.

Cover page Photo by Dr. Gopala Krishna Abburi
Book Design and Layout by Seela Veerraju



Published by Abburi Trust,
HIG/B4/F4, Bagh Lingampally, Hyderabad - 500 044.

Price : Rs. 200

Copies available :
1. Abburi Trust, Hyderabad.
2. Visalandhra Book House, Hyderabad.

Composed by
Fontline Graphics
Bagh Lingampally, Hyderabad - 44.

Printed by
Planographers,
Chirag Ali Lane, Hyderabad - 500 001.

Cover Printed by
Kala Jyoti Process Pvt. Ltd.,
Hyderabad - 500 020.

# విషయ సూచిక

పేజీ

# మామాట

అబ్బూరి వరద రాజేశ్వరరావుగారికి ప్రయోగాలు చెయ్యడం అంటేఇష్టం–కవిత్వంలో కానీ, నాటకరంగంలో కానీ, పత్రికారంగంలోకానీ, ప్రచురణల్లో కానీ–ఏ ప్రక్రియ చేపట్టినా ప్రయోగాత్మకంగా ఆలోచించేవారు, ప్రయోగం చేసేవారు.

ఈ గ్రంథ సంకలనంలో కూడా వరద రాజేశ్వరరావుగారి ప్రయోగశీలతనే అనుసరించాము. ఇది కేవలం వరద సంస్మరణ సంచిక కాదు. ఇది 'వరదస్మృతి'. 'వరద' స్వీయ స్మృతులతో, 'వరద' సన్నిహితుల, స్నేహితుల, అభిమానుల, ఆత్మీయుల స్మృతులతో, 'వరద' అముద్రిత రచనలతో కూడిన సంకలనం ఇది.

వరద రాజేశ్వరరావుగారి జీవితకాలంలో ఎంతో మంది–వివిధ రంగాలకు చెందిన ప్రముఖులూ, సఖులూ ఆత్మీయంగా, ఆదరంగా, అనూహ్యంగా రాసిన అనేక లేఖలు వారి వారి అభిప్రాయాలనూ, అనుభూతులనే కాక, 'వరద' తో వారి కున్న అనుబంధానిక అద్దం పట్టేటటువంటివి. వాటిలో కొన్నిటిని ఈ సంకలనంలో పొందుపరిచాము.

వరద రాజేశ్వరరావుగారు రచించిన, సంపాదకత్వం వహించిన, ప్రచురించిన పుస్తకాలకు సంబంధించిన ముఖ్య వివరాలను తెలిపే పత్రాలతో పాటు ఆ పుస్తకాలపై ఆయా కాలాల్లో వచ్చిన కొన్ని సమీక్షలను కూడా సమకూర్చాము.

ఇవికాక, వరద రాజేశ్వరరావుగారి వ్యాసాలనూ, వారిపైన వచ్చిన వ్యాసాలనూ సందర్భానుసారంగా సంకలనంలో చేర్చాము.

వీటన్నిటినీ మించి, వరద రాజేశ్వరరావు గారి జీవితంలోని ముఖ్య సంఘటనలూ, ముఖ్యులూ కళ్లకుకట్టేటట్లు అనేక ఛాయా చిత్రాలను అక్కడక్కడ అవసరమైన చోట్ల అమర్చాము.

అయితే, ఈ లేఖలనూ, వ్యాసాలనూ, పత్రాలనూ, ఛాయా చిత్రాలనూ వివరించడానికి వరద రాజేశ్వరరావుగారి కన్న కుతూహలజనకంగా చెప్పగలిగిన వారెవరున్నారు? అందుకే వారి రచనల్నే ముఖ్యంగా ఆధారంగా చేసుకున్నాము. 'కవనకుతూహలం', 'వరదకాలం', 'నాట్యగోష్ఠి, నాలుగు నాటకాలు'–ఈ మూడు పుస్తకాల నుంచీ వరద రాజేశ్వరరావుగారు తమ పుట్టుకతో ప్రారంభించి వేరు వేరు సందర్భాల్లో ఉత్తమ పురుషలో చెప్పిన విశేషాలను కొన్నిటిని తీసుకుని, వాటిని కాలక్రమానుసారం అమర్చి, వాటికి సంబంధించిన లేఖలనూ, వ్యాసాలనూ, పత్రాలనూ, ఛాయా చిత్రాలనూ ఆ విశేషాలతోపాటు చేర్చాము.

వరద రాజేశ్వరరావుగారి వివరణలులేని సందర్భాల్లో అవసరమైన నేపథ్య వివరణని సమకూర్చాము.

ఆ విధంగా ఇది ఒక విలక్షణమైన స్మృతి కలశం.

అంతేకాదు. వరద రాజేశ్వరరావు గారి వివిధ అముద్రిత రచనల్ని కూడా ఆఖరి అధ్యాయంలో చేర్చాము (అముద్రిత 'తెలుగు' కవితల్ని కొన్నిటిని ప్రత్యేక సంపుటిగా ప్రచురిస్తున్నాము). ఇందులో చేర్చిన అముద్రిత రచనల్లో 1940 ప్రాంతాల నుంచి 1990 ల వరకూ మధ్య మధ్య రాసిన కథలూ, నాటకాలూ (స్వీయ రచనలూ, అనుసరణలూ), వ్యాసాలూ, వ్యాఖ్యలూ, ఆంగ్ల కవితలూ (అనువాదాలతో సహా) ఉన్నాయి. కథలూ, నాటకాలూ, అసంపూర్ణమైనవైనా, సరళంగా,

ధారాళంగా సాగే 'వరద' వచన శైలికీ, సున్నిత మనస్తత్వానికీ, తాత్త్విక విచార ధోరణికీ మచ్చుతునకలు అవి. వీటికి తోడు కొన్ని 'వరదోక్తులు' చేర్చాము.

ఈ సంకలనంలో అక్కడక్కడ అందంగా అమర్చినవి వరద రాజేశ్వరరావుగారు తమ జీవిత కాలంలో సేకరించిన కొన్ని కళాఖండాల చిత్రాలు.

సంకలనం ఆఖరులో అందించిన నామ సూచిక పాఠకులకు సహకరించడానికి ఏర్పరచినది.

ఈ సంకలనం గురించి మరొక ముఖ్య విషయం ప్రత్యేకంగా చెప్పుకోవలసి ఉంది. ఇందులోని లేఖలూ, పత్రాలూ, వ్యాసాలూ, మొదలైనవి తెలుగులోనూ, ఇంగ్లీషులోనూ కలగలపుగా ఉండటం వరద రాజేశ్వరరావుగారి జీవిత విధానానికీ, మన ఆధునిక జీవన సరళికీ ప్రతీకగా తీసుకోవచ్చు. ఈ సంకలనంలో తమ తమ లేఖలనూ, వ్యాసాలనూ, ఇతర రచనలనూ చేర్చడానికి ఆత్మీయ భావంతో, ఆదరాభిమానాలతో ఆమోదించి, ప్రోత్సహించి, సహకరించిన సహృదయులందరికీ కృతజ్ఞతాభివందనాలు. ముఖ్యంగా, ఆది నుంచీ ప్రోత్సహించి, అడుగడుగునా సలహాలిస్తూ సహకరించిన శ్రీ సత్తిరాజు కృష్ణారావు గారికీ, ఈ సంకలనాన్ని పూర్తి చేయటంలో విశేషంగా సహకరించిన శ్రీ ఎన్.వి. గోపాలశాస్త్రి, డా. మృణాళిని, డా. చేకూరి రామారావు, శ్రీ పి. వామన్‌రావు, శ్రీ ఎ.బి.కె. ప్రసాద్, శ్రీ ఆలపాటి రవీంద్రనాథ్, శ్రీ భరత్‌భూషణ్, శ్రీ వాసిరెడ్డి నవీన్, శ్రీ ఎస్.ఎమ్. కేతా, శ్రీ సమ్మెట నాగమల్లీశ్వరరావు, శ్రీమతి వరకాల నిర్మల, శ్రీ పి.జి. అప్పారావు, శ్రీ హరిశంకర్, శ్రీమతి వై. నిర్మల గార్లకూ, ఇతర మిత్రులకూ, అబ్బూరి కుటుంబ సభ్యులకూ అపార కృతజ్ఞతలు.

సంపాదకులు



# వరద విజ్ఞానసర్వస్వం

డా. సి. మృణాళిని

చాలా మంది గురించి చాలా చెప్పి, తన గురించి చాలా దాచిపెట్టిన విలక్షణమైన వ్యక్తి 'వరద' గారు. ఎన్నో 'సీరియస్' పనులు ఎంతో 'సీరియస్ నెస్' తో చేసి కూడా, వాటిని గురించి సరదాగా మాట్లాడడం ఆయన ప్రత్యేకత. వరదగారి చమత్కారంలో కొట్టుకుపోని తెలుగువారి సంఖ్య అతిస్వల్పం. విశ్వనాథవారి నుంచి వ్యవసాయదారుల కార్యక్రమాల వరకు ఆయన చతురోక్తులకు గురి కాని వ్యక్తులు, విషయాలు లేవు.

క్షణాల్లా గడిచిపోయే గంటల కబుర్లలో ఆయన అభిరుచులు, అయిష్టాలు, అధిక్షేపాలూ బయట పడేవిగానీ, ఆయన అంతర్యం చాలామందికి పూర్తిగా తెలిసేదికాదు. మన కెంతో బాగా తెలిసిన వ్యక్తుల్లో కూడా మనకు తెలియని 'మరో కోణం' ఉండడం సహజం. 'వరద' గారిలోని ఆ 'మరో ముఖాన్ని' కూడా ఆవిష్కరించేదే 'వరద స్మృతి'.

ఇది సంస్మరణ సంచికే గానీ, మామూలు సంస్మరణ సంచిక కాదు. అంటే, మామూలు సంచికల్లా ఇతరులు ఆయన గురించి రాసిన వ్యాసాలతో కూడుకున్న గ్రంథం కాదు. రకరకాల ఆకృతుల్లో వున్న అద్దాల గది మధ్య వరద రాజేశ్వరరావుగారిని నిలబెట్టిన పుస్తకమిది. కథకుడిగా, విమర్శకుడిగా, సాహితీప్రియుడిగా నాటక రచయితగా, మిత్రుడిగా, హాస్యచతురుడిగా స్వీయ చరిత్రకారుడిగా, 'ఖైదీ'గా, కవిగా–సకల రూపాల్లో వరద వ్యక్తిత్వాన్ని ఆవిష్కరించిన వరద విజ్ఞాన సర్వస్వమిది. అందరికీ తెలిసిన 'కవన కుతూహలం', 'వరదకాలం', 'నాట్యగోష్ఠి ....' 'కవితా సంచిక' వంటి రచనల్లోని కొన్ని భాగాలు, పత్రికల్లో రకరకాల విషయాలపై వ్యాసాలు, ఆయన రాసిన ఉత్తరాలు, ఆయన అందుకున్న ఉత్తరాలు, ఆయన జైలు డైరీ, అముద్రిత, అసంపూర్తి రచనలు, వారి కథనంలోనే వారి జీవితంలోని ముఖ్యఘట్టాలు.... ఇదీ ఈ సంకలనం స్వరూపం.

ఇది సంకలనమేగానీ, మామూలు సంకలనం కాదు. డాక్యుమెంటరీకి అతి సన్నిహితంగా ఉన్న గ్రంథం. సంకలనాల్లో ఇంతవరకు ఎవరూ ఉపయోగించని సరికొత్త 'టెక్నిక్' ఇందులో వుంది. ఆయన జీవితంలో – వ్యక్తిగతం గానీ, సాహిత్యం

గానీ-ఒక్కొక్క విషయానికీ, ఘట్టానికీ సంబంధించిన ప్రతి అంశాన్నీ ఒక చోట కూర్చడం, వీలైన చోటల్లా ఫొటోలతో మరింత పుష్టిని చేకూర్చడం- ఈ లిఖిత సంకలనానికి డాక్యుమెంటరీ రూపాన్నిచ్చాయి.

ఒక్కమాటలో చెప్పాలంటే, వరద రాజేశ్వరరావుగారిలో ఉన్న గుణాలన్నీ ఈ సంకలనంలోనూ ఉన్నాయి. కాసేపు తాత్త్వికంగా, కొంతసేపు ఆర్ద్రంగా, మరికాసేపు చిలిపిగా, ఇంకొంచెంసేపు గంభీరంగా-వెక్కిరిస్తూనే ఆదరిస్తూ, ఆదరిస్తూనే అభిశంసిస్తూ అంతులేని ఆత్మీయతను పంచిపెడుతూ, అన్నితరాల వారినీ ఆకర్షిస్తూ, ఎందరిలోవున్నా తన ఉనికిని నిలబెట్టుకుంటూ, ఏకాలం వారికైనా సమకాలీనుడవుతూ, తనతోపాటు అనంతమైన చైతన్యాన్నీ, ఆనందాన్నీ, హాస్యాన్నీ తీసుకువెళ్ళిపోయిన 'పర్‌ఫెక్షనిస్టు' వరద రాజేశ్వరరావుగారికి,

ఒక అద్భుతమైన నివాళి ఈ పుస్తకం.

అంతేకాదు,

కనుమరుగైన వారిని మళ్ళీ మళ్లీ కళ్ళారా చూసుకోడానికి వారి అభిమానులకు, ఆత్మీయులకు వారి 'ఛాయ' ఇస్తున్న కానుక ఈ పుస్తకం.

* * *



# TRULY A GENIUS

**Gopalachakravarty**

If only Varada (Varada Rajeswara Rau Abburi to give his full name) was born in England he would have been hailed as an Oscar Wilde for his ready wit. This quality of ready wit was imbibed by Varada from his father, Abburi Ramakrishna Rau, a pioneer in Telugu literature to be ranked with Gurazada and Rayaprolu.

Varada was again a Gertrude Stein and Ezra Pound of Telugu literature. Varada was an intimate acquaintance of many a stalwart of literature and journalism - Viswanatha, Krishna Sastri, Chalam, Sri Sri, Arudra, Kundurti, Rukmininatha Sastri, Khasa Subba Rao, Kotamraju Rama Rao, K. Iswara Dutt and what have you — and like Pound he was a well spring of inspiration to a generation of talented writers. Varada was cast in the mould of a renaissance scholar. A front ranking poet, delightful essayist, gifted playwright, scintillating conversationalist and raconteur he was a pioneer in the field of working journalists movement and was also associated with a leading publishing firm in Delhi for several years.

In the early days immediately after completing his B.A. Honours at Visakhapatnam Varada had a brief stint in Andhra Prabha and Indian Express. He worked with the well-known journalist K. Iswara Dutt at Hyderabad before Police Action.

Varada always longed for a forum for modern poetry and therefore brought out two issues of Telugu modern poetry in 1954. Later he got rendered Telugu poetry into English and brought out the volume of Modern Telugu Poetry in 1956 under the editorship of his wife Abburi Chaya Devi. Some of the best poems drawn from all Indian languages was published in another anthology of Modern Indian Poetry. The Modern Indo -

Anglian poetry was published in 1959 and Modern Assamese poetry in 1960.

With unbounded love for classicism, Varada always endeavoured to usher in modernity in literature. He is truly a genius as described by P. Lal, the well - known Indo -Anglian poet and thinker.

Varada was always young at heart and there was never a dull moment in his company. In these days in which mediocre writers and shams masquerade as master writers Varada suffered in silence. His departure leaves a void which can never truly be filled.

I whole heartedly congratulate my sister Smt. Chaya Devi for her painstaking efforts in bringing out this volume. Varada with his wit and intellect, his love for classicism and true art and his vitality and zest for life will live in our hearts for ever.

* * *





# బాల్యం, కవులతో పరిచయాలు

## జననం : 1923

*'శారద', నేనూ ఒకే సంవత్సరంలో పుట్టాము.

మా నాన్నగారు తెనాలి హైస్కూలులో...చదివారు. తెనాలి దగ్గరగా ఉన్న జెముడుపాడు స్వగ్రామం. అక్కడ మా తాతగారు లక్ష్మీనరసింహశాస్త్రిగారు మునసబు. సంస్కృత భాషను క్షుణ్ణంగా అధ్యయనం చేసినవారు.. మా తాతగారికి చిన్నతనంనుంచీ సంస్కృతం నేర్చుకోవాలని విపరీతంగా అభిలాష ఉండేది. అయితే ఆ శాఖేతరులకు ఆ గురుకులాల్లో ప్రవేశార్హత ఉండేది కాదు. ఇది గ్రహించి మా తాతగారు యిల్లు వదిలిపోయి పేరు చివర శాస్త్రి అని తగిలించుకుని ఒక గురుకులంలో చేరారు.... ఆ విధంగా మా తాతగారు సంస్కృతంలో నిష్ణాతులయ్యారు. ఆయన సంస్కృతంలో కవిత్వం చెప్పేవారే కానీ ఆయన శ్లోకాలు లభ్యం కాలేదు... మా ముత్తాతగారు సంస్కృతం, ఆంధ్రం, స్వయం కృషివల్లా, స్నేహితుల దగ్గరా అభ్యసించి ఆ రెండు భాషల్లోనూ ప్రావీణ్యం సంపాయించటమే కాక ఆ రెండు భాషల్లోనూ కవిత్వం అల్లేవారని ప్రతీతి. వారి రచనలూ లభ్యంకావు. వారి పేర చాలా చాటువులు గుంటూరు ప్రాంతంలో వింటూ వుంటాము. వారి పేరు అప్పయ్యగారు.

## బందరులో : 1923 – 26

మేం బందరులో ఉన్నప్పుడు బాపిరాజుగారు నన్నెరుగుదురు. నేనాయన్నెరగను... నేనప్పటికి పసికందును. నన్నెత్తుకుని ఆడించేవారిలో మల్లాది రామకృష్ణశాస్త్రి పింగళి నాగేంద్రరావు, కౌతా రామమోహన శాస్త్రి ప్రభృతులు ముఖ్యులు. ఆ రోజుల్లో బాపిరాజుగారు కూడా నన్ను లాలన చేసేవారని ఆయనే నాతో ఒకసారి చెప్పారు.

ఇదివరకే చెప్పాను. నా చిన్నతనంలో బందరులో రామకృష్ణశాస్త్రిగారు నన్నెత్తుకుని ఆడించేవారని... ఆయన మా నాన్నగారికి అత్యంత సన్నిహితుడుగా ఉండేవారు. మా నాన్నగారు ఒకే నవల, పిల్లలం మేము జబ్బునపడ్డప్పుడు రాత్రి మా కోసం మేలుకొని కాలాన్ని వెళ్ళబుచ్చేందుకు రాశారు. మా నాన్నగారు చెబుతుంటే రామకృష్ణ శాస్త్రిగారు రాత్రిళ్ళు మా నాన్నగారికి తోడుగా వచ్చి కూచుని రాసిపెట్టేవారు...

---

* ['శారద' పత్రిక బందరులో; 'వరద' మద్రాసులో కళ్యాణి ఆసుపత్రిలో]

బందరులో మేమున్నప్పుడు నా చిన్నతనం వల్ల శాస్త్రిగారు గుర్తులేరు. .... చాలా ఏళ్ళ తరవాత యుద్ధకాలంలో మొదటి సారిగా బెజవాడలో కలిశాము.

ఓసారి మేము బందరులో ఉన్నప్పుడు వెంకటశాస్త్రి గారింటికి నన్నెత్తుకుని తీసుకుపోయానని మల్లాది రామకృష్ణశాస్త్రిగారు చెప్పినప్పుడు ఆనందంతో ఉప్పొంగిపోయాను.

అప్పటికి జ్ఞానంలేకపోయినా ఆనాటి బందరు సంస్కారంలో నా జీవితారంభం నా పూర్వజన్మ సుకృతం.

## బెజవాడలో : 1926 – 30

ఆంధ్ర విశ్వ విద్యాలయం ఆగస్టు 1926 ప్రాంతాల్లో ఆరంభమయింది... అప్పుడు మా నాన్నగారితోపాటు నేనూ బందరు నుంచి బెజవాడకు వచ్చాను. నేను కాలు పెట్టినప్పటి బెజవాడ నాకు లీలగా గుర్తు. నాలుగేళ్ల ఆ వూళ్ళో ఉన్నందువల్ల కొన్ని ప్రాంతాలూ, కొందరు మనుషులూ నాకు బాగా గుర్తు. నాకు సాహిత్యాభ్యాసం బెజవాడలోనే. అప్పటికి మా నాన్నగారు కవి అనిగానీ, పేరు సంపాయించిన రచయిత అని గానీ నాకు జ్ఞాపకం లేదు. ప్రసిద్ధులైన రచయితలూ, కళావేత్తలూ, కళాకారులూ మా యింటికి వచ్చి పోతుండేవారు. అయినా సాహిత్యంలో కానీ, కళారంగంలో కాని మా నాన్నగారికోస్థానం ఉన్నదనే జ్ఞానం నాకా రోజుల్లో లేదు. ఎందువల్లనో నాకిప్పటికీ అర్థం కాదు .... గ్రంథాలయాధినేతగా ఒక బల్లా, ఒక కుర్చీ, రెండు బీరువాలతో మా నాన్నగారు ... గ్రంథాలయాన్ని ప్రారంభించారు... ఆంధ్ర విశ్వవిద్యాలయ గ్రంథాలయంగా ప్రారంభమైన గృహప్రాంగణం కన్నుల పండుగగా ఉండేది. రెండుమూడు సార్లు నేనా గ్రంథాలయానికి వెళ్ళాను.

మా యిల్లు గవర్నరు పేటలో ఉండేది. మా వీధి చివర ఎదురుగుండా అయ్యదేవర కాళేశ్వరరావుగారిల్లు. మా యింటివెనుక వీధిలో అప్పుడే వచ్చిన చాగంటి సూర్యనారాయణ మూర్తిగారు వైద్య వృత్తి ప్రారంభించారు. సూర్యనారాయణమూర్తిగారు సాహిత్యప్రియులూ, స్నేహశీలురూ, జాతీయవాదులూ కావటం చేత ఆయన దగ్గర వైద్యానికి చాలామంది వచ్చేవారు. మా నాన్నగారితోపాటు చాలాసార్లు వాళ్ళింటికి వెళ్ళేవాడిని.

మా చిన్నతనంలో మా ఇంట్లో ఖద్దరే వాడేవాళ్ళము. ముఖ్యంగా ఉప్పు సత్యాగ్రహం ఆరంభమయిన రోజుల్లో – మా అమ్మగారు బెజవాడలో అయ్యదేవర దుర్గాంబగారి నాయకత్వం కింద సత్యాగ్రహం కూడా చేశారు. ఇంట్లో రాట్నం,

తళిలీలు తయారయి కూచున్నాయి. పిల్లలం ఎవరికి తోచినట్లు వారు నూలు వడికేవారం. కొన్నాళ్ళకు దీన్నంతా తీసుకుపోయి నేయించేవారు మా నాన్నగారు. అలా తయారైన గుడ్డ ఓ అపురూపమయిన గోనెగుడ్డలా ఉండేది. మా చొక్కాలూ, లాగూలూ దాంతోనే కుట్టించేవారు. అలా బట్టలు వేసుకుని తిరుగుతూంటే మా వీధిలో విడ్డూరంగా ఉండేది. అన్నిచోట్లా ఛాతీ విరుచుకుని తలెత్తి తిరుగుతూ ఉండేవాళ్ళము.

మేము బెజవాడలో ఉన్న రోజుల్లో భారతదేశ మంతటా స్వాతంత్ర్యోద్యమ సంచలనమే ముఖ్యాంశంగా ఉండేది. ..1929 సంవత్సరం. మహాత్ముడు ఆంధ్రదేశ పర్యటనకై బెజవాడ వచ్చారు. మహాత్ముడు ప్రసంగిస్తూ ... తన ఖద్దరు నిధికి తోడ్పడమని ప్రార్థించారు... వేదిక మీద కూచున్న ఒకావిడ తనవేలి ఉంగరాన్ని తీసి మహాత్ముడికిచ్చింది. ... వేదిక దగ్గరకు పోయాను. ... నా ఉంగరాన్ని ఆయన కిచ్చాను. 'నాకిమ్మని నీకెవరు చెప్పారు' అని మహాత్ముడడిగారు. 'నాకెవరూ చెప్పలేదు. నా అంతట నేనే యిస్తున్నాను'. అంతే, మహాత్ముడు నన్ను చేరదీసి 'పిల్లలు భగవత్స్వరూపులు ...' అన్నారు. ... తరువాత .... స్త్రీలందరూ తమవొంటి మీద ఉన్న ఆభరణాలన్నీ మహాత్ముడికి ఒకరి తరవాత ఒకరు వచ్చి దానం చేశారు... ఈ ఉదంతం అప్పటి ఆంధ్రపత్రికలో అచ్చయిందిట.

మరీ చిన్నతనంలో ఓసారి గుంటూరులో మా మేనత్త బియ్యం చేసుకుంటున్నప్పుడు నేను పక్కనే కూచున్నాను. చేటలో బియ్యాన్ని అటూ ఇటూ చెరుగుతున్నప్పుడు ఆవిడ ఓ పద్యం అతి నాజూగ్గా చదవటం విన్నాను... ఎవరా పద్యాన్ని రాశారో తెలియదు... ఓ రోజున మా ఇంటికొకాయన వచ్చారు... ఆయన పద్యం చదివిన వైనం నన్ను ముగ్ధుణ్ణి చేసింది. ఆయన వెళ్ళిపోయింతరవాత మానాన్నగారి నడిగాను ఆయనెవరని. నా వంక చూసి నవ్వుతూ 'అత్తయ్య చదివిన పద్యం రాసింది ఈయనే. పేరు విశ్వనాథ సత్యనారాయణ' అని చెప్పారు. ఆ నాటినుంచీ ఆయనంటే ఓ విధమైన గౌరవం ఏర్పడింది. ఆయన్ని మళ్ళీ ఓసారి చూసి ఆయన చేత పద్యాలు చదివించి వినాలనే కోరిక నాలో దినదిన ప్రవర్థమానమవుతూ వచ్చింది.

... మా మేనత్తగారి నోట విన్న పద్యాలు మాత్రం నా మనస్సును అంత చిన్న వయస్సులోనే వికలం చేయటం నాకు గుర్తుంది. భగవంతుడనే అగోచర ధ్యేయాన్ని నేను శంకించటం ప్రారంభించాను... సత్యనారాయణగారి కవిత్వం అలా శైశవంలో, నా కౌమారంలో పెద్ద మార్పు తెచ్చింది.

*[వరద రాజేశ్వరరావుగారిని ప్రభావితం చేసిన విశ్వనాథ సత్యనారాయణగారి పద్యాలు ]*

*" నా కనుల యెట్ట యెదుటన నా జనకువి*
*నా జనని కుత్తుకం  కోసి నన్నడిగెన*
*తండు 'నేదయాంబుధివి కాదా' యటంచు*
*ఓ ప్రభూ! యగునంటినే నాదిగి యుండి*

*నా కనుల యెట్ట యెదుటన నా లతాంగి*
*ప్రాణములు విల్చ్యనందీసి యడిగెనను న*
*తండు 'నేదయాంబుధివి కాదా' యటంచు*
*ఓ ప్రభూ! యగునంటి నేనాదిగి యొదిగి*

*నా కనుల యెట్టయెదుటన నా యనుంగు*
*తనుజు కుత్తుకనులిమితానను నడిగెన*
*తండు 'నే దయాంబుధివి కాదా' యటంచు*
*ఓ ప్రభూ! నీ వయంటి నే నాదిగి పోయి."*

బందరునుంచి బెజవాడ వచ్చి అక్కడ దాదాపు నాలుగు సంవత్సరాలు మాత్రమే వున్నాము. మా యిల్లు గవర్నరు పేటలో ఉండేది... అక్కడికి తరచూ వచ్చే వారిలో బసవరాజు అప్పారావుగారొకరు... మా యింటి కొచ్చినప్పుడొకసారి నన్ను పిలిచి 'నీకెవరి మీదన్నా కోపం వస్తే నువ్వేం చేస్తావ్' అన్నారు. 'కాళ్ళు నరికేస్తాను – కళ్ళు పీకేస్తాను' అన్నాను. నీకన్నా చిన్న వాళ్ళమీద కోపం వస్తే యేం చేస్తావన్నారు. 'చెవులు మెలేస్తాను – దవడ వాయిస్తాను' అన్నాను. నన్ను చేరదీసుకుని అమాంతం, 'నువ్వుకవిత్వం రాస్తావోయి' అని ఆశీర్వదించారు. మా నాన్న గారిని పిలిచి ఈ మాటలు వినిపించి, మీ వాడికిప్పట్నుంచే ఛందస్సు మీద అధికారమొచ్చిందోయి అన్నారుట.

ఈశ్వరదత్తుగారు 'హిందూ' పత్రికలో పనిచేస్తుండగా మా నాన్నగారిని మదరాసు విశ్వవిద్యాలయంలోని గ్రంథాలయ పద్ధతిని పరిశీలించేందుకు రామలింగారెడ్డిగారు పంపించారు. మా నాన్నగారక్కడ ఓ నెల రోజులపాటు వుండాలి. నన్నూ వెంటతీసుకుపోయారు... అప్పుడప్పుడే పద్యాలు రాయటానికి ప్రయత్నిస్తుండే వాణ్ణి... సొంత పేరూ ఊరూ మీద సీసపద్యం రాయాలని తపన. చచ్చీ చెడి పదిరోజులు తంటాలుపడ్డాను. మా నాన్నగారికి తెలియకుండా ఎలాగో అలాగా మొదటిపద్యం ఒకటి తయారవుతోంది.... అప్పుడొచ్చింది చిక్కు, ఒక మధ్యాహ్నం

చడీచప్పుడు లేకుండా దివాన్ బహద్దూర్ ... మోచర్ల రామచంద్రరావుగారు వూరినుంచి వచ్చేశారు. వచ్చీ రావటంతో నేనున్న గదిలోకి వచ్చి చేతికర్రతో నిలబడ్డారు. ఆయనెవరోనాకు తెలియదు. ఆయన మా నాన్నగారి పేరడిగారు. మర్యాదగా చెప్పాను. ఆయన కవిత్వం రాస్తారుకదూ అన్నారు. రాయరు అన్నాను. నువ్వు రాస్తావా అన్నారు. అవునన్నాను. అలా అయితే ఓ పద్యం చెప్పు అన్నారు. నేను మొదలుపెట్టాను.

*హరితసగోత్రమ్ము ఆబ్బూరివంశమ్ము*
*వరదరాజేశ్వరుడరయ పేరు*
*మదరాసు నగరాన మా తండ్రి తోడుగా*
*చూడవచ్చితి నెల్ల చోద్యములను*
*మోచర్ల రామచంద్రార్య గృహమునందు*
*కొన్నాళ్లు వానమ్ము కోరినాము...*

మదరాసులో మోచర్ల రామచంద్రరావుగారి బంగళాలోని అతిధి గృహంలో మాకు విడిది ఏర్పాటు చేశారు ఈశ్వరదత్తుగారు. నాగదిలోకి వచ్చి నాచేత పద్యం చదివించింది మోచర్ల రామచంద్రరావుగారని నాకా క్షణంలో తెలియదు...

*[మదరాసు నుంచి ఇంటికి తిరిగి వచ్చేముందు శతకం రాయాలనే కోరికతో రాసిన మొదటి పద్యం ]*

*ట్రాము లేగు పెద్ద రాజవీధులయందు*
*రోడ్డుమధ్య నడక గడ్డుమాట*
*కాలిబాటెదిక్కు- కడకు చెన్నపురాన*
*వెర్రివాని దురద వినర వరద*

నా ఎనిమిదోయేట 'శారదాపరిణయము' అనే నాటకాన్ని రాసి పెద్దలందరిలోనూ సంచలనం కలిగించాను. ఆ రోజుల్లో కవులూ, నటులూ, నన్నో వింతగా చూడ్డానికి మా యింటికొచ్చేవారు.





# విద్యాభ్యాసం, కవులతో సాన్నిహిత్యం

## విశాఖపట్నంలో : 1930 – 42

*[ఆంధ్ర విశ్వవిద్యాలయంతోపాటు అబ్బూరి వారి కుటుంబం బెజవాడ నుంచి వాల్తేరుకి తరలి వెళ్ళింది ]*

మేము వాల్తేరు వెళ్లిన కొన్నాళ్ళపాటు రాత్రిళ్ళు సరిగా నిద్రపట్టేదికాదు. సముద్రపుహోరూ, భీకరంగా నక్కల అరుపులూ రాత్రిళ్ళను శబ్దమయం చేసేవి.

... మా ఇంట్లో ఒక విషాద సంఘటన జరిగింది. మా ఇంట్లో అందరం అల్లారు ముద్దుగా చూచుకుంటున్న మా చెల్లెలు సుజాత వ్యాధి పీడితురాలయి ప్రాణాలు కోల్పోయింది. ఆ విషాదఘట్టాన్నుంచి మరో ఆర్నెల్లదాకా మేమెవరమూ కోలుకోలేదు. సరిగ్గా ఆర్నెల్ల తర్వాత మా చెల్లెలి మరణం మీద నేను పద్యాలు రాశాను.



[కుడివైపు: 'వరద', ఎడమవైపు: పెద్దచెల్లెలు రాజ్యలక్ష్మి; మధ్యలో-కుర్చీలో చిన్న చెల్లెలు సుజాత; వెనకవైపు అన్న వాణీకుమార్-1931 [ప్రాంతంలో]

*[వాల్తేరులో కాకతాళీయంగా అయిన పరిచయంలో విజయనగరం రాజావారు ముచ్చటపడి అడిగిన వెంటనే 'వాల్తేరు' మీద 'వరద' చెప్పిన పద్యంలో కొంత భాగం.]*

***కలలోని కలవోలె కనుపించు నీతీరు***

***కడలి పక్కను కొండ కనుమ పక్కనె ఊరు***

***........***

***వర్ణనాతీత మిది వాస్తవము వాల్తేరు!***

వాల్తేరు వచ్చిన కొత్త రోజుల్లో మా నాన్నగారు విశాఖపట్నంలో ఖద్దరు దుకాణం కోసం వెతకటం మొదలుపెట్టారు. అక్కడో ఖాదీభాండారం ఉన్నదని విన్నారు... శివాలయం వీధి నానుకుని ... ఆ దుకాణంలో కూచున్న వ్యక్తి పురిపండా అప్పలస్వామి... ఆ తరవాత కొన్నాళ్ళకు శ్రీరంగం శ్రీనివాసరావునూ, సబ్బనీసు సత్యకేశవరావునూ, కాళూరి వెంకటనరసింగరావునూ వెంటబెట్టుకుని మా ఇంటికొచ్చారు. అప్పలస్వామి గారితో మా పరిచయం అలా ప్రారంభమయింది...

***నీవు వినరిన పూలమాలిక దైవ సన్నిధి చేరలేదిక***

***అవుమావుము ఆర్తనాదము, ఆలయమునకె పోదము"***

... అందరూ నా పద్యం విన్న తరవాత ప్రశ్నలు తరవాత ప్రశ్నలు వేశారు. నిజంగా ఆ పద్యం నేను రాసిందేనా అనే అనుమానం వారికి వచ్చినట్లు నాకు అనిపించింది. ... శ్రీరంగం శ్రీనివాసరావు మాత్రం నా వెనకాలే నిలబడి సిగరెట్టు తరవాత సిగరెట్టు కాలుస్తూ, కాశ్శేపయింతరవాత వండర్‌ఫుల్ అన్నాడు. అప్పలస్వామిగారు, మళ్ళీ మా యింటికొచ్చినప్పుడు తనతో ఒక రోజు పట్నం తీసుకుపోతానని చెప్పారు.

మేము వాల్తేరులో నివాసం ఏర్పరచుకున్న అనతికాలానికే మారేపల్లి రామచంద్ర శాస్త్రిగారితో నాకు పరిచయమయింది... ఓ రెండేళ్ళ తరవాత మా చదువుల కోసం మా నాన్నగారు విశాఖపట్నంలో ఇల్లు తీసుకున్నారు. అక్కడ ఉన్నప్పుడు 'కవిగారి'తో పరిచయం సన్నిహితమయింది నాకు... ఓ సంవత్సరం పాటు కవిగారు నన్ను అచ్చ తెలుగుపిచ్చిలో పడేశారు. అచ్చతెలుగులో ప్రతీదీ రాయడం అభ్యాసం చేయటం ప్రారంభించాను. సాంబ నిఘంటువు సంపాయించి ఆ నిఘంటువు మీద పరిపూర్ణమైన అధికారాన్ని చేపట్టాను.

శ్రీనివాసరావు సూచనవల్ల స్థానాపతి సత్యనారాయణగారి కోరికమీద నేను వాళ్ళింట్లో సంస్కృతం, తెలుగూ అభ్యసించేందుకు మానాన్నగారు వప్పుకున్నారు. ఒక శుభముహూర్తాన ఉదయంపూట విశాఖపట్నంలోని వాళ్లింట్లోకి మకాం మార్చాను.

కోటకూ, హార్బరుకూ పోయే దారిలో మెయిన్ రోడ్డు నానుకుని విశాఖపట్నంలో కన్యకాపరమేశ్వరీ దేవాలయం ఉంది. స్థానాపతి సత్యనారాయణ శాస్త్రిగారు ఆ దేవాలయంలో పూజారి. శాస్త్రిగారింట్లో ఉంటూ ఆయన దగ్గర సంస్కృతమూ, తెలుగూ అధ్యయనం చేసేవాణ్ణి. అప్పటి కింకా నేను స్కూల్లో చేరలేదు. .. ఆ రోజుల్లో శాస్త్రిగారింట్లో ఉదయం పూట అమరం, బాలరామాయణం చదివించేవారు. మధ్యాహ్నం మనుచరిత్ర. అన్నీ కంఠస్థం చెయ్యాలిసొచ్చేది.

కన్యకాపరమేశ్వరీ దేవాలయావరణంలో నా సంస్కృతాధ్యయనం ఓ కొలిక్కి వొచ్చింది కాదు. సాహిత్య సాంగత్యం ఎక్కువయి భాషాభ్యాసంమ్మీద ఆసక్తి పోయింది. కవులూ, కథకులూ, సాహితీ క్షేత్రంలో వ్యవసాయం చేసే బహుముఖ ప్రజ్ఞ వున్నవారూ తరుచూ విశాఖ వీధుల్లో తటస్థపడటం వల్ల వాళ్ళతో పాటు తిరిగేవాణ్ణి... ఆ తరుణంలో శ్రీనివాసరావు మదరాసు నుంచి చదువు ముగించుకుని విశాఖపట్నం వచ్చేశాడు... నన్ను తనతో వూళ్ళో తిరగటానికి తీసుకు పోయాడు... స్కూల్లో ఎప్పుడు చేరుతున్నావన్నాడు. ఈ సంవత్సరం మానాన్నగారు స్కూల్లో వేస్తారని అన్నారన్నాను. అయితే అలానే స్కూల్లో చేరి, ఇంగ్లీషులో కూడా ప్రావీణ్యం సంపాదించు, ఇంగ్లీషు కవిత్వం చదివితేనేకాని మనం తెలుగు కవిత్వానికి కొత్తమార్గం వెతక లేమన్నాడు.

*[మొదట్లో వరద రాజేశ్వరరావుగారిని విశాఖపట్నంలోని సి.బి.ఎమ్. హైస్కూల్లో చేర్పించారు. ఆ స్కూల్లో చేరిన తరవాత కూడా స్థానాపతి సత్యనారాయణగారింట్లో ఉంటూ సంస్కృతాధ్యయనం కొనసాగించారు. ఆ సమయంలో తల్లిదండ్రులు కొన్నాళ్లు బెజవాడలో ఉన్నారు. తండ్రి బెజవాడలో ఉండగా తండ్రికి ఉత్తరాలు రాసేవారు.]*

Vizagapatam
25 - 9 - 31

నాన్న
మీరు వ్రాసిన ఉత్తరము అందినది. [illegible]
[illegible] కొన్ని [illegible]
శలవు ఇచ్చేరు. అందుకని ఉత్తరము
26 తారీకు నుండి [illegible] నాకు [illegible]

[illegible]

[ఇది వరద రాజేశ్వరరావుగారి పెద్ద చెల్లెలు సత్తిరాజు రాజ్యలక్ష్మిగారు అపురూపంగా దాచుకున్న కుటుంబ లేఖల్లో ఒకటి.]

## స్కూలు రోజులు : 1932–37

విశాఖపట్నంలో స్కూల్లో చేరాను. అక్కడ మిసెస్ ఎ.వి. యన్. కళాశాలకు అనుబంధంగా వున్న ఉన్నత పాఠశాలలో రెండోఫారంలో చేరాను. అంచేతనే నా సంస్కృతాధ్యయనానికి అంతరాయం యేర్పడింది.

మొదటిసారిగా నేను పాఠశాలలో ప్రవేశించిన సంవత్సరమే ఒక చోట... పద్యాలను చదవటం, ... మరో సహ విద్యార్థి ... ముగ్ధుడయిపోయి నేనంటే విపరీతమయిన అభిమానమూ గౌరవమూ కల్గి నాకు పరమాప్తుడయినాడు. అతని పేరు రాచకొండ విశ్వనాథ శాస్త్రి.

*[చెల్లెలు మరణం మీద రాసిన ఆ పద్యాలలో వరద రాజేశ్వరరావుగారికి గుర్తున్న భాగం ]*

**నాన్నగారి వేదాంతమ్మునెన్నిసార్లు**
**వినుచు నోపిక వట్టగలనని తలచి**
**స్వామి గుడి వాకిలింజేరి ప్రార్థనమ్ము**
**చేసినా నొకమారు నా చెల్లి కొరకు;**
**... కేలు వినరి పొమ్మను నింత జాలివడడు**

. . . . . . . . . . . . . . . . . . . .

సత్యనారాయణగారు నేను రాసిన పద్యాల్ని మెచ్చుకున్నారు. ఆ తరవాత ప్రతి సాహిత్య సమావేశంలోనూ పురిపండా అప్పలస్వామీ, శ్రీరంగం శ్రీనివాసరావూ నా చేత ఆ పద్యాల్ని చదివించే వారు.

ఆంధ్ర విశ్వవిద్యాలయం వాల్తేరులో ఏర్పడ్డ మొదటి మూడు నాలుగు సంవత్సరాలూ సెలవుల్లో బెజవాడ, గుంటూరు పోతుండేవాణ్ణి. బెజవాడలో గుడిపాటి వెంకటచలం గారింట్లో మకాం. గుంటూరులో మాతాత గారింట్లోనూ. అక్కడ కొన్నాళ్ళు కాలక్షేపం. ఓ సంవత్సరం గుంటూరులో మామేనత్త కొడుకు వాడపల్లి లక్ష్మీనరసింహారావు – అతను లక్నోలో లా చదువుతూ సెలవులకి ఇంటికొచ్చాడు. నన్ను తనతో స్నేహితులతో పాటు సాయంకాలం షికారుకు తీసుకుపోతుండేవాడు. ఓ రోజున ... మా బావ నన్నతనికి పరిచయం చేస్తూ 'మా మామయ్య కొడుకు వరద. వీడూ కవిత్వం రాస్తాడుట' అని నవ్వుతూ అన్నాడు. అంతే, అమాంతం అతను నేలమీద సాష్టాంగపడి నాకు నమస్కరించాడు. లేచి, 'మహాకవిని చూసినట్టే లెక్క. రామకృష్ణారావు గారిని చదివాను. వాళ్ళబ్బాయిని చూశా' నన్నాడతను. అతని పేరు శిష్ట్లా ఉమామహేశ్వర రావనీ, మాబావకు సహాధ్యాయి అనీ, అప్పుడు బెనారస్ విశ్వ విద్యాలయంలో చదువు ముగించుకుని వచ్చేశాడనీ, మేధావంతుడనీ విన్నాను.

*[ఒకసారి బెజవాడ వెళ్ళినప్పుడు గుడిపాటి వెంకట చలం గారితో వాహ్యాళికి పోతూ 'వరద' సరదాగా ఆశువుగా చెప్పిన పద్య భాగం:]*

***గుడిపాటి వెంకటచలము***

***గడ గడ వణకు నన్ను చూసి కారణమేమొ?***

... అయిదార్రోజులకి మళ్ళీ బెజవాడలో దిగి వెంకట చలం గారింట్లో వున్నాను. అప్పుడు వెంకట చలం గారింట్లో కృష్ణ శాస్త్రి, చింతా దీక్షితులు గారూ వున్నారు. అక్కడ పద్యాలు చదువుతున్న యువకుడికి ఫలానా అని పరిచయం చేశారు...

అతని పేరు జలసూత్రం రుక్మిణీనాథ శాస్త్రి... మొదటి పరిచయం తోనే జీవితాంత స్నేహితులమైనాము. నాకన్నా పెద్దవాడు, శ్రీ శ్రీ కన్న కొంచెం చిన్నవాడు.



మేము వాల్తేరు నుంచి విశాఖపట్నం మకాం మార్చినప్పుడు విధిగా రోజూ ఆయన్ని [పురిపండా అప్పలస్వామిగార్ని] కలుసుకుంటూ ఉండేవాణ్ణి, ఇంట్లో కాని, ఖాదీ భాండారంలో కాని... భాండారంలో ఎప్పుడు చూసినా ఎవరో ఒకరు-రచయితలు కొలువు దీర్చి కూర్చునేవారు. నేనప్పటికే కవిత్వం రాయటం ప్రారంభించటం వల్ల అప్పలస్వామి గారు అలా వచ్చిన వారందరికీ నన్ను పరిచయం చేసి శ్లాఘిస్తూ ఉండేవారు. ఆ రోజుల్లో సాహిత్య క్షేత్రంలో ఆయనే నన్నెక్కువగా ప్రోత్సహించింది. ఆధునిక కవుల వివిధ రచనలు ఎలుగెత్తి పాడి నాకు వినిపించేవారు. ఆయన కొత్తగా ఏమన్నా రాస్తే ముందస్తు నాకు వినిపించవలసిందే. నేనంటే ఆయనకంత అభిమానం ఉండేది.

విజయనగరంలో ఆంధ్ర భారతీ తీర్థ ... ఆ సంస్థ స్నాతకోత్సవం ఆ సంవత్సరం విశాఖపట్నంలో నిర్వహించారు. ... ఆ వేడుకల్ని చూడటానికి పురిపండా అప్పలస్వామి, శ్రీరంగం శ్రీనివాసరావూ, తురగా వెంకట రామయ్య ప్రభృతులు సమావేశానికి ... వెడుతూ నన్నూ తీసుకుపోయారు... ఆ రోజుల్లో నేను 'తపోభంగం' అనే నాటకం రాశాను. అముద్రితంగా వుండేది. వ్రాత ప్రతిని పట్రమ్మని అప్పలస్వామి గారు ఆదేశించారు. బుర్రా శేషగిరి రావు గారికి చీటీ పంపించారు శ్రీ శ్రీ, పురిపండా కలిసి నా చేత నాటకాన్ని సమావేశంలో చదివించమని ... నేను వేదిక ఎక్కి నా నాటకాన్ని ఒక అరగంట లోపున తడుము కోకుండా చదివేశాను. రతీ మన్మధుల కథ అది. అందులో రెండుపాటలు, నాటకమంతా శిష్ట వ్యావహారికంలో ఉంది... ప్రేక్షకుల్లో ముందుగా కూచున్న తెలుగు మాష్టారి లాంటి పండితుణ్ణి వేదిక మీదికి ఆహ్వానించారు ... ఆయనే గిడుగు రామమూర్తి పంతులు! ... ఆ రోజు నుంచి నేను గిడుగు రామమూర్తి గారికి సన్నిహితుణ్ణాయి పోయాను... నా నాటకం వ్రాత ప్రతిని పంతులు గారి కిచ్చాను. పంక్తి పంక్తీ జాగ్రత్తగా చదివి వాక్యాంతంలోని క్రియా రూపాలను సరిసమానం చేశారు. ఆయన దగ్గర నేర్చుకున్న మొదటి పాఠం అది... ఆయన కవితా సమితి వార్షికోత్సవంలో చేసిన ప్రసంగం విన్న తరవాత నేను పరీక్షలో వ్యాకరణం ప్రశ్నలను ముట్టుకునేవాణ్ణి కాదు.

విశాఖపట్నం – విప్పర్తి వారి వీధి. అందులో పింగళి లక్ష్మీకాంతం గారుండేవారు. ఆయన బావమరిది మోచర్ల అనంత పద్మనాభరావూ, నేనూ సహాధ్యాయులం. ఒకే తరగతిలో కూచునే వాళ్ళం. పొద్దున్న అతనితో పాటు స్కూలుకి వెళ్ళేవాణ్ణి.

లక్ష్మీకాంతం గారుండే మేడ మీద ఓ మూలగది చదువుకోవటానికిచ్చారు... దాంట్లో కొన్ని పుస్తకాలుండేవి. పద్మనాభరావు భోంచేస్తున్నప్పుడు నేనా గదిలో కూచుని ఆ పుస్తకాలు తిరగేసే వాణ్ణి... పింగళి లక్ష్మీకాంతం గారింట్లో దొరికిన రాయప్రోలు సుబ్బారావుగారి పుస్తకాలన్నీ చదివేశాను... ఆయన పద్యాలతో పరిచయం అయింతరవాత ఆయన్ని చూడాలని తాపత్రయ పడేవాణ్ణి.

*[ఆ రోజుల్లో రాసిన మొదటి కథ 'జ్వాల' పత్రికలో నవంబరు 1934లో అచ్చయింది. అందులో రచయితను పరిచయం చేస్తూ సంపాదకుడు ప్రకటించిన వయస్సుకీ అసలు వయస్సుకీ తేడా కనిపిస్తుంది. అది కథలోని కుర్రవాడి వయస్సు కావచ్చు.]*

## ప్రథమ యుద్ధం

## వరద

*[వరద రాజేశ్వరరావు, వయస్సు 13 సంవత్సరాలు. ఈ చిన్న వయస్సులోనే ఈతని ఊహాలు ప్రపంచంలోఉన్న అన్యాయాలనూ, కాఠిన్యాన్నీ ఎదురుకుంటూ ఉన్నవని ఈ కథ వ్యక్తపరుస్తుంది. ప్రారంభానికీ ముగింపునకూ సరియైన కుదిరిక లేదు; ఇంకా లోపాలు కూడా ఉన్నవి, అయినా ఈ కథకు విలువ ఉంది. పక్కా లౌక్యంలో కరటక శాస్త్రి అంటే–డేమ్ స్కౌండ్రల్–గా తయారైన పెద్దవాడి దుర్మార్గానికి తట్టుకోలేక పోయిన దీనులు, ఒక స్త్రీ ఒక పిల్లవాడు అంతర్గతంగా పడిన వేదనను చక్కగా చూపడానికి యత్నించి, 'పెట్ట చిన్నదైనా కూత ఘనం' అనిపించాడు. వరద, మిత్రుడు అబ్బూరి రామకృష్ణారావు కుమారుడు, తండ్రిలో బహిర్గతమైనదానికన్న లోపం మిగిలిపోయిన వాణి ఈ కుమారునిలో వెలువడుంతుందేమో! సం.]*

నా హృదయంలో అయిక్యదయిన కథను కెలికి తీస్తున్నాను. ఎన్నాళ్ళ క్రిందటి సంగతో యిది!

మానాన్నగారు హైకోర్టు గుమాస్తాపనిచేస్తూ గుండెల్లో జబ్బువల్ల పెన్షన్ పుచ్చుకున్నారు. అప్పటికి నాకు తొమ్మిదేళ్ళు వెళ్లినై. ఒకటోఫారం చదువుతున్నా. రోజూ రెండుమైళ్ళు నడిచి స్కూలికి వెళ్ళాలి.

మా నాన్నగారికి యిరవై అయిదు రూపాయల జీతం నయినా కొద్దిగా పలుకుబడి వుందంటారు. నాస్కూలు జీతం, నాపుస్తకాలికే పదిరూపాయలవుతుంది.

నాకో చిట్టితమ్ముడున్నాడు. వాడెప్పుడూ అల్లరిపన్లే చేస్తూంటాడు. నా పుస్తకాల్ని చింపడం, పాలమీగడల దీసి తన స్నేహితులకు కాస్త పెట్టి, తనూ కాస్త తినడం రోజూ వాడు చేసే పని.

మా అమ్మ రోజూ కూతుళ్లు లేరని అనుకొంటుండేది. నాకు కోపం వచ్చేది, వాళ్ళేంచేస్తారు? మేమేదిచెయ్యదని. యిల్లా వుండగా ఓనాడు మానాన్నగారికి హటాత్ గా గుండెజబ్బు హెచ్చయింది. నేనుస్కూల్లో వున్నాను. ఏడ్చి పోతాడని మాఅమ్మ నాక్కబురుచెయ్యలేదట. మావూళ్ళోవుండే లింగయ్యని పిలిపించి కాస్త మందిప్పించారు.

నేను సాయంకాలం ఇంటికొచ్చేటప్పటికి మాఅమ్మ కళ్ళల్లో నీళ్లతిరిగినయి. మొహంనిండా

చెమటపోసి ఒక్కొక్క చుక్క కుంకుంబొట్టుని తొలగిస్తోంది. నన్ను చూడ్డంతోటే మా అమ్మ యేడ్చింది. నేను లోపలికి వెళ్ళాను. మానాన్నగారి కళ్ళల్లోంచి ఒక జ్యోతి ఆకాశం లో పరుగెడుతున్నట్టుంది. నేను వెంబడించి పట్టుకుందామనుకున్నాను కాని నా మనస్సు చివుక్కుమన్నది. పుస్తకాల్ని దుఃఖంతో పారవేశాను. మానాన్నగారి మొహం చూశాను. ఆ పెదవుల్లో ఒక నవ్వు ఒహవిధంగా తాండవిస్తోంది. నుదురుమీద కళ ఏమాత్రం తప్పలేదు. నేను దుఃఖంతో ఆ తలని ముద్దు పెట్టుకున్నాను. నా కన్నీళ్లు మానాన్నగారి మొహమ్మీదపడ్డాయి. అప్పుడు మానాన్నకోసం దేవుణ్ణి ప్రార్థించాను. వెంటనే తిట్టాను, కోప్పడ్డాను. లాభంలేదనిపించింది. ఆగదిని విడిచి వరండాలోకి వచ్చాను. మాఅమ్మ మొహమ్మీద కుంకుమ బొట్టు పూర్తిగా చెమటలో కలిసి జారిపోయింది. ఏడ్చి యేడ్చి సొమ్మసిల్లి పడుకొని మెల్లిగా దుఃఖిస్తోంది. నేను వోదార్చబోయాను. కాని నాకే యేడ్పొచ్చి బావురుమని యేడ్చాను.

మానాన్నగారికి పుత్తరక్రియలన్నీ చేశారు. రెణ్ణెల్లయింది. మా దుఃఖం కొంతవరకు వుపశమించిందనుకోవచ్చును. అన్నీ మరచిపోయాం. డబ్బు లేక పోవడం వల్ల చదువు మానేశాను. ఏదో యింత అన్న వస్త్రాలకి లోపం లేకుండా సరిపోతోంది. సంస్కృతం నేర్చుకుంటున్నా.

ఒకనాడు మానాన్నగారి కాగితాలు ధూళితోనిండి వుంటేదులుపుతున్నాను. చప్పున నాదృష్టి ఒక కాగితమ్మీదికి మరిలింది. అది నాపేరుతోనే సంబోధించి రాశారు. ఎవరా అని చూశాను; మానాన్నగారే రాశారు. అందులో యిట్లా వుంది.

'అబ్బాయీ! నీకోసం నేను కష్టపడి తెచ్చిన శాస్త్రాలు మన యింటి ప్రక్కన వున్న మునగ చెట్టుక్రింద దాచాను. అవి చాలా మంచివి. ఎవరైనా చూస్తే చాలా కష్టం. వాళ్ళు సంగ్రహించాలని చూస్తారు. నేను చచ్చి పోయిన ఆ రోజు రాత్రి ఒంటిగంటకి త్రవ్వుకొని తెచ్చుకో'. నేను నిర్ఘాంతుణ్ణయి పోయాను. అంతటి రహస్యమైన శాస్త్రాలేవయియుంటవిఅబ్బా! అనుకున్నాను. ఒహ అరగంటదాకా ఆలోచించుకున్నాను. ఎంత ఆలోచించినా పర్యవసానవేమీ తేల్లేదు.

ఆరాత్రి నిద్దర్లేదు. తీసుకుందామా, వొద్దా అని ఆలోచన్తో తెల్లవారింది. మర్నాడు మాఅమ్మతో చెప్పాను. మాఅమ్మ కళ్ళనీళ్ళు పెట్టుకుని తెచ్చుకో నాయినా, అంది. నేనుకూడా తెచ్చుకోవాల్సనుకుని, ఆరాత్రి వెళ్దామనుకున్నాను. ఆ సాయింత్రం మాబాబాయి వచ్చాడు. అతను మంచివాడు కాదని మానాన్నగారంటోంటే విన్నా. అతను రౌడీట. చెడ్డపేరుగలవాట్ట. యివన్నీ మేం వేవీ తలంచుకోలేదు. రెన్నాళ్ళుండి రహస్యశాస్త్రాల సంగతి ఎత్తి యేదో వాటిని గురించి నన్నడిగాడు. తెలియదన్నాను. కుర్రాణ్ణికదాని నాలుగు తిట్టాడు. నాకూ తెలీక నేనూ మారుతిట్టాను. అతనికోపం వచ్చింది. నేనేదనుకోలేదు. మర్నాడు వాళ్ళవూరికి వెళ్ళి మా అమ్మకి వుత్తరం రాశాడు, పొగరుమోత్తనంగా. తన కాశాస్త్రాలు కావాలని, లేకపోతే తమ్ముణ్ణి దాస్తాట్ట. మేం విచారించాం. మా మేలు కోరాల్సినవాడు మాకు అపకారం చేస్తున్నాడు! నాకే ఆశ్చర్యం వేసింది. మాఅమ్మ ఆ సంగతి చెప్పేయమంది. నేను చెప్పనని మొండిపట్టుపట్టే నువ్వుకనక చెబితే యిల్లు వదలి వెళ్ళి పోతానన్నాను. మాఅమ్మ కూడా నామాట తొయ్యలేక వప్పుకుంది.

రెణ్ణెల్లికి తమ్ముడు మాయమైపోయాడు. మా బాబాయి చేసిన పనే యిదని అనుకున్నాము. మా అమ్మకి మూడురోజులదాకా నిద్రాహారాల్లేవు. చిక్కిపోతోంది. నేను అన్వేషణకి బయలుదేరాను. మావూరునుంచి ఆ వూరుకెళ్లాను. సరీగ్గా నేననుకున్నట్లు మా బాబాయి యింట్లో తమ్ముడున్నాడు.

నేను వాడికి కనపడకుండా విశేషాలు తెలుసుకుంటున్నా. ఆఖరికి మా అమ్మని తీసుకువచ్చి చూపించి నలుగురి చేతా చీవాట్లు పెట్టిద్దామనుకొన్నాను.

మా అమ్మని తీసుకువచ్చి సత్రంలో దింపాను. రెండ్రోజులు గడిపి మూడోరోజు గల్లంతు చేయించడానికి వెళ్ళాను, మా అమ్మని తీసుకొని. గుప్తంగా కనిపెట్టిన చోటునుంచి అమ్మని తీసుకువెళ్లాను. ఆ యింటి మొదటి వాకిట్లోకి వెళ్లాను. మా అమ్మ కెవ్వున కేకవేసి పడిపోయింది. ఏమిటా, అని చూశాను. మా చిట్టి తమ్ముడి వొళ్లు నెత్తురుమయం – నేను ఏడ్చి అమ్మగుండెను చూశాను. కొట్టుకోవడం లేదు. ఊపిరిపిల్చడమాగిపోయింది.

నా ఆశాసౌధం పెద్ద చప్పుడుతో నేలమట్టమైపోయింది. ఆ యింట్లో నివసించేవాళ్లు ఆకాశంలో సంచరిస్తూ నన్నుచూసి నవ్వుతున్నారు.

నాకు పదమూడేళ్లు నిండినయి. స్వార్జితం లేదు. జీతం సున్న. మా అమ్మకి పుత్తర్రక్రియలూ దహనం చెయ్యాలి. ఎల్లా? దమ్మిడీలేదు చేతుల్లో. ఏమిటి చెయ్యడం? నా శక్తిహీనతకు దుఃఖించాను. పెద్దగొంతుతో యేడ్చినాను, నా అవివేకానికి ఏడ్చినాను.

నా తల్లి ఆత్మశాంతికి ప్రార్థన చేశాను. ఆ పాదధూళి అద్దుకుని తలపైపెట్టుకున్నాను. నా అంటుపోగులు తీయించాను; అయిదురూపాయలవి రెండురూపాయల్లో ఎట్లాగయితేనేం దహనదనిపించాను. ఆ బూడిదవంటికి పూసుకొని గోచీపెట్టి నృత్యం చేశాను. అక్కడుండలేక విడిచిపెట్టి కృష్ణవద్దకు వచ్చాను.

•

నేను యోగంలో ప్రవేశిస్తున్నాను! నా ఆఖరు పయనం మాయలోకానికి, ప్రకృతికి. యోగం రెండురోజులు గడువుంది. నా మాతృసాన్నిధ్యానికి జేరుకుంటాను! పవిత్రుణ్ణవుతాను!

నా ఆత్మశాంతికి ప్రకృతి ప్రార్థిస్తుందనుకుంటాను!

(జ్వాల, 16.11.1934)

ఆ రోజుల్లో 'జాబిల్లి' అని ఓ లిఖిత పత్రిక పిల్లల కోసం ప్రారంభించాను. ప్రారంభోత్సవ సంచికకు ముఖపత్రం మీద ఓ పద్యం ఉండాలని నా కోరిక. ఓ రోజున అకస్మాత్తుగా *[తురగా]* వెంకట రామయ్యగారు కనిపించారు కురుపాం మార్కెట్టు దగ్గర. ఆయన్ని పట్టుకుని వదల్లేదు. ఏమన్నా రాసిపెట్టమని ప్రాధేయపడ్డాను. ఆయన నవ్వుతూ ... రాసి ఇచ్చారు.

విజయనగరం విద్యార్థి మహాసభా సందర్భంగా కృష్ణశాస్త్రి గారికి నా పట్ల అభిమానం ఏర్పడింది. అక్కడ మొదటి సారిగా నాకవిత్వాన్ని విని *[సుజాత మీద రాసిన పద్యాలు]* మెచ్చుకుని ఇతరులు కూడా మెచ్చుకునేట్లు చేశారు. తరవాత నా విద్యార్థి దశలో ఆయన్ని తరుచూ చూస్తుండేవాణ్ణి. ఉన్నత పాఠశాల నుంచి కళాశాల వరకూ విద్యార్థి సంఘాల్లో నేను ప్రముఖ పాత్ర వహిస్తుండటమూ, రెండు మూడు

సార్లు మా సంఘవార్షికోత్సవాలకు ఆయన్ని కాకినాడ నుంచి పిలిపించి ఉపన్యాసాలిప్పించటమూ చేసేవాణ్ణి.

అప్పటికి రెండేళ్ళుగా మా స్కూల్లో 'హైస్కూలు లిటరరీ యూనియన్' అనే సంఘాన్ని మిత్రుడు అనంత పద్మనాభరావు సహకారంతో నిర్వహించిన వాణ్ణి. సత్యనారాయణ గారిని మా స్కూల్లో ప్రసంగించమని కోరాను. ఆయన వెంటనే అంగీకరించారు.

## కాలేజి రోజులు : 1937–39

తరువాత మరో రెండేళ్ళకనుకుంటాను. నేను ఇంటర్ మీడియటులో ఉన్నాను. ఆయన *[విశ్వనాథ]* విశాఖపట్నం వచ్చారు. మళ్ళీ నేను పట్టుకున్నాను, మా కళాశాలకు తప్పక వచ్చి ఉపన్యసించాలని... ఆ రోజు పన్నెండు గంటలకి మాకు దివాకర్ల వెంకటావధాని గారి పీరియడు. ఆయన చేత పాఠం తప్పించి, సత్యనారాయణగారి ఉపన్యాసం ఏర్పాటు చేశాను. నేను కళాశాల విద్యార్థి సంఘానికి కార్యదర్శిని... సత్యనారాయణ గారు తన సహజశైలిలో పద్యాలు చదివారు.

ఇంటర్మీడియట్ లో ఒక స్వర్ణశతకం తెలుగుకు ఉండేది. అప్పుడు దివాకర్ల వెంకటావధాని గారు మాకు తెలుగు చెప్పేవారు. నన్నా శతకాన్ని సంపాయించమనీ, తనకి నా మీద విశ్వాసం ఉందనీ, తనకీ, కళాశాలకీ పేరు వస్తుందనీ చెప్పారు. 'వ్యాకరణాన్ని నేను వదిలేస్తాను. కనక పూర్తిగా ప్రశ్నాపత్రానికి జవాబు రాయడం కష్టం' అని చెప్పి తప్పించుకున్నాను. పంతులుగారికి *[గిడుగు]* నేను చేసిన వాగ్దాన ఫలితం అది. ఆయనంటే అంత భక్తి! ... పంతులుగారికి 'ఉషస్సు' అనే పత్రిక మొదటి సంచిక ఇచ్చాను. ఆ సంచికలో నా 'తపోభంగం' నాటికను అచ్చేశారు.

ఇంటర్మీడియట్ లోకి వచ్చిన సంవత్సరమే కళాశాల పత్రికలో *[చెల్లెలు మరణం మీద రాసిన పద్యాలు]* అవి అచ్చయినాయి.

మిసెస్ ఎ.వి.ఎన్. కళాశాల తరఫున వక్తృత్వపు పోటీకి విజయనగరం మరికొంత మంది సహాధ్యాయులతో వెళ్లాను. అక్కడ మా కన్న వయసులో పెద్దవాడూ, కొంచెం ఆజాను బాహువూ అయిన ఓ వ్యక్తి ఆ ఊరి కళాశాల నుంచి పోటీకి వచ్చాడు... అతని పేరు ఉండవల్లి సూర్యనారాయణ...

తరవాత మళ్ళీ యుద్ధ కాలంలో బెజవాడలో చూశాను... అతనే కాని, పేరు నళినీ

కుమార్ అన్నాడు. .. అతనందరికీ సన్నిహితుడయ్యాడు, ముఖ్యంగా కవులకూ, సాహిత్య శ్రేయోభిలాషులకూ.

## యూనివర్సిటీ రోజులు : 1939–42

ఆంధ్ర విశ్వవిద్యాలయంలో నేను చదువుతున్నప్పుడు దువ్వూరి రామిరెడ్డి గారోసారి వాల్తేరు వచ్చారు... మా నాన్నగారు ఆయన్ని చూపిస్తూ... నాకు పరిచయం చేశారు... అప్పటికే భారతిలో ఆయన ప్రచురించిన ఉమర్ ఖయాము రుబాయీల అనువాద పద్యాలన్నింటినీ చదివేశాను. ఆ పద్యాల మీద నాకెంతో అభిమానం. అంచేత దువ్వూరి రామిరెడ్డి గారంటే ఏం మాట్లాడాలో తోచక రెండు చేతులతో నమస్కారం చేశాను. సామాన్యంగా నేనెవరికీ నమస్కారం చేసిన వాణ్ణి కాదు.

నేను ఆంధ్ర విశ్వ విద్యాలయంలో చదువుతూ ఉండగా... మా నాన్నగారు సుబ్బారావుగారిని *[రాయప్రోలు]* పరిచయం చేశారు... సుబ్బారావుగారు ... నువ్వు కవిత్వం చెబుతావని కృష్ణశాస్త్రి కాబోలు నాతో చెప్పాడు. నిన్ను మెచ్చుకున్నాడు అని, మానాన్నగారి వంక చూస్తూ– 'నీ అదృష్టం పండిందోయి– నువ్వు రాయటం మానేసి మీవాడి చేత రాయిస్తున్నావ' న్నారు. అందరూ నవ్వారు.

"'మధుపాళి' (హనీగేదరర్స్) అనేపేరుతో యూనివర్సిటీలో ఆనాటి యువరచయితలం, నేనూ, జనమంచి రామకృష్ణ, ఎ.ఎస్.రామన్ (తరువాత ఇల్లస్ట్రేటెడ్ వీక్లీ ఎడిటర్), వేమూరి రామనాథం (యూ.ఎన్.ఓ), మామిడిపూడి ఆనందం, వరద రాజేశ్వరరావూ మరి కొందరు– మేష్టార్ని మార్గదర్శకులుగా సాహిత్య సాంస్కృతిక సమావేశాలు జరుపుకొనేవారం. మేం రచించిన కవితలూ, నాటికలూ, ఆ సమావేశాలలో చదవడమూ, ఎవరికి తోచిన విమర్శలు వారు చేయడమూ, మేష్టారు తుదిపలుకులతో సమావేశాలు ముగించేవారం. అబ్బూరి వారి దర్శకత్వంలో 'ఏ హిమ్ టు ది రైజింగ్ సన్' అనే నాటకం వేశాం." (బాలాంత్రపు రజనీకాంతరావు. మా అబ్బూరి మేష్టారు. 'అబ్బూరి సంస్మరణ' పే. 14).

విశాఖపట్నం మీద బాంబులు యాదృచ్ఛికంగా జపానువారు పడేసినప్పుడు మాకుటుంబం వాల్తేరు వదిలి కొన్నాళ్ళు నూజివీడులోను, మరి కొన్నాళ్ళు బెజవాడలోనూ ఉండటం తటస్థించింది.... ఆ రోజుల్లో బాపిరాజు గారు బెజవాడలో ఉండేవారు. దాదాపు పది రోజుల వరకూ రోజూ సాయంకాలం పూట ఆయన మా

ఇంటికి రావటం, ఆయనతో పాటు నేను కృష్ణానదీ తీరం దాకా షికారు పోవటం జరిగేది... నేనప్పుడు ఎం.ఎన్. రాయి గారి అనుచరుడిగా ఉన్నాను. అంతకు పూర్వం మా నాన్నగారు ప్రారంభించిన వర్ధమాన లేఖక సంఘం ప్రాబల్యం వల్ల ప్రజామిత్ర పత్రికలో ఈ కవులందరి మీదా విరుచుకు పడ్డాను. బాపిరాజు గారికది తెలుసు.

".... 1940 జూన్ లో రాడికల్ డెమోక్రాటిక్ పార్టీని ఏర్పాటు చేయడం జరిగింది... ఆయుద్ధ కాలంలో మేము గుంటూరులో అనేక బహిరంగ సభలు పెట్టి రాడికల్ డెమోక్రాటిక్ పార్టీ విధానాలను ప్రచారం చేశాము. శ్రీ అబ్బూరి రామకృష్ణారావు గారు ఆ సభల్లో చాల యాక్టివ్ పాత్ర వహించారు. ఆ రోజుల్లో స్వర్గీయ లావు అంకమ్మ, జి. నరహరి, పి.వి. సుబ్బారావు, ఆవుల గోపాల కృష్ణమూర్తి, గోపీ చంద్ మరియు శ్రీయుతులు జె.ఎస్. ప్రసాద్, కోగంటి కృష్ణమూర్తి, కోగంటి సుబ్రహ్మణ్యం ప్రభృతులు, శ్రీ ఎం.వి. రామమూర్తి, శ్రీ ఆలపాటి రవీంద్రనాథ్, అబ్బూరి వరద రాజేశ్వరరావు మొదలగు వారు పార్టీలో కార్యకలాపాలకు అండగా నిలబడ్డారు."
(ఎ.ఎల్. నరసింహారావు. అప్పుడు అబ్బూరి. 'అబ్బూరి సంస్మరణ', పే. 30)

యుద్ధకాలంలో మేము గుంటూరుకి వలస వచ్చాము. నేను గుంటూరు నుంచి బెజవాడ వస్తుండేవాణ్ణి వారానికోసారి కాలక్షేపానికి. ఆ రోజుల్లో మల్లాది రామకృష్ణ శాస్త్రిగారు బెజవాడలో ఉంటూండేవారు. లక్ష్మీటాకీసు ఎదురుగా కృత్తివెంటి వారింట్లో ఓ గది తీసుకుని మద్దిపట్ల సూరి ఉండేవాడు. శాస్త్రిగారూ ఆ గదిలోనే ఉంటూ వచ్చారు. నేను బెజవాడకు వచ్చినప్పుడల్లా శాస్త్రిగారితోనూ, మల్లాది ఫణిభూషణ రావుతోనూ కాలక్షేపం చేసేవాణ్ణి. వాళ్ళతో పాటు నేనూ సూరిగదిలోనే ఉండేవాణ్ణి.





# నాటకరంగంలో

**గుంటూరు/తెనాలి/బెజవాడలో : 1942 – 43**

నాట్యగోష్ఠి ఉద్యమ ధర్మాన్ని అనుసరించి నేనూ చాలా నాటకాలు రాశాను ... విశ్వవిద్యాలయంలో చదువుకుంటున్నప్పుడూ, తరవాత స్నేహితుల ప్రోద్బలం మీద నాటకాలు రాశాను. ఇప్పుడేవీ దొరకవు. ముక్కామల కృష్ణమూర్తి కోసం వసంతసేన, నాయకురాలు అనే నాటకాలు రాసి యిచ్చాను. అవి రెండూ నాకు నచ్చినవి. అవి రెండూ పోయినవి ... *[జోలపాట]* నాటిక ఒక ఇంగ్లీషు రూపక నిర్మాణాన్ని అనుసరించి రాసింది. యాభయియేళ్ళ క్రితం. ఇంగ్లీషు నాటకకర్త పేరు గుర్తులేదు. ఈ నాటిక విశ్వ విద్యాలయ పత్రికలో అచ్చయి కట్టమంచి రామలింగారెడ్డి బహుమతి పొందింది.

నాట్య గోష్ఠి
NATYA GOSHTI

*[ఆనాటి 'నాట్యగోష్ఠి' లెటర్ హెడ్]*

... మా నాన్నగారు నాట్యగోష్ఠి ఉద్యమానికి అనుబంధంగా 'నటాలి' అనే నాటక సంస్థను ప్రారంభించారు. యుద్ధం ముమ్మరంగా సాగుతున్న రోజులు... ఆ రోజుల్లో నేనూ 'నటాలి' లో పనిచేస్తుండే వాణ్ణి. నాతో పాటు శ్రీరంగం శ్రీనివాసరావూ, శ్రీరంగం నారాయణబాబూ పనిచేసేవాళ్ళు.

... ఆంటన్ చెహోవు రచించిన నాటకం చెరీఆర్చర్డ్ నేనూ శ్రీరంగం శ్రీనివాసరావూ కలిసి అనువదించాము. మా దురదృష్టం వల్ల నాటకాన్ని ప్రయోగించలేకపోయాము. దీనికి నేపథ్య సంగీతం మిత్రుడు బాలాంత్రపు రజనీకాంతరావు సమకూర్చాడు కూడాను. ముఖ్యంగా చివర చెట్లు నరుకుతున్నప్పుడు గొడ్డలి వేటులను స్ఫురించే సంగీతం చాలా హృదయ విదారకంగా వుంటుంది.




[ ప్రచురణ : ప్రజాసాహిత్య పరిషత్, తెనాలి. 1947 ]

మదరాసు నుంచి సటాలిని మొదట్లో చీరాల తరలించారు. చీరాల నుంచి తెనాలికి మార్చారు ... మాకు నాటక ప్రదర్శనలు లేని రోజున తెనాలి లోనే ఉండేవాణ్ణి. సాయంకాలం కాగానే 'సూతాశ్రమం' లో చేరేవాళ్ళము. అందులో గోపీచందూ, ఆయన తమ్ముడు గోకుల్చంద్ ఉండేవారు ... అక్కడికి ప్రతి రోజూ సమావేశమయ్యేవారిలో పి.వి. సుబ్బారావూ, సూరీ, బైరాగీ, నేనూ ఉండేవాళ్ళము.

మొదటి పరిచయం తోనే బైరాగి నాకు సన్నిహితుడయినాడు. ఆ రోజుల్లో అతను తెలుగు సాహిత్యం కొంచెం కొంచెం అధ్యయనం చెయ్యటం ప్రారంభించాడు.

గాంధీచౌకు దగ్గర ఒక వేపున 'గుడ్ విల్ అండు కో' అనే దుకాణం ఉండేది. ఆ దుకాణంలో సాయంకాలం నాలుగైదు గంటలకల్లా ఒక ఆకర్షవంతమైన విగ్రహం కనిపించేది ... ఆయన పేరు మాధవపెద్ది బుచ్చిసుందరరామశాస్త్రి ... ఆ దుకాణానికెదురుగా గాంధీచౌకులో మరో రెండు మందుల దుకాణాలుండేవి. ఓ దుకాణంలో అదే సమయానికి మరో వ్యక్తి వచ్చేవాడు. అతని పేరు చక్రపాణి. ...దాని పక్క దుకాణంలోకి మరొకాయన వచ్చిపోతూండటం చూసేవాళ్ళం అదే సమయానికి. అతని పేరు ధనికొండ హనుమంతరావు.

తెనాలిలో ఉండగా ఆ ముగ్గురితోనూ నాకు పరిచయమయింది.

...ఓసారి మానాన్నగారి ఆదేశం ప్రకారం ములుకుట్ల వెంకటశాస్త్రిగారిని చూడటానికి రాజమండ్రి పోవలసి వచ్చింది. నన్ను స్టేషన్లో ఉండమనీ, తాను సామర్లకోట నుంచి కారులో వచ్చికలుసుకుంటాననీ శాస్త్రి కబురు చేశాడు. నేను వెయిటింగ్ రూమ్‌లో కూచున్నాను. నా కొంచెం దూరంగా మరో పడక్కుర్చీలో మరోవ్యక్తి - వయస్సులో నాకన్న పెద్దవాడు - కూచునిఉన్నాడు. ... ఇంతలో దూకుడుగా శాస్త్రి వచ్చాడు... మరోవ్యక్తి ... అతను పాలగుమ్మి పద్మరాజనీ, కవిత్వం చెబుతాడనీ, మా నాన్నకి తెలుసనీ అన్నాడు ... పద్మరాజుతో పరిచయం అలా ప్రారంభమయింది.

మేమంతా బెజవాడలో కలిసి కాలక్షేపం చేస్తున్న రోజుల్లో సముద్రాల రాఘవాచారిగారు మదరాసు నుంచి నెలకో రెణ్ణెల్లకో ఓసారి వచ్చి పోతుండేవారు ... అప్పుడు నేను గుంటూరులో 'గుంటూరు నాట్యసమితి' అని ఓ నాటక సంస్థను స్థాపించాను: సంవత్సరానికి నాలుగు నాటక ప్రదర్శనలివ్వడం - సాలుచందా పాతికరూపాయల చొప్పున రెండు వందలమంది దగ్గర వసూలు చెయ్యటం జరిగింది. నాట్యసమితిని మా నాన్నగారు ప్రారంభించిన నాట్యగోష్ఠి ఉద్యమానికి అనుకూలంగా, అనుబంధంగా ప్రారంభించాను. మొదటి నాటకాన్ని హెరాల్డ్ బ్రిగ్ హౌస్ ఇంగ్లీషులో రాసిన 'ది ప్రిన్స్ హువజ్ ఎ పైపర్' అనే నాటకాన్ని అనుసరించి 'ప్రతిమా సుందరి' పేరుతో తయారు చేశాను. ...గుంటూరులో రైలు స్టేషను వెనకాల ఓ చిన్న పెంకుటింట్లో ఓ గది అద్దెకు తీసుకున్నాను. నాకు తోడుగా ఏకా అప్పారావు ఉండేవాడు. రిహార్సల్సు ప్రారంభించాము ... గుంటూరులో యూనివర్సిటీ రిజిస్ట్రారుగా పనిచేస్తున్న కూర్మా వేణు గోపాలస్వామి నాయుడిగారిని మా రిహార్సల్సుకి తీసుకొచ్చాను. గోపాలస్వామి నాయుడుగారు చీటికీ మాటికీ రంగస్థలం వెనక్కి వచ్చి ఎవరికీ సంబంధించని సూచనలిస్తుండేవారు. ... నేను ఆక్షేపణ చెప్పాను ... 'మాయాసుందరి' అని పేరు మార్చి అదే నాటకాన్ని అన్ని చోట్లా నాట్యసమితి చేత ప్రదర్శించటం ప్రారంభించారు. అందులో నాపేరులేదు ... మనస్సుబాగుండనప్పుడల్లా బెజవాడ పోతుండేవాణ్ణి ...అక్కడ వెరైటీ ఏజన్సీస్ దుకాణం ఉండేది. సత్యనారాయణరావుగారు ఆ సంస్థ యజమాని. శాస్త్రిగారంటే *[మల్లాది]* విపరీత గౌరవం ...ఓసారి నాగొడవ చూసి శాస్త్రిగారితో నారాయణరావుగారన్నారు: 'మీరవునంటే వరదరాజేశ్వరరావు 'ప్రతిమాసుందరి' అచ్చేయిస్తాను'.... అంతే. అన్ని ఏర్పాట్లూ చేశారు. శాస్త్రిగారూ, సూరీ ప్రెస్సులో కూచున్నారు. శాస్త్రి గారు తొలిపలుకులు

రాశారు. మర్నాడు పొద్దునే మొదటి ప్రతి తయారయింది...

ఆ తరవాత మా నాన్నగారి పర్యవేక్షణలో 'ప్రతిమాసుందరి' నటాలి ఆధ్వర్యాన రెండు వందల నలభై సార్లు తెలుగుదేశం నాలుగుమూలలా ప్రదర్శితమయింది. అలా సాధ్యం కావటానికి శాస్త్రిగారే కారణమని నమ్మేవాణ్ణి ... నేను గుంటూరు వెళ్ళిపోయాను. శాస్త్రిగారు నాతో రాలేదు.




['ప్రతిమా సుందరి' నాటకానికి తొలిపలుకులు:]

## సాహితికి పరమసీమ, రూపక నిర్మాణం

మల్లాది రామకృష్ణశాస్త్రి

నాటక శిల్పి, భావచైతన్య లోకంలో మహామహుల రూపక కల్పనలు నిష్ఠతో అవగాహన చేసుకోవాలి.

ఇప్పుడైనా, రచనావిన్యాసానికి ఒరవడి, దిగ్గంతులైన రూపకనిర్మాతలు తీర్చేత్రోవే! సంభాషణం పోహణికి మటుకు, తనకు గురువు తాను!

– ఇది, పరమాచార్యుల అనుశాసన రూపమైన ఉపదేశము.

నవ్య–నాటక కర్తలలో ప్రథమశ్రేణికి చెందిన విన్నాణికి, రచనా సరణికి – భావములకు, కృతజ్ఞుడు కావడం, శ్రీ 'వరద' కళా–రాసిక్యానికి బిరుదు.

'ప్రతిమాసుందరి' తెలుగులో, ఔచిత్యం, విచక్షణ, జిజ్ఞాసకు హాయిని కల్పించే స్థాయిలోది.





# ఉద్యోగాలూ, వ్యాపకాలూ

... నేను గుంటూరు చేరిన రోజునే నాకు మదరాసు నుంచి నార్ల వెంకటేశ్వరరావు గారు 'ఆంధ్రప్రభ' సంపాదక వర్గంలో చేరమంటూ టెలిగ్రాం ఇచ్చారు. వెంటనే మదరాసు వెళ్లిపోయాను.

*[గుంటూరు నుంచి బయలుదేరే ముందు మామిడిపూడి వెంకట రంగయ్యగారు వరదరాజేశ్వరరావు గారి రీసెర్చి విషయమై రాసిన ఉత్తరం అందింది.]*

RECOGNISED BY ALL THE DIRECTORS OF PUBLIC INSTRUCTION

EDUCATIONAL INDIA

*A Monthly Devoted to Indian Education*

PUBLISHED FROM MASULIPATAM

EDITOR :
M. VENKATARANGAIYA, M. A.,
PROFESSOR AND HEAD, DEPT. OF
HISTORY, ECONOMICS AND POLITICS,
ANDHRA UNIVERSITY.

Nellore
1-6-42

చి॥ రాజేశ్వరరావుకు అనేక ఆశీర్వచనములు.

నీవు వ్రాసిన ఉత్తరం అందినది. Madras University Research కి అవకాశాలు తగ్గినవని విన్నాను. ఈ సంవత్సరం కొత్తగా ఎవరిని చేర్చుకొనరనిన్ని, చేర్చుకొన్నా వేతనాలు ఇవ్వరనిన్ని తెలియుచున్నది. ఒక వేళ నీవు అక్కడ Research చేయదలచుకొనిన యెడల Dr. Asirvatham వద్ద రీసెర్చి చెయ్యవలసి ఉంటుంది. నా క్రింద పనిచేయుటకు వీలుండదు. నీవు వెంటనే Madras University Registrar కు దరఖాస్తు పంపేది. అక్కడి నుండి జవాబు వచ్చిన తర్వాత, అవసరమైతే Dr. S. Asirvatham గారికి వ్రాస్తాను.

బహుశః వారం రోజులలో నీకు గుంటూరుకు వ్రాస్తాను. ఇక్కడ పట్టాభి, కృష్ణమూర్తి వగైరా అందరూ కులాసాగా ఉన్నారు-వ్రాయుటకు విశేషాలు లేవు-ఎండలు అతి తీవ్రంగా ఉన్నందువల్ల ఏపనిసాగుట లేదు-

మా. వెంకట రంగయ్య

మా. వెంకట రంగయ్య

S. Radhakrishnan
Vice-Chancellor

BENARES HINDU UNIVERSITY
Benares,
9th November, 1942.

Dear Rajeswara Rau,

Thank you for your letter. If a reference is made to me, I shall remember what you say.

With kind regards,

Yours sincerely,

[ఉద్యోగ ప్రయత్నాల్లో రాధాకృష్ణన్ గారి 'రిఫరెన్స్' ఇవ్వడానికి అనుమతి కోరిన దానికి సమాధానం.

## మదరాసులో : 1943–46

*[వరదరాజేశ్వరరావుగారు రాజనీతి శాస్త్రంలో పరిశోధన. చెయ్యాలనే అభిలాష ఉన్నప్పటికీ ఆర్థిక కారణాలవల్ల ఆ మార్గాన్ని వదిలి ఉద్యోగంలో ప్రవేశించారు.*

From
V.S. Krishna
B.A. (Oxon), Ph.D.
Professor & Head of the History,
Economics & Politics Dept.,
Andhra University.



Andhra University
University Colleges

Guntur
Date: 24-7-45

I have known Mr. A. Rajeswara Rao, M.A. for over six years. He was a student of the University Colleges for three years and underwent a course of

instruction in History, Economics & Politics, with specialisation in Politics. He possessed a wide knowledge of the different subjects and an intelligent grasp of the fundamentals. I consider him to be one of our best students in recent years.

V.S. Krishna

Professor & Head of the History,
Economics &Politics Dept.,
Andhra University.

*[ఉద్యోగం కోసం తీసుకున్న సర్టిఫికెట్]*

మొదట ఆంధ్రప్రభ లోనూ, తరవాత ఇండియన్ ఎక్స్‌ప్రెస్‌లోనూ కొన్నాళ్ళు సబ్-ఎడిటర్‌గా పనిచేశారు.

తరవాత, 'మదరాసు (వార్) రెవ్యూ' లో అసిస్టెంట్ ఎడిటర్‌గానూ, మదరాసు ప్రభుత్వం ఆహారశాఖలో ప్రజాసంబంధాల అధికారిగానూ ఉద్యోగాలు నిర్వహించారు.]

•

*[యుద్ధకాలంలో అబ్బూరి రామకృష్ణారావుగారు 'నటాలి' ని మదరాసుకి తరలించి, అక్కడ 'కన్యాశుల్కం' నాటక ప్రదర్శన లిచ్చారు.]*

... బలిజేపల్లి లక్ష్మీకాంతం గారు ఆమరణాంతం మా నాన్నగారంటే అభిమానంతో ఉండేవారు. అంతేకాదు. 1944లో మదరాసులో నటాలి నిర్వహిస్తున్నప్పుడు మా నాన్నగారు కన్యాశుల్కం నాటకాన్ని ప్రదర్శించగా అందులో మా నాన్నగారితో పాటు అగ్నిహోత్రావధాన్లు పాత్ర అమోఘంగా నిర్వహించారు.

ఆ రోజుల్లో ... లక్ష్మీకాంతంగారు, నేనూ, శ్రీ శ్రీ, నళినీకుమార్, లక్ష్మీకాంతంగారి మేనకోడలు డాక్టర్ వరం తరచు కలిసి తిరుగుతుండేవాళ్ళం మాంబళం వీధుల్లో. లక్ష్మీకాంతంగారు గుంటూరు నాటక సమాజం గురించి అప్పుడప్పుడు మాటాడుతూ ఉండేవారు ...

యుద్ధకాలంలో మదరాసులో ఉండగా నాకోసారి రేడియోలో ప్రసంగించమని ఆహ్వానం వచ్చింది. విషయం ' ఆధునిక వాఙ్మయంలో మైలురాళ్ళు: త్రృణకంకణం'

... మదరాసులో రిచై జాన్స్ ప్రింటర్స్ ముద్రణాలయం ... లో ఉద్యోగానికి మద్దిపట్ల సూరివచ్చాడు. మరి కొన్నాళ్ళకు శాస్త్రిగారూ [మల్లాది] మదరాసు చేరుకున్నారు. సూరి లజ్ కార్నర్ లో ఓ చిన్న ఇంట్లో మేడమీద గదిలో ఉండేవాడు. చక్రపాణి మొదటి సారిగా వ్యాపారంలో దిగటానికి వచ్చినప్పుడు సూరి గదిలోనే

ఉంచాము. శాస్త్రిగారు తిరుమూర్తి రోడ్డులో ఉండేవారు. నేను ఎలియట్స్ రోడ్డులో మౌంటురోడ్డుకి దగ్గిరగా ఉండేవాణ్ణి.

ఆ రోజుల్లో మదరాసులో ప్రసిద్ధ రచయితలు చాలామంది ఉండేవారు. అయినా శాస్త్రిగారు అలా అందరితోనూ కలిసి తిరిగేవారుకాదు. శ్రీ శ్రీ, నేనూ వారానికి కనీసం ఒక రోజన్నా కలిసేవాళ్ళం. మధ్యమధ్య శిష్లా ఉమామహేశ్వరరావు, రుక్మిణీనాథశాస్త్రి వస్తుండేవారు ...

అప్పటికి మా అందరికీ సాహిత్యం తప్ప మరో ఆసక్తికరమైన విషయం ఉండేదికాదు. అందరమూ ఏదోరాస్తూనే ఉండేవాళ్ళం. అచ్చువేయించాలని ఎవరికీ ధ్యాస ఉండేదికాదు ... మాలో మేమే చదువుకుని ఆనందించేవాళ్ళం. అలా రుక్మిణీనాథశాస్త్రి రాసినవి చాలా పోయినాయి. అతనికి మాత్రం కంఠతావచ్చేవి. ఓసారి అతని మీదనేను 'రుక్కుటేశ్వర శతకం' అంటూఓ ముప్పయి పద్యాలు కూర్చాను ...ఆ పద్యాలన్నీ శ్రీనివాసరావు కిచ్చాను. అతనెక్కడో పారేశాడు ... ఆ రోజుల్లో సునిశితమైన హాస్యస్ఫూర్తికి రుక్మిణీనాథశాస్త్రి మాఅందరికీ ఒకరకంగా ఇన్స్పిరేషన్‌గా ఉండేవాడు.

ఆ సమయంలో శ్రీరంగం శ్రీనివాసరావు కవిత్వానికి ప్రత్యేకంగా ఓ *పత్రిక నడిపిస్తానని చెపుతూ వొచ్చాడు ... ఆ పత్రిక ముఖపత్రం మీద వెంకటశాస్త్రిగారి చేతుల ఛాయాచిత్రాన్ని అచ్చువేయిస్తానన్నాడు. ఆయన వేళ్ల ప్రస్ఫుటంగా కనిపించాలన్నాడు. ఇద్దరం కలిసి వెంకటశాస్త్రిగారున్న కడియం పోదామనుకున్నాము. ఇద్దరి దగ్గరా తగిన డబ్బుల్లేవు. ఇంతలోకి నేను హైదరాబాదు వచ్చాను.

*[హైదరాబాదు వెళ్ళేముందే తండ్రి అనారోగ్యం గురించి కబురు తెలిసింది.]*

77B Harris Road,
Mount Road P.O.
Madras.

My Dear Sister,

I wrote a letter to you a few days ago in reply to yours. Last evening I again received a card from you. I like to know the exact state of the health of father. Is the complaint acute or still in the initial stage?

---

* *['ధ్వని' అనే పత్రిక ప్రారంభించడానికి చేసిన ప్రయత్నాల గురించీ, 'చెళ్ళపిళ్ళ' వారి చేతుల ఛాయా చిత్రాల గురించీ, వరదరాజేశ్వరరావుగారు తరవాత హైదరాబాదు/ బెజవాడలో ఉండగా 1947లో శ్రీ శ్రీ ఉత్తరాలు రాశారు.]*

Whatever it is he needs complete rest and best treatment possible. If the Doctors advise, he can come over here and stay in some nursinghome or Sanitorium . I am trying to come there if I can snatch a couple of days' leave. I am worried day and night. I have even lost all taste for food.

You must immediately write to me of your plans for father's treatment. I have written to Sthanapati Satyanarayana to come to you often and be of some assistance. I don't know what Vani has in mind.

... How are the children? I will write to mother tomorrow. Where is Dr. Lanka Sundaram now?

26.8.46

Yours affly
Varada.



# హైదరాబాదు/బెజవాడ/హైదరాబాదులో: 1946–58

## హైదరాబాదులో : 1946–47

John Spiers,
EDITOR, MADRAS REVIEW.

VICTORY HOUSE,
MOUNT ROAD,
MADRAS.

I can thoroughly recommend the services of Mr. A. V. Rajeswara Rau as an all-round journalist capable of carrying out all the editorial duties required for any journal, having obtained the most satisfactory work from him while he was in charge of the Telegu edition of the Madras (War) Review. He also faithfully served the Department and his personal character is beyond reproach.

John Spiers

Fernhill P.O.,
Nilgiris.

7th August 1946.

[హైదరాబాదులో ఉద్యోగం కోసం తీసుకున్న 'సర్టిఫికెట్'.]

... నేను సర్ మీర్జా ఇస్మాయిల్ గారితో పాటు హైదరాబాదు రావటం తటస్థించింది. ఉద్యోగరీత్యా. ఆ రోజుల్లో కొన్నాళ్ళు కుందూరి ఈశ్వరదత్తుగారితో పాటు లేక్‌వ్యూగెస్ట్‌హౌస్ ఆవరణలో ఒక ఇంట్లో ఉంటుండేవాణ్ణి.

అప్పుడు నేను హైదరాబాదు ప్రభుత్వంలో సర్ మీర్జా ఇస్మాయిల్ ప్రధానిగా ఉన్నప్పుడు ఆయన కింద ప్రత్యక్షంగా పనిచేసేవాణ్ణి. ఆయన ప్రధాని పదవీ స్వీకారం చేసిన కొన్నాళ్లకే అప్పుడావరించిన హైదరాబాదు వాతావరణాన్ని యేవిధంగానూ సంస్కరించలేననే హతాశకు లోనయినాడు. ఆఖరిసారిగా గాంధీగారి కొక ఉత్తరం రాసి నిశ్శబ్దంగా హైదరాబాదు నుండి తరలిపోదామనుకున్నారు. ఆ రోజుల్లో తెలంగాణా ప్రాంతంలో కమ్యూనిస్టు సాయుధ విప్లవ కార్యక్రమం నడుస్తోంది. ఆ కార్యక్రమం పట్ల వెంకటప్పయ్య పంతులుగారి అభిప్రాయాన్ని కనుక్కొని రమ్మన్నారు

నేనూ మల్లాది ఫణీభూషణరావూ కలిసి పంతులు గారిని బెజవాడలో కలుసుకున్నాము ... సర్ మీర్జా ఇస్మాయిల్ గారి సందేశాన్ని వినిపించాను. చిరునవ్వుతో మాట్లాడి తనుకూడా మహాత్ముడికి రాస్తామన్నారు ...

అప్పుడు బాపిరాజుగారు 'మీజాన్' అనే దినపత్రికకు సంపాదకుడిగా పనిచేసేవారు. బాపిరాజుగారూ, కుందూరి ఈశ్వర దత్తుగారూ సహాధ్యాయులు. నేను దత్తుగారితో పాటు పనిచేసేవాణ్ణి. మేం ముగ్గురం ఎన్నో సాయంకాలాలు కలిసి కాలక్షేపం చేశాం.

## జ్ఞాపకాల వరద
## ఓ నాటి వోటు కథ

1946 సంవత్సరంలో మొదటిసారిగా హైదరాబాదులో కాలుపెట్టాను. అప్పుడు మదరాసు ఉమ్మడిరాష్ట్రంలో ప్రకాశంగారు ముఖ్యమంత్రిగా వచ్చారు. అక్కడ ప్రభుత్వం కార్యాలయంలో సమాచారశాఖలో ఉద్యోగంచేసే వాణ్ణి. సాయం కాలాలు ఆచారప్పన్ వీధిలో చక్రపాణి ప్రారంభించిన 'ఆంధ్రజ్యోతి' మాసపత్రికను నిర్వహించడటంలో సహాయం చేస్తూండేవాణ్ణి. ఒకసారి హైదరాబాదు ప్రభుత్వం తరపున మదరాసు ప్రభుత్వసమాచారశాఖను క్షుణ్ణంగా అధ్యయనం చేసేందుకు ఒక చిన్న ప్రతినిధిబృందం వచ్చింది. వారికి సహాయం చేసేందుకు మదరాసు ప్రభుత్వ సమాచారశాఖ డైరక్టరుగావున్న చావలి వెంకటహనుమంతరావు నన్ను నియోగించారు. ఓ వారం రోజుల తరవాత ఆ ప్రతినిధివర్గంలో ఒకాయన నన్ను హైదరాబాదులో తమ శాఖలో చేరితే సంతోషిస్తానని చెప్పారు. ఆలోచించి చెబుతానని సమాధానం యిచ్చాను.

సర్ మీర్జా ఇస్మాయిల్ గారు హైదరాబాదు సంస్థానంలో ప్రధాని కాబోతున్నారని వార్తనీ, హైదరాబాదు నుంచి నాకు దొరికిన ఆహ్వానం గురించి, జయపూర్ లో ఇస్మాయిల్ గారితో పనిచేస్తున్న కుందూరి ఈశ్వరధత్తు గారికి ఉత్తరం రాశాను. తిరుగు టపాలో ఆయన ఉత్తరం రాస్తూ సర్ మీర్జా మదరాసు వచ్చి ఒక రోజు ఉంటారనీ నన్ను కలవమనీ సలహాయిచ్చారు. ... 'త్వరగా నువ్వు హైదరాబాదుపో–దూరంగా ఉన్న చిన్న చిన్న పట్నాలకుపోయి, అక్కడ సామాన్యజనం ప్రజాస్వామిక విధానానికి సత్వరంగా సంసిద్ధులు కాగలరో లేదో కనుక్కో. ఎన్నికలు పెడితే వోటు వెయ్యటం లాంటి సదాచారాన్ని వెంటనే సవ్యంగా సఫలం చెయ్యగలరా? ...నేను ఓ నెల రోజుల్లో హైదరాబాదు వస్తాను. నాతో ఈశ్వరదత్తూ వస్తున్నాడు. అక్కడ కలుద్దాం'.

ఈ లోపున నాకు మళ్ళీ హైదరాబాదు నుంచి వర్తమానంరానే వచ్చింది. ఉద్యోగానికి రాజీనామా యిచ్చి ఓ ఉదయాన నాంపల్లి స్టేషన్లో దిగాను. స్టేషన్లో పెద్ద జన సమ్మర్దం లేదు. ఓ పల్లెటూరి వాతావరణం. ప్రశాంతంగా ఉంది. రిక్షా కోసం స్టేషన్నించి బయటపడాలి. కూలివాడి నెత్తిమీద హోల్డాలూ, సూటుకేసూ పెట్టి నడుస్తున్నాను. పోలీసువాడు కుడిచేతివైపు పొమ్మన్నాడు. అక్కడ ఆపేశారు నన్నూ, కూలివాణ్ణీ ఓ సాయిబు ముందు కొచ్చి హోల్డాలు నేలమీద పడెయ్యమన్నాడు. విప్పారు. ఏమిటన్నాను. కరోడ్గిరీ నాకా అన్నాడు కూలీవాడు. అర్థంకాలేదు.

హోల్డాలంతా చిందరవందర చేశాడు కరోడ్గిరీ నాకా పోయిబు. అందులోంచి రెండు 'ఆంధ్రజ్యోతి' సంచికలు నేలమీద పడ్డాయి. మనస్సు చివుక్కుమంది. అందుకే కాబోలు చక్రపాణికి నేను హైదరాబాదు పోవటం యిష్టంలేదు! సూటుకేసు విప్పించారు. దాన్ని చిందరవందర చేశారు. నాకు వస్త్రాపహరణమంత సిగ్గేసింది. దాంతో నాకు హైదరాబాదు మీద మోజు తగ్గటం ప్రారంభించింది. మెల్లిగా మళ్లీ అన్నీ సర్దుకుని రిక్షా యెక్కి నావిడిదికి బయల్దేరాను. మిత్రుడు మొహమ్మద్ ఖాసింకాన్ మోజాంజాహి మార్కెటు కెదురుగా బాచ్ లర్స్ క్వార్టర్స్‌లో తాత్కాలికంగా నావిడిది ఏర్పాటు చేశారు. కరోడ్గిరీ నాకా పక్కనే ముసాఫర్‌ఖానా. అది దాటి యెడం చేతివైపు వీధి ప్రవేశించాను. ఆ వీధి ప్రవేశిస్తుండగా యెడం చేతివేపు 'దక్కను క్రానికల్' కార్యాలయాన్ని చూశాను. అంతకు ఆర్నెల్ల క్రితం అందులో ఉద్యోగం యిస్తామంటే నేను వొప్పుకోలేదు. దానికిపైనే నాలుగోయింట్లో బారిష్టరు అక్బరలీఖాన్-ఆ తరవాత గోల్డెన్ త్రెషోల్డు-అలా చూస్తూ పోతున్నాను. మళ్ళీ మేడ పక్కన తిరిగాను. ఓ అయిదు నిమిషాల్లో నేనున్న చోటికి వచ్చేశాను. వీధులన్నీ పరిశుభ్రంగా ఉన్నాయి. రోడ్లకి రెండు వైపులా యేపుగా యెదిగిన చెట్లూ తీర్చిదిద్ది నట్లున్నాయి.

ఆ మధ్యాహ్నమే ఉద్యోగంలో చేరినట్లు రాయించి జిల్లాల్లో తిరగాల్సిందని శాఖాధిపతి అయిన సయ్యద్ గులాంరసూల్ గారితో చెప్పాను. ఆయన కళ్లు విప్పారినయి. ఎందుకంటే చాలా జిల్లాల్లోకిపోయి వస్తామన్న వాళ్లింతవరకెవరూ లేరు.

అక్కడేం జరుగుతోందో కూడా తెలియదు. పోవటానికి కూడా భయమే! సర్ మీర్జా ఆదేశాన్ని మనస్సులో పెట్టుకుని ముందుగా నిజాంబాదు బయల్దేరాను. అయితే వూళ్లో ప్రవేశించకపూర్వమే అక్కడ ప్లేగు వ్యాధి ఉందనీ, వెళ్లడం మంచిదికాదనీ అక్కడి ప్రభుత్వోద్యోగులు చెప్పారు. ఆవేళ కెనాల్ పక్కనే ఉన్న ధర్మవరం విశ్రాంతి గృహంలో వుండి పోయాను. ధర్మవరంలో చాలామంది రైతులు గుంటూరు జిల్లా నుంచి వలసవచ్చినవారు. వాళ్లతో మాట్లాడుతూ నిజాం పరిపాలనలో సాగుతున్న యథార్థ పరిస్థితి తెలుసుకున్నాను. అలా వలసవచ్చిన వారిలో కొంతమంది అక్కడ జరుగుతున్న స్వాతంత్ర్యసమరంలో పాల్గొని జైళ్లకి వెళ్లారు. అందులో యిద్దరు ముప్పిలినేని శ్రీనివాసరావు, డాక్టరు భోగరాజు వెంకటేశ్వరరావు, తరవాత కాలంలో విఠల్ రెడ్డితోపాటు నాకు సన్నిహితులయ్యారు. నిజాంబాద్ నుంచి వెనక్కుపోయి మహబూబ్‌నగర్ వెళ్ళాను. స్టేషన్‌కు వూరు దూరం. అప్పుడు తాలుక్దారు ఇల్లెందుల రామచంద్రరావు. అప్పట్లో హైదరాబాదు సివిల్ సర్వీస్ అని ఉండేది. అందులో అప్పటికి ముగ్గురే తెలుగువారుండేవారని గుర్తు. రామచంద్రరావుని కలుసుకుని నా పర్యటన కార్యక్రమం ప్రస్తావించి ఆయన సలహా తీసుకుని ముందుగా నాలుగయిదు ప్రదేశాలకు నారాక గురించి తెలియచేస్తూ వివరంగా ఉత్తరాలు రాయించాను. ముందుగా గోపాలపేటకు బయలుదేరాను. ఆ రోజుల్లో అన్ని ప్రాంతాలకు రోడ్లు లేవు. బస్సులు కూడా చాలా తక్కువ. గ్రామాల్లో ఎద్దుబళ్ల మీదా గుర్రాలమీదా పనిపడితే ప్రజలు పోయేవారు.

గోపాలపేట ఓ చిన్న సంస్థానం. రాజావారు లేరు. రాణీగారి పరిపాలనలో ఉండేదని గుర్తు. బస్సు దిగగానే సంస్థానం తాలూక్దార్, యితర ఉద్యోగులూ నాకు స్వాగతం పలికి ఓ ఒంటెద్దు బండిమీద (అదో చిన్న సైజు రథం లాంటిది) విడిదికి తీసుకుపోయారు. నిజాం ప్రకటించిన



['వరద', ముప్పలినేని శ్రీనివాసరావు, విఠల్‌రెడ్డి]

సంస్కరణలను అనుసరించి ఎన్నికలకు యేర్పాట్లు చేస్తున్నామనీ అక్కడ జరగబోయే ఎన్నికలు జయప్రదంగా జరుగగలవనీ తాలుక్దార్ కిరత్ చంద్ చెప్పాడు. కిరత్ చంద్ కాయస్థుడు. ఎర్రగా,పొట్టిగా- తెల్లని షెర్వానీ, పైజామాతో, కుచ్చుటోపీతో, నిత్యతాంబూల చర్వణంతో ఓ రకమైన సర్కసు బఫూనులా ఉండేవాడు. హాస్యాస్పదమయిన తెలుగు మాట్లాడేవాడు. "ఎన్నికల యేర్పాట్లు ఎలా చేశానో చూపిస్తాను, రేపు ఉదయం ఎనిమిది గంటలకల్లా తయారయి మీరుండాలి" అన్నాడు. అక్కణ్ణించి నేను పదిగంటలకల్లా వనపర్తి పోవాలి.

పొద్దునే తహశీల్దారు కార్యాలయం ముందు ఎన్నికల ప్రదర్శన ఏర్పాటయింది. నన్ను తీసుకుపోయారు. మధ్య ఒక పెట్టె పెట్టారు. ఒక పక్క కాగితం మీద లాంతరు బొమ్మ, మరొకపక్క యేనుగు బొమ్మా వున్నాయి. ఒకదాని మీద కందీల్ అనీ రెండోదాని మీద హాథీ అనీ రాశారు. ఒకవైపు ఓ ముప్పయి మంది జనాన్ని వరసగా నిలబెట్టారు. రెండోవైపు మేము. కిరత్ చంద్ అలా నిలబడ్డ జనంలో నించి కుర్రాణ్ణి పిలిచి నువ్వు కందీల్‌కి వేస్తావా వోటు, లేక హాథీకి వేస్తావా? అని అడిగాడు. వాడు నివ్వెరపోతూ చూస్తున్నాడు. కిరత్‌చంద్ గొంతెత్తి గట్టిగా మళ్లీ అడిగాడు. వాడు వణికిపోతూ వంగి కిరత్‌చంద్ కాళ్లు పట్టుకుని 'బాంచను దొరా! నీకేస్తాను-ఆ టికెయ్యను" అని అరిచాడు!

**(సుప్రభాతం 20, డిసెంబరు 1991)**

# నైమాలుమ్

మహబూబ్ నగరంలో దాదాపు నెల రోజులున్నాను. వారానికొకసారి హైదరాబాదు వచ్చిపోతూండే వాడిని. మహబూబునగరం అసలు పేరు పాలమూరు. ఊరు మొదలయినప్పట్నించీ ఓ అరమైలుదాకా బజారు వీథి ఉండేది. వీథి దీపాలుండేవికాదు రాత్రిళ్లు. విద్యుచ్ఛక్తి లేదు. రాత్రిళ్ల స్టేషన్నుంచి ఒంటరిగా రావటం భయం. దారిలో జిల్లా ఖజానా ఉండేది. దానికి కాపలాగా అరబ్బులుండేవారు. పదునైనవీ పెద్దవీ, పొడుగుపాటి కరవాలాలుండేవి. ఎవరినన్నా చూచాయగాచూస్తే పెద్ద అరుపులతో హెచ్చరించేవారు. వాళ్లకి తెలుగు భాష వచ్చేదికాదు.

ఊరు, చిన్నదయినా జిల్లాకు పరిపాలనా కేంద్రం కనక ఇంతో అంతో జనసమ్మర్దం ఉండేది. అయితే భోంచెయ్యటానికి హోటళ్లుండేవికావు. చిన్న చిన్న చాయ్‌దుకాణాలు వెతికితే దొరుకుతాయి. రోడ్డుమీద ఓరకమయిన హోటల్ని వారం రోజుల తరవాత కనిపెట్టాను. ఎంచాతనంటే నాకు జనం మధ్య తిరగాలని ఉండేది. నాకు చప్రాసీల విద్దర్ని నియోగించారు. అందులో ఒకడు వంట చేయగలనన్నాడు. అయితే ఇల్లూ దాంతో పాటూ వంటిల్లూ యివన్నీ యేర్పాటు చేసుకునేందుకు నాకు తీరికాలేదు, మనస్సూ లేదు. అంచాత ఆ హోటలు మీద శ్రద్ధ చూపించాను. ఆ హోటలు యజమాని కర్నూలులో ఉండేవాడు. అతనికి కొంచెం స్త్రీ వ్యామోహం. అంచాత రోడ్డుమీద ఆ యిల్లు తీసుకున్నాడు. ఆ యింట్లో పెద్ద అటక కూడాఉండేది. కేవలం రహస్య కార్యకలాపాలకు పనికొచ్చేట్టుండేది. ఇంటి కిరాయీ, ఖర్చూ భరించేందుకని హోటలు పెట్టాడు కిరాయికి తీసుకున్నాయన. ఆ హోటలు వ్యవహారమంతా ఒకతను చూస్తుండేవాడు. అతని పేరు కోటేశ్వరరావు. అప్పటికే యాభయి యేళ్లకు పైన ఉన్న వయస్సు అతన్ది. సన్నగా పీలగా ఉండేవాడు. బ్రాహ్మణుడు. ఇంత అన్నం వండేవాడు. ఓ పచ్చడి చేసేవాడు. వీలుంటే కూర, నీళ్ళచారు, నీళ్లమజ్జిగా. ఇదీ ప్రతి రోజూ అతను పెట్టే భోజనం. అతను పశ్చిమ గోదావరి జిల్లా నుంచి యీతిబాధల్ని వదులుకుని వచ్చేశానని నాతో చెప్పేవాడు. నేనంటే కొంచెం గౌరవంగా చూస్తుండేవాడు. నేను భోం చేస్తానన్నప్పుడల్లా నాకోసం అన్నీ వండి పెట్టేవాడు. అతనికి వ్యాపారంమీద దృష్టి వుండేది కాదు. మనస్సులో యేదో అనుకుని ఆ రోజుకా ఆదాయం వస్తే హోటలు సంగతి పట్టించుకునేవాడుకాదు. ఓ రోజున ఎవరో పెద్ద మనిషి భోజనానికి వొచ్చాడు. చాలా సేపతన్ని కూచోపెట్టేశాడు. అతనికి ఆకలి బాధ. రెండుమూడుసార్లు జ్ఞాపకం చేశాడు. అతన్ని కూచోమని చెప్పి విస్తట్లో ఓ పచ్చడీ, యింత అన్నమూ పెట్టి పట్టుకొచ్చాడు. అతని ముందు పెట్టాడు. ఆ పెద్దమనిషి, యిదేం భోజనమయ్యా అన్నాడు. అంతే కోటేశ్వరరావు చప్పున విస్తరి పట్టుకుని లోపలికి వెళ్లిపోయాడు. ఇంకెక్కడన్నా భోంచేయండి అని లోపల్నించి అరుపు! అసలే ఆకలితో వున్నాడు, మధ్యాహ్నం దాటుతోంది, భోంచెయ్యటానికి ఆవూళ్లో మరో చోటు లేదు. ఆ పెద్ద మనిషికి కళ్లనీళ్ల పర్యంతమయింది. ఉన్నదే పెట్టమని ప్రాధేయపడ్డాడు.

అలా హోటల్ నడుపుతున్న కోటేశ్వరరావు భోజనం నాకు శరణ్యమయింది. అక్కడికి ఓసారి పులిరామస్వామి నిజాం తలపెట్టిన సంస్కరణల ప్రచారం కోసం వచ్చాడు! మామూలుగానే

కోటేశ్వరరావు స్థిమితంగా లేక పోవటంవల్ల అతనికి ఆ రోజు పస్తయింది. నేనుసంగతివిని అతన్ని తీసుకుపోయి కోటేశ్వరరావుచేత భోజనం పెట్టించాను. తరవాత నా ప్రోద్బలంమ్మీద కాంగ్రెస్‌లో చేరి పార్లమెంట్ సభ్యుడయ్యాడు. నాకు సన్నిహితంగా ఉండేవాడు.

కోటేశ్వరరావు హోటలువల్ల యితర్రా నేను చాలా లాభం పొందాను. అక్కడికి వివిధ గ్రామాల నుంచి రకరకాల వ్యక్తులు వస్తుండేవారు. వారందరితోనూ అవకాశం దొరికినప్పుడల్లా మాట్లాడుతూ అలా సేకరించిన విషయాలను ఒక చోట రాసుకుంటూ ఉండేవాణ్ణి. వీటిని ఆధారం చేసుకుని సర్ మీర్జా గారికి ఓ రహస్య నివేదికను తయారుచేసి సమర్పించేందుకు నాకు వీలయింది.

ఆఫీసర్లక్లబ్బు ఒకటుండేది. నా సంగతి విన్న మోతిమీమ్‌సాహెబ్ నన్నొకసారి చూడాల్నుందని తాలుక్దార్‌తో చెప్పాడు. ఇల్లెందుల రామచంద్రరావు గారు నవ్వుతూ నన్ను క్లబ్బు కొకసారి వచ్చి అందరినీ పలకరించి పోవటం మర్యాద అన్నారు. సరేనన్నాను. మోతిమీమ్ అంటే జిల్లా పోలీసు సూపర్నెంటన్నమాట. క్లబ్బులో కాలుపెట్టగానే ముందుగా ఆయన్నే నాకు పరిచయం చేశారు తాలుక్దారు. ఆయన నిజాం నవాబుకు బంధువని విన్నాను. పక్కనే కూచోమన్నాడు. కూచోగానే వరసగా ఉర్దూలో మాట్లాడ్డం ప్రారంభించాడు. నాకు ఉర్దూరాదు. నేను నేర్చుకుందల్లా యెవరన్నా నాతో మాటాడితే –హాజీ–అనడం. ఆయన ప్రశ్నలకు కూడా నేను హాజీ అనటంతో ఆయనకి అర్థం అయిపోయింది నాకు ఉర్దూరాదని. ఆ తరవాత యింగ్లీషులో ఏదో అడిగాడు. మర్యాదగా జవాబు చెప్పాను. క్లబ్బులో అందరూ షేర్వానీలూ, పైజామాలు వేసేవారు. తప్పనిసరిగా తలకి టోపీ ఉండేది, కుచ్చుటోపో, బొచ్చుటోపో–తాలుక్దారు రామచంద్రరావుగారు మాత్రం సూటువేసేవారు. నా వేషం సరేసరి. బూట్లూ, పాంటూ, అందులో టక్ చేసిన షర్టూ! నేను తరవాత స్టేటు కాంగ్రెస్‌లో వున్నప్పుడూ అదే వేషం సామాన్యంగా.

జిల్లా సూపర్నెంటుకు నా వ్యవహారం నచ్చలేదని తెలిసిపోయింది. నేను వూళ్లో సామాన్యజనం మధ్య తిరుగుతూండటం అధికార వర్గానికి మర్యాదకరంకాదని తాలుక్దార్‌కి చెప్పాడు. తరవాత నామీద అప్పటి మంత్రి మోయిన్ నవాజ్ జంగ్‌కు రహస్యంగా ఓ రిపోర్టు పంపారు. తరవాత నాకు తెలిసింది. ఇదంతా ఆయన దగ్గర నాకు ఉర్దూ వచ్చినట్టుగా నటించటంవల్లని ఓ మిత్రుడు చెప్పాడు.

ఈ సంగతివిన్న రహమత్ ఆలీ ఓ కథ చెప్పాడు. ఓ సారి ఓ విదేశీయుడు హైదరాబాదు వచ్చి చార్మినార్ దగ్గర ఓ ఇంట్లో బసచేశాడు. అతను పేరుపొందిన యింజనీరుట స్వదేశంలో. చార్మినార్‌ను చూసి ఆశ్చర్యపోయి అక్కడే నిలబడి అలా పోతున్న ఓ పెద్దమనిషిని అడిగాడట. చార్మినార్‌ను కట్టిందెవరని? విదేశీయుణ్ణి తేరిపార చూస్తూ 'నైమాలుమ్' అన్నాట్ట. ఓ రెండు రోజుల తరవాత ఆ ప్రాంతంలోనే ఉన్న ఓ పెద్ద దేవిడీని చూసి ప్రశంసా పూర్వకంగా ఆ దేవిడీ ముందు నిలబడి ఉన్న పెద్దమనిషిని అడిగాడట. ఆ దేవిడీని కట్టిందెవరని. ఆ పెద్దమనిషి 'నైమాలుమ్' అని జవాబిచ్చాడు. మరోసారి పురానాపూల్ మీద నడుస్తూ ఆ విదేశీయుడు ఆగి ఆ వంతెనని యెవరు కట్టారని దారిపోయే పాదచారిని అడిగాడు. అతను బ్రిడ్జి వంక చూస్తూ 'నైమాలుమ్' అని జవాబిచ్చాడు. ఆ విదేశీయుడు నైమాలుమ్ ఆ ప్రాంతంలో యెంత గొప్ప

యింజనీరు అయి ఉంటాడో అని ఊహించుకోవటం మొదలుపెట్టాడు. అతన్నెలాగయినా కలుసుకుని మాట్లాడాలనుకున్నాడు. ఒక సాయంత్రం బజారులో తిరుగుతుండగా ఓ రోల్సురోయిస్ కారులో ఓ నిండైన విగ్రహం కూచుని ఉండగా చూశాడు. చప్పున పక్కమనిషిని అడిగాడు అతడెవరని. 'నై మాలుమ్' అన్నాడతను. ఆ కారును సమీపించేలోగా కారు బయలుదేరి పోయింది. ఇంజనీరును చూడ్డం అయింది, కలుసుకోవటం యెలా అనుకున్నాడు.ఓ రెండ్రోజుల తరవాత తనున్న యింటి వరండాలో నిలబడి కిందికి చూస్తున్నాడా విదేశీయుడు. ఓ శవశకటం, దానివెనక చాలామంది జనం పోవటం చూశాడు. కిందికి దిగివొచ్చి ఆ మరణించిన వ్యక్తి యెవరని వాకబు చేశాడు. 'నై మాలుమ్' అని యిద్దరు ముగ్గురు చెప్పారు. విదేశీయుడు విశ్వేష్టుడయిపోయాడు. 'నై మాలుమ్' సాహెబును కలుసుకునే అదృష్టం దక్కలేనందుకు విచారించాడు!"

ఆ విదేశీయుడికెంత ఉర్దూ వచ్చునో నీకూ అంతే కదా, అన్నాడు రహమత్ ఆలీ!

('సుప్రభాతం, 5 జనవరి 1992)

•

## 'మానవసేవే మధుసేవ'

మహబూబ్‌నగరంలో పల్లెర్ల హనుమంతరావు గారుండేవారు. కాంగ్రెసులో ప్రముఖ కార్యకర్తగా ఉండేవారు. ఆయన్ని గురించి కొంత విన్నాను కాని ఆయన్ని చూసే అవకాశం చాలా రోజులకి కాని లభించలేదు. ఆ తరువాత ఆయనానేనూ సన్నిహితులమయ్యాము.

ఆయన్ని మొదటిసారి చూడటం కోటేశ్వరరావు హోటలు వెనకాల ఒక చిన్న యింట్లో. కోటేశ్వరరావు హోటలు వెనకాల ఆరుబయలు. దానికానుకుని వరుసగా దుకాణాలూ,యిళ్లూ ఉండేవి. అక్కడ ఒక గిర్నీ కూడా ఉండేది. గిర్నీ అంటే పిండిమర. ఆ గిర్నీ పక్కన ఒకటిన్నర గదులవాటా ఉంది. అందులో ఓ స్వాములవారుండేవారు. ఆయన బాగా చదువుకున్నవాడని ఆ ప్రాంతాల్లో ప్రసిద్ధి. గిరజాలు, యేపుగా పెరిగిన నల్లని గడ్డమూ, కాషాయ వస్త్రాలూ ఆకర్షవంతంగా ఉండేవారు. వయస్సు నలభయి అయిదులోపునే అనుకుంటాను. ఓసారి కోటేశ్వరరావు హోటలు యజమాని వచ్చినప్పుడు స్వాములవారిని ఆయన నాకు పరిచయం చేశారు. అప్పుడు స్వాములవారు మళయాళ ప్రాంతం నుంచి వచ్చినట్టూ, మహబూబ్‌నగరం చుట్టుపక్కల వున్న గ్రామాల్లో తిరుగుతూ ఆయుర్వేదవైద్యం చేస్తున్నట్టూ చెప్పాడు. అదీకాక చిన్న చిన్న సంపన్నుల యిళ్ళల్లో పూజలూ వ్రతాలూ నిర్వహించేవాడట. అలా నాకు పరిచయమైన స్వాములవారు నాకు అవూళ్ళో సన్నిహితుడయ్యాడు. ఆయన వల్ల అక్కడ గ్రామ జీవనవ్యవస్థ సాకల్యంగా బోధపడేది. కోటేశ్వరరావు యజమాని వారాంతానికి వూళ్లోకి వచ్చేవారు కదా–ఆ రెండ్రోజులూ సాయంకాలాలు స్వాములవారు హోటల్లో ఉన్న అటకమీదే గడిపేవారు. నేనోసారి ఆదివారంనాడు– ఆదివారం హోటలు మూసేస్తారు. హోటల్లోకి వెనకనించిపోతే తలుపు తెరిచి వుంటుంది. హోటల్లోకి ప్రవేశించాను. కోటేశ్వరరావు కనిపించలేదు. అటకమీద వెలుతురు కనపడేటప్పటికి పైకెక్కాను. అక్కడ స్వాములవారూ, యజమానీ మాట్లాడుకుంటున్నారు. ఇద్దరి ముందు రెండు గ్లాసులూ–ఓ పెద్దసీసా, ఓ కూజా ఉన్నాయి. నన్ను చూసి యిద్దరూ లేచి మర్యాద చేశారు.

నేను కోటేశ్వరరావు కోసం వచ్చాననీ, ఫోంచేసి త్వరగా వెళ్లిపోవాలని చెప్పాను. వాళ్లు తాగుతున్నారు. స్వాములవారు గ్లాసు నిండీ నిండగానే ఏకగ్రీవంగా తాగేస్తున్నారు. మనిషిలో కించిత్తు మార్పులేదు! నాకాశ్చర్యం వేసింది. అయన్ని పెద్దపట్లు. అంతటి పట్టు పరిశ్రమ మనం సామాన్యంగా చూడం. అమర్నాడు ఆయన వాలకమే వేరు. దైవాంశంగా ఉండేవారు. ఆయన్ని చూస్తే నాకు ముచ్చట వేసేది. ఆయన దగ్గర మందులు నూరేందుకు ఇద్దరు పల్లెపడుచులుండేవాళ్లు–'అంకుర్' చిత్రంలో పనిమనిషిని చూస్తున్నప్పుడు స్వాములవారి పరిచారికలే కళ్లకు కట్టారు! అంత అమాయకంగా, నాజూగ్గా ఉండేవారు. తలముడి అందంగా వేసేవారు. చీరలు పాదాలకు బాగా యెత్తుగా కట్టేవారు. ఎప్పుడూ ప్రసన్నవదనాలతో ఉండేవారు. అప్పుడప్పుడు ఆయన దగ్గరకు పోయి మాట్లాడుతూ కూచుండేవాళ్లే. మందులకోసం ఒకరోయిద్దరో పెద్దమనుషులే వచ్చిపోతుండేవారు. ఆయన మాట్లాడే తీరులోనే వాళ్ల రోగం సగం నయం అయ్యే అవకాశం ఉండేది.

స్వాములవారి దగ్గర పనిచేసే యిద్దరి పిల్లల్లో ఒక దాని పేరు మల్లమ్మ. దాన్ని మల్లీ అని ఆయన పిలిచేవారు. ఆ పిల్ల చాలా బాగుండేది. నా వయస్సు అప్పటికి యిరవయి మూడు యిరవయి నాలుగు. అంచేత ఆ పిల్లని చూసినప్పుడల్లా నాకు భువనైక సుందరిగా తోచేది. నేను వెళ్ళినప్పుడల్లా నన్ను చూసి అతి వినయంగా నవ్వేది. అయితే యివన్నీ నేను పట్టించుకునేవాణ్ణి కాదు, నా అధికార కార్యక్రమంలో మునిగిపోయి ఉండేవాణ్ణి కనక. నేను పూళ్లో నిత్యం తిరిగే ప్రాంతాల్లో సామాన్య జనానికి నేనంటే యెంతో భయం, భక్తిని. నేనో పెద్ద అధికారినని వాళ్ల ఊహ. అందువల్లే స్వాముల వారింటిచుట్టూ ఉండే జనానికీ నేనంటే గౌరవం. ఆయనకి నేను రావటం పెద్ద హెూదాగా భావించేవాడు. మళయాళ స్వాములవారు కనక మానవసేవే మధుసేవ అని తలపోసినా ఆయనమీద నాకు దురభిప్రాయం లేకపోవటం వల్ల నాపట్ల మరింత గౌరవం ప్రదర్శించేవాడు. అయితే దానికీ హద్దుండాలి కదా!

ఒక రోజు నేను పడుకుని లాంతరు దగ్గర చదువుకుంటున్నాను. రాత్రి తొమ్మిది కూడా కాలేదు. అప్పుడు రోడ్డుకానుకుని ఒకే మేడ ఉండేది. వకీలు నారాయణరావుగారి మేడ. ఆ మేడమీద ఒక గదిలో ఉండేవాణ్ణి. నాగదీ, వరండా, వెనకాల విశాలమైన డాబా. ఆ డాబామీద నా చప్రాసి నిద్రపోతున్నాడు. మెట్లమీద చప్పుడయింది. క్షణాల్లో కోటేశ్వరరావు వచ్చాడు. గుప్పున సారా వాసన! అనలుసంగతి మరిచిపోయాను. కోటేశ్వరావుకి తాగుడు వ్యసనం. తాగటానికి డబ్బిస్తే వంట ప్రత్యేకంగా బాగాచేసి పెట్టేవాడు. ఆవేళ నేనక్కడ భోంచేశాను. నేను లేచి నిలబడ్డాను. కోటేశ్వరరావు నాచెవిలో మెల్లిగా మల్లమ్మ వచ్చింది మెట్లమీద ఉంది అన్నాడు. అంతే బ్రహ్మాండం నామీద ఒక్కసారి పడ్డట్టయింది. ఎందుకన్నాను. దానికి రావాల్సింది. స్వాములవారు పోయి నీకేమన్నా సహాయం కావలిస్తే చెయ్యమన్నాడుట, అంటూ మందహాసం చేశాడు. ధైర్యం చేసి దాన్ని పిలవమన్నాను. ఇంతలోకి నా చప్రాసి లేచి వచ్చాడు. మల్లమ్మ వచ్చింది. ఏంకావాలి, యింత రాత్రిపూట రావటం తప్పుకాదా, కోటేశ్వరరావు తాగివున్నాడు, నీకన్నా బుద్ధిలేదా–వెళ్ళు–అని లోపలికి పోయి ఓ అయిదు హాలీరూపాయిల నోటు యిచ్చి తీసుకోమన్నాను. ఆనోటు నాకాళ్ళ దగ్గరపడేసి, తలవొంచుకుని దొరా, తప్పయింది–అంటూ కన్నీళ్లతో ఒక

దూకున వెళ్ళిపోయింది. స్వాముల వారు నాకు చెల్లిద్దామనుకున్న కానుక అన్నమాట! ఆ రోజునుంచీ నాకోరకమయిన భయం పట్టుకుంది. అంతే ఆతరువాత ఓ వారం రోజులే అవూళ్లో వుంది. తిరిగి హైదరాబాదు వచ్చేశాను.

ఇంతకీ ఆ స్వాముల వారింటి దగ్గర ఓ రోజున ఓ పెద్దమనిషివచ్చాడు. ఆయన దగ్గిర ఓ పొట్లం తీసుకుని నావంక చూస్తూ వెళ్లిపోయాడు. రెండుమూడు రోజుల తరవాత ఒక సాయంకాలం తాలుక్దారు దగ్గర్నించి ఓ మనిషివచ్చి మందుముల నరసింగరావుగారూ, బూర్గుల రామకృష్ణరావుగారూ ఆరాత్రి వస్తున్నారనీ, పల్లెర్ల హనుమంతరావు గారింట్లో రహస్యసమావేశం ఉందనీ, నన్ను వెళ్లి కలుసుకోమనీ కబురుచెప్పాడు. ఆరాత్రి పదిగంటలకు పల్లెర్ల హనుమంతరావు గారింటికి వెళ్లాను. ఆయన నన్ను చూసి సందేహిస్తుంటే, నేను ఫలానా అని చెప్పుకుని ఇల్లెందుల రామచంద్రరావుగారి సూచనమేరకు వచ్చానన్నాను. ఆయన నవ్వుతూ నన్ను లోపలికి తీసుకుపోయారు. స్వాములవారి దగ్గిర చూసిన పెద్దమనిషే హనుమంతరావుగారు! అప్పుడప్పుడు అక్కడికి వైద్యానికి పోతుంటానని చెప్పారు తరువాత. లోపల ఒక గదిలో రామకృష్ణా రావుగారూ నరసింగరావుగారూ కూర్చుని వున్నారు. నన్ను చూసి కూచోమన్నారు. వారిద్దర్నీ చూడటం అదే ప్రథమం.

('సుప్రభాతం', 20 జనవరి 1992)

•

## ఓ రహస్య మంతనం

పల్లెర్ల హనుమంతరావుగారు పెద్దమనిషంటే పెద్ద మనిషి. మాట మెత్తన. మనస్సూ మెత్తన. నిరాడంబర జీవి. నిజాం పరిపాలన పోయిన తరవాత రామకృష్ణారావు గారి ప్రభుత్వంలో మంత్రిగా చేరారు. తరవాత పార్లమెంటు సభ్యులుగా ఉన్నారు. నేను రామకృష్ణారావుగారి సమక్షంలో కూచుని మాట్లాడటం ప్రారంభించగానే ఆయన గదిలోంచి వెళ్లిపోయారు.

రామకృష్ణారావుగారితో ప్రథమ పరిచయం నాకు. మందుముల నరసింగరావు గారితోనూ అంతే. నేనున్న అరగంటా, సలభయి అయిదు నిమిషాల్లో రామకృష్ణారావుగారే యెక్కువ మాట్లాడారు. రాష్ట్రంలో పరిస్థితులు బాగాలేవనీ, సర్‌మీర్జా ఆగమనంతో పరిస్థితుల్లో యేమన్నా మార్పురాగలదేమోనన్న ఆశాభావాన్ని వ్యక్తంచేశారు. ప్రజలు రాష్ట్రవ్యవహారాల్లో భాగస్వామ్యాన్ని కోరటం సహజం అని పాలకులు గుర్తించి ప్రజాస్వామికపద్ధతుల్లో ప్రభుత్వం యేర్పడేందుకు తగిన సన్నాహం చెయ్యటం ధర్మం అన్నారు. అలాంటి ఉద్దేశం కనక సర్‌మీర్జాకు కలిగితే స్టేటు కాంగ్రెసు సహకారాన్ని యివ్వటంలో తప్పుండదనారు. అలాంటి నిర్ణయాలు దీసుకునే అధికారం స్టేటు కాంగ్రెసుకే ఉందన్నారు. నరసింగరావుగారు నాయోగక్షేమాలడిగారు. హైదరాబాదులో వీలయినప్పుడల్లా వచ్చి చూడమన్నారు. నరసింగరావు గారు ధారాళంగా పొగతాగుతారు. చార్మినార్ సిగరెట్లు ఒకదాని తరవాత ఒకటీ–గది అంతా పొగ. రామకృష్ణా రావుగారు దగ్గటం ప్రారంభించారు. నేను గ్రహించి లేచి నిలబడి సెలవుతీసుకున్నాను. హనుమంతరావుగారు నన్ను వీధిగుమ్మందాకా సాగనంపి 'రాత్రి, జాగర్తగా పొండి" అన్నారు. నేను మహబూబ్‌నగరు వదిలి పెట్టేదాకా

హనుమంతరావుగారిని అడపాదడపా కలుసుకుంటుండే వాణ్ణి. అప్పటి హైదరాబాదు రాజకీయాల్లో స్టేటు కాంగ్రెసు నిర్వహించే కార్యక్రమం, ఆ సంస్థలో అప్పుడప్పుడే నెలకొంటున్న అభిప్రాయ భేధాలూ అవగాహన చేసుకునేవాణ్ణి.

ఈ నేపథ్యంలో హైదరాబాదు వచ్చినప్పుడల్లా రామకృష్ణారావు గారిని కలుసుకుంటూండేవాణ్ణి. ఆయన అప్పుడు కాచిగూడాలో ఒక పెద్ద యింట్లో వుండేవారు. న్యాయవాది వృత్తి కూడా చేసేవారని గుర్తు. ప్రథమ సమావేశంలోనే రామకృష్ణారావుగారి పట్ల నాకు గౌరవాభిమానాలు కలిగినయి. సంస్కారి, మేధావి, రాజనీతి సారం తెలిసిన రాజకీయ వేత్తగా నాకు కనిపించారు. అదీ కాక హైదరాబాదులో కనక ప్రజా ప్రభుత్వం యేర్పడితే ముఖ్యమంత్రిగా తెలుగువాడే అధికారంలోకి రావాలని నాకో ప్రాంతీయ దురభిమానం కూడా కద్దు. హైదరాబాదు రాష్ట్రంలో తెలుగువారే అధిక సంఖ్యాకులు కనక.

ఆ తరవాత కొద్ది రోజులకే ఒక సాయంకాలం సర్ మీర్జా ఇస్మాయిల్ గారి దగ్గరికి ఈశ్వరదత్తు గారు నన్ను తీసుకుపోయారు. ఒక నాజూకయిన వ్యవహారాన్ని నాకు వప్పగిస్తామని చెప్పారు. ఆమాటవిని కొంత భయపడ్డాను కూడా. నన్ను చూడగానే ఇస్మాయిల్ గారు నన్నూ, దత్తుగారినీ షామంజిల్ వెనక వరండాలోకి తీసుకుపోయారు. అక్కడ ముగ్గురం కూచున్నాం. ఎవరూ నోరెత్తలేదు. కొంత సేపయిన తరవాత మందస్వరంతో సర్ మీర్జాగారన్నారూ, రామకృష్ణారావు గారంటే మనందరికీ గౌరవభావం వుందికదా. ఎటువంటి క్లిష్టపరిస్థితుల్లో నేనీ రాష్ట్రానికి ప్రధానిగా వచ్చానో ఆయనకి తెలిసి ఉంటుంది. నాగురించి విన్న వాళ్ళూ, నన్నెరిగున్నవాళ్ళూ నా చిత్తశుద్ధిని శంకించరని నా మట్టుకు నేననుకుంటున్నాను. ఈ పరిస్థితుల్లో యీ రాష్ట్రానికి నేనేమన్నా కించిత్తు ఉపయోగపడాలంటే రామకృష్ణారావుగారి లాంటి నాయకుల సహకారం కావాలి. నేననుకున్న మంత్రి మండలిలో చేరాలి. ఆ సహకారం యెలా లభ్యమవుతుందో నువ్వాయనతో సంప్రదించి చెప్పు. నువ్వాయనతో సాధికారికంగా స్వేచ్ఛగా మాట్లాడేందుకు నేననుమతిస్తున్నాను. అయితే అంతా పరమ గోప్యంగా ఉండాలి."

'సరే' నన్నాను. దత్తుగారికి నామీద విపరీత వాత్సల్యం. దానికి తోడు నేనలాంటి పనులు నిర్వహించగలననే విశ్వాసం. అయినప్పటికీ సర్ మీర్జాతో సవినయంగా ఒక మాట అన్నాను. "రామకృష్ణారావుగారు వ్యక్తిగతంగా యేమీ చెయ్యరేమో! స్టేటు కాంగ్రెసులో తానేమన్నా రాజకీయ చర్య చేపట్టాలంటే ప్రతిపాదిస్తారేమో". సర్ మీర్జా లేచి "యింక మాట్లాడకు. ఆయన చెప్పిందేదో విను. నాకాయన సహకారం కావాలి. ఉంటుందని ముందుగా తెలియాలి" అని అన్నారు.

నాకు మాత్రం కొంచెం భయం పట్టుకుంది. షామంజిల్ నుంచి బయటపడగానే ఈశ్వరదత్తు గారితో అన్నాను: "రామకృష్ణారావుగారితో నా పరిచయం అనతికాలంలోనే అత్యంత సన్నిహితం కావటానికి యెన్నో కారణాలున్నాయి. ముఖ్యంగా సాహిత్య సంపర్కం ఒకటి. ఆయనతో అలా పరస్పరాభిమానపురస్కారంగా పరిణమించిన పరిచయాన్ని నేను దుర్వినియోగం చెయ్యడమవుతుందేమో. కించిదనుమానం కలిగినట్లయినా, ఆయన్ని మళ్లీనేను చూడలేక పోతానేమో!"

లేకువ్యాల్లో ఈశ్వరదత్తుగారి వసతిగృహం నుంచి రామకృష్ణారావుగారికి టెలిఫోను చేశాను, ఆయన్ని వెంటనే చూడవలెననీ, అత్యవసరంగా సంప్రదించవలెననీ. ఆయన రాత్రి తొమ్మిదిన్నర ప్రాంతాలకు రమ్మన్నారు. అప్పటికే యెనిమిదయింది. దత్తుగారింట్లో భోంచేసి కారు తెప్పించాను. కారు తెప్పించింతరువాత మళ్లీ అనుమానం. నా దౌత్యం గోప్యంగా ఉండాలికదా. కారు అమీరాకారు. అంటే ప్రభుత్వ వాహనం. అలా అని కారు ముందు రాసిన ఫలకం ఉంటుంది. అలాంటి కార్లో పోతే రహస్యం యేమిటి? దత్తుగారితో అలాంటి కార్లో పోగూడదన్నాను. ఆయన తికమకపడ్డారు. వూళ్లో చప్పున దొరికే మరో స్నేహితుడప్పటికెవరూ లేరు. తర్కించి తర్కించి ఆఖరికి వల్లూరి సూర్యనారాయణరావుగారనే ప్రసిద్ధ న్యాయవాదికి ఫోను చేసి–ఆయన మాకు తెలిసినవాడే–తరవాత హైకోర్టు జడ్జి అయ్యారు–ఆయన కారును డ్రైవరుతో సహా పంపమని అభ్యర్థించాము. మరో గంటలో కారు వచ్చింది. ఆ సమయాన ఆంధ్రరాష్ట్రంలో సుప్రసిద్ధ కాంగ్రెసు నాయకుడూ, స్వాతంత్ర్య సమరయోధుడూ అయిన డాక్టరు పాలకోడేటి గురుమూర్తిగారి అబ్బాయి సాంబశివరావు దత్తుగారింట్లో ఉన్నాడు. అతనూ న్యాయవాది. అతణ్ణి నాకు తోడుగా రమ్మన్నాను. ఇద్దరం రామకృష్ణారావుగారింటికి వెళ్ళాము. సాంబశివరావును ఆయనకు పరిచయం చేసిన తరువాత నేనూ రామకృష్ణారావుగారూ వేరే గదిలో కూచుని మాట్లాడాము. రాత్రి పదకొండయింది. పర్యవసానం. సర్ మీర్జా పట్ల తనకెంత సానుభూతి వున్నా వ్యక్తిగతంగా యే రాజకీయ నిర్ణయం తీసుకోలేననీ, స్టేటు కాంగ్రెసుతో సంప్రదించవలెననీ, రాష్ట్రంలో సంఘవ్యతిరేక శక్తులనూ మతోన్మాద శక్తులనూ వెంటనే అదుపులోకి తీసుకురావలసిన ఆగత్యం ఉందనీ రామకృష్ణారావుగారన్నారు. అలా చెయ్యలేని పక్షంలో సర్ మీర్జా యేమీ సాధించలేకపోవచ్చుననీ అన్నారు. అంతమాత్రాన ఆయన నిస్పృహ చెందరాదనీ, ప్రయత్నం తప్పక చేసి తీరాలని అన్నారు. నేను సెలవుతీసుకుని వచ్చేశాను. మర్నాడు సర్‌మీర్జాతో పూసగుచ్చినట్లు జరిగిన సంభాషణ నివేదించాను. అనుకున్నట్టుగానే సంవత్సరమైనా తిరక్కపూర్వమే సర్ మీర్జా ప్రధానిపదవికి తిలోదకాలిచ్చి వెళ్లిపోవలసి వచ్చింది.

ఈ ఉదంతాన్ని ఎందుకు ఉల్లేఖించవలసి వచ్చిందో చెబుతాను. రామకృష్ణారావుగారు ముఖ్యమంత్రి అయేంతవరకూ ఆయన ప్రతిపక్షాలు ఆయన మీద అభాండాలు వేసేవారు. ఆయన నిజాం మంత్రివర్గంలో చేరే ప్రయత్నం చేశారని. ఇదెంత మాత్రం నిజంకాదనటానికి నేనే ప్రత్యక్షసాక్షినయ్యాను. నిజానికి ఆయనకంత అధికార వ్యామోహం ఉండేదికాదు. ఎంచాతనంటే ఆయనకు బహిరంగంగా ప్రస్ఫుటంకాని ఆత్మవిశ్వాసం ఉండేది. స్థితప్రజ్ఞుడవటం వల్ల. ఆనాటి స్టేటు కాంగ్రెసు నాయకుల్లో ఆయనకున్న మేధాసంపత్తిగానీ, విజ్ఞాన విశిష్టతకానీ, రాజకీయ విజ్ఞత కానీ మరెవ్వరికీ లేదన్నది నిర్వివాదాంశం. అదీకాక ఆయన పండితు. నిజంగా బహుభాషా కోవిదుడు!

('మిత్రప్రభాతం', 5 ఫిబ్రవరి 1992)

●

హైదరాబాదు నుంచి ఓసారి బెజవాడ పోయాను. అక్కడికి వెంకటశాస్త్రిగారు కంటి వైద్యం కోసం త్వరలో రాబోతున్నారని తెలిసింది ... వెంకటశాస్త్రిగారి ఛాయాచిత్రాలను నన్నే తీయించమని రాశాడు [*శ్రీ శ్రీ*]. నేను తిరిగీ బెజవాడకొచ్చి బందరుకాలవ పక్కన వెంకటశాస్త్రిగారు విడిది చేసిన ఇంటికి పోయాను. నాతోపాటు ఫణిభూషణరావూ, నీలంరాజా వెంకటశేషయ్యగారూ వచ్చారు. మా వెంట ఓ ఫోటోగ్రాఫరూ.

## బెజవాడలో : 1947–48

## కె. ఈశ్వరదత్తు – 50 వ జన్మదినం

*[1947 లో శ్రీ కుందూరి ఈశ్వరదత్తు 50వ జన్మదినం సందర్భంగానూ, పత్రికారంగంలో పాతికసంవత్సరాల అనుభవం పొందిన సందర్భం గానూ స్నేహితులూ, అభిమానులూ పంపిన సందేశాలను బెజవాడలో సంకలితం చేసి బైన్డు చేయించిన పుస్తకాన్ని వరదరాజేశ్వరరావుగారు ఈశ్వరదత్తుగారికి బహూకరించారు]*

K. ISWARA DUTT

*

Messages from friends and admirers on the occasion of his 50th birthday and the Silver Jubilee of his journalistic career.

*

Compiled and presented by

ABBURI VARADA RAJESWARA RAU

[అందులో చేర్చిన ఒక ఉత్తరం]

19, Albert Road,
Allahabad,
17th September, 1947.

Dear Sir,

I thank you for your letter of the 12th of September about Mr. K. Iswara Dutt. I should have been very happy indeed to have written something at length about him if it were possible for me to do so. I have however, been confined to bed for about 18 months and am unable to do any serious work. I am, however, sending you the following message:-

"I have had the pleasure of knowing Mr. K. Iswara Dutt at close quarters for about 17 years, during which period I have learnt to admire his power of great facility of expression, command over the idioms and above all his sober judgment. When he was at Allahabad he occupied a distinct place in the social life of Allahabad and was looked upon as a journalist of great ability. He was the founder of the Twentieth Century which commanded much influence and respect so long as it was possible for him to edit it himself. I hope he has many years of useful service before him. I wish him every success in life."

Yours faithfully,

T B Sapru

[Tej Bahadur Sapru]

A.V. Rajeswara Rau Esqr.,
The New Globe,
Gandhinagar,
Bezwada.
(Madras Presidency).

## సాహిత్యంలో కృషి గురించి శ్రీ శ్రీ

*[తెలుగు సాహిత్యంలో తాను చేస్తున్న కృషి గురించి 1947లో శ్రీ శ్రీ రాసిన ఉత్తరాలు]*

Hyderabad,
11-2-1947

Dear Varada,

your letter. Mani is here. He tells me that you are agitated because GopalaRao has said something about Nalini having said something to Nalini in his turn having heard something

said to be uttered by me. Brush it all aside as idle gossip not in any way related to realities.

Khaja Khan has written to me from Madras. He too is hard pressed for housing accommodation. When are you likely to come to these parts? As soon as I receive my S.Ooo(?), as you so aptly called it, I shall start for Vizagapatam. Thence to Madras and from there back again to H'bad.

If you want to serialize your father's novel don't you think "Andhra Jyothi" will be the proper venue? At any rate I think so.

You can write to me C/o Fida Manzil where I am shifting shortly.

Affly yours

Sri Sri(?)

P.S.
At Madras I am entrusting inquiry to the case of Ellakka(?)

*

Vizagapatam
26-2-47

Dear Varada,

I am starting by Mail tomorrow. (27th) I hope ~~this~~ letter ~~will~~ will reach you in time for you to meet me at the station. I ~~don't think I shall~~ break journey at Bezwada. I am rushing non stop to Madras where I have got to much to do. Things are not shaping as they ought; but when have things obliged us. Undaunted I am dashing to Madras. I met your father. He has promised to introduce my Satakam. He is eagerly expecting you here. How is Phanishayshan? I have written to Mr. Dutt & I am writing to him again to keep him appraised of my whereabouts. More in person.

Yrs Sri Sri

28 శ్రీనివాస పెరుమాళ్ సన్నిధి St., Madras
శ్రీనివాసపురం, రాయపేట. 23-3-47

My dear Varada,

In the hope that you might have reached Waltair by now I am addressing this letter C/o. your father. Are you likely to come to Madras in the near future? Could you fix up a residence at Bezwada? My *Satakam* is ready to go to press. Your father has promised an INTRO in *kanda* metre. Could you send it on to me? Phani hasn't sent me the photographs. When you go to Bezwada please urge him on to prompt action. I have applied to the Chief Press Magistrate for declaring myself as Editor *Dhvani*. What about your article on కిరాస్థితి ? And your father's verse. I met your brother Kumar the other day. He is O.K.

Yours

Sri A.V. Rajeswara Rau M.A
C/o. Sri Abburi Ramakrishna Rao garu
Librarian, Andhra University
Waltair

*

28 S.P.S. St. S. Puram,
R. Peta, M.
18-4-47

My dear Varada,

Received your silence. Hope you'll break it. am proceeding shortly to Vizag. Shall appraise you the exact date later. Stopping at Bezwada for a day or two. Please ask Phani to be ready with photos. QK is away at H'bad. *Satakam* is ready.

"Arudra" is fixed up as Asst. Editor in Ananda Vani.

more (most probably) in person.

affly yours

Sri Sri

Sri A.V. Rajeswara Rau
C/o. M. Phani Bhushan Rao
"Mail" Correspondent
BEZWADA

*

Madras
18-5-1947

My dear Varada,

am in receipt of all your letters. My address is the same. I heard that you were at H'bad & so I didn't write. Hope you have returned to Bezwada by now. How about publishing my Century. I am told that Jacobin Publishers have

announced that they are printing it. A friend of mine (I think you know him- Mr. T. Bullaiah of Navabharati Gurukul) has offered me money and has undertaken to get it printed. But the deal is yet open. I want [him] to expedite matters. My Ms is ready. It is with Mr T. Bullaiah, room No 20. Meenakshi Vilas, [... rrabalu] Chetti St. G.T. Madras. [I am] writing this letter from the above address. You can, if you write to me to the above [address] or to 28 Srinivasa Perumal [Sannidhi] St. Srinivasapuram, Royapet. But I am badly in need of [money.] I want to come to terms speedly with my publishers. Please negotiate on my behalf and let me know. I wrote to your father for his Intro but there has been no reply. Arudra is writing a పఠంపు and Visweswara Rao's verses (ఓ, ఓ) may also be included.

As for my "Dhvani" things have come to a temporary standstill. I am still expecting a call from the Chief President... Magistrate to declare my [name] as the Editor & Publisher. [The] quarters from which I [expected] money have chosen to [sleep] over the matter. Every thing [is] going wrong with me. With the greatest difficulty I am managing to keep my head above the waters.

Puripanda is here. He is printing his 'Soudamini' and other poems (in English translation) here. The translations have been made by me & I also wrote a brief & breezy introduction. The printing is proceeding apace and the book promises to be a nice little luxury.

Well. I shall halt at this point. am eagerly awaiting to hear from you. I may go to Vizag one of these days. In that case shall telegraphically advise you of my journey.

[స్క్వేర్ బ్రాకెట్లలో ఉన్నమాటలు ఉత్తరంలో చిరిగిపోయిన భాగంలోవి]

## ఉద్యోగ సంబంధిత విషయాలు

*[ఉద్యోగ సంబంధిత విషయాల గురించి వరద రాజేశ్వరరావుగారు ఉన్నతాధికారులతోనూ, జర్నలిస్టులతోనూ, ఇతర ప్రముఖులతోనూ ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపారు.]*

Hyderabad-Dt.,
12th February, '47.

My dear Varada,

I am again in the happy company of Mr. Dutt. I met Mr. Sreenivasa Rao and here is a letter he has written to you. your letters are delivered by Mr.

Shyamsunder and nothing to worry about them. Mr. Dutt is very well satisfied with your work and he only said that he thought that the address you gave him is not complete when simply said-Hanumanpet, Bezwada. By this time you might have received his letter too.

The exhibition is postponed for another fortnight and I could get an advt., worth Rs. 100/- from them. I wrote to Mr. krishnamurti to issue the number with the available advts and think of the rest later.

I am very happy to tell you that your article on Sir Mirza is highly praised by Mr. Dutt and everybody here. Don't get worried over something said by somebody-get along. Wishing you good luck. I am coming there on 14th morning.

Phani

[Malladi Phanibhushana Rao]

*

I.Ramachandra Rao
H.C.S.

Mahboobnagar
Date 16-2-47.

Dear Mr.Rajeswara Rao,

Your kind letter to hand. I have been expecting to hear from you. I had gone to Hyderabad about a week back and learnt that you had met my father-in-law. During my stay in Hyderabad I called on Mr.Iswar Dutt. I introduced my brother also to him. You may be interested to know that Mr.Madhava Rao Anwari to whom I gave a letter has now become an M.L.A. Do meet him when you visit Hyderabad next.

I would certainly visit Bezwada some time .... Please be writing to me whenever you find time.

With best wishes,

[P.S.] Kindly convey my respects to your father.

*

ఎఱ్ఱోజు మాధవాచార్యులు, ఎం.ఏ.,

నూజివీడు,
26.2.47

సోదరా! ఆశీః

మీ ఉత్తరం చూచి చాలా సంతోషించాను. మీ హైద్రాబాదు వృత్తాంతం, ఇటీవల నేను వాల్తేరు వెళ్లినప్పుడు శ్రీ నాన్నగారి వల్ల విన్నాను. అప్పుడే ఎంతో సంతోషించాను. ఇప్పుడు ఇంకా

వివరాలు మీ ఉత్తరము వల్ల తెలిసినవి. ఆంధ్రమహాసభ పక్షాన, శ్రీ కుమారరాజా వారి వల్లా సర్వవిధ సౌహార్ద ప్రయత్నాలూ జరుగుతవి. అప్పుడే, శ్రీ హరిసర్వోత్తమరావు, పున్నయ్యశాస్త్రి గారలు, సర్ మీర్జా ఆహ్వానము మీద హైద్రాబాదు వెళ్లారు. ఇందులో మీ ప్రమేయం కూడ తగినంత ఉండి ఉంటుందనుకుంటాను. శ్రీ కుమారరాజావారి చేత మీకు కూడ ఉత్తరాలు వ్రాయిస్తాను.

తెలుగు లిపి సంస్కారము చూస్తున్నాను. కొంచెం ఆలోచన రేకెత్తిస్తున్నది. ఈ విషయము విపులంగా వ్రాస్తాను. మీ కుశలవార్తలూ శ్రీ నాన్నగారి ఆరోగ్యవార్తలూ విశేషాలూ వ్రాస్తుండండి. బెజవాడ వస్తే తప్పక మిమ్మల్ని కలుసుకుంటూ ఉంటాను. ఇక్కడ పిల్లలు అంతా కులాసా.

మీ

Abburi Varada Rajeswara Rau garu, M.A.
Liaison Officer
Hanuman Pet
Bezwada

Y. Madhavacharya, M.A., Nuzvid 19.3.47

సోదరా! ఆశీః

నేను మీకు బెజవాడ ఉత్తరములు వ్రాస్తే ఎలాగ తిరిగి వచ్చేసిందో చూశారా?

మీ కార్యక్రమ విశేషాలేమిటి? 'ములుకోల' పత్రిక మిమ్మల్ని, 'ఫణి' నీ గూర్చి ఏమేమో పిచ్చివ్రాతలు వ్రాస్తున్నదట గదా! మరేమీ ఫరవాలేదు. దాని మాటలు లక్ష్యం చేసే ప్రజలు ఎవరూ ఉండరు. ఎవరైనా ఆ తరగతి వారున్నా సంశయము పడవలసిన అవసరములేదు.

"ఫణి" కూడా చిన్నవాడు. ఏమైనా చిన్నబుచ్చుకుంటాడేమో ఫరవాలేదని చెప్పండి.

నేను బెజవాడ త్వరలోనే వస్తాను. అన్ని సంగతులూ సాకల్యంగా మాటాడవచ్చు.

శ్రీ నాన్నగారి క్షేమోదంతాలు ఏమైనా తెలుస్తున్నవా? జవాబు వ్రాయండి.

మీ

•

Sitaramavilas
Hanuman Pet
Bezwada
27th Mar '47

My dear Varada,

I know you are happy with your parents after an absence of some months and I am sure your dear father is keeping good health. I am eager to meet him once.

When are you going to go here again. Mr.Phani had been to Madras and I do not know his programme. Did you send the design to Mr.Dutt; and what did he say about I do hope you have shown it to father.

With kindest regards,

Yours sincerely.
K. Rammohan Sastri
K.Rammohan Sastri

బందరులో యింకొక మూల కౌతా శ్రీరామశాస్త్రి గారి 'శారద'.....కౌతా శ్రీరామశాస్త్రిగారు దేశ భక్తుడే కాదు, సంఘ సంస్కరణాభిలాషి, సంస్కారంలో స్వయం మార్గదర్శకుడైనాడు. ఈయన కుమారులే రామమోహనశాస్త్రి.



[జనవరి 1948లో శ్రీ కె.ఎమ్. మున్షీ (Agent-General of Government of India at Hyderabad) బెజవాడలో పర్యటించడానికి వెళ్లిన సందర్భంలో–]

[ముందు వరస మధ్యలో–కుడివైపు కె.ఎమ్. మున్షీ ; ఎడమవైపు 'శారద'; వెనక వరస మధ్యలో–కుడివైపు మల్లాది ఫణిభూషణరావు, మొదలైనవారు]

## 'పబ్లిక్‌మైండ్'

*[1947-48 లో 'పబ్లిక్‌మైండ్' అనే త్రైమాస పత్రికను బెజవాడనుంచి ప్రారంభించాలని ప్రయత్నించారు.]*

Journalists, publicists, publicity and public relations men, and film and radio experts, who devote their time and talent to influence the public mind and put others on the map are themselves so much behind the scene that not much is known of their duties and responsibilities, of their methods of work, of their assignments and activities, and of their own personality, that I venture to launch a quarterly entitled **'The Public Mind'** - a quarterly to begin with - for filling a gap in our periodical journalism. The journal will cover a large field and contain attractive features under various heads. It will incidentally be a kind of meeting ground of fellow-workers who are endeavouring, each in his own way and according to the measure of his opportunities, to make an appeal to the public mind as well as to mould it.

It will be heartening to me to know that I have your blessings for this project of mine and to have the further gratification of being able to profit by your advice. An occasional contribution from your pen will doubtless enhance the value of the publication and guarantee the success of the enterprise.

May I therefore solicit your moral support and active cooperation in the interests of a cause which you have made your own.

Thanking you and with kindest regards,

I am .....

Yours sincerely

Abburi V. Rajeswara Rau

*

# PUBLIC MIND

QUARTERLY

EDITOR
ABBURI V. RAJESWARA RAU

Gandhinagar
BEZWADA

*

V. Nagiah

No. 16, Dr. Nair Road,
TNagar,
Madras, 22nd October 1947.

Dear Mr. Rajeswara Rao,

I thank you immensely for your kind letter dated 20th inst. While congratulating you on your bold venture, I wish you and worthy journal all success. As desired by you, I shall, at my leisure, try my best to contribute to your journal and thus give my fullest co-operation to the success of your journal.

God bless you,

Yours sincerely,

(V. Nagiah)

Sri. Abburi V. Rajeswara Rau,
Editor, Public Mind,
Bezwada.

*

Gurukul,
Fernhill P.O., Nilgiris
27th Oct. 1947.

Dear Rajeswara Rao,

Glad to hear from you and to have news of your work and the quarterly you are bringing out. I would have written earlier only haven't been keeping too well-I was in Bangalore and the food there upset me. Here I am recovering in the serenity and kindliness of the mountains.

I'll do what I can in the way of an article, and you can expect it sometime in the first week of November.

I don't hear very much from Madras. I expect everyone feels a bit depressed, suppressed and puzzled as to what to do ... I get that sort of impression from the occasional letters I receive as well as from the daily news.

"Public Mind" seems quite a good venture only do you think you'll get enough specialist material to fill it and keep it going? Unless most people write anonymously, can they write honestly about their work and still keep their jobs?!

Anyway best of luck as always, and thanks for your kindly message,

Sincerely,

John Spiers

P.S. Hope the address is adequate
-you don't give a street or number
so I've just put Public Mind, Bezwada!

*

Gurukul,
Fernhill P.O., Nilgiris,
6th Nov. 1947.

My dear Rajeswara Rau,

Received your kind letter of 2nd. You're correct in thinking I spend most of my time in study and writing-when it is not spent in doing my own (or the Gurukula's) work, cooking, gardening, even digging potatoes etc. and trying to milk a cow.. Anyway it does nobody any harm!

Bangalore, where I went for three months, gave me a stomach ulceration-bad food there. Spratt told me something of the Roy case, seemed to me absurd on Tata's part and he ought to make fools of them. I guess he's enjoying it.

I enclose an article, best I can muster on the given topic. Hope it's not too long. You can cut if need be.Has Spratt written for you? If not do ask him and quote me as saying he might, if you think that necessary.

The Arab union move is useful to buffer off Russia from the East and to hold out on US plans to muscle in on oil etc. But all is being set for the big show down between America and Russia.

Well, I want to get this off to you in time as promised. Yes, I'd like to have a copy of Roy's latest: How far does his Humanism go? It will be interesting to me to see. I could return copy if necessary. Thanks for offer.
warmest greetings as ever,

Sincerely yours
John Spiers

*

**Public Mind**
**Quarterly**

Editor
Abburi V. Rajeswara Rau

Gandhinagar,
Bezwada.

My dear sister,

We had been to Nuzvid yesterday to attend the formal proposal function at the residence of the eldest brother of Mr. S. Krishnamurti. Late in the evening we were back here and father left immediately for Waltair. He will be writing to you shortly.

Father was telling me that you intend visiting Waltair for a short stay. If you are going there write to me in advance so that I can send you the necessary money and see you off at Bezwada station.

26.2.48

Yours affectionately

*[పెద్ద చెల్లెలు రాజ్యలక్ష్మికి శ్రీ పత్తిరాజు కృష్ణారావు (ఇంట్లో 'కృష్ణమూర్తి' అని పిలిచేవారు) గారి సంబంధాన్ని కుదురుస్తున్న సందర్భంలో రాసిన లేఖ]*




I have known Sri A.V.Rajeswara Rao since he was a lad when he confronted me -- and many others -- with precocity. Recently, I who had been in the North and he who remained in the South, found ourselves drawn by Destiny as Head and Assistant respectively of the Department of Public Relations in Hyderabad. It gives me pleasure to acknowledge that, besides high intelligence and deep earnestness, he has given abundant proof of his discretion and tact in delicate situations and difficult conditions. He adheres to a fine literary tradition in Andhra, and is also endowed with a larger outlook encompassing different communities and distant regions. As I ardently hope that he will grow with his opportunities I sincerely wish him good luck in his endeavours.

K. Iswara Dutt

K. Iswara Dutt
Public Relations Officer

Hyderabad(Deccan)
March 17, 1948

*

In response to your letter N.43/S.T.R.O of the 18th instant, I have pleasure in stating that I know Mr.A.V.Rajeswararao, son of Mr.A.Ramakrishna Rau, since his childhood, and that I have taken personal interest in his educational and literary and journalistic career.

Mr.Rajeswara Rau is a versatile gentleman, and bears a very good character. He is hard-working, honest and loyal.

He is exceptionally fitted to be the Telugu Publicity Officer, Information Bureau, Hyderabad. He has an excellent command of Telugu literary forms. He is an author in his own right, and has some books to his credit. He is a journalist of considerable reputation in Telugu journalism, and he is a playwright also in his own right. His output, both in Telugu and English, as a journalist is considerable, and his previous experience of the type work involved in the present job is an additional point in his favour.

As a Mulki he has considerable personal contact with public men in the Hyderabad State, and his familiarity with personalities in Andhra Desh eminently fits him to become the spokesman of the Hyderabad Government. Apart from my personal interest in the career of Mr.Rajeswara Rau, I must state that from a public standpoint also his selection would be endorsed by people both in the State and in Andhra Desh.

Yours faithfully,

—

*[ఈ 'కాన్ఫిడెన్షియల్ రిపోర్ట్' రాసినవారు అప్పుడు మదరాసు ప్రభుత్వ సమాచారశాఖ డైరెక్టరుగా ఉన్న చావలి వెంకటహనుమంతరావు గారు కావచ్చును]*

•



## రాజకీయ నిర్బంధం : 1948–49

నేను జైల్లో ఉన్నప్పటి మాట. ఓసారి చిత్రపు నాగరాజాగారూ, పాలగుమ్మి పద్మరాజూ నన్ను చూడటానికి వచ్చారు. ప్రసంగవశాత్తు కృష్ణశాస్త్రిగారు నన్ను చూద్దామనుకుంటున్నారనీ, నా యోగక్షేమాలు కనుక్కోమన్నారనీ పద్మరాజా నాతో అన్నాడు. 'చెరకాలం' రాస్తున్న రోజులు. అందులో శాస్త్రిగారి నుద్దేశించి రాసిన పద్యాలు పద్మరాజుతో పాటు శాస్త్రిగారికి పంపాను ... ఆ తరవాత రెండువారాల్లో శాస్త్రిగారు తిరిగి పద్యాలు పంపించారు ... అందులో ఒకటి లీలగా గుర్తు .

కారు ముబ్బు వానకారు, వాగులు పొంగి
నిండి నదులు, వరద నింగి కెగసి
వానలోన నీవు వాన కావలనేను!
అంటె బతుకు, చివరికంతె, అంటె

శాస్త్రిగారు లేరు. ఇప్పటికీ అనిపిస్తుంది నాకు: వాన లోన నేను : వానకావల మీరు!

[జూలై 1948 లో వరద రాజేశ్వరావుగారిని రాజకీయఖైదీగా రాజమండ్రి సెంట్రల్ జైల్లో నిర్బంధించడం జరిగింది.
జైల్లో ఉండగా 'డైరీ' లోనూ నోట్ బుక్స్‌లోనూ రాసిన విషయాలను బట్టి అప్పటి పరిస్థితులు కొంతవరకు అర్థం చేసుకోవచ్చు]

~~It is to those who wield power in this part of the country that I address these~~ lines. On the last Thursday of June a ~~[illegible]~~ Police Searjeant turned up at our cottage at Waltair ~~[illegible]~~ and and suddenly caught my sight while I was deeply immersed in the study of Wilde's plays. With a look of profound respect and humility he smiled at me and said he was there to take me to the District Superintendent of Police for a five minute talk. It took little time for me to get ready and immediately followed him in a rotten taxi kept waiting for me outside. I could not even consult my father who was teaching English to my younger brothers in the next room, nor could I tell my mother who was about to serve my breakfast, of ~~my~~ a sudden change in my programme.

I was ~~going to~~ sitting in the car with two police fellows on either side of me. The car took the route by the beach road. I was ~~thrilled at the~~ intensely gazing at the horizon. ~~The Serene Charm~~ ~~That~~ I was thrilled at the sight of that ~~That Secret Symphony horizon~~ ceremonious unison of the sky and sea. The morning sun hidden by the melting ~~[illegible]~~ clouds, was spreading its rays to the regions of the horizon. It added an imperious splendour to the ~~already~~ wondrous beauty already seemed to have been perfected. I am essentially an emotional being, ~~though~~ constantly controlled and guided by reason. I belong to that race of writers and poets who have firmly held their feet to the solid earth ~~ground~~ — ~~to~~ of reality and life. My father a scholar and a poet has been my sole inspiration,

from whom I ~~came to~~ imbibed the instinct for drawing illusions and making them real. I have another guide and friend and that man is Sri Sri. In those early days of thirties of this Century, we sat together in the company of several other young poets reciting our compositions and comparing notes. We spent several evenings together in the presence of before the Bay of Bengal.



To

The Inspector General of Prisons.
Madras.

Sir,

I have been detained here since 26th July 1948 in view of the ~~the~~ strained ~~break down of~~ relations between Hyderabad and the Union. I have already answered the charge-sheet framed against me by the Govt. A careful perusal of my answer, ~~would~~, I am sure, would reveal how unjustly I am incarcerated and detained. ~~B~~ I have borne this ordeal and incarceration quite cheerfully since I have always been loyal to the cause of my motherland, India. It is natural

జ్ఞాపకాల వరద

## నగరం వయసు నాలుగువందలయేళ్లు!

హైదరాబాదు రాష్ట్రంలో ప్రజాస్వామిక ప్రభుత్వం యేర్పడ్డ అనతికాలంలోనే ప్రధాని జవహర్‌లాల్ నెహ్రూ ఒకసారి నగరానికి వచ్చారు. లేక్‌వ్యూ అతిధిగృహంలో ఉన్నారు. ఆ అవకాశాన్ని పురస్కరించుకుని పత్రికా విలేఖరులం కొంతమంది ఆయన్ని చూడటానికి వెళ్లాము. అయితే అనుకోకుండా జరిగిన విలేఖరుల గోష్టిలో నేనాయనతో ఘర్షణ పడ్డాను. హైదరాబాదు రాష్ట్రాన్ని భాషాప్రయుక్తంగా మూడు ముక్కలు చేసి ఆయా రాష్ట్రాల్లో విలీనం చెయ్యడం మంచిదికదా అన్న విషయం గోష్టిలో ప్రస్తావనకు వచ్చింది. నెహ్రూగారు అలా చెయ్యడం మంచిదికాదనీ, హైదరాబాదు రాష్ట్రానికే శ్రేయస్కరంకాదనీ అన్నారు. ఎంచేతనని, నేను గట్టిగా అడిగాను. హైదరాబాదు నగరం సమ్మిశ్ర సంస్కృతికి కేంద్రం అనీ, ఆ సంస్కారాన్ని నిలబెట్టవలసిన అవసరం ఉందనీ అన్నారు. నాకెదురుగా కూచున్న నీలకంఠ్ (తరువాత టైమ్స్ ఆఫ్ ఇండియా సంపాదకుల్లో ఒకడయినాడు) భాషా ప్రయుక్తరాష్ట్రాలు కావాలనీ, హైదరాబాదు విభజితంకావాలనీ ప్రజలు కోరుతున్నారు కదా అన్నాడు. నెహ్రూగారు గొంతు పెద్దదిచేసుకుని "ప్రజలు పొరబడితే దిద్దే బాధ్యత మనది" అన్నారు. నేనన్నాను, ప్రజలంతా ముక్తకంఠంతో అలా జరగాలనికోరితే మీరు అనుమతించక తప్పదు కదా అని. "అలా కుదరదు. ప్రతీ తలుపూ తట్టి మీరు చేసేది మంచి పనికాదు అని నేను చెబుతాను. హైదరాబాదు రాష్ట్రాన్ని యథాతథంగా వుంచేట్టు ప్రయత్నిస్తాను" అన్నారు. నాకు కొంచెం కోపం వొచ్చింది. పక్కన ఉన్న మిత్రుడు పణిక్కరు (పి.టి.ఐ.) వారిస్తున్నా "అలా మీరు చేస్తే భారతప్రధానికీ వెనకటి నిజాంకు యేమిటిభేదం" అన్నాను. నెహ్రూగారి ముఖం కోపంతో ఒక్కసారి యెర్రపడింది. బల్లమీద ఉన్న సిగరెట్టు డబ్బా నేలకేసి కొట్టారు. ఆయన ఇంగ్లాండులో తయారుచేసిన బ్లాక్ అండ్ వైట్ సిగరెట్లను కాల్చేవారు. నేను లేచి ఆ డబ్బాతీసి ఆయన బల్లమీద పెట్టాను. నావంకచూసి గట్టిగా నవ్వుతూ "నేను చెప్పింది జాగర్తగా ఆలోచించండి" అంటూ లేచారు. అంతటితో గోష్టి అయిపోయింది. అందరం లేచి నిలబడ్డాం. ఆయన పక్కన చేరి నేనన్నాను "పండిట్‌జీ! సమ్మిశ్ర సంస్కృతి అంటారే అది ధర్మబద్ధమా?ఓ విదేశస్థుడు ఒక రాజ్యాన్ని బలవంతంగా ఆక్రమిస్తాడు. ఆత్మశ్రేయస్సు కోసం అక్కడి భాష కొంచెం నేర్చుకుని కాలక్రమంగా వాళ్లనెత్తిమీద తన జాతి సంస్కారాన్నీ భాషనీ రుద్ది ఆఖరికి మతపరంగా కూడా మార్చు తేవాలని చూస్తాడు. అలాంటి ప్రయత్న ఫలితం సమ్మిశ్ర సంస్కృతి అని మేమనుకుంటున్నాము. ఒకంతట ఆభావం పోదు". నెహ్రూ గారు నావంకచూసి 'ఓహో' అంటూ తానుచెప్పిన దాంట్లో అంతరార్థం అది కాదనీ, ఉన్న పరిస్థితి దృష్ట్యా మాట్లాడుతున్నాననీ అన్నారు. మాతోపాటు ఆరుబయటికి వచ్చి అందరివంకా చూస్తూ వెనక్కి వెళ్లిపోయారు.

తరువాత కొన్నాళ్లకు 1955లో ననుకుంటాను భారత సేవకసమాజ సాంవత్సరిక సమావేశం నిజాంబాదులో జరిగినప్పుడు హైదరాబాదు రాష్ట్రాన్ని మూడు భాగాలుగా విభజించి ఆపక్క రాష్ట్రాల్లో విలీనం చేసేందుకు ప్రభుత్వం నిర్ణయించినట్టుగా నెహ్రూ గారు ప్రకటించినప్పుడు

రాజకీయవాదులు విస్మయచకితులయ్యారు.

ఈ మధ్య హైదరాబాదు నగర చతుశ్శతాబ్ది సంవత్సరంగా ఓ ఉత్సవాన్ని నిర్వహించే ప్రయత్నం కొందరు చేస్తున్నారు. నగరం మత సామరస్యానికీ, సమ్మిశ్ర సంస్కృతికీ ఆదర్శ దర్పణమంటూ నిర్వాహకులూ, తెలుగురానివారూ ప్రచారం చేస్తున్నారు. ప్రచారంలో తప్పు లేదు. ప్రతి యేటా యథార్థం వేరుగా ఉంటోంది.

ఈ నగరం వయస్సు నాలుగువందల సంవత్సరాలయితే అందులో రెండు వందల సంవత్సరాలపైగా అసఫ్‌జాహీ వంశస్థుల పాలనలో కదా ఉన్నది! ఈ వంశస్థుల పాలన కింద ఉన్నప్పుడే ఏనుగుల వీరాస్వామి గారి కాశీయాత్ర కూడా జరిగింది. ఆయన తెలంగాణా ప్రాంతం, హైదరాబాదు నగరంలోనూ విడిచిపేసి పోయారు. ఆనాటి రాజకీయ పరిస్థితి కన్నులకు కట్టేటట్టుగా అక్షరబద్ధంచేసి పోయారు. వీరాస్వామిగారి గ్రంథంలోని కొన్ని విశేషాలను ఉదాహరిస్తూ అవి సత్యదూరంకావంటూ మిత్రులూ, మాన్యులూ, సురవరం ప్రతాపరెడ్డిగారు తమ 'ఆంధ్రుల సాంఘిక చరిత్ర'లో రాశారు. మత సామరస్యం దేవుడెరుగును, శాంతి భద్రతలే శూన్యం! ప్రజల దోపిడీ ప్రధానం!

అంతకు పూర్వం యే ఒకరోయిద్దరో, సుల్తానులో, పాదుషాలో-తెలుగు నేర్చుకుని తెలుగుభాషని తమ ఆస్థానాల్లో ఆదరించారని వింటాం. అదీ ఓ కంటితుడుపే. తెలుగుభాషకీ, సంస్కృతికీ మహోపకారమేమీ జరగలేదు. అసఫ్‌జాహీ వంశస్థులు అధికారానికి వచ్చినప్పట్నించీ తెలుగుభాషకి అపకారమే జరిగింది. నగరంలో మరీను! కమ్యూనిస్టులూ, కాంగ్రెస్ వాదులూ, యితర దేశభక్తిపరాయణులూ అసఫ్‌జాహీ దుష్టపరిపాలనకు స్వస్తి పలికించేందుకు మహత్తరమయిన త్యాగాలు చెయ్యవలసి వచ్చింది. నగర చతుశ్శతాబ్ది ఉత్సవంలో రాజకీయ బాధితులూ, స్వాతంత్ర్య సమర యోధులూ యేరూపంలో దర్శనమిస్తారో చూడటానికి చాలామంది ఉత్సాహంతో యెదురు చూస్తున్నారు.

నగరం పేరూ సందిగ్ధంగానే ఉంది. బాగామతి అనే ఆమె ఉందో లేదో తెలీదు. ఆవిడ మతాన్ని మార్చి హైదర్‌మహల్ అనే పేరుతో పాదుషా వారు ఉంచుకున్న వైనమూ సందేహాస్పదమే. చారిత్రికంగా దాఖలాల్లేవంటారు విజ్ఞులు. ఉన్నా తెలుగువారికేమంత ఆత్మగౌరవం? నిజంగా మతసామరస్యం ఉంటే బాగామతిగానే ఆవిణ్ణి ప్రేమించి ఆవిడ సంస్కారాన్ని గౌరవించవలసి ఉండెను పాదుషా!. అలా జరగలేదు. అలా జరక్కపోవటమే సమ్మిశ్ర సంస్కృతికి ప్రాథమిక చిహ్నం కాబోలు! ఒక విధంగా యిదంతా వ్యర్థవిచారమే అనుకోండి. కాకపోతే యీ ఉత్సవాలకు యింత ఆడంబరమూ, వ్యయమూ చెయ్యవలసిన అగత్యం కనిపించదు. కుహనా లౌకికవాదుల దురవగాహనవల్ల యిలాంటి పరిస్థితులేర్పడుతుంటాయి.

దుర్గంధభూయిష్టమయిన నగరాన్ని పరిశుద్ధంగా, ఆరోగ్యదాయకంగా తీర్చిదిద్ది, రహదారుల్నీ వాటిని ఆశ్రయించుకున్న సందుల్నీ బాగుచేయించి, జనజీవనాన్ని నిరపాయకరంగా నిర్వహించటమే నిజమైన సంస్కృతి. ఇందుకు పండిత జవహర్‌లాల్ నెహ్రూ కూడా కాదనలేరు!

('సుప్రభాతం,' 20 నవంబర్, 1991)

•

# అబ్బూరి ప్రశ్నకు అబ్బురపడ్డ నెహ్రూ!

జి. కృష్ణ

నిశీధిని పండిట్ నెహ్రూ ప్రెస్ మీట్ ఎక్కడ? హైదరాబాద్‌లో!

స్థలం? కుమారి పద్మజానాయుడు నివాస గృహం.

(నెహ్రూ ఎప్పుడు హైదరాబాద్ విచ్చేసినా బస అక్కడే)

సందర్భం: 1951 సార్వత్రిక ఎన్నికలలో కాంగ్రెస్ విజయం కోసం ప్రచారోద్యమం. నెహ్రూ సోదరీమణి శ్రీమతి విజయలక్ష్మి పండిట్ కూడా హాజరు.

పగలంతా పర్యటనలో గడిపారు నెహ్రూ. తెలంగాణాతోపాటు పూర్వపు హైదరాబాద్ రాష్ట్రంలోని కర్నాటక, మరాట్వాడా ప్రాంతాలలోని ప్రధాన పట్టణాలను విమానంలో సందర్శించి బ్రహ్మాండమైన బహిరంగ సభలో ఆయన ప్రసంగించారు. అయినా కందినట్టు, అలసినట్టు చిహ్నాలు కనిపిస్తే ఒట్టు.

కాకతీయ రాజధాని ఓరుగల్లు (వరంగల్) నెహ్రూ పర్యటన సందర్భంగా కానవచ్చిన ఉత్సాహభరిత దృశ్యాలు వర్ణనాతీతం.

తెల్లని పైజామా, మోకాళ్ళు తాకే తెల్లని షెర్వానీ వేసుకొని, హృదయసౌరభ చిహ్నంగా ఎడమవైపు జేబులో ఎర్రని గులాబీ పెట్టుకొని, చిరునవ్వు చిందిస్తూ నిటారుగా నిలబడి జీపులో నెమ్మదిగా సాగిపోతుంటే ఆ సుస్వరద్రూపిలో చక్రవర్తి ఠీవి ఉట్టిపడింది. కాని ఆయన చక్రవర్తి కారు. అటువంటి తత్వం ఆయనలో ఏకోశానా లేదు. మరి ఏమనాలి నెహ్రూను? మహానాయకుడా! ప్రియతమ నాయకుడా! అబ్బే! ఇవన్నీ మామూలు దంపుడు పదాలే. ఇకపోతే తులాభారంలో సరిపోయే పదం 'ప్రజాస్వామ్య పాదుషా' దర్జానుబట్టి పాదుషా. గుణాలను బట్టి ప్రజా నాయకుడు. నాడు చూడటానికి వచ్చిన అశేష జనవాహిని దృష్టిలో మాత్రం నెహ్రూ దివి నుంచి భువికి దిగివచ్చిన దేవదేవుడే. వరంగల్ రాజవీధుల కిరువైపులా బారులుతీరి గంటల తరబడి ఆయన రాకకై నిరీక్షించిన వేలాది స్త్రీ పురుషుల నయనాలలో ఆరాధనా భావం తొణికిసలాడింది. తమ భవిష్యత్తును సంపూర్ణ విశ్వాసంతో ఆయన చేతుల్లో పెట్టడానికి సిద్ధం అన్నట్లుగా మిన్నుముట్టేటట్లు హర్షధ్వానాలు చేశారు తెలంగాణా ప్రజలు.

నెహ్రూను చూస్తే ప్రజలకు ఎంత పూనకం, ఆనందం కలిగేవో జన సమూహాలను చూస్తే ఆయనకు అంతే ఉత్తేజం, తన్మయత్వం చేకూరేవి. జనమే నెహ్రూకు బలం.

స్వాతంత్ర్య సమరకాలంలో నెహ్రూ బెబ్బులి. జాతీయ వేదిక ఆయన గర్జనలో దద్దరిల్లేది. బ్రిటిష్‌ప్రభుత్వంపై, సామ్రాజ్యవాదులపై ఆయన నిప్పులు కురిపిస్తుంటే జనంలో రోషావేశాలు పెచ్చరిల్లేవి. బ్రిటిష్‌పాలనకు వ్యతిరేకంగా వీరోచిత పోరాటం ఆనాటి కర్తవ్యం. కాని ప్రజాభ్యున్నతికై దేశ పునర్నిర్మాణం స్వాతంత్ర్య సముపార్జనానంతర కర్తవ్యం. ఆ నెహ్రూ వేరు. ఈ నెహ్రూ వేరు.

ఈ అవతార భేదానికి వరంగల్ బహిరంగ సభలో ఆయన ప్రసంగం దర్పణం పట్టింది. ప్రజలు

యావన్మందీ చెమటోడ్చి పనిచెయ్యాలి. భావితరాల కోసం ఈ తరం వారు త్యాగాలు చెయ్యాలి. విశ్రాంతికై పాటుపడాలి. ఇదీ ఆయన ఉద్బోధ. అన్యులపై విరుచుకుపడలేదు. నెహ్రూ తనకే ఓటు చేయాలనీ కోరలేదు. కాంగ్రెస్ పేరు మీదనే ఓట్లకై విజ్ఞప్తి చెయ్యటం ఆయన సంస్కారానికి తార్కాణం. 'కల్ట్' రాజకీయమంటే నెహ్రూకు ఒళ్లు మంట! ఇలాగే, చౌక బియ్యం, సబ్సిడీ చీరలు, ఆకాశాన్నంటే కటౌట్లు మొదలైన చిట్కాలతో, ప్రలోభాలతో నెహ్రూకు పనిలేదు. తరమత భేదాలు ఉండవచ్చునేమోగాని ఆనాటి ప్రముఖ నాయకులు–ఏ పార్టీకి చెందిన వారైనా ఈ కోవకు చెందినవారే.

వెల్లువికిన ప్రజాభిమానం టానిక్‌గా పనిచేయగా జవహర్ పండితులు ఉత్సాహంగా కనిపించారు. ప్రెస్ కాన్ఫరెన్స్‌లో విలేఖరులు ఆప్యాయంగా పలకరించారు. ప్రెస్ కాన్ఫరెన్స్‌కు వేళాపాళా ఉండనక్కరలేదా అంటూ కాస్సేపు విసుక్కున్నారు. అంతలోనే తేరుకుని, విలేకరుల వైపు తిరిగి, ఇది మీ తప్పుకాదు అన్నారు.

ఏదీగాని వేళ ఏర్పాటైనప్పటికీ, ప్రెస్ కాన్ఫరెన్స్ ఎంతో రసవత్తరంగా సాగింది. విశ్లేషణాత్మకమైన సమాధానాలతో మధ్య మధ్య ఛలోక్తులతో రిపోర్టర్లను నెహ్రూ అలరించారు.

అయితే అబ్బూరి వరద రాజేశ్వరరావు అడిగిన రెండు మూడు ప్రశ్నలు మాత్రం నెహ్రూను తికమకపెట్టాయి. అంతేగాక, జగత్ప్రసిద్ధమైన నెహ్రూ టెంపర్‌ను ప్రత్యక్షంగా తిలకించే అవకాశం కలిగించాయి ఆ ప్రశ్నలు.

మొదటి ప్రశ్న: దేశమంతటా పర్యటిస్తున్నారు కదా! కాంగ్రెస్ విజయావకాశాల గురించి మీ అంచనా ఏమిటి?

నెహ్రూ జవాబు: ఏవో ఒకటి రెండు చోట్ల తప్ప దేశం మొత్తం మీద కాంగ్రెస్ విజయ దుందుభి మ్రోగించటం ఖాయం.

ఈ విషయంపై అబ్బూరి ప్రశ్నలోకాని, నెహ్రూ జవాబులోకాని పెద్ద విశేషం ఏమీ లేదు. కాని ఆ తర్వాత అబ్బూరి నుండిబాణం వలె దూసుకువెళ్ళిన ఉపప్రశ్న నెహ్రూకు తత్తరపాటు కల్గించింది.

'ఒకటి రెండు నియోజకవర్గాలలో మాత్రం కాంగ్రెస్ ఎందుకు ఓడిపోవాలి' ఇదీ తికమక పెట్టిన అనుబంధప్రశ్న.

నెహ్రూ ఆలోచనలో పడ్డారు. షెర్వానీ జేబులో నుంచి సిగరెట్ పెట్టె తీసుకొని ఒకటి ముట్టించారు. గాంధీటోపీ తీసి ఒకసారి బట్టతల నిమురుకున్నారు. అప్పుడు స్ఫురించింది వజ్రం లాంటి జవాబు.

కాంగ్రెస్ ఒకటి రెండు చోట్ల ఓడిపోవడం ఎందుకు జరుగవచ్చునంటే ప్రజలు తెలివైనవారు కాబట్టి! ఇలా అంటూనే ఆయన హాయిగా నవ్వేశారు. విలేఖరులు కూడా ఆయనతో శృతి కలిపారు.

రెండవ ప్రశ్న: కాంగ్రెస్‌లో అవినీతి పెరిగిపోయిందని వినవస్తున్నది. దీనికి మీరేమంటారు?

ఈ ప్రశ్నకు నెహ్రూజీ మండిపడ్డారు.

జవాబు: "ఈ కూత కూసింది ఎవరు! కాంగ్రెస్‌లో అవినీతి ఉందనటం అసంబద్ధ ప్రేలాపన

(Fantastic nonsense). నిజానికి, అవినీతి విషయంలో ప్రతిపక్షాలు పరమ అధ్వాన్నం. (In the matter of corruption the Opposition parties are infinitely worse) నిర్దిష్టమైన దృష్టాంతాలు చూపిస్తే తగిన చర్యలు తీసుకోవటానికి నేను సిద్ధమే. కాని ఏవో గాలి కబుర్లు ఆధారం చేసుకొని కాంగ్రెస్‌పై లేనిపోని అభాండాలు వేస్తే నేను సహించను." ఇలా విరుచుకుపడినప్పుడు ఒక రకమైన ఆగ్రహ సౌందర్యంతో నెహ్రూ వదనం వెలిగిపోయింది. సమాధానం పూర్తిచేసిన తర్వాత ప్రశ్న వేసిన అబ్బూరి వైపు తిరిగి, "Mister! I am only angry with your question, not with you." అన్నారు నెహ్రూ.

నెహ్రూ కోపం క్షణికం, అదైనా విషయం పైనే కాని వ్యక్తులపై కాదు...

(ఎన్నికల సంగ్రామం: ఓటరు స్వయం వరం-3, 'ఉదయం', ఏప్రిల్ 28, 1991)

•

## షోయెబుల్లా ఖాన్ సంస్మరణ సభ

*[1952 ప్రాంతంలో వరద రాజేశ్వరరావుగారు షోయెబుల్లాఖాన్ సంస్మరణ సభను ఏర్పాటు చేశారు.]*



[పాత్రికేయుడు, జాతీయవాది షోయెబుల్లాఖాన్ సంస్మరణ సభలో 'వరద'- గోడ దగ్గర]



[ ముందు వరుసలో-మధ్యలో: డా. బూర్గుల రామకృష్ణారావు, వారికి
కుడివైపున ఖాసా సుబ్బారావు, ఫెర్నాన్‌డిస్, థియొబ్లాటూష్;
ఎడమవైపున రఘునాథ అయ్యర్, 'వరద' మొదలైన వారు]





[అతిథిగా పాలగుమ్మి పద్మరాజు ప్రసంగిస్తుండగా-ఎదురుగా కుర్చీల్లో: 'వరద', మాడపాటి హనుమంతరావు, పి. వామన్‌రావు, మొదలైన వారు]

## 'కవిత' ప్రచురణకు ప్రయత్నం

*[1951-52లో 'కవిత' అనేతెలుగు కవితా పత్రికను ప్రచురించాలని వరదరాజేశ్వరరావుగారు ప్రయత్నాలు ప్రారంభించారు. 'లెటర్ హెడ్స్' కూడా వేయించారు. ఆ ప్రయత్నాలు 1954 వరకూ కొనసాగాయి.]*

ఎర్రమంజిల్ లో అప్పుడు సమాచార శాఖ ఉండేది. అక్కడ అధికారి బినోదరావును కలుసుకుని పంజగుట్ట రోడ్డు మీదకు వస్తున్నాను. ఎదురుగుండా మరో స్నేహితుడితో కలిసి అతను [రాజశేఖర్] నిలబడిఉన్నాడు. నన్ను చూడటంతోనే మందహాసం చేసి 'నీకోసమే నిరీక్షిస్తున్నాను పద' అన్నాడు. దారిలో భాస్కరభట్ల కృష్ణారావుని

Kavita

A TELUGU POETRY PERIODICAL

VARADA RAJESWARA RAU M. A.

12 GULBAGH,
HYDERABAD-DN.

పొగుచేసుకుని ఆబీద్..లో స్థిరపడ్డాము అంతే. మరో ఆరేళ్ళు మా సాయంకాలాలు అక్కడే ... బాగా పొద్దుపోయేదాకా. అజంతా, ఏల్చూరీ మాతోపాటు సమావేశమయేవారు. మా సాహిత్యగోష్ఠులూ, కవితా వ్యాసంగమూ అక్కడే. ఊళ్ళోకి వచ్చినప్పుడల్లా బెల్లంకొండ రామదాసూ, శ్రీ శ్రీ, ఆరుద్రా, మాచిరాజు దేవీప్రసాదూ, బైరాగీ మాతోనే నిరంతర కాలక్షేపం ... ఆ రోజుల్లో వాల్తేరు నుంచి మా నాన్నగారు వస్తూపోతూండేవారు. ఆయనా మాతో కాలక్షేపం చేసి మా కవితా వ్యాసంగాన్ని సమీక్షిస్తుండేవారు.

## ‘చెరకాలం’

*[జైలులో ఉండగా రాసిన “చెరకాలం” మహాకావ్యంలోని కొన్ని పద్యాలు 1949లో ‘తెలుగుస్వతంత్ర’లో అచ్చయాయి. తరవాత ఆ కావ్యాన్ని పుస్తకంగా ప్రచురించాలనే ప్రయత్నంలో మిత్రుడు శ్రీ గిడుతూరి సూర్యం గారి చేత చిత్రాలు వేయించారు. కానీ, ఈలోగా ‘చెరకాలం’ రాతప్రతిని పోగొట్టుకున్నందువల్ల ఆ ప్రచురణ ప్రయత్నం అప్పట్లో ఆగిపోయింది.]*






"చిరకాలమ్మున నుండి కావ్య రమణీ స్నేహమ్ము చాలించి సం
స్మరణ వ్యాపృతిలో దగుల్కొనిన నా స్వాంతమ్ము కాంతమ్ముగా
'చెఱకాలమ్మ'ను కావ్యఖండము రచించెన్ వీదు చిన్నన్న
..........."

[అబ్బూరి రామకృష్ణారావు గారు తమ మూడవ కొడుకు చిరంజీవి గోపాలకృష్ణను సంబోధిస్తూ రాసిన కొన్ని పద్యాలలో ఒకటి వరద రాజేశ్వరరావుగారి రచన 'చెరకాలం' కావ్యం గురించి- (అసంపూర్ణం) -రచనా కాలం-1955 ప్రాంతం].




కాలం మారింది నేస్తం!
కల నిజమయి లోకం సమస్తం మరోలా
పాలించే మంచిరోజే
ప్రభవమయి జనం బానిసత్వం నశిస్తే
కౌలీనం మారణం రక్తనదవిహరణం
కానిపించే చరిత్రం
తా లోపిస్తుందిలే! నీ
తరుణహృదయగాథా రహస్యం యిదేలే!
వెనుకటివలె కాదోయీ
మునుపటి రోజులు గతించి
పోయినవోయీ
మనిషికి విడుదల మార్గం
కనిపించే సూచన ఉడు
గంటినవోయీ!

చదలంటిన నీ యెదలో
చెదరిన స్వప్నం, పగిలిన
జీమూతం, యే
ముదికన్నుల భూతయుగా
న్నెదిరిస్తుందోయి, కొత్త
యేలిక లెవరోయ్?
భూగర్భం అట్టడుగున
సాగిందాక ప్రాక్త నాస్థి
సంకుల సమరం
రేగిందాక పెను ప్రళయం
మ్రోగిం దాఖరి తుఫాను
పూర్వాశలలో!
చెరకాలం వచ్చిం దిక
మరలో తల దాచుకొన్న

మనుగడ తడిలో
పరమాణువు పగిలెనులే
నరజాతికి చరమకాల
నరకమిదే లే!

ఇదికాదు లే ప్రపంచం
కదిలేమార్గం, వెలుతురు
కానని గదిలో
నిదురించే మా ఖైదీ

హృదయం కాసిన లౌలికల
యేదో వినవా?

అవధారిక
అవతారిక
వరదాశయ మీడేరుత!
భవదభయ మ్మిందేలుత!

[అచ్చయిన కొన్నిపద్యాలు]-
(తెలుగు స్వతంత్ర, 13.5.1949)



{వరద రాజేశ్వర రావు గారితో డా. ప్రభాకర్ పరకాల జరిపిన ఇంటర్వ్యూలో కొన్ని భాగాలు}

ప్రభాకర్: 'చెరకాలం' మహాకావ్యం అన్నారుకదా...

వరద రాజేశ్వరరావు: చెబుతాను 'చెరకాలం' అన్నది ఎనభయి పేజీల సమగ్రకావ్యం. జీవితంలో యాదృచ్ఛికంగా సంప్రాప్తమయిన అనుభవానికి ఆలంబమయిన గాథ. ఆ గాథని అంతస్సూత్రంగా అన్వయిస్తూఅల్లిన కావ్యం. నలభయిఅయిదేళ్ళ కిందటిమాట. ఆరోజుల్లో ఆధునాతన శైలిలో కావ్యాలు రాలేదు. శ్రీశ్రీతో పాటు మేమంతా ఒక కొత్త శైలికోసం అన్వేషిస్తున్న రోజులు. అంచాత ఆ ప్రయత్నం చేయాలనిపించింది. జైల్లో ఉరికోసం నిరీక్షిస్తున్న ఓ ఖైదీ ఉంటాడు. అతను కటకటాల మధ్య నిరంతరం మృత్యుసన్నిధిలో ఉండేవాడు. అతను నిరపరాధినని చెప్పుకుంటూ తనపై అధికారులు మోపిన నేరం గురించి చెప్పేవాడు. తనకెలాగూ చచ్చిపోవాల్సుంది. తనపై ఆరోపించిన నేరం గురించే బాధపడేవాడు. అప్పటి రాజకీయ పక్షాలన్నిటిలోనూ పనిచేశాడు. ఎవరూ తనక్కావలసిన సహాయం చెయ్యలేకపోయారు. నిరుద్యోగంలో కఠిన దారిద్ర్యంలో-కుటుంబం-భార్యా పిల్లలూ-ఆకలికి తట్టుకోలేక పోయారు. అందరూకలిసి ఆత్మహత్య చేసుకుందామనుకున్నారు. ముందు భార్యనీ, పిల్లల్నీ చంపేశాడు. తనుకూడా కత్తితో పొడుచుకున్నప్పుడు పోలీసులు వచ్చి పట్టుకున్నారు. అదీ అతని కథ. ఈ ప్రపంచంలో తనకు ఆధారం లేనప్పుడు ప్రపంచాన్ని వదిలేసి పోవటానికి తనకి హక్కు లేదా అని అతని వాదన! ఇక్కడే బాగుంది-బయట బాధేబాబూ, మాలాంటి వాళ్లకనేవాడు.

బయిలులోపం స్వేచ్ఛ కలదు
బయట క్షణమ్మయినా వలదు-

ఈ యితివృత్తాన్ని సమాజంలో అంతర్గతంగా ఉన్న పరస్పర వైరుధ్యాన్ని విశ్లేషిస్తూ యింకోరకంగా మలిచి కావ్యసృష్టిలో ఒక ప్రయోగం చేశాను.ఇది విన్నప్పుడు శ్రీశ్రీ చాలా

మెచ్చుకుంటూ తనూ యిలా ఒక ప్రయోగం సంకల్పించాననీ, 'కలకాలం' అని పేరు పెట్టాననీ చెప్పాడు. నేను మరీ సంతోషించాను. ఆ రోజుల్లో మేము ప్రయత్నం చేస్తున్న కొత్త ధోరణిలో ఒక చిన్న కావ్యం రాస్తే బాగుంటుందనుకునే వాళ్ళము. అలాగ ప్రయోగం ప్రారంభించామనే సంతృప్తి ఉండేది మాకు. శ్రీ శ్రీ తలపెట్టిన కావ్యానికి 'కలకాలం' అని పేరు పెట్టాడని చెప్పానుకదూ- అందులో ప్రధానవృత్తం-యీలోకమూ, యీ జీవితమూ అంతా ఒక కలగా ప్రారంభమయి కలగా అంతమవుతుందని. నేను తీసుకున్న యితివృత్తంలో-యీప్రపంచం ఓ రకమయిన కారాగారం అందులో మనం జీవితాంతం బంధితులుగానే ఉంటాం అని. తరవాత 'చెరకాలం' కోసం ఉపోద్ఘాతం రాస్తూ......

*కలకాలం చెరకాలం*

*సిలువై తుది కావ్యమై స్ఫురించెను వరదా!*

అన్నాడు. ఇంతకీ జరిగిన విషాదకరమయిన వ్యవహారమేమిటంటే-నా 'చెరకాలం' వ్రాత ప్రతిని తనతో పాటు తీసుకుపోయి యెక్కణ్ణో పోగొట్టుకున్నాడు. నాదగ్గిర మరో ప్రతిలేదు! ఒకసారి అందుథో కొన్ని ఖండికలు 'తెలుగు స్వతంత్ర'లో గోరాశాస్త్రి ప్రచురించాడు (13.5.1949). శ్రీ శ్రీ 'కలకాలం' అనే శీర్షికతో ఓ ఖండిక రాశాడు. అంతే, ఆకావ్యాన్ని అనుకున్నట్టు రాయలేదు. తరవాత మిత్రుల ప్రోద్బలమ్మీద నాదగ్గర యిక్కడా అక్కడా కాగితాల్లో, నోటు బుక్సులో దొరికిన వాటితో 'అందాకా' అనే పేరుతో ఓ సంకలనం అచ్చయింది. అది అచ్చవుతున్నప్పుడు శ్రీ శ్రీ హైదరాబాదు వచ్చి తనే ఉపోద్ఘాతం రాయాల్సని నాలుగు పద్యాలూ రాశాడు. 'అందాకా' మరోరెండు సార్లు అనతికాలంలో ముద్రణ భాగ్యం పొందింది.

మిత్రులు తిరిగీ 'చెరకాలం' రాయమని పదేపదే అడుగుతూవచ్చారు. నా కలా మనస్కరించలేదు. ఎంచాతనంటే అది రాసినప్పుడు దృష్టివేరు.-అంతే కాకుండా 'చెరకాలం'లో మరోప్రయోగం చేశాను. చాలావరకు సాంప్రదాయక ఛందస్సును వాడాను. స్రగ్ధర, భుజంగ ప్రయాతం, గీతం, కందం, చంపకమాల-అన్నీ వాడాను. అందులో చాలావరకు వ్యవహారిక భాషలో రాశాను. తతిమ్మావి చాలావరకు మాత్రా ఛందస్సులు, కొన్ని ముత్యాలసరాలు. ఆ తరవాత ఓసారి విశ్వనాథ సత్యనారాయణగారు నాతో అన్నారు. "నీ స్నేహితులంతా ఛందస్సు మీద విరుచుకు పడతారేం? వాళ్లకి చాతకావాలి కాని అందులో రాయటానికేంబాధ? నువ్వు రాసి చూపించావుకదా-యింకా యేంకావాలి వాళ్లకి?" అంటూ,అలాగే కృష్ణశాస్త్రిగారూ అభినందించారు. ఇలా ప్రయోగాలు చేస్తూ-కొంచెం తృప్తి, కొంచెం అసంతృప్తినూ-రాసిన కావ్యం అది. అంచాత మళ్లీ తిరిగి రాయటానికి మనస్సు వొప్పుకోలేదు...

('కవితా సంచిక', పే. 163-164)



# శ్రీ శ్రీ గురించి ప్రసంగం

*[1952 లో శ్రీ శ్రీ పైన చేసిన ప్రసంగం ఆలిండియా రేడియో, హైదరాబాదు కేంద్రం నుంచి ప్రసారితమైంది. ప్రసంగవ్యాసం 1953లో 'నేత' పత్రికలో ప్రచురింపబడింది ]*



[ఆలిండియా రేడియో (హైదరాబాదు) లో శ్రీ శ్రీ గురించి ప్రసంగ వ్యాసం చదువుతున్న 'వరద']

నేటి కథకులు

## శ్రీ రంగం శ్రీనివాసరావు

### శ్రీ ఎ.వి. రాజేశ్వరరావుగారు యం.ఏ.

ఆరుణగిరి మొదలి వీధిలో ఆరుద్ర యీక్షణంలో ఉండకపోవచ్చును. నువ్వురాసి పోస్టు చెయ్యని ఉత్తరం యీవాళేచదువుకున్నాను. ఆరుద్రకు అందిందోలేదో తెలీదు, నువ్వన్నావు:

Madras is the same as Vizag, may be a little magnified. There is the same sea where we continue to count the pebbles, khaki here is not the less

attractive or the less expensive, wind and rain, Sun or shadow pose for us the same problems. Our superb gestures of frustration and despair preserve all their classic austerity. In long lone lanes the same whispers are heard, metamorphosed as thunder in reverberation.

సముద్రం యెరుగని హైద్రాబాదులో సంధ్యాద్వీపాంతరవాసం నాకు. మనస్సు ఖాళీసిసా. నీ ఉత్తరం రాకపూర్వం ఒక క్షణం ముందు నాచెరకాల మహాకావ్యాన్ని పూర్తి చేశాను. ఉరితియ్యబడ్డ శిరస్సుకు వీడ్కోలుపు:

*పదముందుకు, వెనక ఆపద*
*ముదికనులకు లేదు, కౌముది*
*గదిలోపలి నలుపు మూగది*
*పద నేస్తం, వెనక ఆపద!*

*ధరపెంచిన పాటలాధర*
*వలపించే పసిడి తోవల*
*ఎదగాలికి రేగు పయ్యెద!*
*పదముందుకు, వెనక ఆపద!*

*గతి తప్పిన జనం సంగతి*
*తలమాసిన తత్వవేత్తల*
*కలరేగిన వె్రికేకల!*
*పదనేస్తం, వెనక ఆపద!*

*తరలించకు చావుజాతర*
*పరమాత్మకు విప్పిచూపర*
*కలికాలపు బతుకుటాకలి*
*గతి యెరుగని జనం సంగతి!*

.................................

మళ్ళీ విశాఖపట్నపు సముద్రతీరమూ, లోయ తోటా, కవిగారి ఆశ్రమమూ, యిలా అన్నీ గుర్తుకొచ్చినయి. మదరాసులో దావీదు   మరణం అన్నిటికన్నా సంతాపకరమయిన విషయం. ఒకసారి శిష్ట్లా ఉమాయ్‌తో అక్కడ తగవు తెచ్చుకున్నాము. ఎలియట్సు వీధిలో మనం ఒక కథా, ఒక నవలా, ఒక శతకం ప్రారంభం చేసి యవరిమానాన వాళ్ళుపోయాము. ఆరోజులు మళ్ళీ రావు. అందుకు చింతించను. 'జ్ఞాపకాలు' అని పాపం, శిష్ట్లా ఉమాయ్ ఒకగీతం రాశాడు. అలాగే జ్ఞాపకంలో ఒక ఆనందం, తృప్తి ఉన్నాయి. ఆరోజులు తలచుకున్నప్పుడు అవ్యక్తమయిన ఆనందాన్ని అనుభవిస్తాను. అదంతా ఒక గత కథానిక.

నేటి కథకుల్లో శ్రీరంగం శ్రీనివాసరావు ఆఖరివాడని చెప్పారు. శ్రీరంగం శ్రీనివాసరావు సాహిత్యంమీద నాది ఆఖరు మాట. ఆధునికాంధ్ర సారస్వతం మీద మనిద్దరిదీ ఆఖరుమాట అన్న నిర్వివాదాంశాన్ని గుర్తించని వారు మొన్న ఎన్నికల్లో చాలామంది వోటు చేసిన వాళ్ళే!

ఈ మధ్య పద్మరాజు యీ ఊరొచ్చాడు. ప్రపంచ కథానికల పోటీలో పరాయిదేశం వారతణ్ణి గౌరవించినందుకు, యిక్కడ అతన్ని సన్మానించారు. అతని "గాలివాన" చదివే వుంటావు. ఒక సభలో ఒక పెద్దమనిషి-స్పెషల్ వెయిటింగ్ రూము ఘట్టం తీసిపారేస్తే, గాలివాన కథ అత్యుత్తమంగా ఉంటుందన్నాడు. ఆయన అజ్ఞానానికి అవనత ముఖుణ్ణయినాను. ఆ రోజే పద్మరాజును ప్రాధేయపడి అడిగాను. రాయడమన్నా మానేయి; యీ సన్మానాలు నిరాకరించన్నా నిరాకరించమని. "అరిసె కాయ కవిత్వనివేదనం శిరసి మాలిఖ మాలిఖమాలిఖ".

ప్రజాస్వామిక యుగానికి చెందిన మనం అట్టి ప్రార్థన చెయ్యడం సమంజసం కాదని అధికార పూర్వకంగా హెచ్చరించే రాజకీయ వేత్తలు లక్షోపలక్షలు. వాళ్ళు చచ్చిపోయిన తరువాతనే మన

జీవితం ప్రారంభిస్తుందన్న యీరహస్యం గ్రహించరు పాపం వాళ్ళు.

కిందటి నెల్లో నేను చెన్నపట్నం వచ్చినప్పుడు పీటర్సు రోడ్డులో మనం ఆరాత్రి కలుసుకున్నాము. అప్పుడే నేను చెప్పాను. నేటి కథకుల గురించి. నువ్వు విస్మయం కనబరచిన సంగతి నేను మరచిపోవడం లేదు. కోనేటి రావును కలుసుకోమన్నావు. కోనేటిరావు చిరునామా లేని వ్యక్తి కావటంవల్ల కలుసుకుని తీరిగ్గా, దీర్ఘంగా యేదీ చర్చించలేకపోతున్నాను. అతను ప్రతీ పట్టణంలో నిత్యమూ యావద్భారతమంతా కనిపిస్తూనే ఉన్నాడు. "సంపెంగతోట"లో అనంతం, "ఈ భారతదేశమే మన మహోద్యానం. ఈ విశాలవనిలో ఎన్ని రమ్యస్థలాలు లేవు. ఒక్కమాట. విను అరుణా! ఎందరు శ్రమజీవులు చెమటార్చి పెంచారో యీ సంపెంగ తోటను, పితంగ్రులు, తాతలు, ముత్తాతలు, ఆ క్షుధార్తులు, చూపులు పూవుపూవునా కొమ్మకొమ్మనా నీకు కన్పించడం లేదూ? తలచుకుంటే వొళ్ళు జలదరిస్తుంది. నీ సంపెంగ తోట పేరు చెబితే నాకుభయం. సాయంవేళ కానీ, రాత్రి కాని ఆ తోటలో నడుస్తుంటే అవ్యక్తమయిన కాంతితో మెరసి పోయే ఆ తరుచ్ఛాయలు చూశావా? ఆ వెనుకటి కష్టకథలు జ్ఞాపకం వచ్చి పీడకలలు కంటున్నట్టు గోచరించవా ?" అంతరమ్యంగాచెహోవ్‌పలికించాడు; ఆసియా ఖండమంత ఆ వాస్తవాన్ని, అదే సత్యాన్ని కోనేటిరావును చూసిన తరువాత ద్యోతకమవుతుంది. 'భారతదేశమే ఒక పెద్ద కోనేటికొంప' అని. వెనక కన్యాశుల్కం అనే యేకాంకికల సంపుటం అని నేనూ సిద్ధాంతాన్ని లేవదీశాను. దాంతో నువ్వు యేకీభవించటమే కాక రుక్మిణీ నాథశాస్త్రితో ఒకసారి కజ్జా తెచ్చుకోవలసి వచ్చింది. అదే విధంగా 'మహాప్రస్థానం' అనేక కథానికల సంపుటం అంటాను. కథ అంటే నిర్వచనం నాకెవరూ చెప్పలేదు. నిర్వచనం కల్పించేందుకు నేను ప్రయత్నమూ చెయ్యను. సులక్షణసారాన్ని, వ్యాకరణాన్ని చదివి కవిత్వం రాస్తే యెలావుంటుందో మన కనవసరం.

ఈ ప్రపంచం, నరసమూహం, యీ జీవితం, యీ గమనం అవలోకించటం, అవగాహన చేసుకోవటం ప్రతీ కళారాధకుడి ప్రాథమిక ధర్మం. మనిషికి మేధస్సు విశిష్టత–ఆ మేధస్సు యెలా పరిణామం పొందుతూంటుందో, ఎలా ఉన్మీలన మవుతూంటుందో మనం చెప్పలేము. అందుచేతనే నేటివరకూ ప్రచారంలోకి వచ్చిన అన్ని రాజకీయ సిద్ధాంతాలూ యివాళ కాక పోతే రేపయినా దెబ్బతింటాయి. మనిషి జీవితం, గమనం, భోజనం, భోగము, భాగ్యమూ, భవిష్యత్తూ ఫలానారకంగా ఉండాలీ అంటే మనిషిని మనిషిగా గుర్తించక పోవటం. అలాగే కళా విషయంలో లక్షణం యిదమిత్థమని నిర్ణయించటం సాహసకరం.

ప్రపంచములో పది కథలు చదివి కథా లక్షణసారం అని యెవరైనా ఒక లక్షణ శాస్త్రాన్ని కల్పించవచ్చును. అది చదివి మరో పదిమంది కథాలక్షణంగా యివాళ గుర్తించి కొన్నాళ్ళదాక కాబోయే కథకుల నెత్తిమీద రుద్దితే, రాబోయే తరం దాన్ని తిరస్కరించక పోదు. అదేకళలోని విశేషం. వ్యక్తిలోనే విశిష్టత. సమాజంలో అందరు వ్యక్తులూ ఒకే రకంగా పరిణతి పొందరు. "సద్యా-స్ఫూర్తిలో" అందరూ అంటే యెవరు? నేనైతే యెందర్నో చూశానుగాని యీ "అందరూ, కనపడలేదు, అందరికోసం వ్రాయమని అడగడం అసందర్భం . అందరికోసం వ్రాస్తున్నా ననుకోవటం ఆత్మవంచన" అన్నావు. అలాగే అందరినీ ఒక లాగే రాయమనటం అర్థంలేనిమాట. వ్యక్తికీ వ్యక్తికీ మధ్య యెంతో తారతమ్య ముంటుంది. రూపవర్ణాదుల్లోనే కాదు. అభిరుచిలో-అభిరుచి హృదయజన్యం–అందరికి ఒకే విధమయిన అభిరుచి కల్పించాలనే రాజకీయవాదులు, మనుషుల్ని చంపుక తినే పిశాచాలు.

మనిషికి ఆదర్శం ఫలానా ఉండాలనటం కూడా పొరపాటే. జీవితం నిత్యచైతన్యం. సమాజం కానీ రాజ్యాంగంకానీ కేవలం సాధనాలు. జడబుద్ధులకూ, అభివృద్ధి నిరోధకులకూ, ఆదర్శం అత్యవసరం. కలకాలం నిలచిపోగల నీతీ నియమం అత్యావశ్యకం. అట్టివారే, అల్పసంఖ్యాకులయినా– నేటి సమాజ వ్యవహారాలను హస్తగతం చేసుకున్నారు. సమాజాన్ని సంస్కరించేందుకు ప్రయత్నించుట మనకాలాన్ని దుర్వినియోగం చెయ్యడమవుతుంది. వ్యక్తిలోని విచక్షణ శీలాన్నీ, హేతువాదాన్నీ, అణగార్చబడిన మేధాసంపత్తునూ, రెచ్చగొట్టడమే మనం సాధించదగ్గ మహత్కార్యం.

నేటివరకూ అచ్చుపడ్డ ఆధునికుల కథలు చదివితే అందులో నూటికి డెబ్బయిఅయిదు పాళ్ళు నమూనాలు. తెలుగు జీవితాన్ని సమగ్రంగా పరిశీలించిన కథకుడొకడూ లేడు. మానవత్వాన్ని మననం చేసుకున్న రచయిత కానరాడు. ఒకరో యిద్దరోఉన్నా, వారి దృష్టి అన్యప్రాబల్యం వల్ల సంకుచితమయిపోయింది. మన నిత్యజీవితంలో వివిధశ్రేణులకు చెందిన వ్యక్తులను తరుచు చూస్తుంటాము. అప్పుడప్పుడు వారి మనస్తత్వాలనూ, వారి జీవితాలలోని ఒడు దుడుకులనూ పరిశోధించే అవకాశం లభ్యమవుతూ వుంటుంది. వారి బ్రతుకు పొలిమేరల్లో ఆశారాశి సంధ్యావర్ణంలో యెలా కరిగిపోతుందో కూడా ఊహించగలం. అంతేకాదు, రచయితకూడా, కనీసం ఒక కథకు కాదగ్గ వస్తువయి ఉంటే అతని కావ్యానికి అమోఘమయిన రసపుష్టి చేకూరుతుంది. మానవ జీవితంలో సామాన్యంగా మనకు దృగ్గోచరం కాని అనేక సంఘటనలు కలుగుతూంటాయి. పామరదృష్టితో ఒకవేళ వాటిని పరిశీలిస్తే అంత విశేషాలుగా తోచవు. అదే కళాదృష్టితో అవలోకిస్తే, ఆ అతిసామాన్య సంఘటనలోనే మానవజీవితము కళవళిస్తూండటము గమనించగలం.

ప్రపంచంలో నా అభిమానపాత్రుడు Stefan Zweig. అతను రాసిన Letter from an unknown woman చదివే ఉంటావు. అతని Amok కూడా చదువు. ఈ రెండు కథల్ని యెన్నిసార్లు చదివాను? చదివిన ప్రతిసారీ మానవ హృదయం భిన్నభిన్నముఖంగా కనిపిస్తుంటుంది. మొదటి కథలో ఆ అజ్ఞాత స్త్రీ అమాయిక కోమల హృదయం, ఆర్పుకోలేని ప్రేమజ్వాలా, అతనికి తెలియకుండా అతనికి పుట్టిన పసికందూ, ఆ దిక్కులేని పసికందుచావూ, ఆ మృత్యుశయ్య సన్నిధానంలో చీకటినంతా మింగలేని దీపిక పక్క ఆమె వ్రాసే ఉత్తరమూ. ఈ దృశ్యం యే చిత్రకారుడు చిత్రంచగలడు? తల్లి ఉండికూడా ఆమె మాతృప్రేమ యెరుగదు. తను వలచిన వానికి తన శరీరాన్నీ, హృదయాన్నీ అర్పితం చేసినా భర్తృసాహచర్యానికి నోచుకోలేదు. ఆఖరికి తన మాతృత్వం కూడా మంటకలసి పోయింది. ఆమె హృదయంలోని ప్రతిధ్వనులనే కృష్ణశాస్త్రి రికార్డుచేసి ఉంటాడని నా ప్రబల విశ్వాసం.

నా కనుల క్రాగుచీకట్లు
ప్రాకుచోట
లేదునేత్రావి, మధువేని
లేదు, లేదు.

ప్రాణమొక్క లావణ్య ల
వమ్ము లేదు.
ఏను రుజనైతి, జరనైతి
మృత్యువైతి.

ఈ గీతాన్ని 'యెవరయినా టెక్నికలర్‌లో ఫలింతీయగలరా? Stefan Zwieg మానవ హృదయాన్ని కూలంకషంగా తరిచి చూశాడు. అందుకనే అట్టికథల్ని కల్పించగలిగాడు. కేవలం మనిషి సమాజపరిస్థితుల మధ్య చిక్కుకుని బాధపడటమూ, వాటిని అధిగమించటమూ–వీటిని కథాపరికరాలుగా పరిగ్రహిస్తే ఉత్తమ కళాసృష్టి అసంభవమని నావాదం. మానవ హృదయాన్ని

మంచుస్వప్నాల త్రివర్ణచిత్రంగా చిత్రించగలిగినవాడే ఉత్తమ రచయిత కాగలడు. దేనికయినా హృదయం ప్రధానం; రసస్పష్టికికానీ, రసాస్వాదనకు కానీ.

మనం ఒక సంస్కృతికీ, సమాజ వ్యవస్థకూ చెందినవారము. సమాజంకంటె మనసంస్కృతి మన కెక్కువ. సంస్కృతి వ్యక్తిగతం. వ్యక్తికోసం సమాజం. వ్యక్తికీ సమాజానికి మధ్య ప్రస్తుతం సంకులసమరం జరుగుతోంది. చివరికి వ్యక్తి గెలిచేవాడయినా, యీసమరంలో దెబ్బతింటున్నాడు. ఆ దెబ్బతినడం మనం యెక్కువగా వస్తువుగా స్వీకరిస్తున్నాము. అట్టి పరాజిత హృదయాన్ని చిత్రిస్తాము. అందులో అన్ని రసాలూ ఉంటాయి. చిత్రిస్తామే కాని, ఆచిత్రణం వెనక ప్రయోజనాన్ని ప్రతిపాదించము. ఉద్బోధచెయ్యము. అందరిలాగే జీవితాన్ని మనమూగమనిస్తాము. కాని మనకు ఆజీవితపు పెల్లల వెనుక అగాధాలూ ప్రమాదాలూ గోచరిస్తయి. అప్పుడే మనం, కావ్యసృష్టి చెయ్యగలం. రసాన్ని పంచిపెట్టగలం.

ఎన్ని సంసారాలను మనం నిత్యము చూస్తూ ఉండము? ఎన్ని సంసారాల్లో యెన్ని తుఫానులు చలరేగటం లేదు? ఎంత హర్షం కురియటం లేదు? అయితే అవేవీ నామనస్సును ఆకర్షించలేకపోయినాయి. ఆమధ్య నాస్నేహితుడొకాయన-ఆయన డాక్టరు-ఆయనభార్య చచ్చిపోయింది. ఆవిడ అంటే ఆయన ప్రేమ కంతులేదు. ఆవిడజబ్బుగా ఉన్నప్పుడు ఆసుపత్రిలో తరుచుపోయి చూస్తుండేవాణ్ణి. ఆవిడ బతకటం దుర్లభమని డాక్టర్లంతా ముందుగానే చెప్పారు. ఆవిడ మృత్యువు కనులార చూశాను. అయితే ఆవారంరోజుల్లోను అతనిగాద్దదిక గాథ వినలేక పోయేవాణ్ణి. ఆవిడజబ్బు గురించి ఆయన వైద్య శాస్త్రాన్నంతా నాకేకరువు పెట్టేవాడు. ఆసుపత్రిలో ఆవిడనాడి యెలా ఆడేదీ, ఆవిడ రక్తం యెలా విచ్చిన్నమయి పోయిందీ, హృదయం యెంత దుర్బలమైపోయిందీ అంతా వైద్యపరికరాల ద్వారా చూపించేవాడు. ఆవిడ చచ్చిపోయిన రాత్రి ఆ శ్మశానంలో అర్థరాత్రి వరకూ వాళ్ళిద్దరి దైనందిన జీవితం వినిపించాడు. ఆ గాథా, అతని మనస్తత్వమూ, ఆవిడ వ్యాధి చరిత్ర గమనించడంలో ఒక విశేషం కనిపించింది. మనిషి గడిపే జీవితం, మనిషి మరణపద్ధతిని చాలావరకు నిర్ణయిస్తుంది. అంతేకాదు. అతను డాక్టరు అయి ఉంటంవల్ల, ఆవిడను భౌతికంగా అనుభవించ లేక పోయాడు. దానికి కారణం శరీరశాస్త్రం అంతా అతనికి కన్నులకు గట్టి ఉంటుంది. అజ్ఞాతంగా ఉంటేనే ఆకర్షణ. ఆకర్షణలోనించి అనురాగం అవ్యక్తంగా ఆవిర్భూతమవుతుంది. అందుకనే డాక్టర్లకు సంసారసుఖం సామాన్యులనుభవించేటంత అనుభవంలోకి రాదు. ఇదంతా నేను రాసి ముగించని కథలోని వస్తువు. నువ్వు చదివి చూద్దుగాని.

శాస్త్రుల్లుగారు ఆధునిక కథానికల సంపుటి అచ్చువేయిస్తున్న రోజుల్లో గురజాడ అప్పారావు కథ అందులో లేనందుకు మనమంతా యెంతో బాధపడ్డాము. ఆయన రాసిన ఒక కథా యుగయుగాంతర్వి శేషంగా నిలుస్తుంది. గిరీశం "True repentence twenty four hours చాలదా అండి" అన్నాడు. ఉత్తమ కథకుడు కావటానికి ఉత్తమ కథ ఒకటి చెపితే చాలు. మహాప్రస్థానంలో 'భిక్షువర్షీయసి' 'వారం వారం'లో 'కోనేటిదినం, నేను విన్న 'ఒసే తువాలందుకో' యివన్నీ ఉత్తమకథలు. కాదని వాదుకువచ్చే వారితో నాకు నిమిత్తంలేదు.

నేటి కథకులూ-శ్రీరంగం శ్రీనివాసరావు అంటారా, మహా ప్రస్థానం పరిచయ వచనంలో చెంకట చలం యేమన్నాడో చూడమంటాను.

(హైద్రాబాద్ రేడియో సౌజన్యంతో) ('నేత', 5.1.1953.)

## 'బిర్లాబ్రదర్స్' లో ఉద్యోగం

*[ఏప్రిల్ / మే 1953లో వరద రాజేశ్వరరావుగారు బిర్లాబ్రదర్స్‌కి హైదరాబాద్‌లో పబ్లిక్ రిలేషన్స్ ఆఫీసరుగా నియమితులయ్యారు.]*



['బిర్లా బ్రదర్స్' ఉద్యోగంలో చేరిన 'వరద']

Waltair
May 15, 1953.

My dear Varada,

your letter has come as a ray of light in the gloom that has been deepening round me for some time.

... Your appointment has come as a birthday gift for me. I shall be completing 57 on the 20th inst.

I shall try to send the list of books on [public relations] in about a week or so.

Yours affectionately

A. R. Rau

(Abburi Ramakrishna Rau)

*

## వివాహం

[ఆగస్టు 1953లో వివాహం జరిగింది.]

*Abburi Ramakrishna Rau*

*requests the pleasure*

*of your company*

*of the marriage of*

*his second son*

*Varada Rajeswara Rau*

*with*

*Chaya Devi*

*second dauther of*

*Sri Maddali Venkatachalam*

*on the night of 27th August-53,*

*2.27 a.m.*

*at the bride's residence*

*Rajahmundry*



[పెళ్లయిన కొత్తలో-హైదరాబాదులో హిమాయత్ నగర్ లోని
'అఫ్సర్‌మంజిల్' అనే ఇంట్లో భార్యతో 'వరద']

*[వివాహానికి కొద్దినెలల ముందే కొత్త ఉద్యోగంలో ప్రవేశించి ఉండటంవల్ల ఎప్పుడూ ఉద్యోగ బాధ్యతలతో తీరిక లేకుండా ఉండేవారు. ఉద్యోగసంబంధమైన వ్యవహారాల గురించి సిర్‌పూర్ కాగజ్‌నగర్ నుంచి కలకత్తా వరకూ వెళ్లవలసి వచ్చేది.]*

Calcutta,
21.1.1954

... From today I will be very busy. Don't be too sentimental on account of my unavoidable absence. I have been struggling all my life for a place in this world. I feel I am just beginning to succeed in that struggle. Bear with me in these moments of my transition and we shall be happy for years to come. Sometimes I feel that you have not seen life as much as I have seen. The course of life is so uncertain that we should all the more be careful. We will have to work hard and strive to achieve what is really due to us. We are partners in that task.

**P.S.**: We are leaving here on 25th evening. Will you arrange good coffee and tiffin at Rajahmundry for the mail? Bindu, Desai and Dr. Chenna Reddy will be with me.

Varada

[భార్యకి రాజమండ్రికి రాసిన ఉత్తరం]



[పెళ్లయిన కొత్తలో-విశాఖపట్నంలో-భార్య,తమ్ముడు గోపాలకృష్ణ, చెల్లెళ్లు సుజాత, ఛాయా జానకితో 'వరద']

## 'మేమే'

*[డిసెంబరు 1953లో శ్రీ శ్రీ, వరద, ఆరుద్ర కలిసి 'మేమే' అనే పేరుతో గేయాలు వరదరాజేశ్వరరావు గారి ఇంట్లో కూర్చుని సృష్టించారు. వీటిని శ్రీ ఏల్చూరి సుబ్రహ్మణ్యం గారికి అంకితం చేశారు. ఈ గేయరచన అనేక విధాలుగా ఒక అపురూపమైన ప్రయోగం. ఇది జూలై 1954లో ప్రచురితమైంది.]*



## 'డెమోక్రాట్'

*[రాష్ట్ర కాంగ్రెస్ తరఫున 'ది డెమోక్రాట్' అనే మాసపత్రికను తీసుకురావాలనే ప్రయత్నం చేశారు.]*

# THE DEMOCRAT

A MONTHLY CHRONICLE OF CURRENT THOUGHT



GANDHI BHAVAN TRUST
HYDERABAD

19th June, 1953.

Dear esteemed and respect Doctor,

The Democrat will be the latest addition to Indian journalism devoted to research into the concept of democracy in its varied aspects. The journal is being published on behalf of the Gandhi Bhavan Trust.

The Gandhi Bhavan Trust is a non-political institution engaged in constructive activity. It has its own building raised at an estimated cost of seven lakhs of rupees. The building at present houses the offices of several institutions working in various spheres of National reconstruction.

The Board of Trustees will be grateful if you can kindly help us in our new endeavour by contributing an article to the inaugural number of the Democrat. The first issue is expected to come out by the 1st of September, 1953. The subject may be "The Future of English in Indian Curriculum".

With highest regards,

Yours sincerely,

Rajeswara Rao
Editor in charge.

To
Dr. M.R. Jayakar,
Vice Chancellor,
University of Poona.

*

## 'అందాక'

*[జైలులో ఉండగా రాసిన 'చెరకాలం' మహాకావ్యం నుంచి కొంతభాగం "అందాక" అనే పేరుతో 1952లో ప్రప్రథమంగా ప్రచురించబడింది. 1954 లో "అందాక" పుస్తకం ద్వితీయ ముద్రణ జరిగింది.]*



అందాక

అబ్బూరి వరదరాజేశ్వరరావు

### [సమీక్ష]

అందాక: అబ్బూరి వరదరాజేశ్వరరావు (ప్రాప్తిస్థానం, ది గ్లోబ్ ట్రేడర్స్ గుంటూరు. వెల: 1-0-0)

తెలుగు సాహిత్యంలో కారాగారంలో వ్రాసిన కావ్యాలు బహుకొద్ది. స్వాతంత్ర్యోద్యమంలో పెద్దలు, పిన్నలు, వేర్వేరు వృత్తులకు చెందినవారు వేలాదిగా చెరజీవితాన్ని చవిచూచేరు. కాని కారాగారాలనుండి వెలువడ్డ పుస్తకాలను వేళ్ళ మీద లెక్కపెట్టవచ్చు. వాటిలో ప్రకాశంగారి "నాజీవితయాత్ర" లాంటి వచన కావ్యాలు మినహాయిస్తేపద్యకావ్యాలు అసలు లేవేమో! ఈ లోటుకు కారణం తెలుగు రచయితలు-ఎవరూ కారాగారవాసం చేసివుండకపోవడం. "అందాక" ఆ లోటును తీర్చింది.

ఆస్కార్‌వైల్డ్ వ్రాసిన 'ది బాలెడ్ ఆఫ్ రీడింగ్ జైల్' ఇంగ్లీషులో మహోత్కృష్టమైన పద్యకావ్యం. వరదరాజేశ్వరరావుగారి 'చెరకాలం' ఆ శ్రేణికి చెందినదే అని అందులో కొన్నిభాగాలు మాత్రమే గల 'అందాక' ఋజావుచేస్తోంది. దీనికి ఉపోద్ఘాతంలో

*దురితాలతో ద్రవించిన*
*చెరబాధే కావ్యమై హసించెను....*

అన్నాడు శ్రీ.శ్రీ.

స్వేచ్ఛగాతిరిగే నవయౌవనంలో, ఉన్నతోద్యోగములో ఉండి, విధివశాత్తు, కారాగారపు నికృష్టజీవనాన్ని అనుభవించవలసి రావడం వల్ల ఉద్భవించింది ఈ కావ్యం. యౌవనంలో ఇట్టి అసాధారణ అనుభూతివలన హృదయపరివర్తన వేవిధాలుగా ఉంటుంది. నిరాశావాదం ప్రబలటానికి అవకాశాలు మెండు. ఒక్కొక్కప్పుడు మతిభ్రమించినా ఆశ్చర్యం ఉండదు. కాని కవిత్వం అటువటి వింత ప్రకృతులకొక నిష్క్రమణ మార్గం. తాత్కాలికమైన మనఃక్లేశాలను కవిత్వం పారద్రోలి కొంతవరకు మనశ్శాంతిని చేకూరుస్తుంది. అంతేకాదు. వ్యక్తికొక నూతనత్వాన్నిస్తుంది.

'అందాక'లో తన పీడిత హృదయాన్ని, అప్పటి మనఃప్రవృత్తిని, కవిసువ్యక్తంచేసారు. పరిమితమైన స్వేచ్ఛ, భయవిహ్వలత, నిరాశలతో కూడిన ఆధునిక జీవితం ఈ పద్యంలో మనకి స్పష్టంగా గోచరిస్తుంది. ఇంగ్లీషులో T.S. Eliot తన 'The Waste Land' (మరుభూమి) లో యుద్ధానంతర జీవితాన్ని నిశితంగా, నగ్నంగా చిత్రించినట్లే ఈ కావ్యం స్వాతంత్ర్యం వచ్చిన కొత్తలో భారతీయజీవనపు-ముఖ్యంగా ఆంధ్రలో వాతావరణం చిత్రించింది. మొదటినుంచి చివరవరకు మనకు నిరాశావాదమే గోచరిస్తుంది.

*పరమాణువు పగిలెనులే*
*నరజాతికి చరమకాల*
*నరకమిదేలే*

అని చెపుతూ, బాహ్యప్రపంచాన్నంతటినీ ఒక పెద్ద జైలుగా భావించి అలా చిత్రించారు. శ్రీ శ్రీ మార్క్సు సిద్ధాంతాన్ననుసరించి,

*నరజాతి చరిత్ర సమస్తం*
*పరపీడన పరాయణత్వం*

అని దేశచరిత్రల్ని ఆర్థిక శాస్త్రవేత్త దృష్టితో సింహావలోకనం చేస్తే, వరదరాజేశ్వరరావుగారు నైరాశ్యమనే పాతాళంలో ఇంకో మెట్టుదిగి

*నిజంగా విషాద ప్రణీతం ప్రపంచ*
*ప్రజానీక గాథా ప్రబంధం సమస్తం!*

అని మానవచరిత్రనంతా తాత్త్వికుని దృష్టితో విమర్శించారు. కఠినం, బాధామయం, నిష్ప్రయోజనకం అయిన జైలు జీవితంలో కూడ పుస్తక సాంగత్యంవల్ల, "ఆనంద పదవి జాడ" చూచి, సృష్టి పరిణామాన్ని, నాగరికతా చరిత్రని వర్ణిస్తూ

మంత్రాల మహిమవల్ల నడచినగతం
యంత్రాలవలె నడుస్తుంది ప్రస్తుతం.

అన్నారు. కావ్యం మొదటినుంచీ చివర వరకూ

*నీ బ్రతుకంతా ఒక గాలివడగ*
*నీ పరమార్థం ఒక నీటిబుడగ*

అనే నిరాశా తిమిరం, నిస్సహాయత అలముకొన్నా అక్కడక్కడ.

*................. బ్రతుకనీ*
*నీ కళేబరాన్ని బాబు కా*
*న్నాళ్ళదాక, విన్నుహవడి*
*నా ఇదే కదోయి జీవితం!*

లాంటి చిన్న ఆశాకిరణాలు కనపడతాయి. తన సంక్షుబ్ధ హృదయాన్ని ఈ కావ్యంద్వారా చూపించటంవల్ల కవి తాత్కాలికమైన ఉద్రేకాలను పోగొట్టుకొన్నారనడానికి సందేహం లేదు.

ఇంగ్లీషులో ఆధునిక పద్యకావ్యాలలో గోచరించే ఫణితులు కొన్ని 'అందాక' లో కనపడతాయి. ఒకే కావ్యంలో వివిధములైన ఛందస్సులను (కొన్ని చోట్ల సాంప్రదాయాన్ని పాటిస్తూ, కొన్ని చోట్ల దానికి భిన్నమై, అంత్యప్రాసలతోను, ప్రారంభంలోనే ఉండే యతులతోను కూడిన నవ్యకవితా రీతుల) సమానమైన స్వేచ్ఛ, సామర్థ్యములతో వాడుటవలన ఈ రెండు కవితా రీతులలో ఈ కవి ప్రావీణ్యం స్పష్టం అయింది. రెంటిలోను సమాన సౌలభ్యంతో వ్రాయగలవారు మన కవులలో చాలా అరుదు. అందుచేత ఈయన ప్రతిభ ద్విగుణీకృతం అవుతుంది. నవ్యకవితకు మరో ముఖ్యమైన లక్షణము ఇతరకవులనుండి, గొప్ప గ్రంథాలనుండి ప్రతిధ్వనులు, పేరడీలు. 'అందాక' లో శ్రీ శ్రీ పోకడలు విరివిగా, దువ్వూరి రామిరెడ్డి మొదలైనవారి పద్యాల ప్రతిధ్వనులు, సంస్కృత శ్లోకం మరోచోట కన్పడతాయి. ఈ పద్ధతి కవి పాండిత్యానికి సాక్ష్యం.

ఏ.నా.రా. – *[ఏలేశ్వరపు నాగేశ్వరరావు]*

('తెలుగు స్వతంత్ర', జనవరి 28, 1955.)

## [Review]

**Andaaka:** By Abburi Varada Rajeswara Rau. (Published by the Globe Traders, Guntur. Price Rs.1)

This is a portion of the author's big work 'chera kalam' in which he depicts in simple verse the evils of slavery, mental, moral and physical, through which Humanity is passing today. The fight against slavery is laborious, continuous and at times desperate, but the Sun of Freedom is seen in the horizon and Humanity passes on towards it with greater vigour and vilality. Off and on despair takes hold of the moble fighters but the ideal is inspiring, noble and great and it must be achieved, cost what it may. The verses are

inspiring and effective, though some are tinged with despair.

G.V.K.Rau.
('The Hindu', 7.8.1955)

## 'ముక్తయాత్ర'

1954 అనుకుంటాను. మదరాసు, విజయవాడ, హైదరాబాదు కేంద్రాలు యేకోన్ముఖ ప్రసారాలు ప్రారంభించిప్పుడు ప్రారంభోత్సవ ప్రథమ ప్రసారానికి 'ముక్తయాత్ర' రాసి పెట్టాను. ఆ తరవాత యీ నాటికను చాలాసార్లు పునఃప్రసారం చేశారు.

ఆ రోజుల్లో బహుళ ప్రశంసాపాత్రమయిన యీ నాటికను ... మిత్రుడు కీర్తిశేషుడు నూకల నరోత్తమ రెడ్డి–అప్పుడు గోలకొండ పత్రికా సంపాదకుడుగా ఉండేవాడు–'ముక్తయాత్ర' అచ్చువేయించి ప్రసార సమయాన మిత్రులకు పంచిపెట్టాడు...

*[అక్టోబరు–నవంబరు 1992లో 'ముక్తయాత్ర' పునః ప్రసారానికి అలిండియా రేడియో కొత్తగూడెం కేంద్రం వారు ఏర్పాటుచేశారు.]*



**GOVERNMENT OF INDIA**

## All India Radio :Kothagudem

NO : Kot : 29(2) 92-PI/134 Dt: 15-09-92

Sri Abburi Varada Rajeswara Rao,
B-4/F-4, Bagh Limgampally,
Hyderabad - 500 044.

Dear Sir,

We are pleased to inform you that we would like to reproduce and broadcast your excellent radio play "Muktayatra" (first produced & broadcast C. 1954), the script of which is available in print in your collection of Plays, "Natyagoshthi - Nalugu Natakalu" (Pub. 1990).

Thanking you,
Yours faithfully,
Sd/-
(Sumanaspati Reddy)
programme Executive for
Station Director

•

## 'కవిత'

మేము 'కవిత' ప్రారంభానికి ప్రయత్నిస్తున్నప్పుడు అతని *[రాజశేఖర్]* చేత బలవంతం మీద మొదటి సారిగా తెలుగులో కవిత్వం రాయించాను.

మా 'కవిత'కు అతని *[బైరాగి]* పద్యాల కోసం రాశాను. అప్పుడు తెనాలిలో వున్నాడు. ఒకేసారి నలుగురం మాలాంటివాళ్ళం 'కవిత'లో కలిశాం. మా అందరికీ ఆనందదాయకంగా వుండేది.

నేనూ, రాయప్రోలు రాజశేఖరు, ఏల్చూరి సుబ్రహ్మణ్యం, బెల్లంకొండ రామదాసు, అజంతా – 'కవిత'ను స్థాపించినప్పుడు తెలుగు కవిత్వంలో శ్రీ శ్రీ తోపాటు మరో మలుపు తెద్దామనే ప్రయత్నం చేశాము. ఆ ప్రయత్నంలో సాయంకాలాలు విధిగా మేమందరం కలిసి గడిపేవారం – చర్చల్లో.



['కవిత' మిత్ర బృందం-శ్రీ శ్రీ, అజంతా, రాజశేఖర్, 'వరద',
కుందుర్తి ఆంజనేయులు, ఏల్చూరి సుబ్రహ్మణ్యం]



[బెల్లం కొండ రామదాసు]



[వరద, ఆరుద్ర]

*[1954 లో]* 'కవిత' ప్రారంభించాము. శాస్త్రిగారు *[మల్లాది]* చాలా సంతోషించారు. మదరాసు నుంచి ఉత్తరాలు రాశారు. శాస్త్రిగారిని 'కవిత'కు రాసి పంపమన్నాను. అలాగే నన్నారు.

కవిత

Tanuku
17. 11. 54.

Dear Friend:

Received your letter. Sorry for the delay in replying you. I am sending a few poems for 'Kavita' by the next post and hope they will reach you in time.

Let me take this opportunity to congratulate you on your literary venture 'Kavita. which satisfies a long felt need and which, I hope, will be a forum for all kinds of modern literature.

Ever yours.
D. Balagangadhara Tilak



From
D. Balagangadhara Tilak
Brindavan (బృందావనము)
Tanuku-W.G.Dt.

Tanuku,
8-12-54

My dear friend,

I am very sorry that I could not send you my poems as promised by me. Infact I was called out of town on urgent business and returned to Tanuku only today and saw your letter. Hope you will excuse this delay.
I am certainly sending my poems by tomorrow's post with out fail and you can expect them to reach you by 10-12-54 or 11th at the latest.

Thanking you,

Ever yours,
D Balagangadhara Tilak

*

మద్రాసు
3-2-55

Dear Varada,

నువ్వీ మధ్య మద్రాసు వచ్చావని తెలిసింది. కాని నేను లేను. అందువల్ల కలుసుకోలేక పోయాను.

'కవిత' రెండవ సంపుటి వెలువడిందని విన్నాను. నాకింత వరకు అందలేదు. దయచేసి పంపగలవా? మూడవ సంపుటికి సన్నాహాలు జరుగుతున్నాయా? ఉంటాను.

నా ఎడ్రస్సు:
Aluri Byragi,
No. 6, Upstairs,
Bhagavatham Gupta St.,
T. Nagar., Madras-17.

బైరాగి

•

To
Sri Abburi Varada Rajeswara Rau,
A/10-431, Himayatnagar,
Hyderabad(Dt)
Nizam State Ry.

Tenali,
19/2/'55,

Dear Mr. Varada,

నీ ఉత్తరం అందింది. నా వ్యాసంలోని భావాలు నచ్చినందుకు కృతజ్ఞుణ్ణి.

“సాహిత్యంలో వ్యాపారాన్ని గుత్తకు తీసుకున్న కొద్దిమంది యీ ఎన్నికల అవకాశాన్ని

తీసుకొని స్వప్రయోజనం కోసం ఈ తతంగం చేస్తున్నారు. ఇది నా భావన" అని వ్రాశావు. ఇది అక్షరాల నిజం. అయితే యీ కొద్దిమంది ఆటలు ఎందుకు సాగుతున్నాయి? ఇవి ఎలా కడతాయి అన్న రెండు ప్రశ్నలకు కూడా ఆలోచించవలసి ఉంటుంది. మొదటి దానికి మాత్రం సమాధానం దొరికింది కాని రెండవదానికి మాత్రం నిర్దిష్టంగా నాకు కనిపించటం లేదు. నీకేమైనా తోస్తే వెంటనే తెలియజేయాలని కోరుతాను.

అన్నట్లు కవిత రెండవ సంచిక గ్లోబ్ ట్రేడర్స్ వద్ద చూచాను. మీనాన్నగారి గేయం, ఆరుద్ర, నీవు వ్రాసిన గేయం మాత్రం చదివాను. జంటగా వ్రాసిన గేయం బాగున్నది. తతిమ్మావాటి సంగతి చదివిన తరువాత వ్రాస్తాను. మొదటి సంచికలో మాత్రం రెండే రచనలు నాకు నచ్చాయి.

Address: Yours,
G.V.K..
Kottapettah
Tenali. G.V. Krishna Rao.

•

[భార్యకి రాసిన ఉత్తరాలు]

హైదరాబాదు.
22-2-55.

*.... ఈ వారం ఇంగ్లీషు స్వతంత్రలో కవిత రెవ్యూ పడ్డది. చూడు. మానాన్నచేత India's foreign policy రాయించటం మొదలు పెట్టించు....

వరద

•

హైదరాబాదు,
3.3.55

... విశ్వనాథ సత్యనారాయణ గారీ ఊళ్లో రెండు రోజులు ఉపన్యాసాలు చేశారు. కలుసుకున్నాను. కవితకు తప్పకుండా రాస్తానన్నారు. నువ్వు వొచ్చేటప్పుడు-ఇంగ్లీషు అనువాదాలు, మానాన్న స్వంతరచనలూ, India's foreign policy మీద పుస్తకం రాయించి-తీసుకురా. లేకపోతే నువ్వక్కడ యిన్నాళ్లుండటం వ్యర్థం అయిపోతుంది......

వరద

•

హైదరాబాదు,
7.3.55

... ఇల్లంతా బిక్కు బిక్కు మంటూ ఉంటుంది. ఏం తోచదు. రెండు మూడు రోజాల్నించి సాయంకాలం పూట అలా అలా వెళుతున్నాను రాజశేఖరుతో కలిసి. ఇంగ్లీషులో 'కవిత

ప్రయత్నాలు పూర్తి చేస్తున్నాము. మానాన్నగారితో చెప్పు.
... పాలవరపు శ్రీ హరిరావు నాకు స్నేహితుడు. ... 'ప్రజామత' లో మన కవిత రెవ్యూపడ్డది. నీకు కాపీ పంపించాను. *అందిందా?

వరద

[అందలేదు]



## [సమీక్షలు]

**కవిత :** సంకలనము: శ్రీమతి అబ్బూరి ఛాయాదేవి. ప్రాప్తిస్థానం. A 10-431, హిమాయత్ నగర్, హైదరాబాద్, వెల రు. 1.8.0.

ఈ పత్రిక సంవత్సరానికి మూడుసార్లు వెలువడుతుంది. సాహిత్యరంగంలో కావ్యరూపాలకు ప్రధానమైన స్థానం వుంది. ఏ సారస్వతంలోనైనా కవితా సంప్రదాయాన్ని అనుసరించే మిగతా సాహిత్యరంగమంతా రూపొందుతూ వుంటుంది. అట్టి కావ్యరూపాలను, ప్రత్యేకంగా ప్రకటించే పత్రిక మనకు యింతవరకు రాలేదు. అట్టికొరత తీర్చటానికి వీరు ఉద్యమించారు. ఇందుకు అభినందనీయులు!

ఈకారణంగానే వీరు చేపట్టిన ఈ కార్యక్రమం ఎంతటి బాధ్యతాయుతమైనదో కూడా ఊహించవచ్చు.

వీరి ఉద్యమస్వరూపాన్ని సమగ్రంగా అవగతం చేసుకోవటానికి, ఇందులో సంపాదకీయంలాంటిదేదీలేదు కాని 'సందేశ' రూపంలో టి.యస్. ఇలియట్ వాక్యాలను

కొన్నిటినీ, 'స్వ విషయసూచిక' అనే శీర్షికతో ఆస్కార్ వైల్డు, "పిక్చర్ ఆఫ్ డోరియన్ గ్రే" అనే రచనకు ప్రవేశికగా వ్రాసిన వాక్యాలనూ అనువాదంచేసి పత్రిక తొలిపుటలలో ప్రకటించారు. వీటి నుంచి వీరి ఉద్యమస్వరూప మెట్టిదో ఊహించటానికి కొంత అవకాశం కలుగుతోంది. ఇలియట్ సందేశంలో ఎలాంటి ఉత్తమకవి అయినా సర్వదా ఉత్తమకావ్యాలే రచిస్తూ వుండలేడనీ, సాధనదశలు వుంటాయనీ వ్యక్తీకరింపబడివుంది. కాని సాధనదశలో ఉత్పత్తిఅయే ప్రతిసామాన్య రచనను అచ్చువేసి, మహత్తరమైన రచన క్రింద చలామణీ చెయ్యాలని ఇలియట్ అభిప్రాయమై వుండదని మనం గమనించవలసి వుంటుంది.

'The artist is the creator of beautiful things' - ఆస్కార్‌వైల్డు ఆ 'ప్రవేశిక'ను పై వాక్యంతో ప్రారంభించి చిత్ర విచిత్రాలైన అనేక భావాలను వెల్లడించుతూవచ్చి,

'There is no such thing as moral or immoral book. Books are well written or badly written. That is all.' అనే దగ్గరకు తేలాడు.

ఈ వాక్యాలను వీరు ఇలా అనువదించారు:

'రామణీయకాన్ని సృష్టిస్తాడు కళాస్రష్ట... నీతికరం, అవినీతికరం అంటూ గ్రంథాలు లేవు; బాగా వ్రాసిన పుస్తకాలూ, బాగా వ్రాయని పుస్తకాలూ, అంతే'-

ఈ వాక్యాలు మనకు శిరోధార్యాలు కావలసివుంటే, సాహిత్యరంగం ఉదాత్తమైన ప్రయోజనాన్ని దేన్నీ కలుగజేయలేకపోతుంది.

ఆస్కారువైల్డ్ అనే ఈ మహాశయుడే మానవ జీవితమంటే యేమిటో అర్థమైన పరిణతదశలో సెలవిచ్చిన ఈ క్రిందివాక్యాన్ని ఈ ఉద్యమ నిర్వాహకులు చిత్తగించివుంటే బాగుండేది.

'The value of art is not beauty, but right action.'

'కళయొక్క విలువను నిర్ణయించాలిసింది రామణీయకతనుబట్టి కాదు, ఋజుమార్గవర్తనుబట్టి'- అన్నాడు. ఈ వాక్యం పై వాక్యాలను రెంటినీ ఛిన్నాభిన్నం చేసి పారేస్తోంది.

ఆస్కార్ వైల్డు జీవితాన్ని సంగ్రహంగా నైనా తెలుసుకున్న వారెవరూ ఆయన తొలినాళ్ల ప్రవచనాలను వేటినీ శిరోధార్యాలుగా గ్రహించరు.

ఒక కవి ఒక అభిప్రాయాన్ని వెల్లడించాడంటే ఆ కవి ఆ అభిప్రాయాన్ని, ఏ అనుభవంతో, ఏ సందర్భంలో, ఎందుకు వ్యక్తపరిచాడు, అని ఆలోచించకుండా, గాలిలో ఎగురుతూ ఉండే ప్రతి అభిప్రాయాన్ని దొరకపుచ్చుకుని ఆ ప్రకారం మనం ఊరేగటం మొదలుబెడితే కుక్కతోకబట్టి గోదావరి యీదటమౌతుంది. ముఖ్యంగా ఆస్కార్ వైల్డు లాంటి జీవితచరిత్రగల రచయితల విషయంలో ఈ జాగ్రత్త చాలా అవసరం.

అన్నిటినీ తలదన్ని ఆస్కార్‌వైల్డు ప్రవచించిందీ, వీరు శిరోధార్యంగా సేకరించిందీ, మరో వాక్యం: "All art is quite useless.'

"యావత్కళా నిష్ప్రయోజనకరం".

"కటిక నిష్ప్రయోజనకరం" అని ఉండవలసింది గాని, ఎందుకో దయతలచి, ఆముక్కను వదిలేశారు. ఇదంతా కటిక నిష్ప్రయోజనకరం అంటే, దాన్నంతా అచ్చేసి జనం నెత్తిన యెలా రుద్దవీలౌతుంది అని కొంచెం వెనకాడారో యేమో! 'క్వైట్ యూస్ లెస్' అన్న ఆస్కార్‌వైల్డు

కూడా యీలాగే ఏమాత్రం ఔచిత్యాన్నీ పాటించకుండా సంపుటాలంతరబడి రచనలు చేసి జనంమీద పారవేశాడు. ఇంతమాత్రాన, ఆయన సర్దాగా అన్న ఈ మాటనుబట్టుకుని, మనం ఆయన సాహిత్యసేవనంతా కొట్టి పారెయ్యటానికి కూడా సంసిద్ధులుగా లేము. 'హేపీ ప్రిన్సు' అనే కథను వ్రాసిన మహామహుడు 'యావత్తు కళా కటిక నిష్ప్రయోజనకరం' అని హృదయపూర్వకంగా అన్నాడని మనం మాత్రం ఎలా విశ్వసించుతాం? కాని ఈ సంకలనం చేసిన వారు మాత్రం, ఈ వాక్యాలను ఆ దృష్టిలో గ్రహించినట్టు, ఈ సంపుటిలో ప్రచురించిన రచనలను బట్టి మనం అనుమానించవలసి వస్తున్నది.

ఆస్కారువైల్డు ప్రత్యేకం ఆ రచనలో వ్యక్తం చేసిన భావాలే తాడూ బొంగరం లేనివి; వాటికి తోడు వీరి అనువాదంతో మరింత అయోమయస్థితి యేర్పడుతోంది. మచ్చుకు:

'All art is at once surface and symbol-those who go beneath the surface do so at their peril; those who read the symbol do so at their peril,

దీనికి వీరిచ్చిన అనువాదం:

'యావత్కళా సువ్యక్తం, సంకేతం. సువ్యక్తాన్ని శోధించేవారు స్వవినాశనానికి, సంకేతాన్ని చదివేవారు స్వవినాశినానికి.'

పై ఇంగ్లీషుమాతృక ఎదట లేకపోతే, తల పగులగొట్టుకున్నా ఈ తెలుగు వాక్యాలు అవగతం కావు.

ఈ రెండు రచనలకూ అనంతరం ఈ సంపుటిలో వున్న మూడవ రచన శ్రీ అబ్బూరి రామకృష్ణారావు గారిది. ఈ రచన మొత్తం 12 పేజీలు. రామకృష్ణారావుగారి పూర్వరచనలకూ దీనికి యెక్కడా పోలిక లేదు. కావ్యగుణం యేకోశానాలేని వచన వ్యాసం. గేయంలా కనుపించేలాగు అచ్చువేశారు. ఈ వ్యాసంలో రామకృష్ణారావుగారు, వర్తమానాంధ్ర సాహిత్యరంగంలోని అన్నిరకాల కవులనూ, పద్ధతి బాగోలేదని మందలించారు. కాని వారు ఆశించుతున్న పద్ధతి యేమిటో సెలవిచ్చారు కారు. ఇందులో కొంత భాగం శ్రీరంగం శ్రీనివాసరావుగారిని మందలించటం. ఇందుకు ఇలాంటి కావ్యరచనకు పూనుకునేకంటే రామకృష్ణారావుగారు, శ్రీనివాసరావుగారి పేర ఒక కార్డుముక్క వ్రాసి పోస్టులో వేయించివుంటే బాగుండేది.

ఇందులో మరోచోట తాము లోగడ చేసిన రచనలను ఆధునికులలో కొందరు అనుకరించుతూ 'పెళ్లికొడుకులకు మళ్లే వీధి వీధి విహరింతురు' అని నేరారోపణ చేశారు. ఇది చాలా అన్యాయం. నేటి ఆధునికులలో నిజానికి, ఎవరికివారే ఒక మహాకవి. ఏ వాక్యమైనా తేలికగా అచ్చయిపోతుంది. ఒకరిని అనుకరించాలిసినంత అవసరం యెవరికి మాత్రం యేముంది? ఈ భాగంలోనే రామకృష్ణారావుగారు:

*'తెలుగుదారి వెలిగించే*
*వెలుగుదారి తెలిగించే'*

అని, ఒక పదబంధాన్ని గారడీ చేసినట్టు మన మీదికి విసిరేశారు. ఈ రకంమాటల గారడీలు ఈ సంపుటంనిండా పుష్కలంగా వున్నయ్.

రామకృష్ణారావుగారి రచన అనంతరం, శ్రీరంగం శ్రీనివాసరావుగారి 'వృషభం' ఇది రోడ్డుకు

అడ్డంగా పడుకుందిట.
'ఏవరు పొమ్మనగలరీ ఎద్దుని
ఎలా చూస్తోందో చూడు
ఏయ్‌ఏయ్ మోటారుకారూ
ఏవిట నీతొందర
భాయ్‌భాయ్ సైక్లిస్ట్
భద్రంసుమీ ఎద్దు నిన్ను తప్పుకోదు
యంత్రవిరోధి అహింసావాది శాఖాహారి
మద్యనిషేధ ప్రజ్ఞాశాలి
నగరం నడివీధిలో
నాగరికతగమనాన్ని విరోధిస్తూ
ఇలా ఎంతసేపైనా సరే
ఈయెద్దు నిలబడగలదు.
ఎద్దుకు లేకపోతే బుద్ధి
మనిషికైనా వుండవద్దా-'

ఇది శ్రీనివాసరావుగారి కవనం; ఇవి వీరి భావాలు; 'మధ్యపానం నాగరికతకు చిహ్నం. మద్యపానం కూడదనేవాడు నాగరికతను విరోధిస్తూ అడ్డం నిల్చున్న బుద్ధిలేనిఎద్దు'-

శ్రీనివాసరావుగారి కవనం, అభిప్రాయాలూ ఎలాంటివైనా మద్యపానమే నాగరికతకు చిహ్నమైతే - అలాంటి నాగరికత తక్షణం నశించటం అవసరం.

ఇందులో 'శాఖా' హారి అనే ప్రయోగం ఒకటి వుంది. ఇది అచ్చుతప్పో లేక రచయిత ఇందులో యేమైనా శ్లేషించారో మనకు తెలియదు.

మిగతా రచనలలో కుందుర్తివారి 'ఉత్తరం' ఒకటి వుంది. ఉత్తరం వ్రాసినట్టే పాడివచనం. బిళ్లలు లేకుండా మనపేర టపాలో వేస్తే 'బేరింగు' దండుగ.

'ఆరుద్ర'గారి 'గుమస్తా ప్రేమగీతం' ఒకటి వుంది. ఈ 'గుమాస్తా' గాని ఈ 'ప్రేమ' గాని యీ దేశం బాపతు గాదు. టి.యస్. ఇలియట్ దేశానిది. భాష కూడా అదే. 'ఆరుద్ర' ఇక తెలుగులోవ్రాయటం మానేసి ఆంగ్లభాషలో రచించటానికి పూనుకోవటం ఉత్తమం.

'టాక్సీ వెయిటింగ్ చార్జీలు పెరుగుతున్నాయ్, టేక్సీటులోనే తొందరగా ప్రేమ మాటలు ముగించేద్దామా? ప్రేమ ఎక్స్ ప్రెస్ చెయ్యటానికి ఐడియల్ వెదర్ డార్లింగ్...

ఈ బాపతు ఇంగ్లీషుభాష తెలుగువర్ణక్రమంలో ఇమడటం కష్టం. రచయిత కష్టపడి యిరికించినా చదివేవాళ్ళని వేధించటం. అందుకే యేకంగా ఇంగ్లీషు వ్రాసెయ్యమనడం-అది కవనమైనా కాకపోయినా.

శ్రీ బెల్లంకొండ రామదాసుగారి 'విస్మృమణం' అనే రచన అర్థంపర్థంలేని నిరాశావాద ధోరణిలో యీ సంపుటిలోని యితర రచనల కేమాత్రం తీసిపోకపోయినా, రచనలో కావ్యగుణం కొంతవుంది.

'నాకు లోకం లేదు
నాకు శోకం లేదు
నాకు బాధలు లేవు
ఏదో చల్లనైంది
నాలో నేడు'-

ఈ రకం వాక్యాలు చదువుతుంటే వట్టి పుణ్యానికి మనకు విచారమేస్తుంది. ఇలాంటి నిస్పృహను జాతికి కలిగించటం ప్రమాదకరం. జాతి నీళ్లుగారి ఎందుకూ కొరగాకుండా నశించుతుంది.

స్వతంత్ర రచనలమాట అటుంచి, పాశ్చాత్య రచయితల రచనలలోనుంచి, వీరి ధోరణికి అనుగుణంగా వుండే కొన్ని రచనలను సేకరించి అనువాదం చేసివేశారు. వీరిలో డిలన్‌థామస్, డి. హెచ్. లారెన్స్, రాంబో, టి.ఇ. హ్యూమ్ మొదలైనవారి రచనలున్నయ్.

ఈ రచనలను గురించి ఒక మాట చెప్పవలసి వుంది. మానవ కల్యాణానికి యుద్ధతంత్రమే పరమసాధనంగా, పాశ్చాత్య నాగరికత యింతకాలం నడిచింది. గత రెండు ప్రపంచయుద్ధాల అనుభవంతో ఆ పద్ధతి నిష్ప్రయోజనకరమని తేలిపోయింది. మరొక పంథా యేదిటో తోచని అయోమయావస్థ యేర్పడ్డది. పైపెచ్చు యీ రెండు యుద్ధాలతోనూ యూరోపియన్ దేశాలన్నీ సర్వనాశనమై ద్రవ్యోల్బణాది యీతిబాధలతో దిక్కుతోచకుండా వున్నయ్. ప్రజలలో వ్యాపించిన ఈ మానసిక నిరాశనే అక్కడి కవులుకూడా వ్యక్తం చేస్తున్నారు. అధోగతికి దిగజారిపోతున్న నిరాశావాదం : ఈ రకం రచనలను సేకరించి అనువాదం చేసి మన ప్రజలలో ప్రచారానికి తేవటానికి పూనుకోవటం అనవసరమైన పనేగాక, అనర్థదాయకం, మనది పారతంత్ర్యపు మృత్యువునుంచి పునఃజీవించి అనంతమైన ఆత్మవిశ్వాసంతో పురోగమించుతున్న జాతి; సాహిత్యం ఈ ఆత్మవిశ్వాసానికి బలం చేకూర్చేదిగా వుండాలిగాని, దాన్ని నశింపజేసేదిగా వుండకూడదు. మన మార్గమేదో మనకు వెలుగుబాటగా కనుపించుతోంది. జాతిలో వున్న బలాన్ని కూడదీసుకుని మనం ముందుకు సాగాలి.

శ్రీమతి ఛాయాదేవిగారు ఈవిషయాన్ని గుర్తించి, మున్ముందు తగిన విధంగా ఈ పత్రికా నిర్వహణను సాగించగలరని ఆశించుతాము.

మనదీ ఒకజాతి; మనకూ ఒక సాహిత్య సంప్రదాయం వుంది. పాశ్చాత్య రచయితలలో నుంచి ఏ రచనను తెచ్చుకున్నా దాన్ని మనం జీర్ణంచేసుకుని, మన పంథాలోకి మనకు బల తేజాలు కలిగేలాగు మలచుకోవాలి గాని, ముక్కు కోసుకుపోయేదిగా వుండరాదు. నవ్యాంధ్ర సాహిత్యరంగంలో అర్థశతాబ్దిగా జరిగిన కృషికి ఈ సంపుటి పరిణామమంటే, నవ్వు బాట్లపనిగా వుంటుంది.

మన జాతి యేవిటి మన సాహిత్య మేవిటి మన బలమేవిటి; మన ప్రజలేవిటి మనకున్న సాధకబాధకాలేవిటి వీటిని సర్దుకుని మనం యెలా ముదుకు పోగలం? అన్న దృష్టి ఈ దశలో చాలా అవసరం.

అంతేగాని యెప్పుడో యెవరో అన్నారని, 'యావత్కాలా నిష్ప్రయోజనకరం' అంటే మీ ప్రయత్నం వట్టి నిష్ప్రయోజనకరమని యితరులు అనవలసి వస్తుంది.

ఈ సంపుటిని ఆదినుంచి తుదివరకూ ఓపికపట్టి యెవరేనా చదవగలిగితే ఆ వ్యక్తికి అర్థం లేని యేదో బెంగపట్టుకుని, వారందాకా వదలదు. వచ్చే సంపుటికైనా పాఠకులకు ఇలాంటి బాధకలిగించకుండా వుంటారని విశ్వసించుతున్నాం.

('భారతి', కార్తికము, జయ)

---

**కవిత : ....**

ఇది కేవలం కవిత్వం ప్రకటించడం కోసం ఉద్దేశించిన పత్రిక. దీనిలో సంపాదకీయం లాంటిదేమీ కనబడదుగాని మొట్టమొదట. టి.యస్. ఇలియట్ సందేశం ఒకటి అచ్చువేశారు. ఇది సాధారణ సందేశాల్లాగ కాక, కవిత్వం లోతులు తరిచిన సందేశంలా స్ఫురిస్తుంది.

విషయంలో యిప్పట్నుంచీ ఆలోచిస్తూవుండు. యీ పని కోసం మనం సేకరించాల్సిన సామాగ్రి యేదైనా నీకు స్ఫురిస్తే వెంటనే రాస్తూవుండు అవన్నీ యిక్కడ చేరదీయటానికి ప్రయత్నిస్తాను.

గురజాడ వర్థంతి సందర్భంలో ఢిల్లీ వెళ్లాలనుకున్నాను. అక్కడ యీ విషయాన్ని చూసే కార్యకర్తలు అసమర్థులు కావటం వల్లా, ఆంధ్రప్రభుత్వమూ ............యేమాత్రమూ కలిసి రాలేకపోవటం వల్లా మానుకున్నాను.

[అబ్బూరి రామకృష్ణారావు]

California.
18th April 1963.

.........

నేను బెర్క్‌లీ (కాలిఫోర్నియా యూనివర్సిటీ) లో మూడు రోజులు, శాన్‌ఫ్రాన్సిస్కోలో మూడు రోజులూ ఉండి మొన్ననే యిక్కడికి వొచ్చాను. ఆదివారం పొద్దున తిరిగీ మాడిసన్ వెళ్ళిపోతున్నాను. బెర్క్‌లీ బాగుంటుంది. అంత చలికూడా వుండదు. నేనున్న మూడు రోజులూ ఎడతెరిపి లేకుండా వర్షం కురిసింది. వాత్స్యాయన్ని కలుసుకున్నాను. బెర్క్‌లీలో యెక్కడ చూసినా పచ్చగా గడ్డీ పూవులూ రంగు రంగులవీ వుంటయి. శాన్‌ఫ్రాన్సిస్కో యించుమించు బొంబాయిలా వుంటుంది. చక్కని నగరం. అక్కడ నైట్ క్లబ్బులు చూశాను. నైట్ క్లబ్బుల్లో చూసే దృశ్యాలే సినిమాల్లో కూడా చూపిస్తారు. కాని తీరా చూసిం తరవాత ఒకరకమైన జగుప్స పుడుతుంది. ఇక్కడి ఆడవాళ్లు బట్టలు వేసుకుంటేనే బాగుంటారు.

వరద

[ఇంటికి రాసిన ఉత్తరం.]

•

**UNIVERSITY OF CALIFORNIA**
Department of Classics
5224 Dwinelle Hall Berkeley 4, California

April 23, 1963

Dear Mr. Rau,

It was very pleasant to meet you and to have an opportunity to talk on subjects of mutual interest.

I have had to be out of town for several days and my work piled up, but at last I have been able to compile the biographical data that you asked for. I enclose it on a separate sheet. If you should need any more details, I shall be glad to supply them.

With all best wishes,

Yours sincerely,

M. B. Emeneau

నేను అమెరి కాలో ఉన్నప్పుడు కాలిఫోర్నియా విశ్వవిద్యాలయానికి వెళ్ళాను. అక్కడ సుప్రసిద్ధ హిందీకవి సచ్చిదానంద వాత్స్యాయన్ గారుండేవారు. ఆయన నన్నొక సాయంకాలం భోజనానికి పిలిచి మరి కొంతమంది విశ్వ విద్యాలయంలోని ఆచార్యులను కూడా ఆహ్వానించారు. భోజనానంతరం నన్ను భారతదేశానికి సంబంధించిన ఆసక్తికరమైన సంఘటన మీద కాస్సేపు మాట్లాడమన్నారు. నేను చీరాల సత్యాగ్రహం మీద ప్రసంగించాను. అందరూ ఆశ్చర్య చకితులయినారు...

నేను అమెరికాలో ఉన్నప్పుడు అక్కడ ... విశ్వవిద్యాలయంలో నాటక శాఖ చక్కని నాటక ప్రయోగాలు నిర్వహించేది. అక్కడ విశ్వవిద్యాలయంలో వాచిక శాఖకూడా ఉండేది. ఆశాఖలో ఆచార్యుడుగా ఎ.సి. స్కాటు గారుండేవారు. నాకు చాలా సన్నిహిత స్నేహితుడు ... ఒకసారి న్యూయార్క్ యేదో కార్యాంతరం మీద యిద్దరం పోయి అక్కడ పరిసర ప్రాంతమయిన గ్రీన్ విచ్ విలేజిలో ఓ నాటకానికి- అతి కష్టం మీద టిక్కట్టు సంపాయించి - వెళ్ళాం. జెనే రాసిన 'Blacks' అనే నాటకాన్ని ప్రదర్శిస్తున్నారు. అందులో పాల్గొన్న నటీనటులంతా నల్లవారే ... నాటకం చూస్తుంటే మనం కూడా ఆ నాటకంలో పాల్గొంటున్న అనుభూతి ఉండేది. నేను యెంతో ఆనందించాను. మా దేశంలో గ్రామసీమల్లో యిలాంటి అనుభూతి నాటక ప్రదర్శనలో కలుగుతుందని స్కాట్ తో చెప్పాను...



[న్యూయార్క్ లో ఎ.ఆర్. కృష్ణ........ తో 'వరద']

Madison,

........రాజమండ్రి నుంచి మన పద్యాల అనువాదం కోసం అనుమతి కోరిన వారికి అనుమతిస్తూ వుత్తరం రాయి.......

నేను కొన్న జపాను బొమ్మల మీద కూడా పన్ను వేస్తారుట. ఎంత వేస్తారో చూడాలి. అయితే మొత్తం మీద నీ కోరిక తీరుతుంది. మూడు బొమ్మలు కొన్నాను.

వరద

26.4.63

[ఇంటికి రాసిన ఉత్తరం.]

•

909 San Benito Rd.
Berkeley 7, Calif.
May 18, 1963.

Dear Mr. Rao,

The pictures have arrived, and we are much pleased with them and thank you for sending them. We like especially the very good one of you and me. My wife likes also the one of me with the elephant in the background. I hope you can use some of them for your article.

The Dictionary has probably come by now. I hoped ~~that~~ you would have it before you leave Madison.

With thanks and all best wishes,

Yours sincerely,

M. B. Emeneau

Madison,
28.5.63

...... ఇక్కడ నుంచి మకాం యెత్తి అన్నీ సర్దుకునే హడావిడిలో వున్నాను. ఫోటోలు పంపడాని క్కూడా తీరిక లేదు. ఊపిరి సలపనంత పని. పరీక్ష పేపర్లు కూడా దిద్ది మార్కులు ఆఫీసులో యివ్వాలి. న్యూయార్కు చేరగానే మళ్లీ రాస్తాను.

...........

వరద

[ఇంటికి రాసిన ఉత్తరం]

•





[యూనివర్సిటీ ఆఫ్ విస్కాన్సిన్ లో ఇండియన్ స్టడీస్ డిపార్ట్‌మెంట్‌లోని విద్యార్థులతో 'వరద'-వెనక వరసలో మధ్యన ఉన్నది Dan Matson]

June 5, 1963.

Dear Sri Rajeswara Rau garu,

Hope you are having a nice time, if not a busy time at New York. We, at 816, W Johnson are as usual.

I had a letter from a friend at Tirupati. He writes to say that my V.C. is not attending the Conference of Common wealth Vice Chancellors at London during this month. It seems that our Government did not allow more than five V.C.s for the Conference. Dr.A.L.Mudaliar and Dr.C.P.R.Iyer will be representing the South Indian Universities.

I will be leaving for Chicago on June 10. My Chicago address will be:

G.N.Reddy
5012, Dorchester
Chicago - 15, Illinois.

How are our friends Sri Krishna and Shri Bhatt? Please convey my regards to them.

I am sure you will not forget the good times we all had here. We miss you very much.

Wish you a nice and happy home ward journey.

With regards,

Sincerely yours

G.N.Reddy





[అమెరికాలోని ప్రముఖ ప్రచురణకర్తలతో 'వరద'].

John Wiley & Sons, INC., Publishers, New York, & London,

6th June,1963.

........ నువ్వు ఒకటో తారీకున రాసిన వుత్తరం అందింది. న్యూయార్కులో పధ్నాలుగో తారీకుదాకా వుంటున్నాను. ఇక్కడ ఆఫీసులో పనిచేస్తున్నాను. పొద్దున తొమ్మిది నుంచి సాయంకాలం నాలుగున్నర దాకా. ఆ తరవాత వూళ్లో తిరగటం, U.N.O. మొదలయినవన్నీ చూశాను. అంత మూర్ఛపోయేట్టుగా ఏమీ లేవు. నిన్న రాత్రి ఎ.ఆర్.కృష్ణ లండను వెళ్ళిపోయాడు. నేనొక్కణ్ణే ఒక హొటల్లో వుంటున్నాను. మధ్య మధ్య మా ఆఫీసు వ్యవహారాల కోసం తతిమ్మా publishing houses కి పోయి వస్తున్నాను. నిమిషం తీరిక లేకుండా వుంది. ఎప్పుడొచ్చి ఢిల్లీలో మనింట్లో విశ్రాంతి తీసుకుందామా అని వుంది.

వరద

[ఇంటికి రాసిన ఉత్తరం]

•

## లండన్‌లో : జూన్ 1963

*[అమెరికానుంచి తిరిగి వచ్చేటప్పుడు దారిలో లండన్‌లో దిగారు. తరవాత యూరప్‌లోని కొన్ని ముఖ్య నగరాలను సందర్శించారు.]*

... అమెరికా, ఇంగ్లండు, ఇతర యూరోపియను ముఖ్య నగరాల్లో నాటకరంగాన్ని సన్నిహితంగా తిలకించే అదృష్టం కలిగింది. ఆ దేశాల్లో నాటకరంగం యెన్ని అవాంతరాలు వచ్చినా సజీవంగా పరిపుష్టంగా వర్ధిల్లటం చూశాను. ఆయా నాటక మందిరాల్లో ప్రదర్శించే నాటకాలను చూసేందుకు టిక్కెట్లు అంత సులభంగా దొరికేవి కావు. నెలరోజులకు ముందుగా కొనుక్కోవాలి. అంటే నాటక రంగానికి సామాజికుల్లో అంత ఆదరణ వుందన్నమాట ...



[లండన్‌లో మిత్రులు ఎస్.వి. రామారావు, కుమార్ బెనర్జీ, మంత్రి శ్రీనివాసరావు, మొదలైనవారితో 'వరద']

## న్యూఢిల్లీలో : 1963 – 81

### అమెరికా నుంచి తిరిగి వచ్చాక–

*[అమెరికా నుంచి తిరిగి వచ్చాక లండన్ నుంచీ, అమెరికా నుంచీ మిత్రులు ఉత్తరాలు రాశారు. చాలాకాలం తరవాత 'చేరాతలు' శీర్షిక క్రింద డా. చేకూరి రామారావుగారు ఒక సందర్భంలో తమ అమెరికా జ్ఞాపకాలు కొన్ని రాశారు.]*

41, Fitzroy Square,
London W-1
England
3.7.63

Dear Mr.Rau,

I first appologise for not meeting you when you left London Y.M.C.A. on the 24th morning for Paris. I hope you enjoyed your stay in Paris and Frankfurt while on your way back home.

Mr.Mantri left for Stratford-on-Avon yesterday morning for a six-day trip - he will be visiting some places near about and then will be proceeding to Clinchester where he will stay for a few days. His tour has been arranged by the British Drama Board. He has left the room in Y.M.C.A. and has kept some of his things with me. It is really very unfortunate that he has to move about with his crutches but on the other hand it might also be an advantage on his part collecting sympathy from these heartless Englishmen here.

I have written a letter to Prof.S.Deb, Head of the Department of Geological Sciences, Jadavpur University regarding you and I think he might be contacting you when he returns to Calcutta from Simla where he is at present attending the Himalayan Geological Summer School. I would also request you to write to him at his University address which is most probably with you.

Sir, it has been very nice meeting you in London. I hope you enjoyed your seven days stay here. Though I could not devote much of my time but still I hope we have tried to make your stay here as far as possible pleasant. Your company was extremely welcome and enjoyable and I will remember it for a long time. I wish you could have stayed in London a bit longer.

Regarding the coloured photographs I have sent it for development and printing at Kodak colour process studios at Sussex and as soon as I receive them I will be despatching them to you in New Delhi. I hope the black and white picture which you took in London has come out well. Could you please send us some copies of the photographs at your convenience?

Please inform Mr.Lal (Lecturer, St. Xaviers, Calcutta) when you next write to him that you met me in London, as he knows my brother-in-law very well, most probably he might be knowing me also.

Mr.Mantri's stay for the next few months is still not settled. His tenure of scholarship will be ending on 15th of this month, he was telling me that he might be putting up with Mr.Hyder if he got a job in some producer's firm.

Dr.Subha Rao, Krishna Reddy, Rama Rao and myself always cherish with joy the nice seven days we spent with you in London.

Hope this will find you and your wife in best of spirit and health.

With regards,
Kumar Banerjee

P.S.Hoping to hear from you soon. KB



లండన్
5.8.'63

మహారాజశ్రీ రాజేశ్వరరావు గారికి,
రామారావు నమస్కారములు.

మీరు క్షేమంగా (అంటే కెమేరాపై అధికపు పన్నులు వగైరాలు లేకుండా) చేరారని భావిస్తాను. వున్నన్నాళ్లూ యిక్కడ మాకు కాలం సరదాగా గడిచింది.

ఈ మధ్య శ్రీ శివరామ మూర్తిగారు (National Museum) వచ్చారు. చాలా మంచి మనిషి మీ గురించి చెపితే బాగా తెలుసునన్నారు మీరు. రోమ్ వెళ్ళారు. ఆ తర్వాత ఇండియాకు వెళ్తారట.

ఎలా వున్నారు మీ తమ్ముడు గోపాలకృష్ణ? నేనడిగినట్లు వ్రాయగోర్తాను.

ఇప్పుడు విపరీతంగా శెలవలు నాకు. అంటే మరో రెండు మాసాలు వూరికే వుండడం (అంటే స్కూలుకు వెళ్ళకుండా). చేతినిండా పనివుంది చిత్రాలు వేసేది.

సరే వుండనా యిప్పటికి.

నమస్కారములు

S.V. రామారావు.





LINGUISTIC RESEARCH PROGRAMME

CORNELL UNIVERSITY

DIVISION OF MODERN LANGUAGES

D. M. Matson, Ph.D. (Wisconsin)
Field Director of Research

B. P. Mahapatra, M.A. ( London )
Linguistic Research Specialist

28 June 1965

రాజేశ్వరరావుగారికి :

A long time has passed since that distant Friday night when we two went to Lorenzo's for beer and Paisan's for pizza, and a lot has happened since then; but I still remember your interest in publishing books on linguistics. I'm writing to tell you about what I consider to be an excellent opportunity for your firm.

The book is READINGS IN LINGUISTICS, edited by Martin Joos (of the University of Wisconsin), published in the States by the American Council of Learned Societies. It is a collection of articles published in learned journals in America, and traces the development of descriptive linguistics in America from 1925 to 1957. It is my own firm conviction that every serious student of linguistics should own a copy of this important book.

It was recently brought to my attention by a friend teaching linguistics at Calcutta University, that not even the University library has a copy of

READINGS IN LINGUISTICS, much less any of the students. I decided that something should be done about this.

I wrote a letter to Martin Joos, asking about the chances of getting Asian rights to the republication of RIL. I quote from his reply:

"Indian" reprinting, not for export outside Asia, will probably be easy to arrange. The ACLS contact for this should be the Bursar or Controller, Mrs.Alice Harger, ACLS, 345 East 46th Street, New York 17. The first publisher to speak will probably get the book exclusively. The ACLS would supply two paperbound copies of the third edition (1963). The publisher should offer royalties for ACLS account, to be held in an account to be set up in an Indian bank and blocked: the money would be spent only within India, perhaps not for many years: the time is sure to come when the ACLS will want to spend it on some activity within India anyhow, and can afford to wait. What could be fairer?"

If you are interested in this enterprise, I'd appreciate your letting me know right away, as Prof.Joos is most anxious to learn of the outcome of my efforts.

I'm leaving today for Tirupati, to see our good friend G.N.Reddy and to clean up some work that he and I started about a year and a half ago. I expect to be passing through Delhi early in August , on my way back to the States to get married. Perhaps we can meet.

Until then, my best regards.

జాన్ మార్టిన్



## చేరాతలు

# అమెరికాలో ఆ ముగ్గురూ!

డా. చేకూరి రామారావు

జి.ఎన్.రెడ్డిగారూ, అడపా రామకృష్ణరావుగారూ, నేనూ ఒక సంవత్సరంపాటు మేడిసన్ (విస్కాన్సిన్) నగరంలో కలిసి కాపురం చేశాం. అప్పటికే నేను వంట చెయ్యటం కళగా అభ్యసిస్తూ శాస్త్రంగా పరిశోధిస్తున్నాను. ....

అప్పుడు ఆ ఊళ్లో కొన్నాళ్లు (అబ్బూరి) వరద (రాజేశ్వరరావుగారు) కూడా ఉండేవారు. మాకు తరచుగా వచ్చే అతిథి ఆయన. ముక్కాలపులుసు ఆయన స్పెషల్. అందరం తెలుగు సాహిత్యాభిమానులం. గంటల కొద్దీ సాహిత్యం మీద చర్చలు జరిపేవాళ్లం. రెడ్డిగారు మితభాషి ఎక్కువగా వినేవారు. ఎప్పుడన్నా తోస్తే తీర్పులాంటి ఒక విలువైన మాట అనేసి తక్కిన ఊరుకునే వారు, వాగుడు మాకొదిలేసి. నాకు కాస్త హుషారు ఎక్కువైతే గ్రాంథికంలో మాట్లాడి వాళ్లకి వినోదం కలిగించేవాణ్ని. సాహిత్యచర్చలు జరిగిన చరిత్రాత్మక గృహం వెస్ట్ జాన్సన్ వీధిలో 816 నంబరు. 1984లో మేడిసన్ వెళితే ఆ ఇల్లు కనబడలేదు. అమెరికా వాళ్లకు చరిత్ర ప్రాముఖ్యం తెలిసి చావదులా ఉంది. ఆ ఇల్లు పడగొట్టేసి ఉంటారు.

('ఆంధ్రజ్యోతి', ఆదివారం, -[1988])





[అమెరికా నుంచి తిరిగి వచ్చాక, ఇంట్లో 'వరద']



## ఉద్యోగ నిర్వహణ; మిత్రులు

అమెరికా నుంచి తిరిగి వచ్చేశాను... హైదరాబాదు పోయి అక్కణ్ణించి విజయవాడ వెళ్ళాను మిత్రులను చూడడానికి... నేనూ రామదాసూ ప్లాటుఫారం మీద నడవటం ప్రారంభించాము... హఠాత్తుగా ఒక వ్యక్తి దాసును పేరుతో పిలిచాడు... నన్నతనికి దాసు పరిచయం చేశాడు. అంతకు ముందు మా ఇద్దరి మధ్య ఉత్తర ప్రత్యుత్తరాలు నడిచేవి. ముఖపరిచయం లేదు. అతనే దేవరకొండ బాలగంగాధరతిలక్... తిలక్‌ని నా దృష్టికి మొదటిసారిగా తెచ్చినవాడు పాలగుమ్మి పద్మరాజు ... ఆ రోజుల్లో తిలక్ నాలాగే సాంప్రదాయక ఛందస్సులో పద్యాలు రాసేవాడు ... తరవాత మాత్రా ఛందస్సుని అతనితో పాటు కొందరం మేమాశ్రయించాము ... మా నాట్యగోష్ఠి ఉద్యమం కోసం ఈడిపస్‌ని తెలుగులో అనువదింప ప్రారంభించాడు. అతను పూర్తి చేస్తే మా నాన్నగారు ఆ నాటకాన్ని స్వయంగా ప్రయోగించి ఉండేవారు. ఢిల్లీలో కూడా ప్రదర్శించేవారు. ఆ సందర్భంలో తిలక్‌ను ఢిల్లీ పిలిపించి ఉండేవాణ్ణి .. హఠాత్తుగా గభాలున తలుపుతెరుచుకొని వెళ్ళిపోయాడు.

ఢిల్లీ నుంచి మదరాసు ఉద్యోగరీత్యా రెణ్ణెల్లకోసారి పోతుండేవాణ్ణి. అయినా కార్యభారంవల్ల మదరాసులోని మిత్రులను కలుసుకోలేకపోయేవాణ్ణి.

ఓసారి [మల్లాది రామకృష్ణ]శాస్త్రి గారిని చూడకుండా వెళ్ళిపోకూడదనుకున్నాను. అప్పుడు నాతో ద్వివేదుల నరసింగరావు వున్నాడు. అతనూ, అతని సతీమణి విశాలాక్షి మాకు సన్నిహితులు. నరసింగరావు శాస్త్రిగారిని చూడాల్నుందన్నాడు. అతని కారులో ఆ సాయంకాలం తిరుమూర్తి వీధికి పోయాం. ...నన్నుచూసి శాస్త్రిగారు సంతోషించారు... "ఏమన్నా రాస్తున్నావా, కేవలం ఉద్యోగమేనా?" అన్నారు. రాయటానికి ప్రయత్నం చేస్తున్నాను – వరదరాజేశ్వరరావు అంత్యక్రియలు – అని ప్రారంభించానన్నాను ... ప్రతి పాదాంతంలోనూ క్రియ వచ్చేట్టు చేశాను. అంచాత అంత్యక్రియ అయిందన్నాను. శాస్త్రిగారానందంతో "అయితే ఒకటుంది వరదా! అంతక్రియలకి ముందుగా నా చేత చదివించు నాయనా"! అన్నారు. అదే ఆఖరుసారి శాస్త్రిగారిని చూడటం.

లండనులోని ప్రఖ్యాత ప్రచురణ సంస్థవారు ఉమర్ ఖయాం రుబాయీలను ప్రత్యేకంగా మరో పారసీక భాషా వేత్త చేతనూ, సుప్రసిద్ధ ఆంగ్లకవి రాబర్ట్‌గ్రేవ్స్ చేతనూ అనువాదం చేయించి అచ్చువేశారు ... ఆ పుస్తకం విక్రయం మీద నా

అభిప్రాయాన్ని అడిగారు. ఎన్ని అనువాదాలు వచ్చినా, ఫిట్జురాల్డ్ అనువాదమే బహుజన సమ్మతం కావటం వల్ల ఆ పుస్తకమే నిలుస్తుందని రాశాను. అలా రాస్తూ తెలుగులో రామిరెడ్డిగారి అనువాదాన్ని ఉదహరించాను. ఎంతో వ్యయప్రయాసలకు లోనయి ప్రచురితమైన ఆ ఆంగ్లానువాదం అమ్ముడు పోక విపరీత నష్టానికి గురి కావలసివొచ్చింది.

*['ఎలైడ్ పబ్లిషర్స్' తరపున ముఖ్య సంపాదకుడిగా రాజేశ్వరరావుగారు ప్రచురించిన పుస్తకాలు బహుళ ప్రచారాన్ని పొందటమే కాకుండా విదేశాలలోని ప్రముఖుల ప్రశంసల్ని కూడా పొందాయి. 'ఎలైడ్ పబ్లిషర్స్' తరపున ప్రచురించిన కొన్ని ప్రసిద్ధ గ్రంథాలు :]*

*ఎమ్.ఎన్.రాయ్. 'మెమ్వార్స్'. 1964.*
*బి.ఎమ్.కౌల్. 'ది అన్‌టోల్డ్‌స్టోరీ'. 1967.*
*ఛెస్టర్‌బౌల్స్. 'ఏ వ్యూ ఫ్రమ్ న్యూఢిల్లీ. 1969.*
*కుల్‌దీప్ నయ్యర్. 'బిట్వీన్ ది లైన్స్'. 1969.*
*బి.ఎన్.మల్లిక్. 'మైఇయర్స్ విత్ నెహ్రూః ది చైనీస్ బిట్రేయల్' 1971.*
*బి.ఎన్.మల్లిక్. 'మై ఇయర్స్ విత్ నెహ్రూః కాశ్మీర్' 1971.*
*[సాహ్నీ, జె.ఎన్. 'ది లిడ్ ఆఫ్ : ఫిఫ్టీ ఇయర్స్ ఆఫ్ ఇండియన్ పొలిటిక్స్ 1921–1971. 1971 .]*



[ఆనాటి కేంద్ర విద్యాశాఖ మంత్రి శ్రీ ఎం.సి. ఛాగ్లా, 'ఎలైడ్ పబ్లిషర్స్' అధినేత ఆర్.ఎన్.సచ్‌దేవ్, మొదలైన వారితో 'వరద']



EMBASSY OF THE
UNITED STATES OF AMERICA
New Delhi

22 MAR 1969

March 21, 1969

Mr. Rajeshwar Rao
Production Manager
Allied Publishers Private Ltd.
13/14 Asaf Ali Road
New Delhi

Dear Mr. Rao:

I want to thank you very much for presenting me the first copy of A View from New Delhi. I have read through the book and I think it is a first-class publishing job. I know how hard and how long you worked to make this such a high quality publication, and I wanted personally to let you know that I deeply appreciate all that you did. I hope the book is an artistic, technical and selling success.

With my warmest regards,

Sincerely,

Chester Bowles

*

Embassy
of the
United States of America

16th April 1969

Mr.Rao:

Since I have been unable to see you, I wanted to pass these marking pens on to you.

The Ambassador departs on Monday morning; afterwards I hope to talk with you some more about A View from New Delhi and other books.

Do you have author's copies in regular hardback and paperback available?

Regards,
John Dine

*

UNITED STATES SENATE

Washington D.C. 20510
ALAN CRANSTON
CALIFORNIA

August 26, 1969

Mr.A.V.Rajeshwara Rao
Allied Publishers Ltd.
13/14 Asaf Ali Road
New Delhi-1
India

Dear Mr.Rao:

Kuldip Nair's book, which you so kindly sent, reached me today via a Mr.Murty of the India Embassy here. He had received the book from your friend who was in Washington; by the way I never learned his name nor personally met him, so was unable to thank him for the favor.

How grateful I am to you for sending me Between the Lines. At this point I am half-way through the book and am enjoying Kuldip's perceptive thoughts and insights. Joan and I talk all the time about India, and the book makes me miss India even more.

As you can see by the stationery, I have begun working for Senator Cranston of California. He is a very able United States Senator with a keen appreciation of foreign affairs. I hope he will be able to visit India this year.

Let me know your thoughts from time-to-time on developments in India, and I'll do the same for the U.S. Obviously, from what I read of Mrs.Gandhi's activities, events are moving quickly.

With warmest regards to you and your wife from both of us. We miss you very much.

Sincerely,

Thomas A.Dine
Legislative Assistant




[అంతర్జాతీయ పుస్తక ప్రదర్శనలో 'ఎల్లైడ్ పబ్లిషర్స్' స్టాల్ లో 'వరద']

విశ్వనాథ సత్యనారాయణగారు ఢిల్లీ వచ్చినప్పుడల్లా ఆయనతో ఎక్కడో అక్కడ కొంత సేపు కాలక్షేపం చేసే వాడిని.

ఓసారి చాలా ఏళ్ళక్రితం సత్యనారాయణగారిని ఢిల్లీలో అజ్మల్ ఖాన్ రోడ్డులో యాదృచ్ఛికంగా కలిశాను. మాటమీద మాట- నేనన్నాను - "రామాయణ కల్పవృక్షం మీద అంతకాలవ్యయం చేశారు - ఓ ప్రభూ, అంధభిక్షువులాంటి ఖండికలు రాస్తే మా తరం ధన్యమయేదీ - ముందుతరాలూ పరవశించేవీ" అని. సత్యనారాయణగారు నవ్వి నా భుజాన్ని తట్టుతూ "నా కల్పవృక్షం వేరేకథ - ఇంతకీ ఓ సంగతి మరిచిపోకు వరదరాజేశ్వరరావు! మనిద్దరం సమకాలికులం!" అన్నారు. తరవాత దారిలో ఒంటరిగా నడుస్తున్నప్పుడు కాని ఆయన అన్నమాటల్లోని అంతరార్థం గ్రాహ్యం కాలేదు.

ఆఖరిసారిగా అతన్ని *[బైరాగి]* ఒకేసారి హఠాత్తుగా ఢిల్లీలో కలిశాను. ఆంజనేయశర్మగారతన్ని ఢిల్లీ పిలిపించారు ఏదన్నా ఉద్యోగం వెతుకుదామనే ఉద్దేశంతో. మా ఇంటి కొచ్చాడు. 'ఒరేయి వరదా, మనం ఇంకెన్నాళ్ళని బతకటం - ఇక్కడేఉందామని వొచ్చాను. ఇది నా ఆఖరి ఉద్యోగం' అన్నాడు గుమ్మంలో

కాలుపెడుతూ. డిసెంబరు చలి ... చలికి తట్టుకోలేకపోయాడు. అతనున్న కొద్దిరోజులూ నాతోనూ, రాజశేఖరుతోనూ గడిపాడు ... 'వెళ్ళిపోతాను, నన్ను రైలెక్కించి పుణ్యం కట్టుకో' మన్నాడు. అతనే, "రైలునుంచి దిగటం సులభం, ఎలాదిగామో తెలీదు. మళ్ళీ ఎక్కటమే బాధ" అన్నాడు నవ్వుతూ. ఆ నవ్వే నాకిప్పటికీ జ్ఞాపకం.



మిత్రుల ఉత్తరాలు (వివిధ సందర్భాల్లో)

Bh. Krishnamurti — Camp Kanpur.
Dec. 5, 1963

Dear Rajeswara Rao,

I came here in connection with a seminar in Applied Linguistics at the Indian Inst. of Technology. I will be going back to Hyd. via Delhi. I'll be there on the 7th morning and hope to see you.

Yours sincerely,
Bh. K.

Hyderabad-7
14-1-'64.

My dear Varada:

I reached Hyd. on the 12th .... I really had a vacation in Delhi, and I am here back at work with a feeling of freshness.

...Have you met Mr.Selig Harrison? What is the result?

Family joins me in sending regards to yourself and your srimati.

Yours sincerely

Bh.Krishnamurti

•

హైద్రాబాద్,
2.12'64

డియర్ వరద,

నవతకు గేయం పంపుతానన్న నీ వాగ్దానమెన్నాళ్ళనాటిది?

నీవేదో వ్రాస్తున్నావని కూడా మీ గోపాలకృష్ణ చెప్పాడు. కాని అది ఇంకా హైద్రాబాద్ చేరలేదు. వెంటనే ఒక కొత్త గేయం వ్రాసైనా పంపాలి. ఎందుకంటే 'నవత' నాల్గవ సంచిక [మూడవ సంచిక నీకు అందే వుంటుంది] ప్రత్యేక వార్షిక సంచికగా ఈ నెలాఖరుకు వస్తుంది. నీ గేయం 15, 20 తేదీల మధ్య అందాలి. నీది లేకుండా ఆ సంచిక వెలువడదు. ఎదురు చూస్తుంటాను.

ఆరోగ్యం సరిగా లేదు. అందుకే ఇంత క్లుప్తంగా లేఖ వ్రాశాను.

కుందుర్తి ఆంజనేయులు,
4.12.'64.

•

కావలి,
27.4.'65.

శ్రీ వరద రాజేశ్వరరావుగారికి,

వందనాలు. 'అడుగుజాడ గురజాడది' అనే ఖండకావ్య సంకలనానికి గాను మీ ఖండికలు పంపండని రాసిన తర్వాత, మిమ్మల్ని మళ్లీ ఉత్తరాల ద్వారా పలకరించలేదు.

ఇప్పుడు నేను రాస్తున్న ఈ ఉత్తరానికి ప్రేరణ ఇదిః– మీ మిత్రుడు శ్రీ శ్రీ గారి జీవిత చరిత్ర రాద్దామని తలపెట్టి, ఆయన జీవితంలో తారసిల్లిన ముఖ్య వ్యక్తులను స్వయంగా గాని, లేఖా ముఖాన గాని, కలిసి మాట్లాడి విషయం సేకరిస్తున్నాను. శ్రీ శ్రీ గారినీ, ఆరుద్రగారినీ ఈ వరకే

కలిశాను. వారితోబాటు మిమ్మ తప్పక కలియాలి. నేను న్యూఢిల్లీకి రాలేను గదా! అందుకే ఈ లేఖ.

ఆంధ్ర విశ్వవిద్యాలయ కేంద్రం విశాఖపట్నానికి తరలిన రోజులనుండి ఇటీవలి వరకు మీ కుటుంబంతో ముఖ్యంగా మీతో-శ్రీ శ్రీ గారికి గలగాఢానుబంధం రేఖా ప్రాయంగానే నాకు తెలుసు. వాటి వివరాలే తెలియనివి. మీ ఒక కావ్యానికి శ్రీ శ్రీ కూర్చిన పద్య పీఠికలో మీరు విశాఖలో కలిసి ఆటపాటలు సాగించినట్లు తెలిపారు. అవి ఎలాంటివో నాకు గాని, విశాలలోకానికి గాని తెలియదు. మీ తండ్రిగారు ఒక విధంగా తనకు పితృతుల్యులని కూడా ఆయన (శ్రీ శ్రీ) రాశారు. ఇది ఎలాగో, ఏ విధంగా శ్రీ శ్రీ కవి-వ్యక్తిత్వాన్ని రామకృష్ణారావుగారు తీర్చిదిద్దారో, నేను తెలుసుకోగోరుతాను. ఆయనకు కూడా ఉత్తరం రాశాను గాని, ఆయన చిరునామా తెలియక మీ సోదరుడు గోపాలకృష్ణగారి పేరిటికి పంపాను. అది ఆయనకు అందిందో లేదో తెలియదు. ఇంతవరకు జవాబు లేదు. సెట్టి ఈశ్వరరావు గారు మీ చిరునామా ఇస్తామన్నారు గాని చివరికి ఇచ్చిన వారు కుందుర్తి ఆంజనేయులు.

1947 ప్రాంతంలో హైదరాబాదు సమాచారశాఖలో జనాబ్ మొహమ్మద్ ఖాసిమ్‌ఖాన్, శ్రీ శ్రీ, మీరు కలిసి పనిచేశారని విన్నాను. ఆ ఉద్యోగ కాలంలో ఆయన కొన్ని బాధలు-ఆరుద్ర చెప్పినట్లు 'హైదరాబాధ' లు అనుభవించినట్లు చదివాను. అవి ఎలాంటివో మీరు చెబితేనేగాని, దూరస్థులమైన మాకు తెలియవు.

ఇక 'నటాలి' నాటక సమాజానికి గాను శ్రీ శ్రీతో కలిసి మీరు చెహోవ్ Cherry Orchard ను అనువదించడం, శ్రీరంగం నారాయణ బాబుగారు స్పర్థించడం, 'నవోదయ' పత్రికలో రామకృష్ణారావుగారు సమాధనం చెప్పడం-ఇవన్నీ నాకు తెలుసు. మీరు మరికొన్ని వివరాలను అందించగలిగితే, ఈ ఉదంతం సమగ్రమౌతుంది. 'సంపెంగతోట' ప్రతులెక్కడ లభిస్తాయో కూడా దయతో తెలియజేయండి.

మిమ్మల్ని ఇబ్బంది పెడుతున్నాను. క్షమించండి. కాని నేను తలపెట్టిన పని పూర్తి కావలెనం ఇంకా ఇంకా మిమ్మల్ని శ్రమపెట్ట వలసి వస్తుంది. మీ మిత్రుని పై గల మక్కువ దృష్ట్యా, ఈ నా జోక్యాన్ని సానుభూతితో సహించగలరని నమ్ముతూ

భవదీయుడు,

[signature]

University of Poona
Poona, 7 India

Department of English

4 June 1965

Dear Mr.Rajeshwara Rao garu,

Many thanks for your letter. I hope you will kindly snatch some time to call on Mr.Rajasekhar as soon as he comes back from England and find out how he feels about writing the essay on contemporary Telugu short fiction.

I've just had a letter from your father to say that I should request "Amarendra" to take up the job. Your father has suggested that Amarendra should have preliminary discussion with him since, it seems, the contemporary Telugu literary scene has its due share of personal rivalries and jealousies and some conscious effort is needed to obtain the necessary initial objectivity. I am anxious to give the assignment to somebody without any further delay. Therefore if Mr.Rajasekhar's return has been postponed or you cannot meet him in the near future (for business reasons), could you kindly drop me a line?

Thank you,

With kind regards,
Yours sincerely,

S.Nagarajan

•

## 'కవిత' పునఃప్రారంభానికి ప్రయత్నం

*['కవిత' పత్రిక ప్రచురణను పునఃప్రారంభించాలని ప్రయత్నాలు చేశారు. శ్రీ శ్రీ, ఆరుద్ర, ఏల్చూరి, కుందుర్తి, అజంతా మొదలైన మిత్రులందరి పద్యాలూ సంపాదించటానికి ప్రయత్నించారు. కానీ, అనివార్యకారణాలవలన వారి ప్రయత్నాలు కొనసాగలేదు.]*

21 Oct. '65,
Madras.

ప్రియమిత్రులు,
శ్రీ వరద రాజేశ్వరరావుగారికి,
నమస్కారములు.

మీరు వ్రాసిన ఉత్తరం 20వ తేదీన నాకు అందినది. శ్రీ శ్రీగారు మీకు పంపమని ఆరుద్రగారి చేతికి రెండు కవితల నిచ్చారట. ఈ విషయం ఇప్పుడే వారు టెలిఫోనులో చెప్పారు. ఆరుద్రగారిని ఈ సాయంత్రం కలిసి అవి మీకు పంపమని జ్ఞాపకం చేస్తాను. రామకృష్ణశాస్త్రి గారి స్మారక సంచికను వెలువరించటం పరమ పవిత్రమైన కర్తవ్యమే. నేను రెంటాల సుబ్బారావుగారి గృహానికి వెళ్ళి ఆపత్రిక సంపుటాలను చూడటానికి వారి అనుమతి పొంది శ్రీ రామకృష్ణారావు గారి పద్యాలు లభ్యమైనట్లయితే సూరిగారినో, ఇంకో మిత్రునో పట్టుకొని-దబ్బిచ్చి ప్రతి వ్రాయించి పంపుతాను. ఆ సంపుటాలు దొరికితే పద్యాలను టైపు చేయించి అయినా పంపగలను. ఈ

విషయం-ఒకటి రెండు రోజులలో మీకు వ్రాస్తాను. చి.సౌ. సోదరి ఛాయాదేవిగారిని అడిగామని చెప్పండి. శ్రీ ఈశ్వరరావుగారికి ఈ లేఖ చూపాను.

రామకృష్ణ శాస్త్రిగారు ఆగస్టులో మా పత్రికకు వ్రాసి యిచ్చిన ఒక కవితను కూడా మీకు పంపుతున్నాను.

భవదీయుడు,

ఏల్చూరి సుబ్రహ్మణ్యం.

•

19.Nov..65

ప్రియమైన శ్రీ రాజేశ్వరరావుగారికి,

శ్రీ రెంటాల వారింటికి వెళ్ళి, ఏడెనిమిది సార్లు ప్రయత్నించగా, రెంటాల వెంకట సుబ్బారావుగారిని కలుసుకొని రెండు మాట్లు వారితో మాట్లాడ వీలయింది. వారి గ్రంథాలయంలో ఆంధ్రభారతి సంపుటాలు లేవు. అందులోని పన్నెండు వందల పుస్తకాలలో ఈ సంపుటాలిప్పుడు లేవు. ఆంధ్ర సారస్వత పరిషత్ పత్రిక సంపుటాలు 1913 నాటివి చెదురు చెదురుగా ఉన్నాయి. ఈ పుస్తకం ఇక్కడ లేదన్న నిర్ణయానికి నిన్ననే రావటం జరిగింది. పుస్తకాలను ఆయన మనల్ని స్వయంగా చూడనివ్వరు కూడా.

శ్రీ శ్రీ గారిని రెండుమాట్లు పద్యాలకోసం కలుసుకొన్నాను. ఆయన ఒక మాటు ఆరుద్రకు మీకు పద్యాలను పంపమని ఇచ్చానని అన్నారు. ఆ తరువాత ఆ మాట, వారు పరాకున చెప్పినట్లు స్పష్టపడ్డది. కొత్తవి ప్రస్తుతం లేవనీ, వ్రాసి పంపుతాననీ అన్నారు. శ్రీ శ్రీ గారికీ, ఆరుద్ర గారికీ, పద్యాలు పంపమని మీరు అసలు వ్రాసారా? వ్రాయకుంటే ఆ ఇద్దరికీ వ్రాయండి. ఆరుద్ర గారికి కూడా మీకు పద్యాలు పంపమని నేను చెప్పాను. బైరాగి గారు ఇదివరకటి ఇంట్లో లేరు. ఆయన ఉంటున్నది చక్రపాణి గారి యింట్లో. వాహినీ స్టూడియోస్‌లో. ఆయన తప్పకుండా యిస్తానన్నారు. కానీ కొద్ది రోజులు పట్టవచ్చు. ఆయన తప్పక యిస్తారు. మీరు శ్రీ శ్రీ గారికీ, ఆరుద్ర గారికీ లేఖలు వ్రాయవలసింది. మీరు లేఖలు వారిద్దరికీ వ్రాసాక నేను వ్యక్తిగతంగా ఆ యిద్దరినీ కలుసుకుంటాను. నేను ఈ విషయంలో ఏమాత్రం ఉపేక్ష చెయ్యలేదు. ఆంధ్రభారతి కోసం నేనూ వేరే మార్గాల కూడా ప్రయత్నిస్తున్నాను. త్వరలోనే నేను నా రచనను పంపుతాను. ఆ సుబ్బరావు గారితోపని నిన్నటి వరకూ తేలకనే నేను మీకు ఆవిషయం వ్రాయలేదు. మిగతా మిత్రులంతా పంపారా? బైరాగి గారిని కలిసి మీకు ఆయన poems వచ్చేటట్టు చూస్తాను. శ్రీ శ్రీ గారికీ, ఆరుద్ర గారికీ వ్రాయండి.

శ్రీ రాజశేఖర్ విదేశ పర్యటన పూర్తి చేసుకొని తిరిగి వచ్చారా?

మీ లేఖకు ఎదురుచూస్తూ – సోదరి ఛాయాదేవిని అడిగామని చెప్పండి.

భవదీయుడు,

ఏల్చూరి సుబ్రహ్మణ్యం.

Abburi Ramakrishna Rau

272 A, Malakpet,
Hyderabad,
1.1.1966.

వరదా,

.............ఫిబ్రవరి అయిదో తేదీన భారతీయ నాట్యసంఘం తరపున వొక seminar నడుపుతున్నారు. దానికి నన్ను అధ్యక్షుడిగా వుండమన్నారు. ఆనాడే కన్యాశుల్కం ప్రదర్శిస్తున్నాం. కేవలం స్వతంత్రమైన తెలుగునాటకమే ప్రయోగించటం భావ్యమని అలా నిశ్చయించటం జరిగింది. మృచ్ఛకటికం మళ్లీయెప్పుడు ప్రదర్శించేదీ యింకా నిశ్చయం కాలేదు. వసంతసేన పాత్రకు బెజవాడలో వున్న వొక అమ్మాయిని యెన్నుకున్నాము. ఆ పిల్లను సరిదిద్దటానికి కొంతకాలం పడుతుంది. నేనోనాటకం రాయటానికి పూనుకున్నాను. కేవలం ఊహ మాత్రమే కాదు. యేప్రిలు నెలాఖరుకు పూర్తి అవుతుందనుకుంటున్నాను. నువ్వు కూడా కొంత ప్రయత్నం చేసి అసంపూర్ణంగా రాసి వుంచిన నాటకాన్ని పూర్తి చేస్తే యెంతో బాగుంటుంది. నా మాటతోసి పుచ్చక గట్టి ప్రయత్నం చెయ్యి.

నువ్వా మధ్య పంపిన కంద పద్యాలు చాలా బాగున్నై. నేనూ కొన్ని రాశాను. యేదో విధంగా వందా పూర్తి అయితేనే గాని ప్రకటించటం బాగుండదు.

'కవిత' కింత వరకూ యేమీ రాయలేక పోయాను. మనసులో మెదలటమేకాని నిరాఘాటంగా పైకి రావటం లేదు. తొందరలోనే పంపుతాను.

మళ్లీ రెండు మూడు రోజుల్లో రాస్తాను.

[అబ్బూరి రామకృష్ణారావు]

•

బెజవాడ,
ఏప్రిల్ 22.
[1966]

ప్రియమైన మిత్రునికి,

ఎప్పటి కప్పుడు ఉత్తరం రాద్దామనుకుంటూనే చాలా ఆలస్యంచేశాను. కోప్పడకండేం.

బద్ధకం, బద్ధకం, బద్ధకం.

అందులో, గత నెల రోజులుగా వరసగా నైట్ డ్యూటీలు కావడం వల్ల - అసలే తీరికలేదు. పగలంతా నిద్రలోనే గడుపుతున్నాను. అసలు విజయవాడలో నా జీవితమే ఒక నిద్రలా ఉంది. వెన్ను తట్టి లేపే వాళ్లే ఎవరూ లేరు. మిమ్మల్నీ, రాజశేఖర్నీ వదిలి పెట్టిన తర్వాత ఉత్సాహం అనేది పూర్తిగా అదృశ్యమై పోయింది.

ఇతరుల నీడలో జీవించే మనిషిని నేను. వెంట ఎవరో ఒకరు తోడుగా ఆసరా ఇస్తే తప్ప బ్రతకలేను... మళ్లీ మిమ్మల్ని ఎప్పుడు కలుసుకుంటానో!

ఛాయాదేవిగారు ఇక్కడ నుంచి క్షేమంగా విశాఖపట్టణం వెళ్లారు. బహుశా ఆవిడ మీకు ఈపాటికి ఉత్తరం రాసే ఉంటారు.

రాజశేఖర్నీ, సుబ్రహ్మణ్యాన్నీ అడిగానని చెప్పండి.

కొన్ని కొత్త పద్యాలేవో రాశాను. తర్వాత వాటిని పంపుతాను. 'కవిత' పత్రిక తీసుకురాకూడదూ! రాజశేఖర్ కూడా అక్కడే ఉన్నాడు కనుక ఇద్దరూ కలిసి ఆలోచించం నవల పంపడం మర్చిపోకండేం.

మరొక మనవిః కొత్త పోయెట్రీ పుస్తకాలు ఏవైనా ఉంటే-అథమం ఒకటైనా పంపండి

[వరద రాజేశ్వరరావుగారు ప్రారంభించిన నవల మొదటి భాగం ఇతర 'అముద్రిత రచన పాటు చేర్చాము-సం.]

అజంతా.

•

కు
M(
Malakpet Col
Hyderabad 500

డియర్ వరద, 12.11

నీవు రాసిన లేఖ. నా ఆరోగ్యం బాగానే ఉంది. సుబ్రహ్మణ్యం ఆరోగ్యం కూడా బాగానే బద్ధకంవల్లనే జవాబు రాసి వుండడు. ఇల్లు అదే. '8', యోగాంబాళ్' ను 20, 'యోగాంబా కార్పొరేషన్ వారు నెంబరు మార్చారు. అంతే. నీ ఆరోగ్యం జాగ్రత్తగా చూసుకో. దురభ్యాసాలు వుంటే యిప్పుడైనా కనీసం తగ్గించుకోవడం అవసరం.

నేను రేపు రాత్రికి అమలాపురం వెళ్తున్నాను. 20వ తేదీ వరకు తూ.గో. విశాఖజి సాహిత్యప్రసంగాలు వరుసగా ఒప్పుకున్నాను. తిరిగి రాగానే నగ్నమునితో మాట్లాడి నీ 'క ఏవైనా పంపుతాను.

[కుందుర్తి]



## తెలుగు నాటక ప్రదర్శనలు

*[ఆంధ్రప్రదేశ్‌నుంచి 1966లో నాట్య విద్యాలయం తరపున శ్రీ అబ్బూరి రామకృష్ణారావుగారి దర్శకత్వంలో శ్రీ ఎ.ఆర్. కృష్ణ, శ్రీ మంత్రి శ్రీనివాసరావు, శ్రీ అబ్బూరి గోపాలకృష్ణ, శ్రీమతి వాసిరెడ్డి సీతాదేవి ప్రభృతులు న్యూ ఢిల్లీలో 'కన్యాశుల్కం', 'మృచ్ఛకటిక' నాటకాల ప్రదర్శనలు జరిపారు. అందుకు కావలసిన ఏర్పాట్లకు-ముఖ్యంగా రాష్ట్రపతి భవన్‌లో డా. రాధాకృష్ణన్‌గారి సమక్షంలో ప్రత్యేక ప్రదర్శనకు తోడ్పడినది వరదరాజేశ్వరరావుగారే.]*



[తండ్రితో 'వరద'-15 పూసా రోడ్' ఇంట్లో]

Natya Vidyalaya
Andhra Pradesh Natya Sangham

Hony. Director — Ravindra Bharathi Building
A.R. Krishna — Hyderabad-4.

వరదా,

ఎంత బాగా జర్గింది ఢిల్లీ కార్యక్రమం! నిజంగా నిన్నూ, ఛాయాదేవిగార్ని, టి.ఆర్. రావు దంపతుల్ని చాలా కష్టపెట్టాం. ఇన్నాళ్ళకు అందరికోరికా తీరింది. జయప్రదంగా 'ఏదురోజాల పెళ్ళి' జరిపించావు. అందరూ మెచ్చారు. సంతోషించారు. అదే మనకు కావలసింది.

నీతో కావాల్సిన పని ఇంకోటుంది. మే, 20వ తేదీ నాన్నగారి జన్మదినోత్సవం చేయాలనుకుంటున్నాం. నీతో మాట్లాడాలనుకున్నా గాని తీరికేదీ? నీవు ఈ నెలాఖరులో

వచ్చినప్పుడు అన్ని నిర్ణయిద్దాం. ఘనంగా, అందరూ అదిరి పోయేటట్లు చేయాలి. నీ సహకా అవసరం. మన T.R. Rao ను కూడా మళ్లీ బాధపెట్టాలి. అతను కూడా హైద్రాబాదు వస్తున్నా చెప్పాడు. ఎదురు చూస్తున్నాను.

ఈ నెల 27వ తేదీ 'World Theatre Day' ఉంది. 'విదూ-కుడి ఆత్మహత్య' ప్రదర్శనం పెట్టాం. ఆ రోజుకి మీ ఇద్దరూ ఇక్కడికి రాకూడదూ! ఎంత బాగుంటుంది.

అందరం కులాసాగా చేరాం. ఇందులో పెట్టిన ఉత్తరం T.R.Rao కి ఇయ్యి........

గురువుగారికి ప్రణామాలు. ఇంతే.

ఎ.ఆర్. కృష్ణ

[... March 1966]

•





## శ్రీ శ్రీ షష్టిపూర్తి

*[శ్రీ శ్రీ షష్టిపూర్తి సన్మాన సంఘంలో వరదరాజేశ్వరరావుగారు కూడా ఉన్నారు.]*

29.10.1969

From
రాచకొండ విశ్వనాథ శాస్త్రి

డియర్ రాజేశ్వరరావ్,

నువ్వు కులాసాగా ఉన్నావని అను
కుంటాను. ఇక్కడ, వచ్చే జనవరిలో
శ్రీశ్రీకి షష్టిపూర్తి అయ్యే సందర్భంలో
సన్మానం ఏర్పాటు చేస్తున్నాము తెలుసు
కదా, అప్పుడు నువ్వు ఇక్కడికి తప్పక

తెలుస్తాను. బాగా కథలు రాస్తున్నా
రనీ కథలు బాగా రాస్తున్నారనీ
వింటున్నాను. [illegible]..

Yours sincerely
రా. వి. శాస్త్రి
29/10

*

Vijayawada
10.11.'69.

Dear Sri Varada Rajeswara Rao garu,

Namaste! You must be aware that the 'shastipurti' of Sri Sri is going to be celebrated at Vizag on 2 January '70. We are bringing out the complete writings of Sri Sri in Telugu and in English. Mr.Ajanta tells me that in the Indian Poetry anthology which you brought out, there are some English renderings of Sri Sri's poetry, and also of others' poems by Sri Sri. I very much want to include them in his English writings. But I do not have a copy of it with me. So, if you could send either the book or copies of the poems, I will be highly thankful. The thing is, the volume is scheduled to go to print in about a week's time from now, and I request you to send us as early as possible, i.e., within a week.

Thanking you,

Yours faithfully,

ప్రియమైన మిత్రునికి,

రమణారెడ్డి మీకు తెలుసుగా! శ్రీ శ్రీ షష్టిపూర్తి సందర్భంగా ఆయన సమగ్ర కవితా సంకలనాన్ని వెలువరించడానికి అతను ప్రయత్నిస్తున్నాడు. శ్రీ శ్రీ కి సంబంధించిన సామాగ్రి మీ దగ్గర ఏది ఉన్నా సరే వెంటనే పంపించండి.

అజంతా.

•

[ఒకే ఉత్తరంలో ఇద్దరూ రాశారు.]

కావలి
2.1.70

శ్రీ వరద రాజేశ్వరరావు గారికి-

వందనాలు. మీ ఉత్తరం అందింది. శ్రీ శ్రీ షష్టిపూర్తి సభ ఫిబ్రవరి 1వ తేదీకి వాయిదా వేశారు.

మీరు ఎడిట్ చేసిన Modern Telugu Poetry ని సాధించాము. అందులోని శ్రీ శ్రీ రచనలను తీసుకున్నాము. కాబట్టి దాని విషయమై మీరు బాధపడక్కర్లేదు.

ఫిబ్రవరిలో విశాఖకు వస్తారు కదా, అక్కడ కలుద్దాము.

భవదీయుడు,
కె.వి. రమణారెడ్డి.

## తెలుగు నాటకాలపోటీ

*[1971లో న్యూఢిల్లీలో జరిగిన తెలుగు ఏకాంకిక ప్రదర్శనల పోటీలో పాల్గొనడానికి ఆంధ్రాయూనివర్సిటీ నుంచి డిపార్ట్‌మెంట్ ఆఫ్ థియేటర్ ఆర్ట్స్ తరఫున దర్శకుడు కె. వెంకటేశ్వరరావు గారినీ, ఇతర నటులనూ పంపించారు. వారికి స్థానికంగా వరదరాజేశ్వరరావుగారు ఎంతో తోడ్పడ్డారు.]*

Andhra University
University College of Arts & Commerce

Waltair,
Date 5-10-71.

From:
M.Sreenivasa Rao
M.A., A.D.B.(London), D.D.A(Bombay)
Head of the Dept. of Theatre Arts
Andhra University Arts Colleges,
WALTAIR.

Dear Sir,

On behalf of the Department of Theatre Arts, I convey my grateful thanks to you for the welcome you have accorded to the Cultural team lead by Sri K.Venkateswara Rao, to participate in the All India one-act-play competition held at Delhi under the auspices of I.A.R.I., Delhi.

Thanking you,

Yours faithfully

Mantri Sreenivasa Rao

•

## 'ఊహాగానం ....'

*[1973లో తండ్రి అబ్బూరి రామకృష్ణారావుగారి కవితలను సమీకరించి, "ఊహాగానం, ఇతరకృతులు" అనే సంపుటాన్ని అందంగా ప్రచురించారు. దాన్ని హైదరాబాదులో ముద్రించడంలో 'అబ్బూరి' సన్నిహితశిష్యుడూ, 'వరద' మిత్రుడూ అయిన డా. బూదరాజు రాధాకృష్ణ గారు ముఖ్య బాధ్యతను నిర్వహించారు.]*

బూదరాజు రాధాకృష్ణ

తేది. 1.8.1972

శ్రీ వరద రాజేశ్వరరావుగారికి,
నమస్కారాలు. ఉభయకుశలోపరి.

నా ప్రత్యుత్తరం ఆలస్యమైనందుకు ఏమీ అనుకోవద్దు. కారణాలు అనేకం. ఈ రోజున Lay out నిర్ణయించటం కోసం మీకు 4పేజీలు పంపుతున్నాను. ఇప్పటికి 'ఊహాగానం' మినహా మిగిలిన రచనలన్నిటికీ వ్రాతప్రతి విడిగా రాయటం పూర్తయింది. అచ్చుపుస్తకాలను ప్రింటర్ చించట మెందుకని ఈ పని చేశాను. 'కవితో' రచనాకాలం ముద్రణకాలం తెలియలేదు. రాయండి. కాలక్రమంలో రచనలను అరేంజ్ చెయ్యడానికని విడికాగితాల్లో రాశాను. "ఎఱ్ఱగన్నేరు" లోని పద్యం వెయ్యాలని గురువుగారు పట్టుపట్టారు. సేకరించాను. ఇప్పుడాయన తన రచనల విషయంలో శ్రద్ధతీసుకుంటున్నారు. ఇది మంచిదే కదా. కేంద్రసాహిత్య అకాడమి ప్రచురణలో నుంచి పద్యాలను పృథక్కరించి ప్రచురించాలని మీనాన్నగారూ, గోపీగారూ అభిప్రాయపడ్డారు. వీటిని ప్రచురించుకోటానికి కాపీరైట్ ఉందా లేదా అనే ప్రశ్న వచ్చింది. Machwe గారితో మాట్లాడి అంగీకారం పొందమని మీకు రాయమని నాకు చెప్పారు– మీనాన్నగారు. మీ నుంచి వార్త రాగానే వాటికి వ్రాత ప్రతి తయారుచేస్తాను. 'జలాంజలి' వ్రాతప్రతి సరిగా లేనందువల్ల, పద్య చరణాలు పూర్వ ఫక్కీలో వున్నందువల్ల, ప్రింటరు తప్పులుగా ముద్రించటం జరుగుతుందని వాటిని గూడా మళ్ళీ ఎత్తిరాస్తున్నాను. ఈ రాతపని అంతా రెండు మూడురోజుల్లో పూర్తి అవుతుంది.

గోపాలకృష్ణ మూర్తిగారి దగ్గర నుంచి భారతిలోని వ్యాసాలు సంపాదించే ప్రయత్నంలో వున్నాను. ఆయన జిల్లెళ్లమూడి అమ్మగారి భక్తుడున్నూ రిటైరయినవాడున్నూ కాబట్టి మనిషి దొరకటమే కష్టంగా వుంది. మనూనాగారికి నేను వుత్తరం రాశాను. ఆయన దగ్గర్నించి సమాచారం త్వరలో అందవచ్చు.

ఏది ఏమైనా ఆగస్టు నెలాఖరులోగా ముద్రణ కార్యక్రమం నెరవేరుస్తాను. ...200 పేజీల అచ్చుపని ఎంతో కాలం పట్టదు మరి.

కింది విషయాలకు వివరంగా సమాధానం రాయండి.

1. పేజీల సంఖ్య ఎక్కడ వెయ్యాలి? పైనా కిందా? అంకెల్లోనా అక్షరాల్లోనా?
2. 'నదీ సుందరి' లోంచి పద్యాలో గేయమో పునర్ముద్రిస్తున్నాం గదా. ఫలాని దానిలోంచి అని రాయాలా వద్దా?

3. 'మల్లికాంబ' పుస్తకంలో రెండు రకాల ఉపశీర్షికలున్నాయి గదా. కమల, మల్లిక-మొదలైనవి. వాటిని ముద్రించాలా వద్దా? పేజీ మధ్యలోనా పక్కనా? అందులో చేరిన ఇతర ఖండికల సంగతేమిటి? వాటిని ప్రత్యేకించి ఇవ్వాలా వద్దా? వేరు వేరు పేజీల్లోనా, ఒక దానివెంట ఒకటి గానా?
4. general alignment ఎలా ఉండాలి.

ఇంకేమైనా మీరు చెప్పవలసినవి వుంటే రాయండి.

ఈ ప్రచురణ విషయంలో మీరు నిబ్బరంగా వుండండి. ఇది నాస్వంత ప్రచురణకన్నా నా దృష్టిలో ముఖ్యమయింది. సంతోషంగా చూస్తాను.

అన్నట్లు A.R. Krishna గారు కనిపించి వుంటారు.

మిత్రుల్ని అడిగినానని చెప్పండి.

మీ
రాధాకృష్ణ.

•

ఎన్.వి. గోపాలశాస్త్రి
B53 F4 విజయనగర్ కాలనీ
(opp. సెంట్ ఏన్స్ కాన్వెంట్)
హైదరాబాదు 28.
ఆప్తమిత్రులు,

వరద రాజేశ్వరరావుగారికి నమస్సులు.

మీరు దయతో రాసిన రెండు లేఖలూ-ఒకటి, మా నాన్నగారు గతించకముందు, మరొకటి సంతాపలేఖ-అందినవి. వెంటనే సమాధానం రాయనందుకు మన్నింతురు గాక.

మా నాన్నగారు పోవడం ఒక పెద్దషాకు మాకు. He was quite healthy till the last minute. ఆయన ఇంత త్వరలో పోతారని ఎప్పుడూ అనుకోలేదు. నేనూ fatalist ని అవుతున్నాను. మనస్సు ఏమంత బావుండడం లేదు. ఏదో దిగులు. అబ్బూరి రామకృష్ణారావుగారు కూడా ఫోను చేశారు.

విశేషాలేమిటి? బూదరాజు రాధాకృష్ణ మీకు రెండు ఉత్తరాలు రాశాట్ట. వెంటనే రిప్లై ఇమ్మని కోరుతున్నాడు. రామారావు ఈ మధ్య వొచ్చాడా?.... పుస్తకాలు కూడా వాపస్ చేయలేదు.

గోపాలశాస్త్రి
26.8.72.

దుద్దుకూరి కృష్ణారావు ఎలా వున్నాడు? (మీసాలతో)
ఢిల్లీ వస్తే మీకు ముందు రాస్తాను.

-గో

•

SCHOOL OF ARTS AND CRAFTS

Principal and Correspondent
A. Paidiraju

Panniru Street,
Vizianagaram,
Date. 2.11.73.

శ్రీయుతులు A.V. Rajeswara Rao గార్కి పైడిరాజు నమస్కారములు.

నేను A.P. Lalit Kala Akademy తరఫునుంచి సెంట్రలు లలితకళా ఎకాడమీ మీటింగుకి హాజరు అవుతున్నాను. న్యూఢిల్లీకి 9తా॥బయలుదేరి 11తా॥ ఉదయానికి చేరుకుంటాను. జన-కెనాట్ ప్లేస్. మద్రాసు హొటలులో చెయ్యాలని సంకల్పం. ఆ తరువాత మీ దర్శనం చేస్తాను. అక్కడ రెండు రోజాలు ఉంటాను. 12, 13 నో తిరిగి విజయనగరం బయలుదేరుతాను. యిదీ నాప్రోగ్రాము.

మీ తండ్రిగారు శ్రీ అబ్బూరి రామకృష్ణారావు గారి పుస్తకం ఇప్పుడే అందుకున్నాను. చాలా బాగుంది. (గెటప్) అందులో నేను చిత్రించిన మీ నాన్నగారి రేఖాచిత్రం చాల ఐడియల్ గా ఉంది. యిక్కడ చూసిన మిత్రులందరూ చాల సంతోషిస్తున్నారు. ఆ రేఖా చిత్రం 10×12 సైజులో ఫొటో ప్రింటు కావాలి. లలిత కళా ఎకాడమీ మొదటిఏన్యుయల్ నా చిత్రాలతో ప్రారంభమవుతుంది. అందులో వేయించాలని సంకల్పంతో వ్రాస్తున్నాను. శ్రమయిస్తున్నందుకు మన్నించి ఒక కాపీ పంపేలా చూడండి.

సెలవు.

మీ

ఆ. పైడిరాజు.





[హైదరాబాదులో రెండవ తమ్ముడు శ్రీనాథ్ వివాహ సందర్భంలో
శ్రీ పి.వి. నరసింహారావుతో 'వరద']



[అదే సందర్భంలో- కుందుర్తి అబ్బూరి, జి. రామారావు, నూతన దంపతులు
శ్రీనాథ్, వసుంధర, గోపాలచక్రవర్తి, గోపాలకృష్ణలతో 'వరద']

# రష్యాప్రయాణం

*[ప్రముఖ పత్రికా రచయితగా, రచయితగా, ప్రచురణకర్తగా అబ్బూరి వరదరాజేశ్వరరావుగారు రష్యా ప్రభుత్వ ఆహ్వానం పై సెప్టెంబరు 1974లో రష్యా సందర్శించారు.]*

INFORMATION DEPARTMENT
OF THE USSR EMBASSY IN INDIA

25, BARAKHAMBA ROAD, POST BOX NO. 241
NEW DELHI-1




भारत में सोवियत समाजवादी जनतंत्र
संघ के दूतावास का सूचना विभाग

२५. बारहखम्भा रोड. पोस्ट बाक्स नं० २४१
नई दिल्ली-१

June 13, 1974.

Mr. A.V. Rajeshwara Rau,
Editor & Managing Director,
Allied Publishers,
15, Sadhu Vaswani Marg,
New Delhi-5.

Dear Mr. Rajeshwara Rau,

It gives me great pleasure to inform you that you have been invited by the Novosti Press Agency, Moscow, to make a two week trip to the Soviet Union. The agency will bear the cost of your stay in the Soviet Union and pay for your air passage. The trip can be made any time during this year, starting from the month of July.

We shall be happy if you kindly accept the invitation and let us know in some detail what you will like to see in the Soviet Union and which particular aspects of Soviet life will be of special interest to you. This will help your hosts in drawing up your tour programme.

We shall be grateful if you also please indicate when you will find it convenient to make the trip.

We are approaching the Ministry of External Affairs, Government of India, to pass on to you the invitation of the Novosti Press Agency.

With regards,

Sincerely yours,
(A.G. Gomov)
Head of the Information Department,
of the USSR Embassy in India)

"LUMBINI", ROAD No. 7,
BANJARA HILLS,
Hyderabad.

Andhra Jyoti
Editor:
V.R. Narla

Aug.13,1974

My dear Shri Varada,

Thank you very much indeed for your nice letter. It is a pity that Shri Pattabhi Ram has suddenly taken ill. I hope he is well on his way to recovery. Pleas give him my very best wishes......

If is not too much trouble, I request you to cali on Dr Jugal Kishore once again, report to him my present condition and seek his further advice.

So, you are leaving for Moscow on September 7. I take it that from there you will be proceeding to London. Let me wish you a fine time during the trip.

My wife joins me in sending you both our very affectionate regards.

Yours sincerely,

V.R. Narla

(V.R. NARLA.)







మాస్కో : 9.9.74

................... మొన్న సాయంకాలం హోటలు చేరేటప్పటికి సాయంకాలం అయింది. అక్కడికీ యిక్కడికీ మూడు గంటల తేడా. మమ్మల్ని air port దగ్గర్నే ఆహ్వానించి అన్ని సదుపాయాలూ చేశారు. నిన్న ఆదివారం. ఊరు చూడ్డానికి తీసుకుపోయారు. మాస్కో మహానగరం పరిశుభ్రంగా ఉంటుంది. భోజనం దుర్లభం. అంతా పచ్చిమాంసాహారం. నిన్నరాత్రి వి.పి. రామచంద్రన్ స్నేహితులు ఓణం పండుగ జరిపారు. అక్కడికి భోజనానికి వెళ్లాను. ఇవాళ నుంచి మనకు కావలసిన వాళ్లని కలుసుకోవాలి. బుధవారం నాడు రీగా పోతాం. అక్కణ్ణించి శనివారం నాడు లెనిన్‌గ్రాడు పోవాలి. వచ్చే సోమవారం Volgagrad వెళ్లాలి. గురువారం నాడు (19న) మళ్ళీ యిక్కడ కొచ్చి 20 తారీకు రాత్రి ఢిల్లీ బయలుదేరతాము. 21 ప్రొద్దున అక్కడ కొస్తాను.

రేపు మాస్కో రేడియోలో Indo-Soviet Relations మీద మాట్లాడతాను. 750 రూబుల్స్ యిస్తారు. అది పెట్టి ఏమన్నా కొనుక్కొస్తాను. అక్కడ అందరూ కులాసాగా ఉన్నారనుకుంటాను.

అప్ప నిన్న వచ్చాడు. చాలా ఆప్యాయంగా ఉంటాడు. స్వంత డబ్బుతో నాకు Beer పట్టుకొచ్చాడు. ఇవాళ సాయంకాలం మళ్లీవస్తాడు. రావుకీ మాలతికీ చెప్పు.....

వరద

[ఇంటికి రాసిన ఉత్తరం]

•



Hotel Astoria
Leningrad
16.9.74

నాన్నా,

ఏడోతారీకు సాయంకాలం మాస్కో వొచ్చాను. అక్కడ నాలుగు రోజులుండి, లాట్వియాలోని రీగా నగరానికి పోయి మొన్న యిక్కడికి వొచ్చాను. రష్యా విప్లవానికి యీనగరం ప్రధాన స్థావరం. అంచాత లెనిన్‌కు సంబంధించిన స్మారక చిహ్నాలు అనేకం. నగరం అంతా ఆనాటి చక్రవర్తుల ముద్రాంకితం. ఇవాళ వోల్గాగ్రాడ్ (అంటే పాత స్టాలిన్‌గ్రాడ్) కు పోతున్నాను. అక్కణ్ణించి మాస్కోపోయి 21వ తారీఖు ఉదయం ఢిల్లీ చేరతాను. ప్రస్తుతం యిక్కడ చలి ప్రారంభమయింది. ఢిల్లీ శీతాకాలంలా ఉంది.

ఇక్కడికి వచ్చే ముందు మాస్కో రేడియోలో తెలుగు ప్రసంగం ఒకటి చేశాను. నాటకాలు చూద్దామనుకుంటే ఇది నాటకాల కాలం కాదిక్కడ. వచ్చేముందు మాస్కోలో బోల్షాయ్ థియేటరు చూసి వస్తాను.

ఇక్కడ ప్రజలు తృప్తికరంగా జీవిస్తున్నట్లు కనిపిస్తారు. ఆహార పానీయాల్లోనూ, ఆహార్యం లోనూ అంతా పాశ్చాత్య ప్రభావం. ఒక విధంగా వాళ్లది వేరే ప్రపంచం.

అక్కడ అందరూ క్షేమంగా ఉన్నారను కుంటాను. ఛాయ [వరద రాజేశ్వరరావుగారి ఆఖరి చెల్లెలు] ఢిల్లీ వస్తానంది. నేను వెళ్లేటప్పటికి అక్కడ చూస్తానను కుంటాను. బుజ్జి [రెండవ చెల్లెలు సుజాత కొడుకు–రవీంద్ర చింతపల్లి] ఎలాఉన్నాడు. వాడికి యిక్కణ్ణించి ఉత్తరం రాద్దామనుకున్నాను. కాని వాడి చిరునామా నా దగ్గరలేదు.

వరద

•



[రష్యాలో మిత్రుడు, పాత్రికేయుడు వి.సి. రామచంద్రన్‌తో 'వరద']

సోవియట్ రష్యాలో ... నాటకరంగానికి చాలా ప్రాముఖ్యం ఉంది. బోల్షాయ్ నాటకమందిరానికి అతి చేరువగా నా వసతి వున్నా యెన్నాళ్ళకో కాని నాకు టిక్కెట్టు లభించలేదు. అక్కడసంగీతనృత్యరూపకాన్ని చూశాను. రీగా పోయినప్పుడు అక్కడ నాటకశాలలో షేక్స్పియర్ నాటకాలను ప్రదర్శిస్తున్నారు. మాక్బెత్ నాటకాన్ని చూశాను. భాషరాకపోయినా ఆ నాటక ప్రయోగం అద్భుతంగా ఉండటంవల్ల వున్న రెండున్నర గంటలూ సావధానంగా ఉండిపోయాను.



## 'ఎల్లైడ్‌పబ్లిషర్స్' ఉద్యోగం – విరమణ

*['ఎల్లైడ్‌పబ్లిషర్స్' ఉద్యోగ విరమణ తరవాత మళ్ళీ సాహితీ మిత్రులతో సన్నిహిత సంపర్కాలు ఏర్పరచుకున్నారు.]*

[R. Viswanatha Sastry]

Dear Rajeswara Rau,

Trust you are doing well, and that you got my previous letter. I have been very busy with court work since I came here. The above is a copy of the letter I addressed to our D.S. I sent it thro' Pattabhi, who must have told you about it. I am waiting for a letter from Pattabhi.

Regarding Sri Sri's books, we wrote to him to get them to you when he next goes to Delhi on the 16th of this month. But, it appears, he does not have them with him. So, we will obtain them from Bezwada and send them to you by registered post.

On reading "నా కాలేజీల్లో నేను" M.A. Padmanabha Rao wrote a gushing. sentimental letter. Also Venkateswaralu.

Venkatappaiah sends you his greetings. Please convey my regards to Mrs. AVR. My kids are all right.

Yours sincerely,
Sastry.
[12/11/[75?]

•

## వర్తమాన తెలుగు సాహిత్యం

*[వర్తమాన తెలుగు సాహిత్యం గురించి వ్యాసం రాయవలసిందని 'ఇండియన్ ఎక్స్‌ప్రెస్' తరఫున ఆహ్వానం అందింది. 1976లో వరదరాజేశ్వరరావుగారి వ్యాసం ఆ పత్రికలో ప్రచురించబడింది.]*

Telephones :
273931 (5 lines)

Telegraphic Address.
"PRESSNEWS"

INDIAN EXPRESS NEWSPAPERS (Bombay) LTD.

*(Registered Office: Express Towers Nariman Point Bombay)*
Post Box No. 671
Express Building, Bahadurshah Zafar Marg, New Delhi-1.

Dear Mr Rao,

In pursuance of our telephone talk, I am just writing to confirm that we are expecting your article (up to 1,000 words) briefly reviewing the current

trends of writing in Telugu literature, for our special supplement on World Books Fair starting in Delhi on January 16.

Wishing you happy New Year,

Yours sincerely,

December 31,1975 July

Ravindra Nath
Books Editor

•

## VOCABULARY YET TO CATCH UP

**A.V. Rajeswara Rau**

If we take the population of Andhra as a whole, writers in Telugu- be they poets, playwrights or novelists — and their audience form a relatively small group. This small body started laying the foundation of modern Telugu literature nearly nine decades ago, during the pioneering days of the great Viresalingam. Since then Telugu literature has steadily grown in size, especially during the last fifty years, and has not only gained in insight and depth but also has acquired a new sense of perspective bringing about with it a new confidence.

Looking at the literary scene in Andhra today, however, it can hardly be denied that the great hopes raised during the post - Independence period about a creative upsurge in Telugu literature, have not borne fruit. Of course, there has been considerable activity all around. But there has also been in evidence a certain uncertainty and lack of proper direction.

The modern movement in Telugu poetry which started at the turn of this century had two voices, one of which while adopting the traditional metrical norms assumed the name of "Romantic revival" and spoke with a mystical accent partly borrowed from other literatures. It had all the refinement of language, dexterity of weaving fine words, sweetness of phrasing, the very qualities which made competent critics of earlier periods of poetry exclaim that Telugu poets were not creators but artists, mere masters of the craft of language. The poets belonging to this school are the authors of a number of exquisite lyrics in the language. They had many adherents even today and they have gained a wide reading public by their skilful use of linguistic egotisms and national particularism and sadly enough, this genre of writing has now become the staple of song writers and listeners of film music.

The other voice, a more authentic one, was comparatively shortlived. The poets who represented this trend realised that the transfer of language

from one generation to another was not like transfer of property. They know that phonetic and semantic changes were not accidental but were necessary for the renovation and rejuvenation of a language. They experimented with new metrical forms of great simplicity and attempted to liberate the language of poetry from the shackles of hidebound tradition. They had a clearer vision and proclaimed that the mother country was not just a piece of earth but a community of minds.

Before these tendencies had time to consolidate their gains, there appeared on the scene a number of enthusiasts of *vers libre*. Among the votaries of this form there were some who, having tried the traditional forms with distinction, adopted this new mode in their search for a new freedom. They have produced poems of great beauty and created new rhythmic patterns which have come to stay. But there were far too many novices who lacked any metrical sense whatever.

Then came the progressive school of writers who gladly accepted this new mode of writing as it enabled them to arrange their new fangled ideas in irregular lines and call poetry. One of the declared principles of *vers libre* was to "compose in the sequence of musical phrase, not in the sequence of metronome." But pioneers in this line like Sri Sri, Ajanta, Kundurthi, had the inflexible discipline to learn the art of writing.

The practitioners of the traditional epic and kavya style still continue to write. Their mastery of language and mellifluous composition are held in high esteem by a fairly large reading public. Like handicrafts and heavy industry in New India, the old and the new jostle against each other through a period of flux and ferment. While old sanctions are declining, new ones have not firmly taken their place.

Telugu fiction has yet to catch up with poetry as creative literature of acepted canons. Most of it is inferior literature which tends to reduce novel to a news supplement. Today's writers of fiction, whose number if growing enormously, are least concerned with the major problems of 'picture and drama', symmetry, narrative pattern, pace and language, the complexities of the novelist's art. Their study and understanding of life around is merely superficial and the characters they portray, the places they present and the climate they create are feigned and far from convincing. They usually deal with the varied life patterns of the middle classes and their inherent contradictions, emotional conflicts and didactic disillusionment in relation to situations that do not exist.

However, there are discernible traces of talent and promise among them. Of all the contemporary writers, Rachakonda Viswanatha Sastri alone deserves the credit, restoring fiction to its legitimate place in literature. Puranam Subrahmanya Sarma, another very gifted fiction writer, is known

for his unique and flawless style and command over the complex structure of novel. Muppala Ranganayakamma, Balivada Kantarao, Yaddanapudi Sulochanarani, Dwivedula Visalakshi and Vinukonda Nagaraju have already made a mark as popular writers.

The Telugu short story remains popular with the reading public and the supply of this art form continues unabated. Although no striking technical innovations have been experimented in this field, quite a number of interesting stories have been published. A volume of short stories by different writers in Telugu has been brought out by the National Book Trust — the best collection of its kind so far.

As in the novel, it is the middle class that dominates the theme in short story, which shows signs of becoming stale. Palagummi Padmaraju, Rachakonda Viswanatha Sastri, and Puranam Subrahmanya Sarma are known for their vigorous narrative, fine structure and style. P. Bhanumathi, Bina Devi, Chivukula Purushotham, D. Kameswari and Behara Venkata Subbarao are some of the writers whose work is gaining wide recognition.

The field of drama too shows signs of activity. The modern full-length play is yet to make good. The lack of well-equipped theatre where it is possible to have continuity of practice, and the prevailing confusion in the minds of writers and artistes regarding the relative values of the stage and cinema are partly responsible for arresting the growth of genuine popular drama. Like the short story, it is only the one-act play and the short radio-play that seem to hold the ground. However, "Trijaki Yama Darshanam", a full-length play liberally interspersed with verse by A. Gopalakrishna recently proved a great success in the stage. In drama, essay, speculative writing and critical work, there is considerabble activity in Telugu though not all of high literary standard.

There are practically no literary journals, and hardly any group activity as such inTelugu today. Most of the serious writers have had to depend on mass-circulating periodicals for popularity and recognition. These journals have attained phenomenal circulation now because the educated housewife needs something to brouse through in her newfound leisure thanks to the cooking gas, culinary devices and instant foods. As a corollory to this development, a large number of women writers have come up and the present-day periodicals seem to prefer short stories and serialised novels written by them.

Although Telugu is comparatively rich in vocabulary, it is still far from being stable medium of modern literary sensibility. It is the linguistic development that largely impels and determines the power of thinking. To express an experience, in the context of universal experience it is rather difficult to find proper words in the language. For instance, with the changing

times and shedding of some old taboos and shibboleths, the bedroom is thrown open to public gaze, and the private love between man and woman no more remains private in literature. But the available vocabulary for sex is crude. Telugu has yet to develop words for sex life, which have no jarring overtones. It is generally accepted that obscenity lies not in the idea but the word which denotes it. The linguistic limitations of Telugu make it too difficult for writers to express the new meaning and experience of modern life and culture in an idiom acceptable both to the elite and the ordinary man. When one comes across such situations in contemporary writing, we are ruefully reminded of Crebillon's remark about "marrying words that haven't even thought of becoming acquainted."

The custom of honouring men of letters has been overdone. Even the dedication of a slender sheaf of poems or stories to a local worthy becomes an occasion for extravagant praise. This tends to confuse the simple minded lovers of literature and obscure the function of legitimate literary criticism.







[అన్నగారి పెద్దకొడుకు డా. అనిల్‌కుమార్, రెండవ చెల్లెలు సుజాత (మధ్యలో), పిల్లలు పద్మ, రవి, ఛాయాదేవిలతో 'వరద' – '15 పూసారోడ్' ఇంట్లో]



[రెండవ తమ్ముడి మొదటి కూతురు సత్యప్రియతో 'వరద']

## న్యూఢిల్లీ – హైదరాబాదు ప్రయాణాలు

*[1976-77లో భార్య ఉద్యోగరీత్యా ఫ్రాన్స్‌లో ఉన్నప్పుడు వరద రాజేశ్వరరావు గారు న్యూఢిల్లీ నుంచి హైదరాబాదు తరచువెళ్ళివస్తూండేవారు. ఆ రోజుల్లో దేశరాజకీయాలు సంక్లిష్టంగా, సంచలన పూరితంగా ఉండేవి. అందులో వరదరాజేశ్వరరావుగారు ప్రత్యేకమైన ఆసక్తి కనబరచేవారు. కొందరు రాజకీయ నాయకులతో సన్నిహితంగా మెలుగుతూ ఎన్నికల సంరంభంలో కొంత బాధ్యత కూడా వహించారు.*

*ఆసమయంలో భార్యకు రాసిన కొన్ని ఉత్తరాల్లో న్యూఢిల్లీ నుంచి హైదరాబాదుకి నివాసం మారిస్తే బాగుంటుందేమోనన్న అభిప్రాయాన్ని వ్యక్తం చేశారు.]*

15, Pusa Road,
New Delhi-5,
15.11.76.

...యిల్లు కొనాలని ప్రయత్నించాను. ఫలించలేదు. ఢిల్లీ అంటే విసుగ్గా ఉంది. వయస్సు వస్తున్న కొద్దీ మార్గాంతరం వెదకాలి. నువ్వొచ్చిన తరవాత ఆలోచిద్దాము........వరద

15, Pusa Road,
New Delhi-5,
6.12.76.

......... కొత్త సంవత్సరం మరో ప్రయత్నం చేస్తాను. మొదట్నుంచీ నా జీవితం యిలాగే నడవటంతో అలవాటయి పోయి యేదీ విపరీతంగా కనిపించటం లేదు. కాని వయస్సు వస్తున్న కొద్దీ కొంచెం సెక్యూరిటీ మీద దృష్టి పోతుంది. జాగర్తగా ఉండబుద్ధి పుడుతుంది.

........

వరద.

•

15, Pusa Road,
New Delhi-5,
14.2.77

......రెండు రోజాల నుంచి రాష్ట్రపతి అంత్యక్రియలతో ఊరంతా సెలవూ, మార్కెట్టు మూసివేతా......యిన్నిసార్లు హైదరాబాదు పోవలసి వస్తోంది. వొచ్చేనెల 22 తేదీ కల్లా ఎన్నికలు పూర్తి అవుతయి. కాంగ్రెసుకు యెదురుగా అన్ని పార్టీలు కలిసి (కమ్యూనిస్టు పార్టీ మినహా) జనతా పార్టీ అని యేర్పాటు చేశారు. కాంగ్రె.కు బలవత్తరమయిన పోటీ యేర్పడింది. దానికి తోడు

జగజీవన్ రామ్ కాంగ్రెసు నుంచి రాజీనామా యిచ్చి కాంగ్రెస్ ఫర్ డెమోక్రసీ అనే పక్షాన్ని పెట్టాడు. జనతాపార్టీతో సహకరిస్తున్నాడు. దీంట్లో యివాళ విజయలక్ష్మీ పండిట్ కూడా చేరింది. కాబట్టి ఎన్నికలు యీసారి యింపుగా ఉండవచ్చును. శ్రీమతి మొరాజె వస్తే నలుగురి దగ్గరికీ తీసుకుపోతాను. నాకు రాయమను ఆవిడ కార్యక్రమం గురించి. పాపం విశ్వనాథ్ ('పేట్రియట్') కాన్సరు వ్యాధితో ఆసుపత్రిలో ఉన్నాడు.....

వరద.

•

15, పూసారోడ్డు,
న్యూఢిల్లీ-5,
3.3.77.

...... అతి కష్టం మీద విన్న మధ్యాహ్నం అశోకా హోటలుకు పోయి శ్రీమతి మొరాజెను కలుసుకున్నాను. ఒక గంట సేపు మాట్లాడిన తరవాత, భార్యా భర్తలిద్దర్నీ సుందర్ నగర్ మార్కెటు దగ్గర దించి వొచ్చాను. ఆవిడ యిక్కడ అజాద్ భవన్ లో యేదో మీటింగుల కోసం వచ్చిందట. తీరిక తక్కువ. సోమవారం తిరిగి పారిస్ వెళ్లి పోతోంది. చాలా మంది ఫ్రెంచి ప్రతినిధులు వొచ్చారు కలిసి.

...... ఇక్కడ యెన్నికల హడావిడి జోరుగా ఉంది. కాంగ్రెసు నెగ్గటం కష్టం అంటున్నారు. మీ యూనివర్సిటీ అంతా కాంగ్రెసుకు వ్యతిరేకంగా ప్రకటనలు చేశారు. బిమలా ప్రసాదు జనతా పార్టీలో చేరాడు. నువ్వు తిరిగి భారతదేశానికి వొచ్చే టప్పటికి కొత్త ప్రభుత్వం యేర్పడుతుంది.

................

వరద.

•

15, పూసా రోడ్డు,
న్యూఢిల్లీ
7.3.77

....... శ్రీమతి మొరాజేను శ్రీ జి.కె. రెడ్డి దగ్గరికీ, శ్రీ జగన్నాథన్ (స్టేట్స్‌మన్), గిరీష్ మాధుర్ (పాట్రియట్) దగ్గరికీ తీసుకు పోయాను. చాలా మంది ఎన్నికల హడావిడిలో ఊళ్లోలేరు. చలపతి రావు గారి దగ్గరికి తీసుకుపోతే ఆయనతో మాట్లాడటం కష్టం అని తీసుకుపోలేదు. ఆవిడకెప్పుడు తీరిక ఉంటుందో యెప్పుడూ తెలియక పోవటం వల్ల లంచ్‌కు తీసుకుపోలేక పోయాను. నవంబరులో మళ్లీ వస్తానంది. అప్పుడు తీరిగ్గా మనతో కాలక్షేపం చేస్తానన్నది.

వరద.

•

# 'విశాఖ'లో 'వరద'

*[డిసెంబరు 1977లో విశాఖ పట్నం వెళ్లినప్పుడు విశాఖ రచయితల సంఘం ఏర్పాటు చేసిన సభకు వరదరాజేశ్వరరావుగారు ముఖ్యఅతిథి.]*

విశాఖలో 'వరద'

పతంజలి

మధ్య వయసు మంచు తెరల్లోంచి జ్ఞాపకాల తొలికోడి కూతలు

"దేవుడు లేడని మొట్ట మొదట నాకు చెప్పినది వరద రాజేశ్వరరావే-అప్పట్లో నేనెంతో ఆశ్చర్యపోయాను-అదేవిటా దేవుడు లేకపోవడమేవిటి అనుకున్నాను" అన్నారు శ్రీ రాచకొండ విశ్వనాథశాస్త్రి శ్రీ అబ్బూరి వరదరాజేశ్వరరావును విశాఖ రచయితల సంఘానికి పరిచయం చేస్తూ; "నేను కలుసుకున్న మొట్టమొదటి కవి కూడా వరద రాజేశ్వరరావే-, నాకు సాహిత్యం ప్రవేశం కలగడానికి అతడే కారణం" అని రావిశాస్త్రి చెపుతున్నప్పుడు కింగ్ సైజు సిగరెట్ కాలుస్తూ, క్రర కుర్చీలో కూర్చున్న శ్రీ అబ్బూరి వరద రాజేశ్వరరావు నవ్వారు కానీ కళ్ళద్దాల వెనుక ఆయన కళ్ళు నవ్వలేదు. అవి "అన్నా ఈ పరుగు వృథా ఆగిపోటం మంచిది... ముళ్ళదారి తప్పించుకు మళ్ళిపోవడం మంచిది" అంటూనే వున్నాయి.

కవుల బాధలు ప్రపంచపు బాధలయిన దృష్టాంతాలు వున్నాయి. కవుల జీవితాలే సాహిత్య చరిత్రలయిన ఉదాహరణలూ వున్నాయి. కాగా ముగ్గురు ప్రఖ్యాతులైన సాహితీ వేత్తలు ముప్పై, నలభై ఏళ్ళ నాటి ముచ్చట్లు జ్ఞాపకం చేసుకోవటం వింటున్న వారందరూ వాటికి తలవూచి అవి తమ చిన్నప్పటి జ్ఞాపకాలే అన్నంతగా ఆనందించటం మొన్న సాయంత్రం హిందూ "రీడింగ్ రూములో జరిగిన విషయం. పదహారేళ్ళ తర్వాత శ్రీ అబ్బూరి వరద రాజేశ్వర్రావు విశాఖపట్టణం వచ్చి, విశాఖ రచయితల సంఘం సమక్షంలో, రా.వి. శాస్త్రి తోను, పురిపండా అప్పలస్వామితోనూ, "సాహిత్య ఖాదీ భాండార్' నాటి ముచ్చట్లు మననం చేసుకున్నారు.

పురిపండా అప్పలస్వామిగారు వరదాకు "వరదా నేను ఎవరో కాదు వేమన్నను తెలుసా?" అంటే అమాయకంగా నమ్మేసి శ్రీ అబ్బూరి రామకృష్ణారావు దగ్గరకు వెళ్ళి "నాన్నా అప్పలస్వామిగారు వేమన తెలుసా" అన్నప్పటినుంచి, శ్రీ శ్రీ పద్యమే తనదిగా భ్రమించిన 'వరద' దాన్ని తిరిగి రాసి పురిపండాకు చూపి ఆశ్చర్యపరచటం నుంచి, ఎల్లమ్మతోటలో పోలీసులు లైసెన్సు లేని సైకిళ్ళను పట్టుకుంటుంటే, సంఘ సేవకుడైన 'వరదు' డనే చిన్నవాడు చౌర్ట్రీ దగ్గర దారికాసి, "లైసెన్సు లేనివాళ్ళు ఎల్లమ్మతోట వైపు సైకిల్ మీద వెళ్ళొద్దు... పోలీసులున్నారు. పట్టుకొంటున్నార" ని హెచ్చరించటం వరకూ ఎన్ని ముచ్చట్లు. విశాఖలో శ్రీ శ్రీ వాళ్ళూ గొప్ప గొప్ప పనులు చేస్తున్నారని అనుమానించిన నారాయణబాబు ప్రభృతులు విశాఖ రచయితల కంటే పెద్ద జుత్తు పెంచేసుకుని చీటికి, మాటికీ విజయనగరం నుంచి విశాఖ వెళ్ళి పొచ్చేయడం కూడా 22వ తేదీన 'వరద' జ్ఞాపకం చేసుకొంటూ నలుగురితోటి ఆ గుబాళింపులు పంచుకొన్నారు.

రెండు 'కవిత' సంకలనాలు వెలువరించి శ్రీ శ్రీ, ఆరుద్రలతో కలిసి, స్వతంత్రంగా నంపెంగతోట, అందాకా గ్రంథాలు వెలవరించి, అలైడ్ ప్రచురణా సంస్థకు ఛీఫ్ ఎడిటర్‌గా వ్యవహరించిన వరద రాజేశ్వర్రావు కాల్పనిక సాహిత్యానికి పెద్ద భవిష్యత్తులేదని అన్నారు. పురిపండా అధ్యక్ష పీఠంలో కూచున్న ఈ ఇష్టాగోష్టిలో ఆఖరి మాట శ్రీ చలసాని ప్రసాద్‌ది.

('ఈనాడు, ఆదివారం, డిసెంబర్ 25, 1977)

## తండ్రి మరణం

*[1978 'మే'లో తల్లి దండ్రుల్ని ఢిల్లీలో తమతో పాటు ఉండటానికి తీసుకువచ్చారు. దురదృష్టవశాత్తూ సెప్టెంబరులో తండ్రి కాలు జారిపడిపోవడంవల్ల తుంటి ఎముక విరిగి మంచం పట్టారు. ఆ సమయంలో అనేకమంది సాహితీ మిత్రులు 'అబ్బూరి' ని సందర్శించడానికి వరదరాజేశ్వరరావు గారింటికి వేళ్ళేవారు. ఆ రోజుల్లో జవహర్ లాల్ నెహ్రూ యూనివర్సిటీ కాంపస్‌లో 'ఉత్తరఖండ్' లోని క్వార్టర్స్‌లో ఉండేవారు- ఊరికి దూరంగా.]*

ఆఖరిరోజుల్లో ఢిల్లీ వచ్చారు మా నాన్నగారు. అక్కడ ఉంటున్నప్పుడు స్నానాలగదిలోపడికాలు విరుచుకున్నారు. అవసానదశ అంతా మంచంలోనే గడిపారు. ఆ రోజుల్లోనే మిత్రుడు పురాణం సుబ్రహ్మణ్యశర్మ వచ్చి ఆయన చాటువు లన్నింటినీ పోగుచేసుకుపోయాడు. మా నాన్నగారు మంచం నుంచే సుబ్రహ్మణ్యశర్మ కోరినట్లుగా వాటిని తన పత్రికలో ప్రకటించేందుకు అనుమతించారు. ఆ అవస్థలో రోజూఆయనకి దినపత్రికలూ, ఆయన కోరిన పుస్తకాలూ చదివి వినిపించే వాళ్ళము.

"శ్రీ అబ్బూరి రామకృష్ణారావుగారిని చూడటానికి వెతుక్కుంటూ వెళ్ళడం ఒక సాహిత్యయాత్ర. డాక్టర్ రమేష్‌బాబు చిన్నకారులో లజపత్‌నగర్ నుంచి అబ్బూరి వారి యింటికి జవహర్‌లాల్ నెహ్రూ యూనివర్సిటీ న్యూ కాంపస్ ఉత్తరఖండ్‌కి తరలివెళ్ళాం. అది మెహరోలీ ప్రాంతానికి దగ్గర - కుతుబ్‌మీనార్ కనపడుతూ మాయమవుతూ కవ్విస్తోంది ...

అబ్బూరి వారిల్లు 'అబ్బో' అనేలా మంచివాళ్ళు దర్జాగా కూడా వుంటే ఎలా ఉండచ్చో అలా క్వయిట్‌గా నీటుగా వుంది. ఆ యింట్లోకి ప్రవేశించగానే మమ్మల్ని ఆకర్షించినవి వరదగారి నవ్వులూ, కబుర్లూ -ఆ అల్మైరాలకేసి అక్కడ వరసగా పేర్చివున్న డిలాన్‌థామస్, టి.యస్. ఇలియట్ వగైరా కవుల యల్.పి. రికార్డులు, పుస్తకాలు, బొమ్మలు, శిల్పాలు, వాటికేసి చూస్తూ మధ్యమధ్యలో సిగరెట్లు కాలుస్తూ ఎన్ని గంటలయినా సునాయాసంగా గడిపేయవచ్చు ...

రామకృష్ణారావుగారు నిద్ర పోతున్నారు. ఆయన చదివిన పద్యాల టేపులు వింటూ కాఫీలు తాగుతూ కూర్చున్నాం... ఈ పద్యాలను ప్రకటిస్తామన్నప్పుడు అవి అసభ్యంగా వుంటాయేమో అన్నారు రామకృష్ణారావుగారు. చాటువులకి అసభ్యతేమిటి - అసభ్యాలు కాకపోతే చాటువులు కావు అని నవ్వుతూ అన్నారు వరదరాజేశ్వరరావుగారు ... సుమారు రెండు మాసాల క్రితం శ్రీరామకృష్ణారావుగారు బాత్రూంలో కాబోలు పడిపోవడం వలన హిప్‌బోను పట్టుతప్పింది. బ్యాండేజి వేశారు. మంచంమీద నిద్రపట్టిన సరస్వతిలా తెల్లగా స్వచ్ఛంగా వున్నారు. బుర్ర చురుగ్గా వాడిగా పని చేస్తోంది. మాట స్పష్టత తగ్గింది. అన్నీ మంచంమీదే- లేవలేకపోయినా పదాల్ని అందుకోవడంలోనూ పదాలనందించడంలోనూ అబ్బూరి వారి మనసు చేవగా, చురుగ్గా, తాజాగా వుంది. ప్రపంచం అసూయపడదగిన తండ్రీ, కొడుకులు వారిద్దరూ"... (పురాణం సుబ్రహ్మణ్యశర్మ. శ్రీ అబ్బూరివారితో. 'ఆంధ్రజ్యోతి' సచిత్రవారపత్రిక, 22-12-78)

*[1979, ఏప్రిల్ 30న తండ్రి అబ్బూరి రామకృష్ణారావుగారు మరణించారు.]*

[మే 1979లో డెహ్రాడూన్‌లో ఎం.ఎన్. రాయ్ సమాధి వద్ద తండ్రి అస్థికలు విక్షిప్తం చేస్తున్న 'వరద', పక్కన ఉన్నది రాయిస్ట్ మిత్రుడు ఆర్.ఎమ్. పాల్]



Prof. G.N. Reddy, M.A., M. Litt. Ph.D.
Head of the Department of Telugu.
May 8, 1979.

మాన్యమిత్రులు శ్రీ వరదగారికి,

నమస్కారాలు.

లోకమాన్యులు మీ పితృపాదులు. వారి మరణవార్త తెలిసి సాహితీ మిత్రులందరం బాధ పడ్డాం. బహుముఖమైన జీవితాన్ని వేయి పున్నముల పర్యంతం గడిపిన ప్రతిభామూర్తి ఈ లోకాన్ని వదిలి వెళ్లినందుకు మీ కుటుంబానికే గాదు దేశానికంతా తీరని లోటు. ఈ సందర్భంలో నేనూ, నా శ్రీమతీ మీ దంపతులిద్దరికీ, సోదరులకూ, మీ తండ్రిగారి మాటల్నే వల్లించి, అందరం ఉపశమనాన్ని పొందుదాం.

"చచ్చిపోయి జీవి యెచ్చటికేగునో
ఏమియగునొ యెవరి కెరుగరాదు
ఎరుకలేని వారలేమేమొ చెప్పగా
విని తపించువారు వేనవేలు."
-శ్రీ అబ్బూరి

మీ,
జి.యన్. రెడ్డి

•

14.5.79

మిత్రులు
శ్రీ అబ్బూరి వరద రాజేశ్వరరావుగారికి,

నమస్కారం. మీ నాన్నగారు వెళ్లిపోయిన వెలితి నుంచి మీ కుటుంబం కోలుకోవడం కోసమై మీరు ఏ విశాఖపట్నమో, హైదరాబాదో తిరిగి వస్తే మంచిదని నాకనిపించింది. చివరి రోజుల్లో మాకు వారితో పరోక్షంగా వారం వారం అనుబంధం ఏర్పడడం మా అదృష్టం. బెజవాడలో తుఫాను లాస్ ఏమీలేదు. We are all safe. నెల్లూరు, ప్రకాశం జిల్లాలు బాగా దెబ్బతిన్నాయి. చాలా యిళ్లు తోటలు దొడ్లు మునిగి పోయాయి. ఈ పర్యాయం గవర్నమెంటు చాలా శ్రద్ధతో ముందు జాగ్రత్తలు తీసుకోవడం వలన జననష్టం చాలా minimum అయింది.

ఈ విషాద సమయంలో మేమంతా మీతోపాటు మీ విచారంలో పాలు పంచుకుంటున్నాం.

పురాణం సుబ్రహ్మణ్యశర్మ.

•



[ఆఖరి చెల్లెలి కూతురు 'మినీ' తో 'వరద']

## 'నదీసుందరి'

[తండ్రి మరణానంతరం ఆయన ప్రసిద్ధ నాటకం 'నదీసుందరి' ని పునర్ముద్రించడానికి వరద రాజేశ్వరరావు గారు పూనుకున్నారు. ఆ పుస్తకాన్ని హైదరాబాదులో ముద్రించడంలో డా. బూదరాజు రాధాకృష్ణగారు సహకరించారు. శ్రీ పురిపండా అప్పలస్వామి గారి చేత 'నదీసుందరి' కి 'పరిచయం' రాయించడంలో శ్రీ అబ్బూరి గోపాలకృష్ణ కృషి కూడా ఉంది.]






GOPALA KRISHNA ABBURI
LECTURER IN STAGE CRAFT
DEPARTMENT OF THEATRE ARTS
ANDHRA UNIVERSITY, WALTAIR

28.5.1979.

వరదా,

ఈ పాటికి నువ్వు ఢిల్లీ చేరుకుని ఉంటావనే ఉద్దేశంతో ఢిల్లీకి రాస్తున్నాను. ఇప్పుడే బూదరాజుకు కూడా రాశాను. శ్రీపురిపండా 26 తారీఖున నాకు లోకల్ కార్డు రాస్తూ, రెండు మూడు రోజుల్లో Introduction పూర్తి చేసి అందచేస్తానన్నారు. 31న నన్ను కలుసుకోమన్నారు. ప్రస్తుతం

విజయనగరం వెళ్లారు. 30 తారీకుకి వస్తారు. "ఈలోగా ఇప్పుడు అచ్చయిన ఫారాలు నాకు పిల్లై తే అవును పీలైతేనే పంపమని శ్రీ బూదరాజుగారికి రాయండి" అని రాశారు. నేను బూదరాజుకు వెంటనే రాశాను గాని అవి పంపడం 31 లోపుగా కుదరదనుకుంటాను. అయినా నా దగ్గరున్న నదీసుందరి కాపీ ఆయనకిచ్చాను. ఎలాగోలాగ ఆయన దగ్గర్నుంచి Introdutction తీసుకుని బూదరాజు పేర పంపుతాను........

మళ్లీ రాస్తాను.

•

## నదీసుందరి పరిచయం

పురిపండా అప్పలస్వామి

కలం నడవటం లేదు-

ఢిల్లీ నించి అబ్బూరి వరదరాజేశ్వరరావు ఏప్రిల్ 18 న ఈ కింది వుత్తరం రాశారు.

"మా నాన్నగారు పక్కలోనే ఉన్నారు. దాదాపు అవసాన దశ అనుకోవచ్చును. చాలా క్షీణించిపోయినా, మానసికంగా చాలా చురుగ్గానే ఉన్నారు. మధ్య మధ్య కాలక్షేపానికి ఆశువుగా పద్యాలు చెబుతుంటారు. అలా చెప్పిన పద్యం మచ్చుకి:

చచ్చిపోయి జీవి యెచ్చటి కేగునొ
ఏమి యగునొయెవరి కెరుకరాదు
ఎరుకలేని వార లేమేమొ చెప్పగా
విని తపించువారు వేనవేలు!

మధ్య మధ్య విశాఖపట్నంలో ఉన్ననాటి మాటలూ అవీ జ్ఞాపకం చేస్తూ మీ గురించి అడుగుతుంటారు. ఆయనకి అందర్నీ ఒక్కసారి చూడాలని ఉంటుంది. ఎలా సాధ్యం?

మా నాన్నగారి 'నదీసుందరి' (ఆ నాటిక మీద ఆయనకు మమకారం ఎక్కువ.) హైదరాబాదులో తిరిగీ అచ్చు వేయిస్తున్నారు. దానికి మీ పరిచయ వాక్యాలు కావాలి. మీరు వీలుచూసుకుని, యెంత తొందరగా ఆయితే అంత మంచిది రాసి పంపాలి."

"సరే", అన్నాను సంతోషంగా. పుస్తకం దగ్గిర లేక చప్పున రాయలేక పోయాను. అప్పుడే ఈ రెండు ముక్కలూ రాసుంటే రామకృష్ణారావుగారు వినుంటే, ఇప్పటి ఈ బాధ కొంతయినా తేలికయేదేమో!

రామకృష్ణారావుగారు మరి లేరు!

గత సెప్టెంబరులో ఢిల్లీలో వారిని చూశాను. అప్పటికే అన్నంపక్కలా వున్నారు. కౌగిలించుకుని, "ఇదే ఆఖరి చూపు అనుకుంటాను" అన్నారు.

అన్నంతా అయింది. అదే ఆఖరిచూపు. ఆయన మరిలేరు.

ఈ వొకటో తేదీని రాజమండ్రినించి గోదావరిమీద లాంచీలో బొబ్బర్లంక బయలుదేరాం, అద్దేపల్లి రామమోహనరావు గారూ నేనూ. ఉదయాన్నే లాంచి కదిలింది. ఎదటి ప్రయాణికుడి చేతిలో ఆంధ్రపత్రిక అడిగి విప్పాను. 'అబ్బూరి అస్తమయం'! వార్త.

రామకృష్ణారావు గారితో గడచిన ఏభయ్యేళ్ళ స్మృతులూ గోదావరి అలలతో పులుముకు లేస్తున్నట్టనిపించింది. నిజమేనా ఈ వార్త?

రేడియోలోనూ విన్నా మన్నారు మిత్రులు.

కంటి చెమ్మ ఆరనేలేదు. వరద 23-5-79 టెలిగ్రాం, తమ్ముడు గోపాలకృష్ణ గారికి:

Ask Puripanda introduction for Nadisundari. Post immediately.

ఈ బరువు గుండెతో ఏం రాయనూ! ఎలా రాయనూ! నిజంగానే కదలడం లేదు కలం.

నవ్య కవితకి నాందీ పలికిన మన మహాకవులలో అబ్బూరి రామకృష్ణారావు గారిది విశిష్టమైన వొక ప్రత్యేకస్థానం. కవితా, నవలా, నాటకమూ, విమర్శా మేఘాలేఖ్యం వంటి రమ్య రచనా-అన్నిటా ఆయన అమృతహస్తుడు. అబ్బూరి ప్రభావం నవకవు లందరిమీదా అంతో ఇంతో అవుపడుతూనే వుంటుంది.

పరిపుష్టమైన, మధురమైన, రసప్లుతమైన, స్నిగ్ధసుందరమైన ఆయన శైలీ, శిల్పమూ 'నదీసుందరి'లో కూడా కొట్టవచ్చినట్టు కనిపిస్తాయి.

'నదీసుందరి' రామకృష్ణారావుగారు తమ పైలాపచ్చీసులో 1920 ప్రాంతంలో రాసిన ఏకాంక రూపకం. వారి కూర్పు 1931 లో వచ్చింది...

అబ్బూరి రామకృష్ణారావు గారి అమరకృతి నదీసుందరి. ఆయన ఇంకేదీ రాయకుండా ఈ వొక్క రూపకమే రాసివుండినా, తెలుగువారి రస హృదయాల్లో చిరకాలం జీవించే వుండేవారు.

అందుకనే ఈనాటికమీద ఆయనకి మమకారం ఎక్కువ.

విశాఖపట్నం

27 మే 1979



# మిత్రుల ఉత్తరాలు (వివిధ సందర్భాల్లో)

*[ఆ రోజుల్లో సాహితీరంగానికీ, పత్రికారంగానికీ చెందిన మిత్రులను కలుసుకుంటూ ఉండేవారు. మిత్రుల దగ్గరనుంచి ఉత్తరాలు వస్తూండేవి.]*

16.6.79

మిత్రులు శ్రీ వరదరాజేశ్వరరావు గారికి,

మీరాసిన మూడు ఉత్తరాలూ యీవాళే చూశాను. నేను గత పది రోజులుగా మదరాసు, తిరువణ్ణామలై వెళ్లి నిన్ననే చేరాను. పన్యాల సుబ్రహ్మణ్యభట్టు అనే ఆయన యిప్పుడు ప్రస్తుతం లేరు. ఆయనకి హైద్రాబాదు ట్రాన్స్‌ఫరయింది. అక్కడ చేరకుండా ఏవో కోర్టు వ్యవహారాల్లో వున్నాడు. మీరు చెప్పిన పని వాకబు చేశాను. ఇంద్రగంటి శ్రీకాంతశర్మ, ప్రయాగ రామకృష్ణ గార్లు మనకు పని చేసి పెడతారు. ఆ టేపు వొకటి చేయుమని ముందుకోరాను. తర్వాత అవసరమైతే ఒక చిన్న కాసెట్ తీసుకుని దానిమీదకి ఎక్కించిన తర్వాత మీకు పోస్ట్‌లో పంపే ఏర్పాట్లు చేస్తాను. ఈ పనులు కొంత ఆలస్యంగానే జరుగుతాయి. అందుచేత నా దృష్టిలో ఆ విషయం మరుగున పడిపోయిందని అనుకోవద్దు.

ఇకపోతే, మన డాక్టర్ రమేష్ హఠాత్తుగా మాయమయి పోయాడు. మీ వుత్తరంలో ఎక్స్‌ప్రెస్ చేసిన సెంటిమెంట్స్ అన్నీ–నాకంటే మీరు ఎక్కువ బాధపడతారనీ నాకు తెలుసు. ఎందువల్ల నంటే, నేనాయన పోయే ముందు రోజు చూచాను. పోయాక కూడా తన కూడా వున్నాను కొంత వరకు. మీరన్నట్లు మళ్లీ రమేష్ లాంటి తెలుగువాడు కనిపించటం, వినిపించటం దుర్లభం.

మీనాన్నగారి చాటువులు,. ఆశువులు, పద్యాలు అచ్చయినవన్నీ సేకరించి రమేష్‌కి. అతను పోయే ముందు రోజు యిచ్చాను. అవి మళ్ళీ సేకరించి బూదరాజు రాధాకృష్ణ గారికి డైరెక్టుగా పంపిస్తాను, ఒక వారంరోజుల్లో . మీ పద్యాలు కూడా అన్నీ రెండు సంచికల్లో అచ్చయినాయి. ఆ కటింగ్స్ కూడా మీకు వేరే పంపుతాను.

.... చలంగారి గురించి మీ ఎసెస్‌మెంటూ అభిప్రాయాలూ ఏవైనా వుత్తరాలు–మెటీరియల్ వుంటే నాకు పంపి సహాయం చేయండి. ..........

నేను వుత్తరాలు రాస్తూంటాను.
మీరు జవాబులు రాస్తూండండి.

ఇక్కడ ఎండలు జోరుగానే వున్నాయి.
అలాగే వడ దెబ్బలూ!
అక్కడ మీరంతా కులాసా?

పురాణం సుబ్రహ్మణ్య శర్మ.

**New Directions**
( TELUGU - ENGLISH TRANSLITERATURE )

EDITOR
VEGUNTA MOHAN PRASAD

27.10.'79.

మిత్రులు శ్రీ వరద రాజేశ్వరరావుగారికి, నమస్తే.

నేను నగ్నముని, శ్రీపతి, పురాణంలకు మిత్రుడ్ని. అంచేత మీకూ మిత్రుడ్నే అవుతాను. మీ చిర్నామా కుందుర్తి ఇచ్చారు. శ్రీపతి ఈ పాటికి మిమ్మల్ని కలిసే వుంటారు. మీరు లోగడ చేసిన ప్రయత్నాల వలెనే మరొక సమగ్రమైన సంకలనం వేద్దామని గట్టిగా కృషిచేస్తున్నాను. ఇప్పటికే డబ్బో డబ్బురా బాబూ అని ఓ 200 ఉత్తరాలూ, కవి మిత్రులకు మీ కవితలూ వాటి అనువాదాలూ అని ఓ వొందా, అనువాదకులకు అనుమతి కోసమని ఓ పాతికా రాసాను. శేషేంద్ర ఆయన కవితల్ని చేర్చుకుంటే చంపేస్తానని రాసాడు. కొందరు కనుబొమలు పైనించి కిందికి దించలా ఇంకా, వ్రాతకోతలన్నీ ఒంటి చేతిమీదనే చేసుకొంటున్నా. మీరూ, రాయప్రోలు శ్రీనివాస్‌గారూ, డా.బి.వి.ఎల్. నారాయణరావుగారూ ఒప్పుకొంటే ఓ 20సం॥పాటు దాచుకోదగిన anthology వస్తుందని నమ్మకం.

రోణంకి గురువుగారు పేరు ఆఖరికి వేశానని అలిగి ఉత్తరం రాసారు. గురుదక్షిణగా ఓ పూర్ణకుంభం తీసుకొని ఈ రోజే కోణార్క్‌కి వెళ్తున్నా వాల్తేరు. డా.ఎస్. ప్రభాకర్ వరేనన్నారు ఆయన అనువాదాల్ని చేర్చుకోటానికి . నేను యువతీ యువకుల్ని ఓ 20 మందిని ఇంగ్లీకరిస్తాను.

మీ Modern Telugu Poetry, Modern Indian Poetry నాకు అర్జంటుగా కావాలి. నేనింత వరకు వాటిని చూడలేదు. VPP లో పంపండి మిమ్మల్ని అవమానిస్తున్నానని అనుకోక పోతే.

మీ సహకారం లేకపోతే ఇలా అక్కడక్కడా డబ్బులు పోగు చేసి నేనే మింగి కూచుని నలుగురితో తన్నులు తింటానని భయంగా ఉంది మరి.

ప్రసాద్

•

బూదరాజు రాధాకృష్ణ

హైదరాబాద్,
28.10.79

శ్రీ వరదరాజేశ్వరరావుగారికి,

నమస్కారాలు. ఉభయకుశలోపరి.

ఈ రోజు ఉదయం శ్రీ మహంకాళి వేంకటేశ్వరరావుగారి ఇంటికి పోయి వచ్చాను. ఆయన అడ్రసు: 1-1-336/108, చిక్కడపల్లి, హైదరాబాదు-20. ఆయనకు 85 వ సంవత్సరం పదిరోజుల్లో వస్తున్నదట. మాస్టారు ప్రస్తావన వస్తేనే ఏడుస్తున్నాడు. ఆయనకూ Parkinson's disease ఉంది. కష్టం మీద గుర్తు తెచ్చుకొని ఇంచుమించు రెండు పద్యాలు చెప్పారు.

ఇంటర్మీడియట్ చదువుతుండగా ఒక సాయంత్రం మాస్టారు వాహ్యాళి సమయంలో ఆశువుగా చెప్పినవంటారు.

1. నలుగడలఁగ్రమ్మె సాయంతనంపుటెరులు
నీలకాదంబినీ జవనికల వెనుక
మిణుకు మిణుకను తారకాగణములెల్ల
మందకళల వెలార్చె నంబరములందు.

2. మంజుగానాను రాగప్రమత్త యైన
కాపుకన్నె మందలతోడి కదలిచనియె
పాడి పాడి కోయిల తన గూడు చేరె.

..................... పిల్లల ..............

జ్ఞాపకం చేసుకొని తక్కిన పద్యాలు చెప్తామన్నారు. అలాగే నాటి సంఘటనలు వగైరా. శ్రీ కొడాలి ఆంజనేయులు గారిని కలిస్తే మంచిదన్నారు. మీరో ఉత్తరం రాయండి ఆయనకు.

భద్రిరాజు వారి నూతన గృహప్రవేశం నవంబర్ మొదటి వారంలో జరగవచ్చు. అది నెరవేరేదాకా ఆయన ఏమైనా రాస్తాడన్న నమ్మకం నాకు లేదు. అయినా మరోసారి ఫోను చేసి చూస్తాను.

మీ
రాధాకృష్ణ



[న్యూఢిల్లీలో మిత్రుడు వేణు (ఎం.వి. రావు) ఇంట్లో ఎం.వి. చలపతిరావు గారితోనూ, వేణు కుటుంబ సభ్యులతోనూ, భార్యతోనూ 'వరద'-ఫొటో తీసినది వేణు]

Prof. G.N. Reddy, M.A.M.Litt., Ph.D.
Head of the Department of Telugu.

Dt. 3.4.1980.

Dear Sri Rajeswara Rao garu,

It was a pleasant opportunity I had at Delhi to visit you and to spend an evening with you on 28.3.80.

I am herewith enclosing a brief report of my Department. I request you to help me to develp the Department by undertaking some useful reseach projects to promote Telugu Studies.

Please let me have any information you obtained to get financial assistance from Ministry of Education, or I.C.S.S.R. for research projects.

I would like to know about any agency that could undertake to publish the Dictionary of Hindustani Loans in Telugu or any support for its publication.

I shall send you a specimen page of the Dictionary after a week.

I would appreciate very much if you could reply and pass on any suggestion, advise or information to me on the above points....

With best regards,

Sincerely yours,
G.N. Reddy.

•

V. Narayana Rao

మే 5, 1980.

వరద రాజేశ్వరరావుగారికి,

చాలాకాలంగా మీకు ఉత్తరం రాద్దామనుకుంటూ కాలయాపన చేస్తున్నాను. మీరెలా వున్నారు? గత వేసంకాలం పి.వి. నరసింహారావుగారు వొచ్చినప్పుడూ, ఈ మధ్య భద్రిరాజా కృష్ణమూర్తిగారు వొచ్చినప్పుడూ మీ కబుర్లు తెలిసాయి.

చాలా రోజులుగా అబ్బూరి రామకృష్ణారావుగారిని తలుచుకుంటూ ఒక వ్యాసం మొదలుపెట్టాను. ఆ వ్యాసం అలా మిగిలిపోయింది. పూర్తిచేసి మీకు పంపుతాను. పనికొస్తుందేమో చూడండి. ఆయన పద్యాలు అప్పుడప్పుడుగా చెప్పిన చాటువులూ, ఇంత వరకూ అచ్చుగాని రచనలూ ఒక సంపుటం చేస్తున్నారనే ఆశిస్తాను. లేక ఇప్పటికే అచ్చువేసారా? ఈ సందర్భంలో నేనేమైనా ఉపకరించగలిగితే తప్పకుండా చెప్పండి. ఆయన పద్యాలు కొన్నైనా ఇంగ్లీసులోకి అనువదించాలని వుంది.

సాహిత్య అకాడమీ అచ్చువేస్తానంటే Makers of modern literature series లో రాయప్రోలూ, అబ్బూరీ-కృష్ణశాస్త్రి ఈ ముగ్గుర్ని గురించీ రాయాలని మరో సంకల్పం. ఈ పనిలో చాలా ఆలోచనలు మీతో మాట్లాడవలసినవి వున్నాయి. ఈ లోపున అకాడమీ వాళ్లకి రాసి చూస్తాను.

సాహిత్య అకాడమీ ప్రోత్సాహం లేకపోయినా చెయ్యొచ్చుగాని, అచ్చువేసేవాళ్ళ ఆసరా పని సాగడానికి సాయం అవుతుంది. ఈ సంవత్సరం చివర్లో ఇండియా రాగలుగుతాననుకుంటాను. అప్పుడు ఈ పనికి కావలసిన సమాచారం పోగుచేస్తాను.

మీకు సావకాశం వుంటే ఓ ఉత్తరం ముక్క రాయండి. మీరు ఇటువేపు వొచ్చే పని ఏం తగిలే అవకాశం లేదూ. ........

భవదీయుడు

నారాయణ్రావు

•

V.Narayana Rao
4501 Onaway Pass
Madison Wisconsin
53711 USA

July 6, 1980

రాజేశ్వరరావుగారికి,

నేను ఆగష్టు 13, 14 ఢిల్లీ వొస్తాను. 14న హైదరాబాదు వెళ్తాను. మీరు ఆరోజుల్లో ఢిల్లీలోనే వుంటారని ఆశిస్తాను. ఆగష్టు 13న మీకు phone చేస్తాను.

తిరిగి మళ్ళీ నేను ఆగస్టు నెలాఖరుకి మాడిసన్ వచ్చేయాలి.

మీకు కొన్ని వారలక్రితం ఓ ఉత్తరం రాసాను. అందిందో లేదో తెలియదు.

తెలుగు భావకవిత్వం మీద ముఖ్యంగా అబ్బూరి రామకృష్ణారావుగారు, రాయప్రోలు, కృష్ణశాస్త్రి–వాళ్ల కవితా వ్యక్తిత్వాలు ఆధారంగా చేసుకొని–ఒక మోనోగ్రాఫ్ రాద్దామని ప్రయత్నం.మీతో మాట్లాడాల్సినది చాలావుంది. మీకు వీలయితే ఆగష్టు 13న గాని, 14 ఉదయం గాని మిమ్మల్ని కలుస్తాను.....

[వెల్చేరు నారాయణరావు]



[జె.ఎన్.యూ. క్యాంపస్‌లో – ఇంట్లో 'వరద', శ్రీ సత్తిరాజు కృష్ణారావు, వరకాల ప్రభాకర్]

# హైదరాబాదులో : 1981 – 1993

*[మళ్ళీ హైదరాబాదుకి 1981 డిసెంబరులో తిరిగి వచ్చి స్థిరనివాసం ఏర్పరచుకున్నారు. బాగ్‌లింగంపల్లిలోని సొంత 'ఫ్లాట్' లో స్తిమిత వర్ధాక సాహిత్య సాంస్కృతిక కార్యక్రమాలను క్రమంగా ప్రారంభించారు. పాత మిత్రులతో అనుబంధాలు పెంచుకున్నారు.]*

## రా.వి. శాస్త్రి షష్టిపూర్తి

*[1982లో రాచకొండ విశ్వనాథశాస్త్రి గారి షష్టిపూర్తి సందర్భంలో వెలువరించిన అభినందన సంచిక 'జూలై 30' కోసం శాస్త్రిగారిపై వ్యాసం రాశారు ]*



[మిత్రులు పురాణం సుబ్రహ్మణ్యశర్మ, రాచకొండ విశ్వనాథ శాస్త్రిగార్లతో 'వరద']





[ శ్రీకృష్ణదేవరాయ భాషానిలయంలో పురిపండా అప్పలస్వామి,
ఎం.ఎల్. నరసింహారావు గార్లతో 'వరద']



[ శ్రీకృష్ణదేవరాయ భాషా నిలయంలో ఎం.ఎల్. నరసింహారావు, శివారెడ్డి, ప్రభృతుల
సమక్షంలో గౌస్ పద్య సంపుటి 'స్పర్శ'ను ఆవిష్కరిస్తున్న 'వరద']

## 'వరదకాలం'

[వరదరాజేశ్వరరావుగారి విశిష్టరచన "వరద కాలం" 1985లో 'ఉదయం' దినపత్రికలో వారం వారం ధారావాహికంగా ప్రచురింపబడింది. తరవాత 1990లో పుస్తకరూపంలో వెలువడింది.]

TARAKAPRABHU PUBLISHERS PRIVATE LIMITED

Regd Office 1-2-593/37, Gaganmahal Colony, Domalguda, Hyderabad - 500 029 Phone 66757



*CHAIRMAN : DASARI NARAYANA RAO*

17.11.'84.

మిత్రులు,

ఆబ్బూరి వరద రాజేశ్వరరావు గారికి,

నమస్కారం!

'ఉదయం' ప్రారంభ సంచికలో మీ "సాహిత్య స్మృతులు" రాస్తే సంతోషిస్తాను. మీ వంటి చరిత్ర తెలిసిన వారు ఈ తరం వారికి చెప్పవలసిన విషయాలు, విశేషాలు చాలా వుంటాయని నా నమ్మకం! మీ స్మృతులు ఆదివారం అనుబంధంలో కొనసాగిస్తే యెంతో బాగుంటుంది. ప్రారంభోత్సవ విశేష సంచికకి మీ సాహిత్య స్మృతులు ఈ నెల 30 లోపు మాకు చేరేట్టు పంపితే సంతోషిస్తాను. వ్యవధి తక్కువగా వున్నందువల్ల గడువు నిర్ణయించవలసి వచ్చింది. అన్యధా భావించక మీ రచనను పంపించవలసిందిగా మనవి చేస్తున్నాను. మీ స్మృతుల కోసం నిరీక్షిస్తాను.

శుభాకాంక్షలతో,

భవదీయుడు

ఎ.బి.కె. ప్రసాద్





['ఉదయం' కోసం 'వరద కాలం' రాస్తున్న 'వరద']

కావలి, 524202.
5-12-'90

శ్రీ వరదరాజేశ్వర రావుగారికి,

నమస్కారం. 'వరదకాలం' ఒక్క ఊపున చదివేశాను. సాహిత్యంలో ఒక యుగం కళ్ళముందు నిలిచినట్టయింది. వట్టి పేర్లు ప్రాణ పూర్ణంగా ఎదట నిల్చున్నాయి సజీవ వ్యక్తులుగా. ఎవరికి వాళ్ళే తమ విశిష్టతలతోటి, peculiarities తోటి, వ్యక్తిత్వ విశేషాలతోటి సాక్షాత్కరించారు. కాలంలోకి జారిపోయిన ఒకానొక చారిత్రక క్షణాన్ని ఇంత పటుతరంగా చిత్రించి, విస్మృతి పాలు గాకుండా చేసినందుకు ధన్యవాదాలు. ఇంతకన్న ఎక్కువ రాయడం ముఖస్తుతి అవుతుంది గనక మానివేస్తాను.

మదరాసులో 'ఆంధ్రప్రభ'లో మీరు కొన్నాళ్ళు చేసిన ఉద్యోగం, అలాగే 'చెరకాలం'కు ముందు హైదరాబాదులో చేసిన ఉద్యోగం—ఈ రెండింటిలోనూ మీకు శ్రీ శ్రీతో ప్రమేయం ఉంది. దయతో అప్పటి విషయాలు గుర్తు చేసుకుని రాసి పంపుతారా?

..... ఉంటాను.

మీ

కె వి యార్.




## జ్ఞాపకాల వెల్లువ– 'వరదకాలం'!

[ఎ.బి.కె. ప్రసాద్]

చాకలి పద్దుల్లాంటి చప్పుచప్పు రచనలతో కాలక్షేపం చేసేవారి సంగతేమోగాని జీవనవమరాన్నీ, ఇంద్రధనస్సులానే విభిన్న జీవన రంగాలనూ ప్రతిబింబించే రచనలకే ఏనాటికైనా విలువా, విశిష్టతా, కావలసింది, రొడ్డకొట్టుడు రచనలు కాదు, మానవుల మధ్య, మానవ జీవితంలోని సుఖదుఃఖాలకు, సాహిత్యానికీ, సరదాలకు అద్దం పట్టే రచనలు అన్నాడు ఎ.బి. ఆల్కాట్ ("The less of routine, the more of life".) వయొలిన్‌తో శ్రోతలకువీనులవిందు చేస్తూనే - వాద్యపరికరం గురించి కూడా తెలుసుకోగోరేవాడే మంచి కళాకారుడన్నాడు శామ్యూల్ బట్లర్. ఈ లక్షణాలు ఏకాంతంలోనే గాక పదిమందితో కలివిడి తనంవల్ల మరింత ఎక్కువ రాణింపునకు వస్తాయి. విద్యాగోష్ఠులు, విద్వద్గోష్ఠులూ వర్ధమాన రచయితలకు, కళాకారులకూ అభ్యుదయ పరంపరాభివృద్ధికి ముఖద్వారాలు. కుటుంబసంస్కారం, సాహిత్యసంపర్కం ఈ అభిరుచిని ఇబ్బడి ముబ్బడిగా పెంచే ముడిపదార్థాలు. విజ్ఞానఖని అయిన అబ్బూరి రామకృష్ణారావుకి "పండితపుత్రుడు" గా కాకుండా తండ్రికి దీటైన సాహితీమూర్తిగా, నాటకకర్తగా, కవిగా, రచయితగా, పాత్రికేయునిగా, ప్రయోక్తగా, చేయి తిరిగిన ప్రచురణ కర్తగా, గ్రంథకర్తగా ఎదిగివచ్చిన వరద రాజేశ్వరరావు మరొక రచన "వరదకాలం". నవ్యసాహిత్య చరిత్రకు, ఆధునికాంధ్ర సాహిత్యచరిత్రకు, కవితావిప్లవాలకు పూర్వరంగాన్నీ, పథనిర్దేశంలో వైభవపతనాలను, అన్నిరకాల కవితా ఉద్యమాలకు మెట్టినిల్లుగా మారిన అబ్బూరివారి సాహిత్యసదనంలో జరిగే గోష్ఠికార్యక్రమాలను వర్ణిస్తూవుగా

సన్నిహితంగా పరిశీలించిన "వరద" రచన సాహిత్య చరిత్రకాదు, స్వీయచరిత్రే! అయితే అది ఇంకా అసంపూర్ణమే. 1985లో ఒక దినపత్రికలో ధారావాహికంగా తెలుగుసాహితీలోకాన్ని భావనారసజగత్తులో ఓలలాడించిన "వరదకాలమ్" ఏనాడో అచ్చుకావలసింది. కానీ, 1987-88లో వచ్చిన "కవనకుతూహలానికి పూర్వరంగం 'వరదకాలమ్' కాగా, అర్థశతాబ్దంగా సాగిన సాహితీ సమరాంగణంలో రాజేశ్వరరావుకర్మసాక్షిగా తెలుగువారికి పంచవలసిన భావపరంపర ఇంకా అనంతంగానే మిగిలిపోయింది. కారణం– వరద ఒక సందర్భంలో చెప్పినట్టుగా "నాకు తెలిసిన వన్నింటినీ అక్షరబద్ధం చేసి అచ్చువేయడం కష్టం, కొన్ని బహిరంగంగా చెప్పుకోవడానికి వీలులేనివి ఉంటాయి. కీర్తిశేషుల మీద గౌరవంకొద్దీ అలా రాయడానికి వీలుండదు. భావ్యం కాదు" అని భావించి, తన సంస్కారాన్ని ప్రకటించుకోవడం. అర్థశతాబ్దసాహితీచరిత్ర అంటే మరొకవిధంగా సాంఘిక చరిత్ర అనే అర్థం. సంఘజీవనం ఆధారంగా, జాతీయ, రాష్ట్రీయ ఉద్యమాలు ఊతగా కదలుతున్న కావ్యరథమూ, భావస్రవంతీ రచయితల స్వీయచరిత్రను ఆవిష్కరిస్తూ ఉంటుంది. వరద కవనకుతూహలం, వరద కాలం సాహిత్యగోష్ఠులు, సాహితీమూర్తుల హృదయవీణా తంత్రులు వినిపించగా, ఆయన "నాట్యగోష్ఠి" తెలుగు నాట రంగస్థల నిర్మాణ, నాటికా, నాటక ప్రయోగాల విశిష్టరచన, తన ప్రత్యక్ష అనుభవాలకూ, అనుభూతులకూ, ఏభయ్యేళ్ళ రాజకీయ సాహితీ సాంస్కృతిక రంగస్థలంపైన పాత్రధారులైన అసంఖ్యాకమైన ఉద్దండపిండాల కార్యకలాపాలకూ సరసమైన ప్రతిబింబం, గడుసురచన "వరదకాలం"! రచనలో వైశిత్యం, వాక్కులో చమత్కారం రథచక్రాలుగా సాగిన శారదామూర్తి ఈ గ్రంథం. రచయిత అసాధారణ జ్ఞాపకశక్తికీ, ఆశువుగా సాగిన అనుభవ సంపద ఆవిష్కరణకూ ఇది తిలకప్రాయం. గురజాడ, గిడుగు, రాయప్రోలు, అబ్బూరి, ఉమాకాన్తం, దేవులపల్లి, శ్రీ శ్రీలు పురోహితులుగా కావ్యరచనా రోచిస్సులు చిందించిన నవ్యకవిత్వ, అభ్యుదయ కవితా ఉద్యమాల ప్రభావంతో ముందుకు సాగిన తెలుగు భారతికి ఇది వ్యక్తి పరిచయ స్థాయిలో సాగిన అందమైన వ్యాఖ్యానం. ఈతరం వారికి తెలియని ఎన్నో విషయాలు తెలుసుకోదగిన వారికి ఈ గ్రంథం తోడ్పడుతుంది. కవితా, రంగస్థల ఉద్యమాలకు, వృత్తిపదకోశాలకూ, పద్యప్రయోగకోశాలకూ ఆద్యులలో ఒకరుగానే గాకపత్రికా సారస్వతానుబంధాలకు, రసమంజరీనాదాలకు కూడా తొలిపూజలు చేసినవాడు రామకృష్ణారావు. తొలి తెలుగు కథానికలకు ఒరవడి పెట్టిన ఒకరిద్దరిలో ఆయనొకడు. ఇంతవరకూ జాడతెలియని "మంగళసూత్రం" డిటెక్టివ్ రచనకు, "తెలుసంసారానికి" కర్తకూడా రామకృష్ణారావే. "హిందూ"లో పనిచేసిన ప్రథమాంధ్రుడు కుందూరి ఈశ్వరదత్తు; కస్తూరి కుటుంబం యాజమాన్యంలోకి రాకముందు "హిందూ" వ్యవస్థాపకులలో ముఖ్యుడు న్యాపతిసుబ్బారావు. ఇలాంటి విశేషాలెన్నో కుంభవృష్టిలా కురిపించింది "వరదకాలం". ఎందరో ప్రశంసలందుకున్న "కవిత" సంచికలకు, "మోడరన్ తెలుగుపోయిట్రీ" కి సంకలనకర్త ఆయన సతీమణి ఛాయాదేవి కాగా, "అందాకో" స్వీయకవితా సంకలనానికీ, "మోడరన్ ఇండియన్ పోయిట్రీ" "ఇండో-ఆంగ్లియన్ పోయిట్రీ" సంకలనాలకూ బాధ్యుడు వరద. వర్కింగ్ జర్నలిస్టుల భారతీయ సమాఖ్య హైదరాబాద్ యూనియన్‌ల వ్యవస్థాపకులలో ఒకరు వరద. అక్కిరాజు, దుగ్గిరాల, కొండా వెంకటప్పయ్య, సుందరయ్య బసవరాజు, బళ్ళారి, లంకసుందరం, చలం, తాపీ ధర్మారావు, మరోమధురవాణి లాంటి ఎన్నో

కీపస్తంభాలను, వారిశక్తి సామర్థ్యాలనూ వరదకాలం చూపిస్తోంది. ఎన్నో విద్యాలయాలు, విద్యాకేంద్రాలూ, అక్కడి జ్ఞాపకాలూ మనం పంచుకుంటాం! స్టేట్ కాంగ్రెస్ అభ్యుదయ పథంలో వరదపాత్ర అర్థమవుతుంది.

దాదాపుగా స్వీయచరిత్రలుగా పరిగణించదగిన సాహిత్యచరిత్రలు మనకున్నాయి. ముఖ్యంగా క్షటీవలకాలంలో అసమగ్రంగానే అయినా, అరమరికలు లేకుండా అర్థశతాబ్దపు అనుభవాలను అలవోకగా అందించిన ఇతర రచనలు: హనుమదింద్రగంటి "మరపురాని ముచ్చట్లు" (గౌతమీగాథలు), తాపీధర్మారావు "రాలూ-రప్పలూ", శ్రీ శ్రీ "అనంతం", కోదాటి నారాయణ రావు "చిన్ననాటి జ్ఞాపకాలు", సాహిత్యస్థాయిలోనూ, వ్యక్తిగత స్థాయిలోనూ కొన్ని విలువలు కోల్పోతున్న నేటి వాతావరణంలో నేటితరం విద్యార్థి యువజనులందరికీ ఈ గ్రంథాలు పాఠ్యగ్రంథాలు కావాలి. రాజుల దండయాత్రలను యాత్రలుగా మాత్రమే చిత్రించి ఆత్మగౌరవాన్ని చంపుకొన్న తెలుగుమేధావులను ఉమాకాన్తం శతించినందుకు "వరద కాలం" మెచ్చుకోవడం అభినందించ దగ్గది. అంతేకాదు, రాజకీయాలలో పతనదశగురించి, డెమోక్రసీపేరులో నాయకత్వాల "నామినేషన్" సంస్కృతి గురించీ ఇంటర్ విద్యార్థుల సివిక్స్ పాఠ్యగ్రంథంలో విమర్శలున్నందుకు కొందరు ప్రజాప్రతినిధులు బాధపడిపోతున్నారట! కానీ "వరదకాలం" చదివితే వారి బాధ ఇంకా "యమగోల"గా పరిణమిస్తుంది! వరదపెట్టిన చీవాట్లు వినండి: " మాతరం దిగ్గజాల్లాంటి రాజకీయ నాయకుల్నీ, గాయకుల్నీ, పండితుల్నీ కవుల్నీ, నటుల్నీ చూసింది.... ఆనాడు పెద్ద మనుషులే రాయకీయాల్లోకి వచ్చేవారు. నీతినిజాయితీపరులే రాజకీయరంగంలో ఉండేవారు. అప్పటికింకా రాజకీయం వృత్తిగా మారలేదు. ...తెలుగువాడు దుర్యోధనుడిలాంటివాడు, దుర్యోధనుడు తనకేమీ కావాలనడు: ధర్మరాజుకి మాత్రం ఏమీ ఉండకూడదంటాడు. తెలుగువారూ అంతే ... ముగ్గురుతెలుగువాళ్ళు జమ అయితే పార్టీపెడతారు. ఇద్దరు కూడితే ముఠాలు కడతారు. ఒక్క తెలుగు వాడైతే ప్రతిపక్షం పెడతాడు! ఈ పరిస్థితి అనాదినుంచీ మారలేదు. ఈ శతాబ్దం రెండో దశాబ్దాంతాన కూడా తెలుగువాడు అలాగే ఉన్నాడు!" కాని, శతాబ్దం ఆఖరి దశాబ్దంలో కూడా పరిస్థితి మారలేదు! వరద రచనలు ఇంగ్లాండులోని బ్లూమ్స్బరీ గ్రూపులోని ప్రముఖుడైన లిటన్ స్ట్రాచీ సారస్వత వివేచనలోనూ, ట్రూమన్ కపోటె "ది మ్యూజెస్ ఆర్ హర్డ్" రచనతోనూ పోల్చదగినవి. గడసరి, మాటకారి అయిన వరద కూడా కపోటే లాగే మంచి కన్వర్సేషనలిస్టు. conversation will always come with me అంటాడు. కపోటే! ఈ శక్తి విద్వద్గోష్ఠుల ద్వారా, వినికిడి ద్వారా, స్వాధ్యాయనం ద్వారా 'వరద'కు కూడా అబ్బింది. తన ఇల్లు ఒక శారదానిలయం కాగా జార్జెస్ సిమెనాన్ (అమెరికన్ రచయిత) లాగాఅందులో వరద ప్రేక్షకుడే కాదు, పాత్రధారి కూడా ("all the day, I am one of my characters")! రాబర్ట్ ఫ్రాస్ట్‌లాగా చతురంగా అయినా లోకంతో తగాదాపడడం వరక వరదా ("I had a lover's quarrel with the world" అన్నాడు ఫ్రాస్ట్)! రాజకీయ వాసనలతో మిళితమైన సాహితీ ఆత్మకథారచనలో 'వరద' మనకొక లియోనార్డ్ ఉల్ఫ్ ఉల్ఫ్ నాలుగైదు సంపుటాలలో ఆత్మకథరాశాడు. వరద తెలుగు సాహితీ లోకానికి కనీసం ఇంకా రెండు సంపుటాలైనా 'బాకీ' ఉంటారు!

(సంపాదకీయం, 'ఆంధ్రభూమి', ఆదివారం, అక్టోబరు 28, 1990)

## MEMORIES OF A GENIUS
### Gopalachakravarty

*Varadakalam.* Abburi Varada Rajeswara Rau.For copies: Navodaya Publishers, Vijayawada, Rs. 25.

*Andhra Ratna* Duggirala Gopala Krishnayya is one of the legendary figures of Andhra. As K. Iswara Dutt puts it: "There was thunder on his brow and lightning in his looks." He represented Andhra at her best emphasising the emotional aspect.

Abburi Varada Rajeswara Rau, poet, thinker, journalist, critic and essayist, is a great admirer of Andhra Ratna and this is reflected in his latest publication 'Varadakalam' a collection of his articles published in a local daily during 1985.

Gopalakrishnayya was a multifaceted genius, a 'sthita prajna' and lover of fine arts, says Varada; informs us that the great Nationalist Mohammed Ali called *Andhra Ratna's 'Ramadandu'* the Red Army of India. We are also informed that the veteran stage actor Addanki Srirama Murti emulated the poetry recitation method of *Andhra Ratna.*

More than forty eminent Andhras- Konda Venkatappaiah, Puchalapalli Sundarayya, Basavaraju Appa Rao, Ballary Raghava, Addanki Srirama Murti, Abburi Ramakrishna Rau, Lanka Sundaram, Chalam, Sri Sri, Thapi Dharma Rao, Akkiraju Umakantham, Rachkonda Viswanatha Sastri and a host of others-come alive in the pages of Varada's book. What he writes are essentially reminiscences. He does not draw conventional portraits. One is amazed at his capacity to remember matters which happened . half a century ago with such sharp detail. Evidently he has no notes to depend upon. He draws the Vignettes with the aid of his phenomenal memory.

The book is not an autobiography, but collection of an intellectual's memories-memories of a genius who has seen several events in modern political and literary history from a ring-side seat. It provides back ground information about some of the stalwats who strode the Telugu literary seene with great gusto. The preset generation can find a wealth of information in the book about writers and theatre personalities of the previous era.

Marked by objectivity and passion for truth, Varada's reminiscences are laced with sparkling wit. His character sketches deftly and artistically drawn, remind us of Lytton Strachy's "Eminent Victorians". The difference, however, is that Varada enjoys a greater measure of intimacy with the people he writes about.

Varada's abundant sense of humour peeps through every page of the book, At one place, he says: "The Telugu man is like Duryodhana: he does not want anything for himself, but he wants that Dharmaraju should not get

anything. Three Telugu people, if they come together, form a party; two will form a group, and one Telugu man will start an opposition".

"Kavana Kuthuhalam" is the first publication in the series of Varada's memories and this is the second one. As an eminent journalist put it, Varada "has a lover's quarrel with the world" like Robert Frost and "all the day he is one of his characters". A thoroughly enjoyable book.

The book is finely produced. The cover is drawn by 'Chandra'.

('Indian Express', Hyderabad, November 13, 1990.)

## పసిడి రెక్కలు విసిరిన 'వరదకాలం'

**పురాణం సుబ్రహ్మణ్యశర్మ**

తెలుగువారి సాహిత్య, సాంస్కృతిక జీవనానికి అక్షరబద్ధమైన నేపథ్యం ఈ వరదకాలం. 1985లో 'ఉదయం' దినపత్రికలో ధారావాహికంగా వెలువడిన ఈ వ్యాసపరంపర వెనకటి మనుష్యులు సంగతులపట్ల 'నోస్టాల్జియా' ను పెంచి, ఆలనాటి జ్ఞాపకాం లోనికి మనం కూడా ప్రయాణం చేస్తాము. ఒకరి జ్ఞాపకాలలోకి మరొకరు పతితగా ప్రయాణం చేయడమే ఈ వరదకాలం రచనకు సాఫల్యం.

వరద తరంవారు దిగ్గజాల్లాంటి రాజకీయ నాయయకులని, గాయకులని, పండితులని, కవులని, నటులని చూశారు.

... బందరు గురించీ, విద్యానిలయం గురించీ చదివినప్పుడు ఇటువంటి వ్యాస పరంపర తెలుగు దేశంలోని విద్యానగరాలైన విజయనగరం, రాజమండ్రి, విశాఖపట్నం, కాకినాడ, గుంటూరు, ఏలూరు ఇలా స్థలపరంగా కూడా సాహిత్య సాంస్కృతిక వికాసాన్ని చిత్రించవచ్చునని ఈ పుస్తకం చదివితే అనిపిస్తుంది...

...'వరదకాలం' లోని వ్యాసాలు ఇన్ బిట్వీన్ దిలైన్స్ గా కొన్ని చరిత్రలో భాగం అయిన విషయాలను గురించి తెలుసుకోవడానికి చక్కగా ఉపయోగిస్తాయి.

... ఆనాటి బెజవాడా లేదు, విశాఖపట్నం లేదు ఇప్పుడు. ఆ సంగతి గ్రహించడానికైనా 'వరద కాలం' చదవాలి ...

... ఈ వరదకాలం ఇందులోనిదంతా క్షీరసాగరమథనమే అనుకోవాలి. అటువంటి హేమాహేమీలతో కలిసి ఉన్న కాలాన్ని నేట అరటి చెట్లు గాళ్లతో పోల్చుకున్నప్పుడు నిరాశ కలగక మానదు...

ఈ పుస్తకం అంతా ఒక ఎత్తు. అంతటా పరుచుకున్న విశాఖపట్టణం జ్ఞాపకాలు ఒక ఎత్తాను. తెనాలి వారైన అబ్బూరి వారి కుటుంబం విశాఖపట్నంలో ఇమిడి పోవుటం చేత వారు విశాఖవారు అయ్యారు... ఈ జ్ఞాపకాల్లో విశాఖ స్మృతులు నిజంగా అపురూపాలు.

...అక్షర మాత్ర సహాయం చేత గతంలోకి ప్రయాణించి, జ్ఞాపకాలలో తానమాడి పునీతులము అవుతాము.

('ఉదయం', నవంబర్ 15, నవంబర్ 30, 1990)

## తల్లిమరణం

**[1986లో మే 27న తల్లి మరణం సంభవించింది.]**

అబ్బూరి సతీమణి కాలధర్మం
(ఆంధ్రప్రభ ప్రతినిధి)
హైదరాబాద్, మే 28.

ప్రముఖ కవి, నాటకకర్త స్వర్గీయ అబ్బూరి రామకృష్ణారావు సతీమణి శ్రీమతి అబ్బూరి రుక్మిణమ్మ మంగళవారం నాడు ఇక్కడ మరణించారు. ఆమె వయస్సు 84 సంవత్సరాలు. కొంతకాలంగా ఆమె అస్వస్థులుగా ఉన్నారు.

శ్రీమతి రుక్మిణమ్మకు నలుగురు కుమారులు, ముగ్గురు కుమార్తెలు ఉన్నారు. 1930లో ఆమె చీరాల సత్యాగ్రహంలో పాల్గొన్నారు.

శ్రీమతి రుక్మిణమ్మ భౌతికకాయానికి నేటి ఉదయం ఇక్కడి అంబర్‌పేట శ్మశానంలో అంత్యక్రియలు జరిగాయి. ఆ సందర్భంగా పెద్ద సంఖ్యలో స్నేహితులు, బంధువులు హాజరయ్యారు.

-('ఆంధ్రప్రభ', మే 29, 1986.)

# The Radical Humanist

an independent monthly devoted to secular democracy

*Editor* : V. M. Tarkunde
*Managing Editor* : R. M. Pal

B-17, Maharani Bagh,
New Delhi - 110065.

June 3, 1986

My dear Rajeshwar,

It is with deep sorrow that we received the news of the sad demise of your respected mother. Please accept our heartfelt condolences.

I know too intimately you and your wife looked after her. Our thoughts are with you and all the members of the family.

With warm regards,

affly,

R. M. Pal

Dy. No. 4611 M(HRD)/86

मानव संसाधन विकास मंत्री

June 13, 1986

My dear Rajeshwar Rao,

I was grieved to learn of your mother's demise. I remember the kindness with which she treated me whenever I met her. I know how difficult it is to reconcile oneself to the loss of one's mother. I send my heartfelt condolences to you and the bereaved family.

Yours sincerely,

P.V. Narasimha Rao

(P.V. Narasimha Rao)

Shri A.V. Rajeshwar Rao,
Block No.IV, Flat No.4,HIG,
Baglingmpally,
HYDERABAD

*MINISTRY OF HUMAN RESOURCE DEVELOPMENT*
*SHASTRI BHAWAN. NEW DELHI-110001*



[ వివాహాల సందర్భంలో కుటుంబ సభ్యులతో అబ్బూరి రామకృష్ణారావు దంపతులు]






## 'కవనకుతూహలం'

[వరదరాజేశ్వరరావుగారి అపూర్వరచన "కవనకుతూహలం" 1989లో పుస్తకరూపంలో ప్రచురింపబడింది. ఇది మొదట 1986లో 'ఆంధ్రప్రభ' సచిత్ర వారపత్రికలో ధారావాహికంగా వెలువడింది. ఈ పుస్తకాన్ని రాజేశ్వరరావుగారు తనకు పరమాప్తుడైన బాల్యమిత్రుడూ, చిరకాల మిత్రుడూ, ప్రసిద్ధ రచయిత రాచకొండ విశ్వనాథశాస్త్రిగారికి అంకితం ఇచ్చారు.]

Dt. 28.8.87.

Dear Shri Abburi,

I regularly follow your Kavana Kutuhalam in Andhra Prabha Weekly (కవన కుతూహలం). I am very well acquainted with your father Late Shri Ramakrishna Rao while I was a student in A.U. College in 1934-36. As I am interested in Telugu literature, I am acquainted with almost many of the modern poets you mentioned in your Kavana Kutuhalam like Krishna Sastry,

Puripanda, Sri Sri, Jalasutram, Bapiraju (Adavi), Vedula, Viswanatha and others. I do not know how I could not meet you for such a long time. I want to meet you once, make your acquaintance and spend atleast an hour with you to exchange our ideas on modern Telugu literature....

So please drop a card to the above address when it will be convenient to you to spare an hour on one day.

yours sincerely,

283 S.R.T. Jawaharnagar,
R.T.C.X Roads,
Hyderabad.

M.V. Siva Ram Krishna
Journalist.

•

చెరుకువాడ వెంకట్రామయ్య నుండి-

విస్సాకోడేరు
W.G.Dt. 534244

శ్రీ వరద రాజేశ్వరరావుగారూ!

నమస్కారములు.

ఉదయంలో 'వరద కాలం' చదివి ముగ్ధుడనవుతూండేవాణ్ని! అకస్మాత్తుగా ఆ పేశారు ఉదయంలో వరదకాలం. నిరాశ పడ్డాను. ఎందుకంటే, అమూల్యమైన భావపరంపరను అందిస్తూ వచ్చారు. ఆ అనుభూతి మీదైనా, చెపుతూంటే మేమూ అనుభూతికి లోనయ్యాము....

యిటీవల శ్రీకాకుళంలో పట్టణానికి పదిమైళ్ళ దూరంలో చిన్నగ్రామంలో వుండవలసి వచ్చింది. వారం వారం ఆంధ్రప్రభ కోసం-మీ కవనకుతూహలం కోసమే! శ్రీకాకుళం రావలసి వచ్చింది. మరలా మావూరు వచ్చేశాను. నేను వారప్రతికలు చదవడం మానేశాను. అసలు చదవడమే మానుకున్నాను. శ్రీ ఉషశ్రీ (ఆకాశవాణి)ని అడిగాను. 'వరద కాలం చదువు' అని ప్రోత్సహించారు. మీ గురించి కొన్ని వివరాలతో పరిచయం చేసారు. శ్రీ పురిపండా వారిని- శ్రీ నారాయణబాబుని- శ్రీ శ్రీ ని - ముద్దుకృష్ణను - కృష్ణశాస్త్రిగారిని-మాకు తెలియని తురగావారిని - యింకా యింకా యెందరినో సన్నిహితంగా స్పష్టంగా సూటిగా మాకు మీ దివ్యానుభూతిని పరిచయం చేస్తున్నారు. కవన కుతూహలం-కుతూహలంగా కమనీయంగా వుంటున్నది. మీతో పరిచయం లేకపోయినా చిరకాలంగా మీరు నాకు సన్నిహిత గౌరవనీయ మిత్రులుగా కనిపిస్తున్నారు. చలంగారు ఎంత హ్యాయిగా మాట్లాడేవారో విన్నాను. కృష్ణశాస్త్రి గారు మూగవోయిన తర్వాత చూశాను. మా తండ్రిగారికి వారు పరమాప్తులు. శ్రీ అడివి బాపిరాజుగారు మా తండ్రిగారికి మిత్రులు కావడం - ఆరీత్యా ఎందరో కవి పండితులు మా యింటికి రావడమూ-మాలో సాహిత్య 'గుబాళింపు' ఏర్పడటం జరిగింది. నేను కవిని కాదు. పండితునీ కాదు. సామాన్యుడను మాత్రం. మీ తండ్రిగారి పద్యాలు నా చిన్నతనంలోనే చదువుకున్నాను. యీనాటికీ సుళువుగా జ్ఞాపకం వున్నాయి. మీరు కవనకుతూహలం పుస్తకరూపంలో తేవాలి. జాతి కవసరం. మీ అనుభవపరంపర చివర వరకూ కొనసాగాలి-యిదే నా ఆకాంక్ష.

జవాబు వ్రాయించ ప్రార్థన. నమస్కారములతో,

[illegible]

అయ్యా,

నా పేరు రామారావు. నా దేశం భారతం (హర్షక్షేత్రం చేద్దామనుకున్నా "కురుక్షేత్రం" అయి కూర్చుంటున్నది.) నామతం కమతం, నా కులం వ్యాకులం, వృత్తి I.M.C..C (ఇండియాస్ మిజరబుల్ క్లెరికల్ కోర్), సభ్యత్వం అఖిలభారత ప్రోనోటు రచయితల సంఘం (నా రచనలు రాయించుకున్న వారివద్దనే వుంటయ్, లేక న్యాయస్థానాల్లో. కొన్ని 'చెదరి చెదరి తామె చెదం జేరే!)

మీరు వృద్ధాప్యంలో ముడతలు పడ్డారా- ప్రభపేజీల్లో పసందుగానే వున్నారే-అచ్చొత్తు వాడు నేర్పరి.

దినచర్య? 'అందాక' వుంది నావద్ద! వద్దామంటే ఓపిక లేదు. మీవాడు[వాణీ కుమార్] ద.హ [ధనికొండ హనుమంతరావు] యింటి వద్ద కనపడతాడు సకృత్తుగా.

నా కిడ్నీలకు ఓపికలేదు. మోటారు సైకిల్ క్రింద పడ్డాను. నడుం మూడు తుండ్లు! బొత్తిగా నవ్వేవాడు లేదు, ఆముదం భోంచేసినట్లుంటారు, ఎందుకో. జనవరిలో ముప్పాతిక లోకి వస్తా (75). శిష్ట్లా ఉమేశ్ బొమ్మ పంపుతున్నా. 40 ఏళ్ళయ్యి. కాస్త మాసిపోయాడు; మీ రచన ఆనందం కలిగించింది. కంగ్రాట్స్ చెప్తూ లెటర్ వ్రాశా. "జవాబు" దారీ ఉద్యోగం కాదేమో. నిరుత్తరుడు.

జవాబు వ్రాయాలి. కొత్తిమీర కంటె చౌకే-యింకా......... (15రో ఆఫీస్, 15 రో సుస్తీ)

[signature]

18-12-1986.

['చందమామ' రామారావుగారు 1986లో పంపిన ఫొటో]



[శిష్ట్లా ఉమా మహేశ్వరరావు]

చాగల్లు
3-10-86.

మహారాజశ్రీ అన్నగార్కి
నమస్కారాలు.

యీవుత్తరంతో పాటు, పుష్పసూన ప్రచురణలు-రెండు ప్రసూనరాజాలు-1. శృంగార పంచకము-మీ గురువుగారైన లేటు సెట్టి లక్ష్మీనరసింహంగారి సంకలనం-2. కాళిదాస లంబోదర ప్రహసనం-అనామధేయుని అనువాదం, మీ కోరిక (కాదు ఆజ్ఞ)అనుసరించి పంపుతున్నాను.

అన్నప్రకారం వెంటనే పంపలేక పోయినా ఆలస్యంగానైనా అందచేస్తున్నాను. ఆగ్రహించకండి!

అన్నట్టు, చంద్రరేఖ మీ యింట్లో ఎక్కడో విలపిస్తూ వుండాలి. సారంగపాణి కూడా ఏ మూలో సారంగి మీద పదాలు ప్రాక్టీసు చేస్తూ వుండాలి. సమధాన ప్రాప్తి కలిగిస్తే చాలా సంతోషం-కాదంటే -అంతే?

చిత్తగించవలెను,
భవదీయుడు,
(సంతకం)
★[పి.జె. అప్పారావు]

తా.క: ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రికలో మీ చేత సంకలనం(కాపీరైటుతో సహా) చేయబడిన "కవన కుతూహలమ్" ప్రచురణ సాహిత్య'దురద'గాళ్లకి కొంత ఉపశమనం కలిగించినా నాబోటి 'తామర' గాళ్లకి మీ స్వంత సామానుకూడా బజార్లో ఎపుడు పెడతారో అని కుతూహలం కుతకుత లాడిపోతోంది. కాబట్టి వీలుని బట్టి మీ స్వంత ఫార్మసీ నుంచి పూర్ణచంద్రోదయం ఒకటైనా ప్రచురించండి.

★ [వరద రాజేశ్వరరావు గారి తోడల్లుడు]

●

శ్రీ అబ్బూరి వరద రాజేశ్వర రావుగార్కి- ద్వా.నా. శాస్త్రి [22-12-86]
నమస్కారములు-

మీ కవనకుతూహలాన్ని వీక్షిస్తూ ప్రశంసిస్తూ వున్నాను. నేను దొణప్పగారి వద్ద సంవత్సరం క్రితం "మారేపల్లి రామచంద్ర శాస్త్రిగారు (కవిగారు)-కవితాసమీక్ష" అనే అంశంపై పరిశోధన చేసి ఎం.ఫిల్ పొందాను. త్వరలో అది పుస్తకంగా తీసుకురాబోతున్నాను. మీరు విశాఖ వాస్తవ్యులు కాబట్టి కవిగారి జ్ఞాపకాలు నాకు తెలియపరిస్తే పుస్తకంలో పొందుపరుస్తాను. లేదా ప్రభ వీక్లీలో ఓ వారం కవిగారి గురించి రాయండి. ఫోటో కావాలంటే నేను పంపిస్తాను. జవాబు వ్రాయప్రార్థన.

ఉం
ద్వానాశాస్త్రి

●

P. Paparao
Door No. 49-35-29
Abidnagar
Akkayyapalem

Visakhapatnam-530016

Date: 25.5.87

మైడియర్ వరదాయ్!

ఎవర్రా వీడు నా ముద్దుపేరు పెట్టిరాస్తున్నాడు అని అనుకుంటున్నావు కాదూ! బహుశా నా చిరునామా నుంచి పోల్చుకోలేవులే. ఏమంటే 50 ఏళ్ల క్రిందటి విషయాలు-ముఖ్యంగా ఎట్టి ప్రాముఖ్యత లేని వాళ్ల గురించి-ఎటువంటి ప్రాముఖ్యత లేకపోవడమే నా యొక్క ప్రాముఖ్యత కాదా! పేరును బట్టి పోల్చుకోడం అంటే కష్టమేమరి.

ఈ ఊళ్లో విస్సర్తివారి వీధిలో స్వర్గీయులు పింగళి లక్ష్మీకాంతం గారి నివాస గృహము అరుగు జ్ఞాపకం తెచ్చుకో. లీలగా కనిపిస్తోంది కాదూ! ఆ ప్రాంతంలోనే కొత్తగా M.N. Roy పేరును బహుశా ఆంధ్రాకి దిగుమతి చేసిన వారు మీ నాన్నగారు అబ్బూరి రామకృష్ణారావుగారు.

చెవుల్లో వేళ్లు పెట్టుకుని బాబులూ సుత్తి కొట్టవద్దని బతిమాలుకున్నా వినకుండా మా ప్రాణాలు తీసేవాడు మీ అన్న "వాణి".. సరే వాడెక్కడ?

పింగళి వెంకటరత్నం, అన్నాజీ రావు-పద్మనాభం-లాస్టు బట్ నాటిది లీస్టు పాపారావు-ఈపాటికి జ్ఞాపకం వచ్చి ఉండాలి.

డబ్బిచ్చి కొనకపోయినా FS గా దొరికితే ఆంధ్రప్రభ వారపత్రికలో నీ 'కవనకుతూహలమ్' చదవడం అలవాటు.

ఈ ఉత్తరం నీ చేతికి వచ్చి (ఆంధ్రప్రభ వారపత్రిక ఎడిటర్ ధర్మమా అని) దానికి జవాబు వస్తే అప్పుడు పునః పరిచయం చేసుకుంటా.

ఉత్తరం నీకు అందాలి-దానికి నువ్వు శ్రద్ధగా జవాబు రాయాలి. పోస్టువాళ్ల చెత్తబుట్టలో పడకుండా నీకు చేరాలి- Many a slip between the cup and the lip.

అంతవరకు ఆయుఃరారోగ్య ఐశ్వర్య ప్రాప్తిరస్తు అని దీవిస్తూ విరమించుతా.

ఇట్లు

[signature]

9.10.87

బెంగుళూరు.

శ్రీ వరద రాజేశ్వరరావుగారికి,

నమస్కారాలు.

మీ 'కవన కుతూహలం' కాలంను తొలి రచన నుంచి తప్పకుండా చదువుతున్నాను. అన్నింటివి 'ఫైలు' చేసుకుంటున్నాను కూడా.

తెలుగుకవి, పండితుల జీవితం, రచనల గురించి ఎన్నో కొత్త విషయాలు, ఆసక్తికరమైన రీతిలో మీరు తెలియచేస్తున్నారు.

ఒక శీర్షికను ఇంత కుతూహలకరంగా నడపడం చాలా నేర్పుతో కూడుకొన్న పని. ఈ పనిని మీరు ఎంతో ప్రతిభతో నిర్వహిస్తున్నారు. అందుకు మిమ్మల్ని హార్దికంగా అభినందిస్తున్నాను.

ప్రస్తుతం మీకు వ్యక్తిగతంగా తెలిసిన రచయితల గురించి మీరు రాస్తున్నారు. మీరు రాసిన వారిలో దాదాపు అందరూ కోస్తా ప్రాంతంవారే. మీ తండ్రిగారితో సంపర్కం ఉన్న వ్యక్తులగురించి మీరు రాస్తున్నారు. కట్టమంచి, రాళ్లపల్లి, డా. చిలుకూరి నారాయణరావు, పుట్టపర్తి నారాయణాచార్యుల గురించి కూడా త్వరలో రాస్తారని భావిస్తున్నాను.

కట్టమంచి రామలింగారెడ్డిగారితో మీ నాన్నగారికున్న సాన్నిహిత్యం చాలా గొప్పది. కాబట్టి CR Reddy గారి గురించి కనీసం 3, 4 వారాలైనా రాస్తారని భావిస్తున్నాను.

అలాగే రాళ్లపల్లి, డా. చిలుకూరి నారాయణరావుగారి గురించి కూడా రాస్తారని-విపులంగా-ఆశిస్తున్నాను.

మీ తమ్ముడు G.K. Abburi ద్వారానిన్ననే నాకు మీ చిరునామా దొరికింది. మీ తమ్ముడు నాకు కొంతకాలంగా తెలుసు. ఆయన అత్తగారి వూరు-మా వూరూ ఒకటే-అనంతపురం.

మిమ్మల్ని మా 'అభిరుచి' తెలుగు సాంస్కృతిక వేదిక ద్వారా బెంగుళూరుకు ఆహ్వానిస్తున్నాను. మీరు ఎప్పుడు రాగలరో చెప్పండి. రెండు మూడు రోజులు ఇక్కడ ఇష్టా గోష్ఠి జరపవచ్చును.

మీ

G. Aswathanarayana

ఘట్టమరాజు

•



# ANDHRA JYOTI

VIJAYAWADA, HYDERABAD & TIRUPATI
(Proprietors: ANDHRA PRINTERS Ltd.)

EDITOR:
NANDURI RAMAMOHANA RAO

VIJAYAWADA-520 010
Phones-Office: 474532, 473694
Resi.: 476900

పూజ్యమిత్రులు శ్రీ వరద రాజేశ్వరరావు గారికి,

నమస్కారం. మీ పరిచయభాగ్యం ఆలస్యంగానైనా కలిగినందుకు నేనెంత సంతోషపడుతున్నానో చెప్పలేను.

మీరు అజంతా ద్వారా పంపిన పుస్తకం అందింది. వీలైనంత త్వరలో రివ్యూ రాద్దామని ఉదిలాటం.

ఈ ఏడాది ఆంటన్ చెకోవ్ సంవత్సరంగా యునెస్కో ప్రకటించింది. అందుచేత మా

సోమవారం సాహిత్యవేదికలో మీ వ్యాసం ఒకటి వేయాలనుకున్నాను. (మీరు షెరీ ఆర్చర్డ్ అనువదించారు కదా!) చెఖోవ్ నాటకాల్లో ప్రసిద్ధమైనవి-షెరీ ఆర్చర్డ్, అంకుల్ వాన్యా, త్రీసిస్టర్స్, సీగల్-తీసుకుని వాటిని స్పృశిస్తూ నాటకరచయితగా చెఖోవ్ గురించి ఒక చిన్న వ్యాసం (డెయిలీలో సుమారొక కాలమ్-మీ వ్రాతలో నాలుగు అరఠావులలో) పంపమని అభ్యర్థన. అతడిని తెలుగువారు కథారచయితగానే ఎక్కువగా ఎరుగుదురు కాని, నిజంగా అతను గొప్పనాటక రచయిత కదా? అతడి నిరాశా వాదంగా కనిపించే ఆశావాదం నాకు చాలా ఇష్టం. మీరు ఒక వారం పది రోజులలో వ్రాసి పంపగలరా? ఏప్రిల్ లోనే వ్యాసం వేయాలనుకుంటున్నాను.

సం॰దూరి రామమోహనరావు

7.4.90

---

మాన్యులు వరద రాజేశ్వరరావు గారికి,

నమస్కారం.

మీరు చెఖోవ్ నాటకాలపై ఎప్పుడైనా మాకు వ్రాయవచ్చు. మీ తీరికను బట్టి వ్రాయండి.

ఈ లోగా మాకు ఎడిట్ పేజి మిడిల్ గా వారం వారం ఓ చిన్నకాలమ్-మీ సాహిత్యానుభవాలు, జ్ఞాపకాలు, వ్యాఖ్యలతో-వ్రాయగోరుతున్నాను. చిన్నదంటే నిజంగానే చిన్నదిగా వుండాలి. మీరైటింగ్‌లో 1/2, 2 అరఠావులు మించకుండా వుంటే సరిపోతుంది. లేదా, ప్రస్తుత రాజకీయ, సాంఘిక, సాంస్కృతిక, సాహిత్య పరిస్థితులపై -నిత్యం వచ్చే వార్తలను ఆధారం చేసుకొని రన్నింగ్ కామెంటరీగా కొత్త తరహా కాలమ్ ప్రారంభిస్తే బాగుంటుందేమో ఆలోచించండి.

సందూరి రామమోహనరావు.



[మిత్రులు సోమంచి యజ్ఞన్నశాస్త్రి, డా. అక్కిరాజు రమాపతి రావు, వాసుదేవరావు గార్లతో]

[సమీక్షలు]

## 'వరద' కాదు, సెలయేరుల కలకలం......!

[ఎ.బి.కె. ప్రసాద్]

ఒక్కొక్క రచన చేయడానికి ఎంతటి ధిషణ, ఆర్ద్రత కావాలి, మరెంతటి అనుశీలన, అనుభూతి, అనుకంపన అవసరం! అందులోనూ స్థలకాలాదులకు అతీతంగా పలువురు ప్రసిద్ధులతో, పరిసరాలతో ఏర్పడిన పరిచయాలనూ, అనుభవాలనూ అప్పటికప్పుడు లిఖితం చేయడంకాదు, కొన్ని దశాబ్దాల తర్వాత ధారణ శక్తితో, 'రసనాగ్ర నర్తకి'లా మననం చేసుకొని అకుంఠితంగా కలాన్ని నడిపించడానికి ఎంతటి సాధనకావాలి! అలాంటి కృషిలో అగ్రతాంబూలం అందుకోగల రచనలు అటు మొన్నటి వరకూ రెండేరెండు– శ్రీ పాద సుబ్రహ్మణ్యశాస్త్రి "అనుభవాలూ జ్ఞాపకాలూను", శ్రీ శ్రీ "అనంతం" కాగా, మొన్నటి రచన ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి "గౌతమీ గాథలు"; ఆ తర్వాత చెప్పుకోదగింది నిన్నటి, నేటి రచన అబ్బూరి వరద రాజేశ్వరరావు "కవన కుతూహలం"! యుద్ధంలో కదన కుతూహలమూ, సాహిత్య సమరాంగణంలో 'కవన కుతూహలమూ' ఒకే కోవకి చెందుతాయి! శ్రీ వరద రచన ఆధునికాంధ్ర సాహిత్య చరిత్రలో ఒకటి రెండు దశాబ్దాలకు పూర్వం "స్వర్ణయుగం"గా భావించుకున్న 'ఒక మహోజ్వల ఘట్టంతో' సంబంధం ఉన్న సాహితీ స్రష్టల గురించిన జ్ఞాపకాలు మాత్రమే కావు; ఇది రొడ్డకొట్టుడు పద్ధతిలో వెలువడిన ఆత్మకథ అంతకంటే కాదు; పరనిందా రచన అసలే కాదు; రెండు దశాబ్దాలకూ కాదు; అగణితమైన సంఖ్యలో వరద పేర్కొన్న కవులూ, రచయితలూ, నాటక కర్తలూ ఇందులో బారులు తీరి పాఠకులకు అజ్ఞాతనేత్ర దర్శనం చేయడానికి 'క్యూ'లో నిలబడడం చూస్తే ఇది, సాహిత్యావలోకనంలో అయిదు దశాబ్దాలకు ప్రతినిధిగా నిలబడుతుంది. అయితే ఆ పనిని శ్రీ వరద సాహిత్య సిద్ధాంత రాద్ధాంతాలతో బాధించే ప్రక్రియతో కాకుండా తనకు సహజమైన చతురిమతో, హేళన అనిపించని పరిమిత అవహేళనతో, పరదాలు తొలిగించి సరదాగా సాధించారు! సాహిత్య వివేచన, విమర్శన, హాస్యప్రియత కలబోసిన రచన. ఆయన కవిత్వమేమో గాని, తెలుగు సాహిత్యం బతికున్నన్నాళ్ళూ పాఠకుల మనస్సులపై చెరగని ముద్రవేయగల రచనగా "కవనకుతూహలం" నిలిచి పోతుంది. విశాఖ, మదరాసు, ఢిల్లీ, తెనాలి, గుంటూరు బెజవాడ ఇత్యాది నగరాలలో ఎక్కడ సాహిత్యసభలు జరిగినా, గోష్ఠులు జరిగినా అదొక వ్యసనంగా కాళ్ళు కదిపి, విజ్ఞానఖనీ, మహాపండితుడైన తండ్రి అబ్బూరి రామకృష్ణారావుకు తగిన సాహిత్యపుత్రుడుగా ఆ సభలలో పాల్గొని, గడించిన ఎన్నో అనుభవాలకు అక్షర రూపం ఈ గ్రంథం. ఈయనకు ఎవరెవరితో పరిచయం అంటే చెప్పడం కష్టం! ఒకరా, ఇద్దరా! వారిలో కొందరు తన సమకాలికులయితే, మరికొందరు తండ్రి రామకృష్ణారావుగారి వృద్ధ సాహితీమిత్రులు! ఆ సంపర్కం ఈ రచన ద్వారా వరదతో ఆ చంద్రతారార్కం కావడానికి అవసరమైన సంభారాలూ వాతావరణమూ అలా కుదిరాయి. ఇందులో ప్రాచీన, అర్వాచీన, పాశ్చాత్య సాహిత్యోద్యమాలతో కవితా ధోరణులతో మునిగి తేలుతున్న వారంతా వరదరచనా వైశిష్ట్యం వల్ల మీకు ఎంతో పరిచయస్తుల్లా ఎదురై పలకరిస్తారు! అదొక సాహితీ ఇంద్రధనుస్సు.

అబ్బూరి సమకాలికులైన రాయప్రోలు, విశ్వనాథ, కృష్ణశాస్త్రి ప్రభృతులతో పాటు ఆధునిక సాహిత్య వ్యవసాయాన్ని సుసంపన్నం చేస్తూ వచ్చిన శ్రీ శ్రీ, శిష్లా, జలసూత్రం, ఆరుద్ర, మల్లవరపు, ఏల్చూరి, తిలక్, బైరాగి, బెల్లంకొండ, అజంతా.... ప్రభృతులూ, వారి కవితా విన్యాసాలూ, వాటిపై వరద ఉరవడిలో నడిచిన 'వరద' భాష్యపరంపరా మనల్ని గిలిగింతలు పెడతాయి! అందుకే ఇది కొలది మందికి పరిమితమైన అనుభవ పేటికకాదు. ఆంధ్రదేశమంత వెడల్పూ, తెలుగు సాహిత్యమంత లోతూ ఉన్న అపురూపమైన రచన అని చెప్పడం. రాత్రింబవళ్ళు చర్చలలో, కవితా విన్యాసంలో గడిపి తిండీ తిప్పలెరుగని అనేక మంది కవులకు, రచయితలకు తన యిల్లే ఆశ్రయంగా జీవించిన, నేటికీ జీవిస్తున్న శ్రీ వరద రచనాపద్ధతీ, కమ్మని రచనాశైలీ, ధారాశుద్ధీ ప్రశంసనీయం. ఆ మాటకొస్తే, నేటికీ ఎందరో యువకులకు, పరిచయమైతేచాలు వదలి పెట్టని మనీషి వరద.... ఈ రోజుకీ అతను "అబ్ధిఘోషలో శబ్దతరంగం" గానే ఉన్నట్టుంటారు!! ఒక తరానికి తండ్రితో పాటు కౌమార దశలోనే కవి కుమారుడై తన తరానికి ఒక ఇన్స్పిరేషన్ గా మారాడు. కనుకనే అజంతా చెప్పినట్టు "ఆయా కవి ప్రముఖుల జీవితాలలో రసవత్తర సన్నివేశాలను, వచోవైభవస్మృతి విశేషాలను అనితర సాధ్యమైన రీతిలో" శ్రీ వరద గ్రంథస్తం చేయగలిగారు.

ఇలాంటి రచనకు, అనుభవ నైవేద్యాలకూ సీమాంతరాలలో పోలిక బెర్నార్డ్ లెనిన్ "కండక్టెడ్ టూర్". అతనిది వాగ్గేయ కారుల కుటుంబం కాకపోయినా ప్రసిద్ధ రచయితగా యూరప్‌లో 12 సంగీతోత్సవాలకు హాజరై లెనిన్ సాహిత్య 'గుబాళింపు' లతో రసవత్తర ఘట్టాలతో సంగీత సమీక్షలు చేశాడు. అలాగే 1920, 30 లలో పారిస్ సాహిత్య గోష్ఠులకు నిలయమై ఒక తరాన్ని అమితంగా ప్రభావితం చేసిన సిల్వియా బీచ్ నెలకొల్పిన "షేక్స్పియర్ అండ్ కంపెనీ" ప్రచురణ సంస్థ ఈ సందర్భంలో గుర్తుకు రాకమానదు. అబ్బూరి వారి ఇల్లు మాదిరే ఒక దశలో అదొక కవన మందిరం, కావ్యతీర్థం. దాన్ని పావనం చేసిన ప్రముఖులు జేమ్స్ జాయిస్, జాపాల్ సార్త్రే, లూయీ ఆరగాన్. అలాగే అమెరికాలో "హెమింగ్‌కోహెన్" అమెరికన్ రచనల్లో మైలు రాళ్ళు (Landmarks in American writing) అన్న గ్రంథం కూడా శ్రీ వరద రచనమాదిరే సాహిత్యం, లలిత కళలు, రాజకీయ ధోరణులకు సంబంధించిన ఎన్నో అంశాలను ఎరుకపరుస్తుంది. వాల్ట్ విట్‌మన్‌లా శ్రీ వరద అవసరమైన చోట్ల ఎంతటి వారినైనా 'వద్దించకుండా' వదిలింది లేదు! అయితే ప్రజల సమస్యలతో బొత్తిగా సంబంధంలేని భావకవితా ధోరణికి చెందిన 'వరద' వచన కవితను 'మిల్లు ఖద్దరు'గా అవహేళన చేయడం, అభ్యుదయ సాహిత్యోద్యమాన్ని కేవలం "నినాదబ్రహ్మ"గా ఈసడించుకోవడం ఆయనలోని కొంటెతనానికి నిదర్శనం! అజ్ఞాతంగా ఉండవచ్చుగాని 'నాదం' కూడా ఒకరకమైన నినాదమేనని మరవకూడదు!! ఇది క్రోత సంస్కార సంబంధి! ఈ రోజున "కంటెస్ట్" పేరిట కోర్టులకెక్కి సాహిత్య విమర్శనే అడ్డుకోజూస్తున్నారు గాని, రామకృష్ణకవులూ, తిరుపతి కవులూ 'ఢీ' కొన్న సన్నివేశాలను మరచి పోతున్నారు. కొన్నాళ్ళ క్రితం ఇంగ్లాండులో "బ్లూమ్స్‌బరీ" సాహిత్యమండలి (గ్రూపు), బ్రిటిష్ రచయితల, కవుల, కథలూ, గాథలూ యథాతథంగా అచ్చువేసి ముందుతరాలకు మహోపకారం చేసింది. ఆ పనిని ఇక్కడ కూడా చేయాలన్న శ్రీ వరద తలవంపు "కవన కుతూహలం" తో ఒక మేరకే నెరవేరింది.

ఇప్పటికైనా "తీరిక చిక్కితే" అన్న పదాన్ని మానుకుని ఈ పుస్తకంలో ప్రస్తావించని పెక్కుమంది తన సన్నిహితుల కథలూ గాథలూ కూడా ప్రచురించి తీరాలి. ఇది అనుశాసనం! అంత వరకూ మనం

*"పెలయేరుల కలకలముల*
*చిరుగాలుల మృదుగీతల*
*మంజులమగు నీ పలుకులె*
*మదికి దోచురా!"* అనుకుంటూ ఉందాం!!

(సంపాదకీయం 'ఆంధ్రభూమి', జూన్ 25, 1989.)

ఏల్చూరి మురళీధరరావు.

**కవన కుతూహలం**

రచయిత: అబ్బూరి వరదరాజేశ్వరరావు, క్రౌను సైజు XVI+271 పుటలు. [ప్రతులకు: నవోదయ పబ్లిషర్సు, విజయవాడ, వెల : రూ. 25.]

కవనకుతూహలం–ఇటీవలన వెలువడిన మంచి పుస్తకాలలో మరీ మంచి పుస్తకం. రచయిత అబ్బూరి వరదరాజేశ్వరరావుగారు చాలా చాలా రోజుల తర్వాత స్మృతి వల్మీకం నుంచి బయటికి వచ్చి అభ్యుదయ కవితా నవాధ్వంలో తమకు సాంయాత్రికులై ప్రయాణించిన అనేక కవి పండితుల విశిష్ట జీవితాలలోని రసవత్తర సన్నివేశాలను, వచో వైభవ విశేషాలన్నూ, తెర మరుగున దాగిన సాహితీ వృత్తాంతాలను అనితర సాధ్యమైన రీతిలో గ్రంథస్థం చేశారు. చెళ్లపిళ్ల వెంకటశాస్త్రిగారి కథలూ–గాథల అద్భుతమైన శైలి వరవడిలో, ఆ చమత్కారాలూ చాటూక్తుల బోహళింపులో తమ చిన్ననాటి అనుభవాలూ జ్ఞాపకాలను 'జీవనప్రదగాథలు'గా మలిచి మనకు సమకాలంలో విలుప్తమైన ఒక విదగ్ధ కళా ప్రపంచాన్ని కన్నులకు కట్టి చూపారు. మంచి పుస్తకాన్ని మరింత అందంగా ముద్రించి, శిష్యరూప మిత్రుడైన శ్రీ రాచకొండ విశ్వనాథశాస్త్రికి అంకితం ఇచ్చారు. అభ్యర్ణాంధ్ర సారస్వత భువనకోశం ఆంగికమై, రమ్యకవితా బహువ్రీహి పండిన ఆనాటి వాఙ్మయమంతా వాచికమై ఈ మహాకవి యశఃపారిజాతాల మాల ఆహార్యమై రూపొందిన ఈ అద్భుతమైన పుస్తకంలో తరంగ ప్రతిబింబన్యాయంగా వరదరాజేశ్వరరావుగారి సాత్త్విక శివమూర్తి ప్రత్యక్షమౌతుంటుంది.

ఆత్మచర్యాప్రవేశ విష్కంభకంగా రచితమైన ఈ వ్యాస సంపుటంలో చెళ్లపిళ్ల వెంకటశాస్త్రిగారు మొదలుకొని అత్యాధునిక కవుల దాకా ముప్పయి ముగ్గురు మహాకవుల జాగతిక రూపరేఖల ప్రథిత పరిచయం ఉన్నది. ఈ వ్యక్తిత్వ చిత్రణంతో పాటు జాతిజాగరణకు ఉత్తమాదర్శాలతో మొదలైన కీర్తి కలుషిత వాతావరణంలో నైసీతికంగా పరిణమిస్తున్న వర్తమాన సాహిత్య రాజకీయాల ప్రాదుర్భావ కారణాన్వేషణ కావించిన 'సాహిత్య అకాడమీ', 'అరసావిర్భావం', 'కాలదోషం' అన్న వ్యాసాలు కూడా కవనకుతూహలం కలిగిన పాఠకులకు జ్ఞాతవ్యసంగతులే. వీటన్నింటినీ కాలక్రమాన్ని బట్టి కాకుండా స్వీయ కథానుసారం చెప్పుకొని పోవడం వల్ల గ్రంథమంతటా ఒక చిత్రమైన

ఆత్మీయత, తేజోమయ వాతావరణం వెల్లివిరిశాయి. ప్రసన్న సరస్వతీకమైన నేపథ్యంలో ఆ మహా కవులను రంగావతీర్ణులనుగా ప్రవేశపెట్టి రాజేశ్వరరావుగారు ఆసక్తికరమైన నాటకీయ సంవిధానంతో పాఠకులను ముందుకు నడిపిస్తారు. ఐతిహ్యకల్పనలో ఆ వ్యక్తులందరి పట్ల సవ్యాజమైన గురుభావం ఐదంయుగీనులలో అటువంటి కవితాత్మను పునరాలోచించాలనే సహజ కుతూహలం, చిరకాలపు జ్ఞాపకాలతో బరువెక్కిన హృదయాన్ని సహృదయులతో పంచుకోవాలనే ఔత్సుక్యం రచయితను ఈ స్మృతి ప్రబంధానికి ప్రేరేపించాయి.

మూర్తి చిత్రణలో రాజేశ్వరరావుగారు అనధిష్ఠపవి ఈ సంపుటంలోని 'ఒక్కొక్క వ్యాసమూ విశ్రుతంగా వెల్లడిస్తున్నది. గ్రంథాన్ని చదువుతున్నప్పుడు విశ్వనాథ సత్యనారాయణగారి 'ఆంధ్రప్రశస్తి'లోని కథాశిల్పం మాటిమాటికీ జ్ఞాపకం వస్తుంటుంది. కవిత్వం మీద తమ అభిప్రాయమేమిటని శ్రీ శ్రీ అడిగితే, 'నేనూ కవినేనా?' అని చెళ్ళపిళ్ళవారు ఉపక్రమించినప్పటి గాంభీర్యం, ఉదయినికోసం వ్యాసం రాయమంటే 'నేనెందుకు రాయాలో చెప్పు?' అని ప్రశ్నించిన అబ్బూరి రామకృష్ణారావుగారి పూర్ణపురుషత్వం, శ్రీ శ్రీతో వైరశుద్ధికి హత్యాప్రయత్నం చేసిన ఉమామహేశ్వరరావు జీవిత విశ్లేషణ, తెలుగు జీవితాన్ని ఆమూలం చూడంగా తరిచి చూసి కవిత్వంలో అపరస్సరంగా అనేక నూతన ప్రయోగాలు చేసిన విశ్వనాథవారు 'మనిద్దరం సమకాలికులం రాజేశ్వరరావు!' అన్నప్పటి విదగ్ధత, రుక్మిణీనాథ శాస్త్రి హాస్యధోరణి సినిమాహాలులో పొట్లాటగా పరిణమించిన చిత్తవిస్తారరూపం, యావజ్జీవితం కవితా యజ్ఞానికి వేల్చి సన్మానసభలో సరస్వతీ సమారాధకునిగా మృతి చెందిన బొడ్డు బాపిరాజు విశిష్ట కథానకం, వచన కవితా వ్యాహారాన్ని సుప్రతిష్ఠితం చేయటానికి ప్రయత్నించిన కుందుర్తి ఉద్యమ ప్రవృత్తి, సాహిత్యానికే జీవితాన్ని అంకితం చేసి చిరంజీవులైన బెల్లంకొండ రామదాసు, దువ్వూరి రామిరెడ్డి, మారేపల్లి, మాధవపెద్ది మొదలైనవారి స్వభావ నైర్మల్యం, ఇవన్నీ ఆ కవుల కవితావ్యక్తిత్వాలలో అపురూపంగా కలిసిపోయి, వారందరూ కలిసి జీవించిన ఒక మహోజ్జ్వల ఘట్టం మనకు ప్రత్యక్షమవుతుంది. 'కవిత' మూడవ సంపుటం రానందువల్ల దీనిలో చోటు చేసుకొన్ని బెల్లంకొండ రామదాసు, రాయప్రోలు రాజశేఖర్, బాలగంగాధర తిలక్‌గార్ల అముద్రిత గేయాలు తెలుగు కవిత్వం ఉన్నన్నాళ్ళు వాచోవిధేయులగా ఉండదగిన అందమైన రచనలు. అనేక వ్యాసాలలో ప్రస్తావశంగా ఉదహరించిన ముద్రితాముద్రిత పద్యరత్నాలలో ఆయా కవుల ఉక్తి చాతుర్యం, శ్రద్ధావైశాద్యం, ఆంతరతమ్యం, సకర్మక జీవితోపదేశం పరిస్ఫుటంగా ధ్వనిస్తున్నాయి.

సన్నివేశాలంకృతికి రాజేశ్వరరావుగారు స్వీకరించిన పద్యాలు అన్నింటికి అన్నీ అనర్ఘరత్నోపమాలని చెప్పుకోదగ్గవి. కవిత్వం శబలిత భావ సంపక్తమై రసనాగ్ర నర్తకిగా ఉండాలన్న రచయిత దృక్పథానికి అనురూపంగానే గ్రంథస్థగిత పద్యగేయాలన్నీ ఉండటం విశేషమే.

ఆధునిక సాహిత్య చరిత్ర కాథికులలో అబ్బూరివారికి ఈ గ్రంథం సముచితస్థానాన్ని సంతరించిపెడుతుంది. ఇదే ప్రాగ్భూమికతో వారు మరికొంతమంది రచయితలను చేర్చి మరింత విపులమైన గ్రంథాన్ని రచిస్తే అది మంచి పుస్తకాల కోవం కలయికనే తెలుగువారి అదృష్టం.

('ఆంధ్రప్రభ', సోమవారం జూన్ 26, 1989).

## అబ్బూరి 'కవన కుతూహలం'. కడురమ్యం

'కవన కుతూహలం' .......... శ్రీకాంతశర్మ

ఈ అనుభవాల పరంపరను గుర్తు చేసుకుని కవనం చేసిన వరద రాజేశ్వరరావుగారు ఆధునిక తెలుగు సాహిత్యంలో మూడు తరాల రచయితల స్పందనలకీ, సృష్టికీ ప్రత్యక్షసాక్షి. అవతలితరం గిడుగు రామమూర్తి పంతులుగారి నుంచి తన తరం బైరాగి వరకు ఎంచుకున్న ముప్పైముగ్గురు రచయితల గురించి మనకీ సంపుటిలో తెలియజేస్తున్నారు. తెలియజేయడమంటే, కేవలం తారీఖులు, దస్తావేజులు బాపతుగా, ఆయుర్వేదం మందుల కేటలాగులాగా, పట్టీలు గుదిగుచ్చిలేదు. ఆయా రచయితల ఆలోచనల తీరునీ, ప్రవర్తనల తీరునీ పరిశీలించి వివరించిన ఒకానొక ఆత్మీయత ఉందిక్కడ. ఈ వ్యాసపరంపర, పుస్తకాలు చదివి పుస్తకాలు రాసే జాతి రచయిత కూర్చింది కాదు. కనక-ఇందులో మనం చదివే రచయితల పుస్తకాల విషయాలేకాక, వారి తరంనాటి ఊపిరి చప్పుళ్ళుకూడా మనం వినగలం. ఒక రచయిత రచనా సామర్థ్యం, ప్రేరణల వెనక వైయక్తిక జీవన నేపథ్యం విలువ ఏమిటో ఇటువంటి రచనల ద్వారా మాత్రమే తెలిసేవీలుంది. శిష్ట్లా గురించి, కుందుర్తి గురించి, మారేపల్లి రామచంద్ర శాస్త్రి గారి గురించి, బొడ్డు బాపిరాజా, ముద్దుకృష్ణ, పురిపండా, మాచిరాజు, తురగా వెంకట్రామయ్య, నళినీ కుమార్ వంటి వ్యక్తుల గురించి ముఖ్యంగా వరద రాజేశ్వరరావుగారు తెలియజేసిన సమాచారం వల్ల మాత్రమే వాళ్లేమిటో తెలిసింది. శ్రీ శ్రీ, జరుక్ శాస్త్రి, పద్మరాజు, మల్లాది రామకృష్ణ శాస్త్రి, విశ్వనాథ, నాయని, కొంపెల్ల జనార్దనరావు, నారాయణబాబు వంటి రచయితలతో వరద రాజేశ్వరరావుగారి అనుభవాలు ఆయనొక్కరికే పరిమితమైన 'స్వఘోషలు' కావు. సాహిత్య చరిత్రలో ఆయా రచయితల స్థాన నిర్ణయంలో విలువైన ఆకరాలు.

ముఖ్యంగా ఇందులో వరదరాజేశ్వరరావుగారు కవి మిత్రుల గురించి వ్రాసేటప్పుడు వారి పద్యం ఒక్కొక్కటి తన వ్యాసంతో అనుసంధించడం ఎంతో బాగుంది. ఆంధ్రప్రదేశ్ లో సాహిత్య అకాడమీ ఆవిర్భావానికి పూర్వరంగం, అభ్యుదయ రచయితల సంఘ అవతరణ నేపథ్యం, చరిత్ర దృష్ట్యా విలువైన డాక్యుమెంట్లు.

ఇవన్నీ ఒక ఎత్తు-వరద రాజేశ్వర రావుగారు ఈ సారస్వతానుభవాలను 'కథనం' చేసిన వచన శైలి ఒక ఎత్తు. తన స్నేహితులతో కబుర్లు చెపుతున్న ధోరణిలో గొప్ప "చదివించే గుణం"తో ఈ వ్యాసాలు రాశారు. ఈ పుస్తకం చదువుతూ మనం అబ్బురంగా కాలంతో పాటు ప్రయాణించినా, వరద రాజేశ్వరరావు గారితో పాటు ఆ అనుభవం మనదే ననేమైక్యం పొందుతాం. అంటే, ఈ రచన పాఠకుణ్ణి వరద రాజేశ్వరరావుగా మార్చే నైపుణ్యం సాధించింది. అందుకే ఇందులో రచయితల గురించి పది పరిశోధన గ్రంథాలు ఇవ్వజాలని సారాన్ని ఆయిదారు పేజీల వ్యాసాలు ఇవ్వగలుగుతున్నాయి. బెల్లం కొండ రామదాసు, బైరాగి గురించిన వ్యాసాలు చదవండి. తరువాత వాళ్ళ కవిత్వం చదివితే, ఆ రచయితల జీవన సారం వరద రాజేశ్వరరావు ఎంత బాగా చెప్పారో అర్థమవుతుంది.

ఇక-వరద రాజేశ్వరరావుగారికి కవిత్వం గురించి నిశ్చితాభిప్రాయాలున్నాయి. అది రసాగ్ర

నర్తకిగా వుండాలని, మననానికి రావాలని, అదే కవిత్వానికి ప్రాథమికంగా కావలసిన లక్షణమనీ ఆయన ఉద్దేశం. వచనంలో కవులు కూర్చే కవిత్వం మీద ఆయనకి సదభిప్రాయం లేదు.

సాధారణంగా విమర్శకులుగాని, కవిత్వాభిమానులుగాని-ఒక విధమైన సుముఖాభిప్రాయంగాని, విముఖాభిప్రాయం గాని ఏర్పరచుకున్నాక, వాటికి అనువైన ఉపపత్తుల్ని సేకరించి వాదనకు బలంగా సూచించడం పరిపాటి. కవిత్వం విధిగా ఛందస్సులో వుండాలని అనుశాసనమేమీ లేదు. మన సాహిత్యంలో ప్రాచీనకాలం నుంచి కవిత్వం పేరిట "ఛందః కరణం" ఎంత ఎక్కువ వచ్చిందో, ఆధునిక కాలంలో కవిత్వం పేరిట ఆయనే చెప్పినట్టు "పాళై పాళై" సరకు చాలానే వచ్చింది. అయితే మంచి కవిత్వానికి ప్రమాణంగా చూపదగిన నిష్పత్తి సహజంగా ఛందంగానైనా, స్వచ్ఛందంగానైనా తక్కువగానే వుంటుంది. వరద రాజేశ్వరరావు గారు ఈ సూక్ష్మాల్ని గ్రహించలేని వారుకాదు-ఆయన గ్రహించదలచుకోలేదేమో అనిపిస్తుంది. ఆయన రుచి భేదం అదని మనం సరిపెట్టుకొంటే చాలు.

విలువైన ఈ పుస్తకాన్ని అశ్రద్ధ చెయ్యకుండా వరద రాజేశ్వరరావుగారు ప్రచురించడం చాలా బాగుంది. వెనకటి తరం రచయితలతో-పరిచయం కావలసిన తరుణంలో-సరైన రచయిత ద్వారా, ఈ నాటి తరానికి ఈ పరిచయం కలగడం అభినందనీయం.

-('ఆంధ్రజ్యోతి సచిత్ర వారపత్రిక, 11-8-1989)

## అద్భుత భావాల, దృశ్యాల చిత్ర విచిత్ర రోచిర్నివహం

**కవన కుతూహలం** **అంబటి సురేంద్రరాజు**

అబ్బూరి వరద రాజేశ్వరరావుగారి కలం మన మీద ఎంతో దయతో ప్రసరించిన కవుల ప్రపంచంలో చరించి, సంచరించి, ఆ పెదవి ఆత్మను తొక్కిపెట్టి బలవంతంగా బయటికి వచ్చేసేముందు చివరగా ఒకటి రెండు మార్లు అబ్బుర మనిపించేఆ ప్రపంచాన్ని చుట్టేసి వచ్చిన తరువాత పెదవి విప్పడం కష్టం. కలం కదపడం మరీకష్టం.

పుస్తకం పూర్తి చేయనవసరం లేదు. మధ్యలోనే, పుస్తకం పూర్తికాకముందే, అంతటి అనుభవాన్ని పంచి, పారమెరుగని ఆనందార్ణవంలో ముంచి తేల్చిన గ్రంథకర్తకు వినమ్రులమై నమస్కరిస్తాం, కవిపిస్తే కృతజ్ఞతా భారంతో ఒకటి రెండు పాడిమాటలతో, అదీ చేతకాకపోతే కంటికొన చూపుల మూగభాషతో మనం, ఆయనకు ఏ విధంగా రుణపడి వున్నదీ ఎరుకపరుస్తాం. అప్పుడుగాని మన ఎదలో కలిగిన తీయని బాధ, అలలలలుగా రేగిన అంజడి చల్లారదు. ఎన్నాళ్లనుంచో చూడాలనుకుంటున్న కవులను ఆనవాలు పట్టేంత చేరువ నుంచి చూసి, కవుల మాటలను విని, వారి అంతర్ బహిర్ జీవన రహస్యాలను పొదివి పట్టుకుని, ఆ అనుభవాల సంపుటితో హృదయాలను సంపన్నం చేసుకొన్న మన ఆత్మలు అప్పుడు గాని సంతుష్టి చెందవు.......

మంచి పుస్తకం కోసం కొన్నేళ్ళుగా, మోహం వాచివున్న బహుకొద్ది మంది 'ఉన్మత్త భావశాలు'ర జఠరాగ్నిని 'కవన కుతూహలం' ఎట్టకేలకు చల్లార్చింది. కవిత్వం పేరిట, విమర్శ పేరిట చలామణీ

అవుతున్న చెత్తా, చెదారంతో విసిగి వేసారిపోయిన ఆలోచనా శీలుర కడుపు నింపింది. అబ్బూరి విందుబల్ పసందు అనిపించింది.

ఎవరినైతే మనం అనునిత్యం తలచుకోవాలో, వారిని మనకు చిరపరిచితులను చేసి- అభ్యుదయ కవిత్వంతో కవిత్వాన్ని ఉద్ధరిస్తామని, కవిత్వానికి పథనిర్దేశం చేస్తామని చెప్పుకుని అవతరించిన అరసం ఏ కవులమీదనైతే 'ఇనుపతెరలు' దింపిందో, ఆ కవులను, వారి కవిత్వాలను వెలుగులోకి తెచ్చి-ఆయా కవుల వ్యక్తిగత జీవితంలోని ఔన్నత్యాన్ని, సత్యసంధతను, ఆదర్శతత్పరతను, నిర్భీతిని, మహోన్నతమైన వ్యక్తిత్వాన్ని, విలువల కోసం వారు చేసిన ఉత్కృష్టమైన కార్యాలను మనముందుంచి-మన కళ్లు తెరిపించేయత్నం చేసినందు వల్లే అబ్బూరి వారి గ్రంథానికి ఇంతటి తావి అబ్బింది. అక్షర తప్త హృదయాల కవనకుతూహలం తీరింది....

వరద రాజేశ్వరరావు గారు ఆయా కవుల గురించి మనకు చెప్పేటప్పుడు తమకు తెలిసిన జీవన పార్శ్వానికే పరిమిత మయ్యారు. వ్యక్తిగతంగా అంటే-ప్రత్యక్షంగా తమకు తెలియని జీవితం జోలికి గాని, వివిధ కవుల రచనల విమర్శజోలికి గాని పోలేదు. అక్కడక్కడా కవిత్వం పరామర్శ మాత్రం చేశారు. దీని వల్ల "కవన కుతూహలం"లో చిత్రితమైన వారందరి జీవిత చిత్రణ అర్థాంతరంగా ముగిసినట్టు అసంపూర్తిగా మిగిలిపోయినట్టు, అయ్యో, అప్పుడే అయిపోయిందా! అని బాధపడేట్టు సాగింది. ముఖ్యంగా రామదాసు, బైరాగి, నారాయణబాబు, తిలక్, 'పాప' ల విషయంలో ఇది జరిగింది. అందుకే కవులతో ముఖాముఖి లిప్తపాటులో పూర్తయి పోయిందే! అనే బాధ, అసంతృప్తి పాఠకుడికి మిగిలింది. అయితే కవి సందర్శనం కనుమూసి తెరిచేలోగా ముగిసినా, దాదాపుగా అన్ని వ్యాసాలూ జీవన శకలాలే (Fragments of life) అయినా, ఆ రెప్ప పాటులోనే గొప్పకాంతి ప్రజ్వరిల్లడం విశేషం. ఆయా కవుల జీవితాల్లోని తానెరిగిన సన్నివేశాలను చిత్రించడంలో రచయిత ప్రదర్శించిన నిరుపమానమయిన శైలీ విన్యాసం వల్లే ఇది సాధ్యపడిందనిపిస్తుంది. ఏ ప్రత్యేకతా, ఆకర్షణా లేకుండానే పాఠకుడిని నిర్నిమేషున్ని చేసే నిలిపి చదివించే నిరాడంబర భాషా పటిమ అబ్బూరి వారి కలానికి వుంది. జ్ఞాపకాలు, అందునా చిరకాలం నాటి జ్ఞాపకాలను కథలు కథలుగా చెప్పడానికి ఈ శైలి వారికి బాగా ఉపకరించింది ..... ఇక్కడ ప్రస్తావించాలంటే ఎన్నో వున్నాయి.

ఆధునిక తెలుగు సాహిత్య సీమను, సాహిత్య దిగ్గజాలను ఆసాంతం స్పృశించిన అబ్బూరి వారి కలం చెప్పేవ కథలు-గాథలు అన్నీ చవులూరించేవే. పదహారు, పదిహేడేళ్లకు పైబడని లేప్రాయంలోనే దేశంలో ఆనాడు సాహిత్య సాంస్కృతిక రంగాలను ఉర్రూతలూగించిన ఎందరో మహానుభావులను ప్రత్యక్షంగా ఎరిగి వుండటం, వారి ప్రేమాదరాలకు పాత్రుడవడం, వారిలో కొందరికి చేరువకాగలగడం చరిత్ర ఆయనకు ఇచ్చినవరం.

అబ్బూరి కవిత్వ విమర్శ చేయలేదు గాని పరామర్శ చేశారని ఇంతకు ముందనుకున్నాం. ఈ పరామర్శలో భాగంగా ఆయన తమకు నచ్చని ఒకరిద్దరు కవులపై తీవ్ర అసహనం వెలిబుచ్చారు. అబ్బూరికి నచ్చని ఆ ఒకరిద్దరు కవులు కవిగా నారాయణబాబు, వ్యక్తిగా (కవిగా కూడా) శిష్లా ఉమామహేశ్వరరావు.... నారాయణ బాబుకు అబ్బూరి వారు ఉల్లి తిరుపతి, మొక్కపాటి రామమూర్తి ముద్దుకృష్ణల సరసన స్థానం ఇచ్చారు. ముగ్గురూ మహానుభావులే, మహోన్నతులే! అయితే కవిత్వం రాసినందుకు కాదు..... శ్రీ శ్రీని అనుకరిస్తూనే, శ్రీ శ్రీ లోలేని అధోలోకాలను,

చీకటి గుహలను, దరికానని లోతులను, నారాయణబాబు, బైరాగి, బెల్లంకొండ రామదాసు, అజంతాలలో పసికట్టి కొత్త అర్థాలు కనిపెట్టే తరం (సంఖ్యలో స్వల్పమైనా) ఒకటి ఉద్భవించిందని అబ్బూరివంటి పెద్దలు గుర్తించాలని విన్నపం.

బెల్లంకొండ 'త్రిపుట', 'తాగుతాగు చెల్లెలా', 'పాప' 'ఎర్రజీర', రాయప్రోలు రాజశేఖర్ 'వివాళి', శిష్ట్లా 'జ్ఞాపకాలు' ఈ పుస్తకంలో ఉచితంగా ఇచ్చినందుకు అబ్బూరికి పాఠకలోకం ఎంతైనా ఋణపడి వుంటుంది.

అజంతా మాటల్లో చెప్పాలంటే "సాహిత్య శిరోవేదన" తో బాధపడుతున్న "సమకాలీన కవితా బాధితులకు "కవన కుతూహలం" ఉపశాంతి. అంతేకాదు "సైద్ధాంతిక శిరోముండనా"నికి ఇది విరుగుడు కూడా.

('ఆంధ్రపత్రిక, సోమవారం, సెప్టెంబరు 4, 1989)



## కవన కుతూహలంలో ప్రధాన ధాతువు స్వాత్మక అరాచకత్వమే!

సోమసుందర్

కవనకుతూహలం............

శ్రీశ్రీ, ఆరుద్రల ద్వారానూ, అబ్బూరి ఛాయాదేవి సంపాదకత్వంలో నడచిన 'కవిత' త్రైమాసిక ద్వారానూ, 'అందాకో' అనే పద్య కవిత ద్వారానూ సాహితీ పరులకు పరిచయమయ్యారు శ్రీ అబ్బూరి వరద రాజేశ్వరరావు. భావకవితాయుగ వైతాళికులలో ఒకరైన రామకృష్ణారావు ద్వితీయ పుత్రుడు. శ్రీ వరద యిటీవల కవనకుతూహలం అనే శీర్షికతో, ఆంధ్రప్రభ వారపత్రికలో ఒక స్మృతి వ్యాసపరంపర ప్రచురించారు. సమకాలిక ప్రముఖ కవి రచయితలతో తనకు గల అనుబంధాలను వ్యక్తం చేశాడు. వీలయినంత అందంగా రచన సాగించాడు. పాఠకులను ఆకర్షించి పేరూ తెచ్చుకున్నాడు. ఆ వ్యాససమాహారాన్ని 'కవన కుతూహలం' అనే పేరనే గ్రంథంగా ప్రచురించాడు.

ఈ గ్రంథానికి శ్రీ అజంతా 'హెచ్చరిక' అనే ముందుమాట రాశాడు. ఈ గ్రంథాన్ని పఠించడానికి కావలసిన నియమ నిష్ఠల గురించి, అజంతా చాలా దీర్ఘంగా హెచ్చరికలు వినిపించాడు. 'ఆధునికాంధ్ర కవిత్వ శరీరంలో జ్వరతీవ్రత భయంకరంగా పెరిగిందని పాపం అజంతా భయపడ్డాడు. 'సాహిత్య కర్మాగారం నుంచి కవిత్వమనే రాకాసి పొగ బాధాకరంగా వెలువడుతోందని బాధపడ్డాడు. పఠన భంగం గురించి బోలెడు అనవసర ప్రసంగం చేసి, చమత్కారత్వంగా ధ్వనింప జేశాడు...." వచన కవిత్వం అనే మాట తప్పు, తప్పు, తప్పు!' అని రెట్టిస్తూ....... దాన్ని ముక్త కవిత అని మాత్రమే అనాలన్నాడు. మంచిదే! కాని ఊరందరిదీ ఒక త్రోవ; వచన కవితగా రూఢ్యర్థం స్థిరపడింది.

'సాంప్రదాయక కవిత ఇక చెల్లదని' అజంతా ఖరాఖండిగా చెప్పాడు. కాని పాపం వరదకు అది అన్యాయమే చేస్తుంది. ఆయన యిప్పటికీ పద్యం తప్ప అన్యమేదీ కవితా వాహకాలేదని

విశ్వసిస్తున్నాడు. ఈ గ్రంథంలోనూ ఘోషించాడు. ఈ శతాబ్దపు తెలుగు కవితా క్షేత్రాన్ని పండించిన ప్రముఖుల గురించిన భోగట్టాలూ, భోగాలూ, తెరమరుగున దాగిన వృత్తాంతాలూ గ్రంథస్థ చేసినందుకు వరద అభినందనీయుడే!

.....శ్రీ అబ్బూరి వరదరాజేశ్వర రావు రచించిన కవనకుతూహలం అనే బృహత్ గ్రంథం గురించి వాచ్యంగా పరిచయం చేయడానికే ఈ వ్యాసకర్త పూనుకున్నాడు. సమగ్ర సమీక్ష చేయడం ఈ వ్యాస పరిథికి అందదు. ఈ గ్రంథంలో ముప్పయి ఎనమండుగురు కవిరచయితలను స్వీయ పరిచయపురస్సరంగా స్మృతి వీచికలుగా పరిచయం చేశాడు. భావకవులంతా వున్నారు. ఆధునికులలో జలసూత్రం, శ్రీ రంగం నారాయణబాబు, కొంపెల్ల జనార్దనరావు, మాచిరాజు దేవీ ప్రసాదూ, రావిశాస్త్రీ, పురిపండా అప్పలస్వామీ మున్నగు వారి గురించిన రచనలు తప్పకుండా సమీక్షించవలసి వున్నది. ఏ కవి గురించికానీ వరద అభిప్రాయాలతో అందరమూ ఏకీభవించాల్సిన అవసరం లేదు. అన్నీ ఆయన సొంత అభిప్రాయలే కనుక!

'నారాయణ బాబు పట్ల అమాయకుడనుకొనే వాణ్ణి!" అన్న వరద అభిప్రాయంలో- అమాయకుడనే మాటకు మాయామర్మం లేని వాడన్నది అర్థం కాదు. ఉత్త తెలివి తక్కువ దద్దమ్మ అన్నదే! సంపెంగ తోట అనువాదం గురించి శ్రీ శ్రీ పై వివాదం తేవడం కూడా అమాయకత్వం వల్లనే జరిగిందంటాడు. కాని శ్రీ శ్రీ వగైరాల మాయలు గురించి చెప్పకుండా ఏకపక్ష నిర్ణయం చేస్తాడు వరద.....శ్రీ శ్రీ అంటే ఈర్ష్యపడ్డ వాళ్లంతా నారాయణబాబుని అందలమెక్కించారు. నారాయణబాబు తను కూడా శ్రీనివాసరావుతో పాటు, అతనికంటే ఘనంగా కవితా విప్లవానికి ముందస్తునాంది పలికిన వాణ్ణని ఓ అపనమ్మకం పెంచుకున్నాడు. నిజానికి ఇదంతా అనవసరం. నాకు మాత్రం నారాయణబాబు కవిత్వం మీద అంత అభిప్రాయం లేని మాట వాస్తవం!" అంటూ చప్పరించేశాడు. నిజానికి శ్రీ శ్రీ మాత్రాబద్ధ కవిత్వంపైనే వరదకు మంచి అభిప్రాయం లేదు. ఇక నారాయణబాబు కవిత్వం గురించి ఇంతకన్నా ఏమనగలడు?

ఇలా వ్యక్తిగత ధోరణితో సాగిన పుస్తకం మరీ అంత పవిత్రమైందని అజంతా అంటూంటే నమ్మడానికి అమాయకులెవరూ లేరు. వ్యక్తిగత అభిమానంతో మాత్రమే అంత పెద్ద మాటలంటున్నాడని చదివితే అందరికీ అనిపిస్తుంది. శ్రీ వరద తనకు కలిగిన సదవకాశాలతో సమకాలీన కవిరచయితల పరిచయాలు మధుర స్మృతులుగా అందించాడు. చదువరులకొక బాల్య స్మృతి మాధుర్యం అందకపోదు! చదవకపోతే సాహితీ పరులకు కలిగే అపార నష్టమూ లేదు! ఏ గ్రంథం వెలువడడం గురించేనా అదొక అపురూప మహత్తర సంఘటన అంటూ కొనియాడే వారి మాటలను మాత్రం జాగ్రత్తగా కనిపెట్టక తప్పదు!

('విశాలాంధ్ర', 17-12-1989)

## ఆధునిక కవిత్వానికి స్వర్ణయుగం- ఒక రమ్యాలోకం

'ఆర్'.

కవనకుతూహలం.......

ఈ శతాబ్దం మొదటి రెండు దశాబ్దాలూ ఆధునిక కవిత్వానికి స్వర్ణయుగం లాంటివని నా కనిపిస్తూంటుంది"-అని అబ్బూరి వరద రాజేశ్వరరావుగారు తన "కవనకుతూహలం" అనే పుస్తకంలో వ్రాశారు. ఒక చిన్న సవరణతో ఇంకా ఎందరికో అలాగే అనిపిస్తుంది.

మొదటి రెండు దశాబ్దాలూ అంటే -1901 నుంచి 1910 వరకు అయితే, ఆ స్వర్ణయుగానికి ప్రారంభకుడైన గురజాడ అప్పారావుగారు ముత్యాల సరాలు వ్రాసింది 1910లో. అందుచేత 1901 నుంచి 1909 వరకూ తీసేయవచ్చు.

పోతే, ఆనాటి నవ్యకవులు 1920 లోపున కంటె 1921-30 సంవత్సరాల మధ్య కాలంలోనే తమ గొప్ప కవిత్వమంతా వ్రాశారు. అందుచేత ఈ శతాబ్దం రెండవ, మూడవ దశాబ్దాలు (1910-1930) ఆధునిక కవిత్వానికి స్వర్ణయుగమని భావించడం మరింత సార్థకంగా వుంటుంది.

అవి తెలుగు నాట నవ్య కవిత్వం స్వర్ణమంజీరాలు ధరించి నాట్యం చేస్తున్న రోజులు; రాయప్రోలు, అబ్బూరితో మొదలుపెట్టి ఎందరో మహానుభావులు వెయ్యేళ్ళ తెలుగు కవిత్వాన్ని కొత్తదారికి మళ్ళించి నవ్యత్వానికి నీరాజనమెత్తిన కాలం.

చిరస్మరణీయులైన ఆ మహామహులతో-వారు ఇంకా ప్రౌఢ నిర్భర వయః పరిపాకంలో వున్న రోజులనుంచే సన్నిహితంగా మెలిగిన అదృష్టవంతుడు వరదరాజేశ్వరరావు. ఆనాటి నవ్యకవితా వైతాళికులలో ప్రముఖమైన అబ్బూరి రామకృష్ణారావుగారి కుమారుడు కావడం ఇందుకు ముఖ్యకారణం. ఉత్తమ సాహిత్య సంస్కారం కలిగి స్వయంగా కవి కావడం మరొక కారణం.

ఆనాటి అగ్రశ్రేణి కవులతో సన్నిహిత మైత్రీపరిచయాలుండడం ఒక ఎత్తు. ఆ మైత్రీ పరిచయాల జ్ఞాపకాలను- గుత్తువా ముత్యాల సరములు-కూర్చుకొని తేటైన మాటలు-అన్నట్లు గుదిగుచ్చి కథలు, గాథలుగా గ్రంథస్థం చేయడం మరొక ఎత్తు. ఏదో వ్రాసి పారేయడం కాదు. అనింద పూర్వమైన నూతన కథన ప్రక్రియలో అత్యంతాసక్తికరంగా వ్రాయడం ఇంకొక ఎత్తు.

వరద రాజేశ్వరరావుగారి "కవన కుతూహలం" చదువుతుంటే ఎన్నాళ్ళకు తెలుగులో ఒక మంచి పుస్తకం, విలవైన పుస్తకం చదువుతున్నామనే భావన కలుగుతుంది. చదువరి మనస్సు ఒక్కసారిగా 1930లలోకి, 1940లలోకి పోతుంది. ఆ రోజులు, ఆ మనుషులు, ఆనాటి సాహిత్య వాతావరణం మళ్ళీవస్తే ఎంత బాగుండును అనే 'నాస్టాల్జియా'లాంటి బెంగ కలుగుతుంది. పాఠకులకు అలాంటి బెంగ కలిగేటట్టు వ్రాయడంలోనే వరదరాజేశ్వర రావుగారి కథన శిల్పమంతా వుంది.

ఈ సంపుటంలో మొత్తం 33 మంది కవి, పండితుల గురించి ఆయన వ్రాశారు. అరసావిర్భావం, సాహిత్య అకాడమీ అనే రెండు వ్యాసాలున్నాయి. పుస్తకం మొదలు పెట్టడమే రచయిత విశాఖలో తన చిన్ననాటి స్నేహితుడు శ్రీరంగం శ్రీనివాసరావుతో మొదలుపెట్టారు. అన్నట్లు ఈ సమీక్షా రంభంలో ఉదహరించిన వాక్యానికి ఇంకో చిన్న సవరణ చేయాలి. ఈ శతాబ్దం రెండవ, మూడవ దశాబ్దాలేకాదు, శ్రీ శ్రీ తన మహాప్రస్థానం గీతాలన్నీ వ్రాసిన 4వ దశాబ్దాన్ని (1930-40) కూడా

ఆనాటి స్వర్ణయుగంలో భాగం గానే పరిగణించాలి....మొత్తంపై అందరు నేడు స్మృతి మాత్రులు గా మిగిలినవారే.

వరద రాజేశ్వరరావు గారు ఈ స్కెచ్‌లను ఆయాకవుల జీవిత చరిత్రలుగా ఉద్దేశించలేదు. కేవలం వారి గురించిన తన జ్ఞాపకాల కథనంగానే ఉద్దేశించారు. అయినా ఈ వ్యాసాలలో ఆ కవుల విభిన్నవ్యక్తిత్వాలు సజీవంగా, సచేతనంగా రూపుకడతాయి. ముఖ్యంగా రచయిత కథనం బందరు, బెజవాడ, తెనాలి, విశాఖ, మద్రాసుల చుట్టూ తిరిగింది. ఆ రోజుల నాటి ఆ పట్టణాలు, ఆ వాతావరణం ఈ పుస్తకం పేజీలలో మన కళ్ళకు కడతాయి.

అందరిలోకి ఎక్కువగా శ్రీ శ్రీ తో వరద రాజేశ్వరరావుగారి మైత్రి మరీ గాఢం. శ్రీ శ్రీ రామకృష్ణారావుగారి అభిమాని, శిష్యప్రాయుడు. వరద రాజేశ్వరరావు ఆయన కుమారుడు. కనుక వారిది చిరకాలమైత్రి. అయినప్పుడు శ్రీ శ్రీ గురించి మరి కొంచెం విపులంగా వ్రాయవలసింది. అందరిలోకి తక్కువ వ్రాసింది శ్రీ శ్రీ గురించే. రెండు పేజీల తోనే సరిపెట్టారు. అయితే, శ్రీ శ్రీ ఇతర కవులకు సంబంధించిన వ్యాసాలలో తరచుగా ప్రత్యక్షమవుతూనే వుంటాడు. అబ్బూరి, విశ్వనాథ, దేవులపల్లి, జలసూత్రం, కొంపెల్ల వంటి కొందరిపై వ్రాసినవి మరీ మరీ బాగున్నాయి.

అడవి బాపిరాజు గారి కవితను ఉద్దేశించి "మీకు రాయడమే ప్రధానంగా కనిపిస్తోంది" అని తాను అన్నట్టు రచయిత వ్రాశారు. బాపిరాజుగారు కవిగా కంటె నవలా రచయితగానే ఎక్కువ స్మరణీయులు. కాని, ముద్దుకృష్ణ వైతాళికులలోచేర్చిన రావోయి చిన్నవాడా, ఉప్పొంగి పోయింది, వంటి అయిదారు గీతాలు చాలవా బాపిరాజుగారిని ఉత్తమ కవిగా నిలపడానికి?

నారాయణబాబు గురించి వరద రాజేశ్వరరావుగారి వ్యాఖ్యలతో ఏకీభవించని వారికంటె ఏకీభవించేవారే ఎక్కువగా వుంటారు. ...

వరద రాజేశ్వరరావు గారితో ఒకందుకు కొంచెం తీవ్రంగాను, దీర్ఘంగాను విభేదించక తప్పదు. వృత్త ఛందస్సుపట్ల ఆయనకు వల్లమాలిన అభిమానం.ముక్త ఛందస్సుపట్ల అంతే వల్లమాలిన వైముఖ్యం.

సాంప్రదాయిక పద్య ప్రక్రియ పట్ల ఆయన కున్న అభిమానంతో ఎవరికీ పేచీ వుండదు. దాదాపు వెయ్యేళ్ళపాటు నన్నయ పెట్టిన ఒరవడి తెలుగు కవిత్వ స్వరూపాన్ని శాసించింది. తెలుగువాడు పద్యం కట్టే పద్ధతి పూర్తిగా తెలుగు వాడిదే. వృత్త ఛందస్సు సంస్కృతం నుంచి దిగుమతి అయినా, కన్నడంలో మనకంటె ముందుగానే పద్యచ్ఛందస్సువున్నా, పద్యం తెలుగువాడి ప్రత్యేకత. నిజమే, కాని, తెలుగు పద్యం మీద మమకారంతో ఈనాటి వచన కవితను తృణీకరించవలసిన అవసరం లేదు.

రోజులు మారినప్పుడు కొత్త పరిస్థితులు, కొత్త జీవనవిధానం వచ్చినప్పుడు కవిత్వ స్వరూప, స్వభావాలు కూడా మారుతాయి. పద్యాన్ని ఎల్లకాలానికి పట్టుకుని వేళ్లాడాలనడం గుండుగీయించుకుని పిలకా, బొట్టూ పెట్టుకుని, సూటూ బూటూ ధరించడం లాంటిది. యుగధర్మం అని ఒకటుంటుంది. ఇప్పటికీ రామాయణ, భారతాలను, పురాణాలను పురాణశైలిలోనే వ్రాసేవారు వుండవచ్చు. కాని, అవి ఈ యుగధర్మాన్ని ప్రతిబింబించలేవు. ఇప్పటికీ మన దేశంలో ఎడ్లబళ్ళున్నాయి. కొన్ని సందర్భాల్లో వాటి అవసరాన్ని కాదనలేముకూడా. కాని, అవి చనిపోయిన యుగం తాలూకు

అవశేషాలు. పద్య కవిత కూడా అంతే. అది ఈ నాటి జీవన వాస్తవాన్ని ప్రతిబింబించడానికి పనికిరాదు. ఈనాటి మానవుడి పరిస్థితిని, ఆధునిక జీవిత సంక్లిష్టతను చిత్రించడానికి సరైన ప్రక్రియ సాంప్రదాయిక పద్యం కాదు. వచన కవితే. కొత్త భావాలను కొత్త ప్రక్రియలోనే వ్రాయాలి. వస్తువు మారినా రూపం మారకూడదు అనడంలో అర్థం కనబడడం లేదు.

వచన కవిత అనే సమాసం అర్థంలేనిదని కూడా 'వరద' అన్నారు. అది కవిత్వానికి మనమిచ్చే నిర్వచనాన్ని బట్టి వుంటుంది. అలాగే వచన కవితాప్రక్రియ కృతకమని ఆయన అన్నారు. యతి ప్రాసలు, గణాలవంటి కఠోర నియమాలతో కూడిన వృత్తం కంటె వచన కవిత ఏవిధంగా కృతకమో ఆయన తెలుపలేదు.

గుంటూరు శేషేంద్రశర్మ కూడా ఒకప్పుడు తెలుగు పద్యప్రక్రియ ఆధునిక వస్తువుకు క్షేమగ్గా సరిపోతుందని వాదించిన వారే. అయినా, అనతికాలంలోనే ఆయన ఛందస్సును వదిలిపెట్టి వచనకవితా ప్రక్రియలో చక్కని కవిత్వం వ్రాశారు, వ్రాస్తున్నారు.

వచన కవిత్వం ప్రారంభమై 50 ఏళ్లుదాటినా, ఒక ఇరవై, పాతికేళ్ళనుంచి అది మరింత పదునుతేరి, ఇప్పుడు పూర్తిగా తన కాళ్ళమీద తాను ఒక ప్రక్రియగా నిలబడింది. ఇప్పుడు మరీని. ఈనాటి యువకవులు ఇది వరకెన్నడు లేనంత సౌలభ్యంతో, అలవోకగా, అవలీలగా గొప్పవచన కవిత్వం వ్రాస్తున్నారు. వచన కవితకు నిజంగా ఇది స్వర్ణయుగం.

వచన కవితను ఈ 1989లో కూడా ఇలా వెనకేసుకు రావలసిన అవసరం ఎంతమాత్రం లేదుకాని, వరద రాజేశ్వరరావుగారు ఈ గ్రంథంలో ఎడనెడ పలుసార్లు చేసిన వ్యాఖ్యలను పురస్కరించుకుని ఇలా కొంత దీర్ఘంగా ఈ విషయం ప్రస్తావించవలసి వచ్చింది. ఇది అలా వుంచితే, "కవన కుతూహలం" వంటి అరుదైన పుస్తకం తెలుగువారికి అందజేసినందుకు ఆయనను ఎంతైనా అభినందించాలి. ఇంకా చలం, దీక్షితులు, తాపీ, కొడవటిగంటి, గోపీచంద్ మొదలైన వారి గురించి వ్రాయవలసివుందని ఆయన అన్నారు. త్వరలో ఆ పనిపూర్తి చేస్తారని ఆశించవచ్చునా?

అజంతా గారు ఈ పుస్తకానికి తన సహజ ధోరణిలో పీఠికలాంటి "హెచ్చరిక" లాంటి పరిచయ వాక్యాలు చక్కగా వ్రాశారు. ఆయన కూడా వచన కవితపై వరదరాజేశ్వర రావు గారి అభిప్రాయాలతో ఏకీభవించినట్టు లేదు (అజంతా వ్రాసింది అంతా వచన కవితే కదా?) అయితే వచన కవిత అనే మాట శుద్ధ తప్పు అని, ముక్త కవిత అనాలని వ్రాశారు. వచన కవిత మాట తప్పో ఒప్పో స్థిరపడి పోయింది.ప్రోజ్ పోయెట్రీ అనే దానికి అది తెలిగింపు. ఇప్పుడు ముక్త కవిత అనే మాటను వాడుక లోకి తేవడం కష్టం. (భావ కవిత్వం అనేది కూడా ఇలాగే సరైన మాట కాకపోయినా రూఢమైపోయింది).

నేటి కవితా వాతావరణం నిరాశాజనకంగా వుందని, కవితా ప్రపంచమే ఛిన్నాభిన్నమై పోతోందని అజంతాగారు పీఠికలో హెచ్చరించారు. ప్రస్తుతపు తెలుగు కవిత్వం ఆయన నిరాశపడినంత పాడుగా వుందా? అజంతాగారు పొరపడ్డారనిపిస్తుంది.

('ఆంధ్రజ్యోతి, సోమవారం 17, జూలై, 1989).

*

# నాటిసాహిత్యరంగ సూక్ష్మదర్శనం

## పురాణం సుబ్రహ్మణ్యశర్మ

'కవన కుతూహలం'....

బ్రిటిష్ సాహిత్యరంగంలో 'బ్లూమ్స్‌బరీ గ్రూప్' గురించి, లండన్‌లో ఉన్నప్పుడు అబ్బూరి వరద రాజేశ్వరరావు లియొనార్డ్ వుల్ఫ్‌ని అడగ్గా నాటి రచయితలు, కవుల గురించి ఎటువంటి సంకోచం దాపరికం లేకుండా.... బహిరంగంగా రాయబోతున్నారని, వాటిని చదవమని వారు సూచన చేశారు. ఆటువంటి పుస్తకాలు తరువాత రాగా వాటిని, వరదరాజేశ్వరరావు చదివారు. 'అందులో లబ్ధ ప్రతిష్ఠులూ, ఒక నవశకానికి నాంది పలికిన, విశ్వవిఖ్యాతి గాంచిన రచయితల గురించి కథలూ గాథలూ యథాతథంగా ఉన్నాయి.

ఆటువంటి పుస్తకం ఆధునిక సాహిత్యరంగం మీద రాయిస్తే బావుణ్ణనే ఆలోచన 'కవనకుతూహలం' రచయితకు ఆనాడు కలిగింది. అది తను రాయాలని ఆయన అనుకోలేదు. వైతాళికులు సంకలనకర్త ముద్దుకృష్ణ రాస్తానని అన్నారు. కాని ఆయన రాయలేదు. అది ఆయన రాయవలసిన పుస్తకమని రాజేశ్వరరావు అనడం, మర్యాదగా ఉంది. అయితే 'బ్లూమ్స్‌బరీ గ్రూపు' రచయితలు, కవుల గురించి రాయించిన పుస్తకాలకు, 'కవన కుతూహలా'నికి ఈషణ్మాత్రం పోలిక లేక పోయినా వరద ఒక ప్రముఖ వారపత్రికలో ఒక ఏడాది పాటు రాశారు.

ఈ పుస్తకం రాయడానికి రాచకొండ విశ్వనాథశాస్త్రిగారు కూడా వరద జ్ఞాపకాలను రాయమని, అక్షర రూపం కల్పించమని ప్రోత్సహించడం కారణమని రచయిత చెప్పుకున్నారు. ఈ పుస్తకాన్ని వారి చెలిమికి చిహ్నంగా రావిశాస్త్రిగారికి, వరద అంకితమిచ్చారు...

కవన కుతూహలం ఒక గొప్పతరం రచయితల,కవుల గురించి అలవోకగా రాసిన వ్యాసపరంపరకు పుస్తక రూపమేగాని అందులో ఒక పథకం గాని ప్రణాళిక గాని లేదని రచయిత ఒప్పుకున్నారు. ఇవి రేఖా మాత్ర స్వల్పపరిచయాలు మాత్రమే. ఆత్మైక వచనంలో రచయిత జ్ఞాపకాలను ఏకరవు పెట్టడం వలన ఇది వరద రాజేశ్వరరావు స్వీయ చరిత్రలో భాగమై కూర్చుంది. లబ్ధప్రతిష్ఠులైన తండ్రులు గలవారి సంతానానికి....' నాన్న గారు' అనే ప్రసక్తి రావడం అనివార్యం. దీన్ని మరోలా అపార్థం చేసుకోరాదు. జీవిత చరిత్రల నుంచి ఆశించే సమగ్రత, ఓ క్రమం, ఒక పరిణామాన్ని ఇటువంటి రేఖామాత్ర స్వల్ప పరిచయాల పుస్తకం నుంచి ఆశించరాదు.

ఈ పుస్తకానికి 'అజంతా' పీఠిక వారన్నట్లే ఒక హెచ్చరిక.....వరద అజంతాకు 'గురువు'. పీఠికకు కించిత్తు గురుభక్తిని జోడించారు.

... ఈ సంపుటిలో సుమారు 35 ప్రముఖ రేఖా చిత్రాలున్నాయి. ఇవి హోమియోపతి మాత్రల్లా మంచి 'ఏగరు', పొగరు, 'పొటెన్సీ' కలిగి ఉన్నాయి. ఈ పుస్తకం తెలుగు సారస్వత ఆకాశంలో మెరిసిన, ఇంకా మెరుస్తున్న నక్షత్రమాలిక. ఇది వాసనకేగాని మృష్టాన్నభోజనం లా ఉండజాలదు. ఒక్కొక్కరి గురించి ఇంకా రాస్తే ఎంత బావుణ్ణు అని ఇంకా తెలుసుకోవాలనే కవన కుతూహలాన్ని పాఠకుల్లో పెంచేవిగా ఉండడం గమనార్హం. ఇటువంటి పుస్తకాలకు ఇదే శ్రీకారం.....

ఈ పుస్తకం జర్నలిస్టులకు, కుర్రకవులకు,కొత్త రచయితలకు, సాహిత్యాభిమానులకు రేఖా మాత్రంగా ఒక గొప్ప కవిలోకావలోకనాన్ని కలిగిస్తుంది.

('ఉదయం'. - 1989)

*

## నే చదివిన మంచి పుస్తకాలు

చందు సుబ్బారావు

### కవనకుతూహలం

మొత్తం ఏడాదిలో అయిదేనా మంచి పుస్తకాలు చదివిందీ! ఏమో అయిదు కూడా చదవలేదేమో. ఉన్న టైంనంతా టీ.వీ. తినేస్తుంది. మిగతా విశ్రాంతి సమయాన్ని సొంత విషయాలు కొరికేస్తాయి. మంచి పుస్తకాలు అడపాదడపా చేతికందినా చదివే తీరికా, ఓపికా తగ్గిపోతున్నాయన్న మాట. మరి మంచి పుస్తకం అంటే నవలలా లాగించి వెయ్యటానికి వీల్లేదు. వార పత్రికలా పేజీలు త్రిప్పి వెయ్యటానికి వీలుపడదు.

1990 ప్రారంభంలో అబ్బూరి వరదరాజేశ్వరరావు గారి 'కవనకుతూహలం' చదివాను. అది అంతకుముందు సంవత్సరమే వెలువడిందేమో చెప్పలేను గాని చదవటం 90లోనే. రాజేశ్వరరావు 'జీనియస్' అని రావిశాస్త్రిగారు వైజాగ్‌లో ఎప్పుడూ చెబుతుంటారు. ఆ జీనియస్ తాలూకూ రచనలు ఏవీ చదువలేదు. 'మంచి మాటకారి' అని మాత్రం ఆయన తమ్ముడు గోపాలకృష్ణ, మా అత్తలూరి మిత్రులద్వారా వింటుంటాం. భావకవితాయుగంలోని బోలెడు సంగతులు, వింతలు, విశేషాలు నన్నాకర్షించాయి. అనుభవాలున్నాయి. మంచి, సారంశముంది.
కాని మాటిమాటికి మా నాన్నగారు, మానాన్నగారు అనటం కోపం తెప్పించింది. "కవనకుతూహలమ్ అను మానాన్నగారు, నేనూ" అంటూ ఓ సమీక్ష కూడా రాశాను. తండ్రి గొప్ప వాడయినప్పుడు బిడ్డలు జాగ్రత్తగా ఉండాలి. మాటిమాటికి ఆయన పేరు ఉచ్చరించరాదు. ఒకవేళ చెప్పినా తగు జాగ్రత్తగా ఉటంకించాలి. పైగా అబ్బూరి తన తండ్రి ఘనకీర్తిని కాసింత అతిశయోక్తితో చెప్పాడేమో అనిపించింది. ఏమైనా పుస్తకం మంచిది.రసముంది, రసాస్వాదన తెలిసిన రచయిత నుండి వచ్చింది.

(ఆంధ్రప్రభ, ఆదివారం, 6.1.1991)

*

# మిత్రుల ఉత్తరాలు (వివిధ సందర్భాల్లో)

E. Muralidhara Rao
128 Police Colony,
Hauz Khas
New Delhi-110 016.

ప్రియమైన మామయ్యగారికి
నమస్సులతో-

హైదరాబాదు నుంచి వచ్చిన చాలా రోజుల తర్వాత మీకు ఈ ఉత్తరం వ్రాస్తున్నాను. 'ఆలస్యం' కాదు కానీ-చాలా delay జరిగింది.

మీ నాన్నగారి రేడియో ఇంటర్వ్యూను ఆర్కైవ్స్ నుంచి మళ్లీ cassette చేయించాను. దాన్ని యథాతథంగా transcribe చేశాను. ఇందులో ఎర్ర ఇంకుతో వ్రాసిన మాటలు ఇంటర్వ్యూ చేసిన శ్రీ బాలాంత్రపు రజనీకాంతరావు గారివి. ఈ కార్యక్రమం ఆకాశవాణిలో ప్రసారం ఐనదీ లేనిదీ చేపు cue-sheet లో వివరాలు లేవు. ఒకటి రెండు చోట్ల పదాలు స్పష్టంగా తెలియరాలేదు. ఆ చోట్లలో dots ఉంచాను. తిరుపతి వెంకటకవుల దేవీభాగవతంలో వారు జ్ఞాపకం ఉంచుకొన్న చరణం (వ్రాతప్రతిలో 14-వ పేజీ) అవతారికలోని పూర్వకవిస్తుతి-ఆ గ్రంథం నాకింకా దొరకలేదు. అందులో నుంచి సరిచూసి ఆ పద్యం వ్రాసి పంపుతాను. 'పునీతా గాంధి' అన్న శ్లోకం (వ్రాతప్రతిలో 3-వ పేజీ) మీ దగ్గర ఉన్నదేమో తెలియదు. ఇక్కడ గాంధీ మ్యూజియంలో ప్రయత్నించాను. కాని ఎక్కడా దొరకలేదు. గాంధీగారు ఎవరికిచ్చారో కనిపెట్టవచ్చునని ఇక్కడి క్యూరేటర్ అంటున్నారు. అలా దొరితే మీకు వ్రాసి పంపుతాను. ఈ కాసెట్‌ను ఎవరైనా స్నేహితుల ద్వారా మీకు త్వరలోనే పంపిస్తాను. లేదా మే నెలలో అక్కడికి వచ్చినప్పుడు నేనే తెస్తాను. పోస్టులో పాడయితే మళ్ళీ దొరకదని పోస్టుచెయ్యడం లేదు.

ఈ ఇంటర్వ్యూకు పూర్వభాగం కూడా ఉన్నది. రేడియోలో కనబడలేదని నా స్నేహితుడు వ్రాశాడు. అందులో మీ నాన్నగారి బాల్యం, రవీంద్రునితో పరిచయం, తత్పరిణామరూపమైన వైముఖ్యం, సంస్కృత కవితాభినివేశం, కొన్ని సంస్కృత శ్లోకాల ఉదాహరణలూ ఉండాలి. మే నెలలో నేను విజయవాడకు వెళ్లినప్పుడు రికార్డింగును వెతికి తీస్తాను. దాని సంగతి ఇదమిత్థంగా తెలిసేనందాకా మీరు దాన్ని ఎడిట్ చెయ్యకండి. మొత్తం దొరికితే మీరు సంకల్పించిన గ్రంథానికి ముందుమాటగా అమరవచ్చు........

ప్రసంగపాఠం పూర్వభాగాన్ని గురించి నేను మళ్లీ మీకు సవివరంగా లేఖ వ్రాస్తాను.

నమస్సులతో
మురళి.
[2 .4.87]

PARIS
508 - Les Champs-Elysées et l'Arc de Triomphe

Editions CHANTAL. 74, rue des Archives, Paris

17/7/89

ప్రియమైన రాజేశ్వరరావు గారికి,
మీరు, ఛాయా దేవి గారు
కులాసాగా ఉన్నారని తలుస్తాను.
మేము ఫ్రెంచి విప్లవం
ద్విశత వార్షికోత్సవాల్ని
చూడ్డానికి ప్యారిస్‌కి
వచ్చాం. ఈ సమయానికి
ఇక్కడ ఉండగలగడం అదృష్ట
మనుకుంటాను. ఇండియాకి
వెళ్ళాక ఉత్తరం వ్రాస్తాను.
ప్రేమతో
ప్రభాకర్

Photo A Choisnet



[జవహర్‌లాల్ నెహ్రూ యూనివర్సిటీ విద్యార్థిగా ఉన్న పరకాల ప్రభాకర్‌తో యూనివర్సిటీ క్యాంపస్‌లోని 'ఉత్తరఖండ్' లో 'వరద'-1980 ప్రాంతంలో]

KVR 11-33-957 KAVALI 524202

కావలి,

4-12-'90.

శ్రీ వరద గారికి

వందనాలు. మీరు దయతో పంపిన పుస్తకాలు, జాబు అందాయి. కృతజ్ఞుణ్ణి.

శ్రీ శ్రీ జీవిత చరిత్రకు సామగ్రి సమకూర్చుకోవడంలోనే ఉన్నాను. మరి రెండేళ్లకు గాని రచనకు ఉపక్రమించను. మీలాంటి శ్రీ శ్రీ మిత్రులు శ్రీ శ్రీ గురించి చెప్పేది అంతా వినాలి. రాసిందంతా చదవాలి. 1938-40 ప్రాంతాల్లో మదరాసులో 'ఆంధ్రప్రభ' దినపత్రికలో పని చేసిన జర్నలిస్టులు ఇద్దరు-ఒకరు జి. కృష్ణ-సజీవులేనని విని సంతోషించాను. వారికి రాద్దామంటే అడ్రెసు తెలియదు. అలాగే శ్రీ శ్రీ ప్రాథమిక, సెకండరీ విద్య గురించి వివరాలు కావాలి. జనవరిలో విశాఖపట్టణం వెళ్ళినప్పుడు, శ్రీ శ్రీ సవతి-చెల్లెలు, కొండమ్మగారిని కలుసుకోవాలి. శ్రీ శ్రీ సమవయస్కుడైన లాయరుగారు ఒకరున్నారు. వారినీకలవాలి. చిట్టచివర ఆరుద్రగారినీ, శ్రీ శ్రీ రెండో భార్యనూ, పెంపుడు కుమార్తెనూ కలవాలి. చలసాని ప్రసాద్ సాయంతోటే ఈ పనులన్నీ జరగాలి. అందుకే రెండేళ్ల గడువు పెట్టుకున్నాను.

మీరిద్దరూ కులాసాయేగదా! ............................

ఉంటాను.

మీ

కెవి యార్.

•



## 'నాట్యగోష్ఠి' పునరుద్ధరణ

[అబ్బూరి రామకృష్ణారావుగారు *1933*లో 'నాట్యగోష్ఠి" ఉద్యమాన్ని ప్రారంభించారు. ఆ ఉద్యమంలో భాగంగానే 'నటాలి' అనే నాటక సంస్థను స్థాపించి, అనేక నాటక ప్రదర్శనలను ఆంధ్ర దేశమంతటా ఏర్పాటు చేసి నాటకరంగంలో అభివృద్ధి కరమైన మార్పులు తీసుకువచ్చారు. తరవాత ఉద్యమం హైదరాబాదులో కొంతకాలం కొనసాగించారు.

*1983* నుంచీ వరదరాజేశ్వరరావుగారు "నాట్యగోష్ఠి" ఉద్యమాన్ని పునరుజ్జీవింపచేశారు. నాట్యగోష్ఠి ఆధ్వర్యాన కుమారి చింతపల్లి పద్మ (రాజేశ్వరరావుగారి మేనకోడలు) చేత భరతనాట్య, కూచిపూడి రీతుల్లో నృత్య ప్రదర్శన హైదరాబాదులోని త్యాగరాజగాన సభలో ఏర్పాటు చేశారు. ]





[హైదరాబాదులో 'నాట్యగోష్ఠి' పునరుద్ధరణ సందర్భంలో
'ఉదయం' జరిపిన ఇంటర్వ్యూలో 'వరద']

# నాటక చర్చావేదిక
## రాజకీయాల వల్ల హాని

**అబ్బూరి వరదరాజేశ్వరరావు**

*[అబ్బూరి వరద రాజేశ్వరరావు 1943లో అబ్బూరి రామకృష్ణారావు స్థాపించిన 'నటాలి' రిపర్టరీ నిర్వాహకులలో ఒకరు. నటుడు, నాటకకర్త, ప్రయోక్త, కవి-......ప్రస్తుత తెలుగు నాటకరంగ స్థితిపై వీరి అభిప్రాయాలు ఇక్కడ ఇస్తున్నాం. సం.]*

కన్యాశుల్కం తరువాత తెలుగులో మరో నాటకం రాలేదనడంలో ఎంతమాత్రమూ అతిశయోక్తి లేదు. ఒకానొక సమకాలీన సాంఘిక దురాచారాన్ని ఆధారం చేసుకుని తెలుగు సమాజాన్ని అంత కూలంకషంగా పరిశీలించిన నాటకకర్త మరొకరులేరు. గురజాడ అప్పారావు గారు సాధించిన మహత్తర ప్రయోగం ఆయన నాటకంలో వాడిన తెలుగువారి సజీవ భాష. అదీ కాక, ఆయన మలచిన పాత్రపోషణ మరెవ్వరికీ చాతకాలేదు. ఈ శతాబ్ది ప్రారంభ దశాబ్దంలో, ముఖ్యంగా 1920 నుంచి ఈ నాటకాన్ని తెలుగునేల నాలుగు చెరగులా ప్రదర్శించడం జరిగింది. అంత విజయవంతమైన మరొక నాటకాన్ని చూపించండి. అలాంటి నాటకాలు మరిన్ని తెలుగులో వున్నవనుకోవడం ఆత్మవంచనే. అదీకాక అలాంటి రచయితల్లో ఇబ్సెన్ లున్నారనడం హాస్యాస్పదమే కాక మన అజ్ఞానాన్ని మరింత ప్రస్ఫుటం చెయ్యగలదు. సంస్కృతంలో మృచ్ఛకటికం తరువాత, కన్యాశుల్కం లాంటి నాటకం మరే భారతీయభాషలోనూ రాలేదు.

తెలుగుదేశంలో నాటకరంగం అభివృద్ధి చెందకపోవడానికి ముఖ్యకారణం, నాటక రంగాభ్యుదయానికి పరిశ్రమించే వారిలో-చలన చిత్రానికి, ఈ రంగస్థలానికీ మధ్యవున్న పరస్పర వైరుధ్యం గురించిన-అజ్ఞానమే మూలకారణం. సినిమా పూర్తిగా వేళ్ళు తొక్కక పూర్వమే

నాటకరంగం పాశ్చాత్య దేశాల్లో సుస్థిరమయి పోయింది. అందు చేతనే సినిమా అవతరించినా నాటకరంగం క్షీణించిపోలేదు. మనదేశంలో, ముఖ్యంగా తెలుగుదేశంలో, ఈ శతాబ్దారంభంలో ధర్మవరం కృష్ణమాచార్యుల వంటి మహనీయులు నాటకరంగం పునర్జీవనానికి చేసిన ప్రయత్నం ఫలించకపూర్వమే సినిమా అవతరించడం, దాంతో నాటకరంగం అధోగతి పాలవడం సంభవించింది. సినిమా, రంగస్థలం రెండు విభిన్న ప్రక్రియలని గుర్తించకుండా-నాటకరంగ పునరుజ్జీవనానికి దోహదం చేయడం కష్టం. 1950 ప్రాంతంలో యునెస్కో నిర్వహించిన అంతర్జాతీయ కళావేత్తల సదస్సులో సినిమాని కళగా నిర్ణయించక, పారిశ్రామిక కళగా నిర్వచించారు. నాటకాన్ని పరిశుద్ధమైన కళగా ఆమోదించారు. సామాజిక సంపర్క విహీనమయిన రంగస్థలం వృద్ధిచేయడం దుష్కరం. రంగస్థలం ఒక అర్థ శతాబ్దం పాటు ఆంధ్రదేశంలో స్వయం పోషకంగా వుండేది. స్వాతంత్ర్యం సిద్ధించిన తరువాత ప్రజాదరణను విసర్జించి ప్రభుత్వాదరణకోసం పాకులాడడంతో రంగస్థల శ్రేయోభిలాషులు రాజకీయాలకు లోనై రంగస్థలాన్నే సమూలంగా నాశనం చేయడం జరిగింది.

ప్రస్తుత పరిస్థితులలో తెలుగు నాటకరంగానికి భవిష్యత్తు లేదనిపిస్తోంది.

రంగస్థలానికి నాటకం ప్రధానం. నాటకానికి సర్వపరికర సమాయత్తమైన నాటకశాల ప్రధానం. తెలుగుదేశంలో, కేవలం నాటకానికి ఉపయోగపడే నాటకశాలలు ఎన్ని ఉన్నవి? నాటకశాలతో సన్నిహిత సంపర్కం కలవాడే నాటకం సృష్టించగలడు. నటులూ, నాటకకర్తా, ప్రయోక్తా ఒక సమిష్టి కుటుంబంగా నాటక శ్రేయస్సును ఆరాధిస్తేనే, మంచి నాటకం వొస్తుంది. అందుకు ప్రేక్షకులూ వుంటారు. ఈనాటి నాటకానికి ప్రేక్షకులు లేరు.

ప్రభుత్వం వల్ల ధనసహాయం జరగవచ్చు. ప్రేక్షకులెలా వొస్తారు? అకాడమీలు, తదితర ప్రభుత్వ సహాయపరికరాలు పోవడం వల్ల రంగస్థలం క్షీణించిందనుకోవడం తప్పు. రంగస్థలానికి ఎనలేని హానిజరిగిందని నా విశ్వాసం. గత ముప్ఫయి సంవత్సరాలలో అకాడమీల వల్ల సర్వాన్న భుక్కుల సంఖ్య పెరిగి, పదవీ వ్యామోహం పెరిగి రంగస్థలం నాశనం అయిపోయింది. అకాడమీలలో ఉన్న వారందరూ సినిమాకు దాసోహం అన్నవారే. నేటి విశ్వవిద్యాలయనట శిక్షణాలయాలు సినిమాకు అండదండగా వున్నవే. అంచాత నాటకరంగానికి భవిష్యత్తేదీ?

('ఉదయం', శుక్రవారం, ఏప్రిల్ 18, 1986)



[పతంజలి, వినాయక్, రావి. శాస్త్రిగార్లతో 'వరద']





[భార్య, ఆఖరి చెల్లెలుఛాయాజానకి, రెండవ చెల్లెలి కూతురు పద్మ లతో 'వరద']



[రెండవ చెల్లెలి కొడుకు చింతపల్లి రవీంద్రతో 'వరద']

# అబ్బూరి సంస్మరణ

[1988లో "అబ్బూరి సంస్మరణ" అనే గ్రంథాన్ని (సంపాదకుడు డా. అబ్బూరి గోపాలకృష్ణ) ప్రచురించి, త్యాగరాయగానసభలో 'అబ్బూరి సంస్మరణసభ"ను అద్వితీయంగా ఏర్పాటుచేశారు. ఇందులో పద్యపఠనం, కావ్యగానంతో పాటు, శ్రీయుతులు రాచకొండ విశ్వనాథశాస్త్రి, ఎ.ఆర్.కృష్ణ, శ్రీమతి లక్ష్మీ కనకాల, మొదలైన ప్రముఖ రచయితలూ, నటులూ పాల్గొన్న 'కన్యాశుల్కం" నాటక ప్రదర్శన ('కన్యాశుల్కం' లో ఒక దృశ్యం) జనరంజకంగా ఏర్పాటయాయి. పద్యపఠనం చేసినవారు డా. బాలాంత్రపురజనీ కాంతరావు, శ్రీ ఉత్పల సత్యనారాయణాచార్య ప్రభృతులు. కావ్యగానం చేసినవారు శ్రీ పాలగుమ్మి విశ్వనాథం, శ్రీమతి వేదవతీ ప్రభాకర్, శ్రీమతి నెమలికంటి సువర్ణలత, మొదలైనవారు. సభలో ఉపన్యసించిన ప్రముఖులలో డా. సి. నారాయణరెడ్డి, శ్రీ సోమంచి యజ్ఞన్నశాస్త్రి, శ్రీ నగ్నముని మొదలైనవారున్నారు. ]




[కన్యాశుల్కం' నాటక ప్రదర్శన]

Dr. M.A. Padmanabha Rao

Rustumbada,
Machilipatnam
22.10.88.

మిత్రుడు రాజేశ్వరరావుకి,

'నాన్న' గారి గురించి నాకు తెల్సునని బడాయి పడి భుజాలెగరేసుకున్నాను ఒకప్పుడు. ఇప్పుడు నాకు తెల్సింది పూజ్యం అని తెల్సుకుని సిగ్గుపడుతున్నాను.

ఈ తెలివిడికి అవకాశం అందించిన నీకు కృతజ్ఞతలు చెప్పకుండా ఉండలేను.

మరోసారి "అబ్బూరి సంస్మరణ"తో

పద్మనాభరావు.

*



[నాట్యగోష్ఠి తరపున 'అబ్బూరి సంస్మరణ గ్రంథాన్ని ప్రచురించిన మిత్రులు సోమరాజా]
రంగారావు, డా.సోమరాజా సుశీలతో 'వరద'

# మంత్రి శ్రీనివాసరావు సంస్మరణ ; నాట్యగోష్ఠి, నాలుగునాటకాలు

*1990*లో నాట్యగోష్ఠి ఆధ్వర్యాన 'మంత్రి శ్రీనివాసరావుసంస్మరణ సభ'ను ఏర్పాటు చేశారు. ఆ సందర్భంలో వరదరాజేశ్వరరావుగారు రచించిన "నాట్యగోష్ఠి నాలుగు నాటకాలు" అనే గ్రంథాన్ని వెలువరించారు. ఆ సభలో ప్రముఖుల పద్యపఠనం, కావ్యగానంతోపాటు, శ్రీ శ్రీ రచించిన "విదూషకుడి ఆత్మహత్య" అనే నాటకాన్ని డా. అబ్బూరి గోపాలకృష్ణ దర్శకత్వంలో ఆంధ్రాయూనివర్సిటీ డిపార్ట్‌మెంట్ ఆఫ్ థియేటర్ ఆర్ట్స్ విద్యార్థులుసమర్థవంతంగా ప్రదర్శించారు. ]



MANTRI SRINIVASA RAO

natyagoshti





[మంత్రి శ్రీనివాసరావుతో 'వరద']



[మంత్రి శ్రీనివాసరావు, ఎ.ఆర్. కృష్ణ, డా. పన్నూరి రామారావు,
మొదలైన మిత్రులతో 'వరద']




[మంత్రి శ్రీనివాసరావు సంస్మరణ సభ]




*[సమీక్షలు]*

## నాట్యగోష్ఠి

**పురాణం సుబ్రహ్మణ్యశర్మ**

'నాట్యగోష్ఠి' తెలుగు నాటకరంగ చరిత్ర పూర్వాపరాలకు సంబంధించిన సమాలోచనగా చెప్పవచ్చు. శ్రీ అబ్బూరి రామకృష్ణారావు గారు నిర్వహించిన తెలుగు నాటకోద్యమ సమీక్ష యీ నాట్య గోష్ఠి పుస్తకం. ఇందులో శ్రీ శ్రీ, వరద కలిసి రచించిన ఆంటన్ చెహొవ్ గారి చెరీ ఆర్చర్డ్‌కి తెలుగు– 'సంపెంగతోట', ఆంధ్రదేశంలో ఒకప్పుడు రెండు వందల ప్రదర్శనలకు పైగా నోచుకున్న 'ప్రతిమా సుందరి' నాటకం యిందులో వున్నాయి. 'సంపెంగతోట'లో ఎక్కువ భాగం వరదరాసిందే. 'ప్రతిమాసుందరి' హెరాల్డ్ బ్రిగ్ హౌస్, 'దిప్రిన్స్ హువజ్ ఎ పైపర్' అనే నాటకానికి అనుకృతి. 'ప్రతిమా సుందరి' సంప్రదాయ కమైన రాజమర్యాదలను వెక్కిరిస్తూ రచించిన రసవత్తరమైన హేళన కావ్యం. ఇందులో కొన్ని శ్రవ్య నాటికలుగా ఆకాశవాణి వారు ప్రసారం చేశారు. ఈ నాటకాల నేపథ్యంలో తెలుగు నాటకరంగ కథా నేపథ్యం సూక్ష్మంగా చెప్పారు.

నాట్యగోష్ఠిపుస్తకానికి ఆలోచనాత్మకమైన భూమిక కూర్చినందుకు వరద హస్తాన్ని అభినందంచాలి. కాలం, ప్రజలు మారుతున్న కొద్దీ నాటకాలకు 'అప్రిసియేషన్ తగ్గి 'డిప్రిసియేషన్' రావచ్చునవిపిస్తుంది. ఇది యీ సంపుటిలోని నాటికలు, నాటకాల దృష్ట్యా విచారణీయాంశం. అది అలా వుంచితే, తెలుగు వారి నాటకరంగ చరిత్ర సంప్రదాయకం, ఆధునికం–రెండు కలిసి ఒకటిన్నర శతాబ్దాలకు మించక పోవడం దురదృష్టకరం. నాటకం చూస్తూంటే మనం కూడా

నాటకంలో పాల్గొంటున్న అనుభూతి వుండాలి. అప్పుడే నాటకం చిరంజీవి. అది ఒకప్పుడు మనకు వుండేది. నాట్యగోష్ఠి ఉద్యమం నాటక రంగంలో ప్రజాభిరుచిని పునః ప్రతిష్ఠ చేయడానికి తన ప్రదర్శనలద్వారా అవిరళ కృషి సలిపింది. చలన చిత్ర రంగ వ్యవస్థ ఎంతభారీ వ్యాపారంగా మారిందంటే రాజకీయ నాయకులను, ఆఖరికి ప్రభుత్వాలను తన చేతి కిందకు తెచ్చుకోగలిగింది....కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు జాతీయ అంతర్జాతీయ చలన చిత్రోత్సవాల క్రింద కోట్లు ఖర్చు పెడుతున్నాయి గానీ, నాటకోత్సవాలు జాతీయంగా అంతర్జాతీయంగా నిర్వహించడం పట్ల ఆసక్తి కనబరచడం లేదు. తెలుగునాటకాలు ఎందుకు అభివృద్ధి చెందడం లేదు? చెప్పుకొనతగిన మంచి నాటక సంప్రదాయం కానీ నాటక వ్యవస్థకాని తెలుగు వారికి ఎందువలన ఏర్పడలేదు? చలన చిత్రం పారిశ్రామికమైన కళకాగా, నాటకం స్వచ్ఛమైన కళ. ప్రేక్షకుడు సినిమాలో భాగం కాలేడు. కాడు. ప్రేక్షకుడు నాటకంలో భాగంగా కలిసిపోగలడు, కలిసిపోతాడు.

మనరాష్ట్రంలో ముఖ్యపట్టణాలు, నగరాలలో నాటక ప్రదర్శన శాలల నిర్మాణానికి ప్రభుత్వంపై ఒత్తిడితేలేదు. నాటక ప్రదర్శనకు కనీస సౌకర్యాలు కూడా లేవు. నాటక కళ పురోభివృద్ధి కుంటుపడడానికి సినిమాయే కారణం. ఇది దురదృష్టకరమైన స్థితి. అకాడమీలు వచ్చినా థియేటరు నిర్మాణం చేపట్టలేదు. అవి కొంతమందికి జేబు సంస్థలుగా మాత్రమే వినియోపడ్డాయి. ...... రంగస్థల నటులు నాటకం నుంచి సినిమాకు జారి నాటకరంగపునరుద్ధరణకు ధర్మోపన్యాసాలు చేయడం వింటున్నాం. నాటక అకాడెమీలు ఆత్మహత్యాసదృశమైన ధోరణులను అవలంబించడం గర్హనీయం. ప్రభుత్వం వలన చిత్రశాలల నిర్మాణానికి బహిరంగంగా సహకరిస్తుంటే అకాడెమీలు చూస్తూ వూరుకున్నాయి.

రెండవ ప్రపంచ యుద్ధకాలంలో మద్రాసులో 'నటాలి' నాట్యగోష్ఠికి అనుబంధంగా ఆవిర్భవించింది. అది ఒక ఆదర్శప్రాయమైన రిపర్టరీ. నటాలిలో కవులూ, రచయితలూ, సాంకేతిక నిపుణులూ, నటులూ, గాయకులూ, వాద్యవేత్తలూ, నర్తకులూ, ప్రయోక్తలూ అంతా ఒక వ్యవస్థలా ఏర్పడి మద్రాసులో కృషిచేశారు. యుద్ధకాలంలో కాంట్రాక్టు నాటకాలతో నటాలి పోటీ పడవలసి వచ్చేది. శ్రీ శ్రీ కూడా యిందులో చేరారు. మొదటి సారి ప్రయోగించిన కన్యాశుల్కం నాటకంలో శ్రీ శ్రీ మహాప్రస్థానం కావ్యాన్ని తొలిసారి ప్రకటించిన నళినీ కుమార్ గిరీశంగా నటించారట. నటాలి చీరాలకు మారింది. నటాలి రిపర్టరీ లో కన్యాశుల్కం, ప్రతిమా సుందరి, సంపెంగతోట, ధాన్యలక్ష్మి, పిగ్మాలియన్ అండ్ గెలెటే గేయ నాటక వున్నాయి. నటాలి చీరాల నుంచి తెనాలికి మారింది. ఆ రోజుల్లో నటాలి ప్రదర్శనలకు పోటీగా కొప్పరపు సుబ్బారావుగారి 'తారాశశాంకాన్ని' రాజరాజేశ్వరి నాట్యమండలివారు పెద్ద సెట్టింగులతో ప్రదర్శించే వారు (సూరిబాబు, రాజేశ్వరి కాంబినేషన్). 'ప్రతిమాసుందరి'లో మొదటిసారి సైక్లోరమా ప్రయోగించారు. డి.వి. సుబ్బారావు గారు నాటకానికి సినిమాకి గల వ్యత్యాసాన్ని బతికున్న మనిషితో మాట్లాడడం, ఫొటోతో మాట్లాడడం లాంటిదని తూచినట్లు చెప్పారు. నటాలి అనుభవంతో, 'మంచి నాటకం రావాలంటే నాటకకర్తకి రంగస్థలంతో, నాటకరంగంతో సన్నిహిత సంబంధం వుండాల్సిందే' నన్నారు. యుద్ధానంతరం సినిమా విపరీతంగా విస్తరించడం చేత నాటకరంగం తెలుగు నాటస్తంభించి పోయింది.

ఆంధ్రప్రాంతంలో నాటక ప్రదర్శనలు అరకొరగా సాగుతూ వుండగా నైజాం ప్రాంతంలో నాటకం అసలు ప్రదర్శనగా ఏమాత్రం వృద్ధిచెందలేదు. మామిడి పూడి ఆనందం తొలిసారి బందావస్తై రా నటించిన 'వీరాభిమన్య' నాటకం రైల్వే జాగాలో 1946లో ప్రదర్శించారట. తర్వాత నిజాం కళాశాల ఆంధ్రోత్సవాలలో మంత్రి శ్రీనివాసరావు తెలుగునాటకాల్ని ప్రదర్శింప జేశారు. నాటకం కోల్పోయిన సామాజిక సంబంధాన్ని పునరుద్ధరించనిదే నాలుగు కాలాలపాటు నిలబడే మంచి నాటకం రాదు. మంచి నాటకం కావాలంటే నాటకంతో ప్రజలకు సామాజిక అనుబంధం ఏర్పడి బలపడాలి. వరద ఘోష అంతా నాటకోద్యమం ప్రజలతో జీవ సంబంధం ఏర్పరచుకోవాలి, అప్పుడే నాటకం స్వచ్ఛంగా, స్వతస్సిద్ధంగా అభివృద్ధి చెందుతుంది అని.

– ('ఆంధ్రజ్యోతి', ఫిబ్రవరి 4, 1991)

## 'ఊహకందని రాణి ఉదిత సంధ్యారాణి'

[ఎ.బి.కె. ప్రసాద్]

అంతర్జాతీయ రంగస్థల దినోత్సవం మరి రెండు రోజుల్లోనే (మంగళవారం–మార్చి 27) జరగబోతున్న సమయానికి "కవనకుతూహలం" కర్త అబ్బూరి వరద రాజేశ్వరరావు "నాట్య గోష్ఠి–నాలుగు నాటకాలు" కూడా వెలువడడం, చలన చిత్రరంగం తెలుగు రంగ స్థలాన్ని దాదాపుగా మింగి వేసిన దుర్దశలో కళాభిమానులందరిలో కొత్త ఆలోచనలకు అంకురార్పణ చేస్తుంది. తెలుగునాట నాటకరంగ వైభవానికి ఆధునిక రంగస్థల రూపక నిర్మాణానికి ఎంతగానో దోహదం చేసిన అగ్రగణ్యులలో ఒకరైన అబ్బూరి రామకృష్ణారావు ఉద్దండు డైన నాటకకర్త, ప్రయోక్త, తండ్రికి తగిన వారసుడు 'వరద'. రోమన్, గ్రీకు నాటకరంగాలకు ప్రతి బింబాలుగా తెలుగు నాటకరంగాన్ని దిద్ది తీర్చడానికి కథనంలో, రంగస్థల కథనంలో 'కన్యాశుల్కం' తో ప్రారంభోత్సవం చేసిన గురజాడ అంతటి నాటక కర్తగా కాకపోయినా, ప్రయోక్తగా గిరి శిఖరంగా నిలిచిన వారు రామకృష్ణారావు. "ఈ వేషం వెనుకటిదే. ఏమీ లేదా వేశం/ప్రయోగాలు లేని నుడులు అయోమయవు పలుకు బడులు" గా భావించిన రామకృష్ణారావు నిర్మాణకర్తగా నిత్యప్రయోగంలోనే పండిపోయిన మేధావి. జీవితంలో ప్రత్యక్ష సంబంధం వున్న వేదిక కనుకనే కావ్యాలలో కెల్లా రమ్యమైనదిగా నాటకాన్ని పేర్కొన్నారు. నాటకాంతం సాహిత్యం అన్నారు. ఆ విషయాన్ని 1963 లోనే రామకృష్ణారావు అంతర్జాతీయ రంగస్థల దినోత్సవం సందర్భంగా (1961లోనే ఈ దినోత్సవానికి బీజావాపన జరిగింది.) అందజేసిన సందేశంలో స్పష్టం చేశారు! "నాటకరంగంతో సంబంధం లేని విద్యగాని, శాస్త్రంగానీ లేనేలేదు. అది సకల కళా నిలయం. శోకార్తులకూ, శ్రమార్తులకూ విశ్రాంతినీ, వికాసాన్నీ, వినోదాన్నీ, ఆనందాన్నీ కల్పిస్తుంది–వాద ప్రతివాదాలతో కాదు–లోక వృత్తాంత దర్శకమైన రంగస్థల దృశ్యాలు చూచి తమతమ మనోమాలిన్యాన్ని క్షాళనం చేసుకోవాలి" అన్నారు! కనుకనే ఒకనాటి ప్రసిద్ధ నటులు డి.వి. సుబ్బారావు నాటకరంగానికి, చలన చిత్రరంగానికీ ఉన్న తేడాను ఎవరికంటే కూడా తడబడకుండా బాగా చెప్పగలిగాడు. "బతికున్న మనిషితో మాట్లాడండి, ఫొటోతో మాట్లాడండి"! అదీ రెండు రంగాలకూ ఉన్న భేదం! నిజమే.

ఒకటి పరిపూర్ణ కళాఖండంగా తల్లిపాలతో ఎదిగిన బిడ్డ, వేరొకటి పోతపాలతో పెరిగిన బిడ్డ. రంగస్థలం చరిత్రలో ఈ విపరిణామానికి సవాలక్ష కారణాలు ఉండవచ్చుగాక. విద్య వ్యాపారమైనచోట సర్వకళలూ ఆ వైపుగానే ప్రయాణించక తప్పని పరిస్థితులు ఏర్పడ్డాయి. దశాబ్దాలుగా తెలుగు నాటకరంగమూ, కళాకారులూ పడుతూ వస్తున్న ఇబ్బందుల గురించి, రంగస్థల పతనానికి కారణాల గురించీ ఎంతో అవగాహనతో, ఆవేదనతో చర్చించడమేగాక, రంగస్థలం పూర్వరంగాన్ని ఆపనికాంతర ఘోషగా వినిపిస్తున్న రచన వరదరాజేశ్వరరావు "నాట్యగోష్ఠి". రూపక నిర్మాణానికి, రంగస్థల నిర్మాణానికి సంబంధించిన సిద్ధాంత రాద్ధాంతాలకు జల్లెడ పట్టిన వేదిక అబ్బూరి వారి "నాట్యగోష్ఠి" కాగా, అందుకు ప్రయోగ శాలగా, నటీ నటుల శిక్షణాకేంద్రంగా (రిపర్టరీ) తన గజ్జెల రవళిని, తెలుగు నాట వినిపించిన దాని అనుబంధ సంస్థ "నటాలి". 1930ల తర్వాత, ముఖ్యంగా యుద్ధకాలంలో, ఆ తరువాత కొంది రోజుల దాకా–చిత్తూరు నుంచి చికాకోలు (శ్రీకాకుళం) దాకా ఆధునిక రంగస్థల సంస్కారంతో, వినూత్న ప్రయోగాలతో ప్రేక్షక సమూహాలను ప్రయోజనకర రంగస్థలాన్ని సమాశ్రయించేందుకు ఉత్సాహపరిచి ఉద్యమింప చేసిన సంస్థ 'నటాలి'. దక్షిణ భారతంలో తొలి "రిపర్టరీ" "నటాలి". ఇక్కడో సత్యాన్ని చెప్పక తప్పదు. "ప్రజా నాట్యమండలి" కూడా ఇంచుమించు రెండో యుద్ధం నాటికే అవతరించి తెలుగునాట ప్రభంజనంలా దూసుకుపోయింది. అప్పటికి మరచి పోయిన తెలుగు వారి అన్ని కళారూపాలను–బుర్రకథ, జముకులకథ, ప్రజాసమస్యలు ఆధారంగా మా భూమి, పరివర్తన, ఇత్యాది నాటకాలతో రంజింప జేసింది. ప్రజలను విజ్ఞానవంతులను చేసింది. నటాలి వారి "ప్రతిమాసుందరి" (ఊహాకందని రాణి) 200 ప్రదర్శనలిస్తే "మాభూమి" కనీసం వెయ్యి ప్రదర్శనలిచ్చి చరిత్ర సృష్టించింది. ప్రజా నాట్యమండలికి డాక్టర్ రాజారావు ఎలా గుండెకాయగా వ్యవహరించాడో, హైదరాబాద్ లో పోలీసు చర్య తరవాత మొదటిసారిగా 1950లో ఆంధ్రాభ్యుదయోత్సవాలను ఆసరా చేసుకొని సామాజిక ప్రక్రియగా నాటకాన్ని ప్రవేశపెట్టిన ప్రముఖుడు మంత్రి శ్రీనివాసరావు. ఆయనకే "నాట్యగోష్ఠి" అంకితం. అఖిల భారత స్థాయిలో పీపుల్స్ థియేటర్, నేషనల్ థియేటర్ లాంటి సంస్థలు వెలసి దేశ వ్యాప్తంగా ప్రాంతీయ శాఖల ఏర్పాటుకు నాందీవాచకం పలికాయి. "నాట్యగోష్ఠి"లోని నాలుగు నాటకాలు ఒక ఎత్తు అయితే, ఈ పూర్వరంగ చరిత్ర అంతా 'వరద' సుదీర్ఘ పరిచయ గోదావరిలో అంతర్వాహినిగా సాగిపోయింది!

"నటాలి" తరఫున లేదా "నాట్యగోష్ఠి" పనుపున ప్రయోగంగా గురజాడ వారి మహోత్తమ సాంఘిక నాటకం "కన్యాశుల్కం" తోపాటు ఎదిగి వచ్చిన నాటికా నాటకాలు, నాలుగు. అవి: జోలపాట, ప్రతిమాసుందరి, సంపెంగ తోట, ముక్త యాత్ర. మొదటి మూడింటికే మాతృకలు పాశ్చాత్యనాటకాలు. నాల్గవది రేడియో నాటిక. అయితే ఇంచుమించు అన్నింటిలోనూ లోక వృత్తాంతం, సంప్రదాయ విరసన, రాచమర్యాదల అవహేళన, అహంకార ప్రతిఘటన, స్వేచ్ఛా ప్రియత్వం, సంఘసంస్కార ప్రియత్వం పూసల్లో దారంలా కళ్ళకు కట్టినట్టు ఉంటాయి. కావ్యాలలో నాటకం, నాటకాలలో 'శాకుంతలమ్', మళ్లా అందులోనూ నాల్గవ అంకం విశిష్టమైనదన్న లోకోక్తి ఎలా ఏర్పడిందో, వరద, శ్రీ శ్రీ చెహోవ్ రష్యన్.నాటకం "చెరీ ఆర్చర్"కు అనుకృతిగా రాసిన "సంపెంగతోట"ను ఈ నాలుగింటిలో శిఖరాయమానంగా చెప్పి తీరాలి. దానిని

అనుకృతి అనడం కంటే అనుభూతి కృతిగానే చెబితే అతిశయోక్తి కాదు–తెలుగువాడు తెలుగులోనే రాసినట్టు రచనలో, రూపక నిర్మాణంలో, రంగాలంకరణ సూత్రాలలో అంత బిగువుగానూ సాగింది. దురదృష్టం ఏమంటే, తెలుగు నాటకరంగ దుస్థితిని ఆనాటి నుంచి ఈ నాటివరకు ఎందుకు పదేపదే చెప్పుకోవలసి వస్తోందంటే, ప్రదర్శనకు సరిపోయినన్ని స్టేజి థియేటర్లు లేకపోవడం. "సంపెంగతోట"ను దర్శించలేని సమయంలోనే ఇంగ్లండ్ లోని "లిరిక్ హామర్స్మిత్" థియేటర్ లో చెహోవ్ "చెరీ ఆర్చర్డ్", బెర్నార్డ్ షా "పిగ్మాలియన్" శతదినోత్సవాలు, ద్విశత దినోత్సవాలూ చేసుకున్నాయి! ఆస్కార్ వైల్డ్ వర్ణించిన సారాబెన్ హార్ట్ అంతటి ("the divine Sarah") పాత్ర గాకపోయినా చెరీ ఆర్చర్డ్‌లో చెహోవ్ సృష్టించిన మదామ్ రనే వస్క్రయా పాత్రను పోషించిన ఆంగ్లనటీమణి సీలియా జాన్సన్ కు మన "సంపెంగతోట"లోని "జయశ్రీ" ఏమాత్రం తీసిపోదు!

"సంపెంగ తోట"ను తొలిసారిగా ఆస్వాదించే భాగ్యం తెలుగువారికి ఎప్పుడు కలుగుతుందో చూడాలి! అందులోని "అనంతం" కూడా మరపురాని పాత్ర. ఆధునిక భావాలకు ప్రతీక. బరువుగా ముగిసే ఈ నాటకాంతం ఓ గొప్ప కళాసృష్టి. సీరియస్ నాటక కర్తలందరికీ సుఖాల కంటే కష్టాలే ఎక్కువ. బెర్లిన్ థియేటర్ లో తలమునకలై ప్రయోగాలు చేస్తున్నప్పుడు ఆధునిక నాటకరంగస్థం పితామహుడైన ఇబ్సన్ తన తొలి వైఫల్యాలనూ, ఎదురైన ఇబ్బందులనూ "a daily abortion" అని హాస్యభరితంగా వర్ణించుకున్నాడు! జాతీయతను, రాజకీయాలను, సంఘదృష్టినీ కళారంగానికి అబ్బించిన ఖ్యాతి ఆయనదే. ఆధునిక యుగంలో–'వరద' పేర్కొన్న ఔత్సాహిక నాటక రంగానికి ఉత్తేజంగా యూరప్‌లో తలెత్తిన (డబ్లిన్) "లిటిల్ థియేటర్" ఉద్యమ నిర్మాత లేడీ గ్రిగరీ. ఐరిష్ జాతీయోద్యమానికి అండగా, రైతు కార్మిక జీవితాలకు, సుఖదుఃఖాలకూ అంకితమైన రంగస్థలం అది. సహదేశభక్తుడు, అనంబద్ధ నాటకకర్తలలో ఒకరైన బెకెట్ ఆమెకు తోడూ నీడగా నిలిచాడు.

డబ్ల్యు.బి.ఏట్స్ పండితుడు, మరి కొందరు ఇతరుల చేయూతతో లేడీ గ్రిగరీ ఐరిష్ నేషనల్ థియేటర్ కంపెనీకి మాతృమూర్తి కాగల్గింది. బాలీ నుంచి బ్రాడ్‌వే వరకూ సాగే సుఖ దుఃఖాల యాత్రగామ్నానవ జీవితాన్ని వర్ణించుతూ ఓ పెద్ద మనిషి "men and women come together to act out drama and comedy of life" అన్నాడు! అలా లోకవృత్తాంతాన్ని ఆవిష్కరించడానికి సుశిక్షితులుగా ప్రసిద్ధ కళాకారులను దిద్దితీర్చినవే మాంచెస్టర్, బ్రిస్టల్, స్ట్రాట్ ఫోర్డ్, లివర్ పూల్–రిపర్టరీలు. 'వరద' విదేశపర్యటనలు ఈ శిక్షణా కేంద్రాల వైశిష్ట్యాన్ని తెలుసుకునేందుకు ఎంతగానో తోడ్పడ్డాయి. లిటిల్ థియేటర్ ఉద్యమకాలంలోనే, "నటాలి" గజ్జెల చప్పుడు వినిపిస్తున్న కాలంలోనే–బ్రిటన్‌లో "ఫ్రింజి థియేటర్" గ్రూపూ, "సిస్ సిమాన్స్" గ్రూపూ, 7,000 మంది సభ్యులతో "రెబెల్ ప్లేయర్స్ అండ్ రేడియో" గ్రూపు సమన్వయ సంస్థగా కార్మికోద్యమ రంగస్థలంగా "యూనిటీ థియేటర్" అవతరించాయి.

ఇలాంటి వారసత్వాన్ని పుణికి పుచ్చుకున్నవాడే వరద రాజేశ్వరరావు!

(సంపాదకీయం, 'ఆంధ్రభూమి', ఆదివారం, 25 మార్చి, 1990)

# A STUDY OF DEVELOPMENT OF TELUGU DRAMA

Gopalachakravarty

Natya Goshti: Nalugu Natakalu. Abburi Varada Rajeswara Rau, Published by VisalaGranthasala. For copies-Navodaya Publishers, Vijayawada. Rs. 25.

Abburi Varada Rajeswara Rau.... by virtue of being the son of a great poet, he knew several literary giants intimately. He wrote about them in the Andhra Prabha Weekly for several weeks which was later published... Varada has now come out with a book with the title "Natya Goshti: Four plays".

Drama is the *ne plus ultra* of literary expression. The origins of drama are traceable to some form or other of religious ceremony. The theatre of today may be said to have had its birth in Greece and India.

Even though the Telugu language is ancient, unfortunately the Telugu drama is only 100 years old. It was only during the last quarter of the nineteenth century that the stage in the Telugu country came into being mainly as a result of the indirect influence of the European theatre through the medium of English touring companies calling at Indian ports, on their way to the dominions and colonies. The cities of Bombay and Calcutta had the advantage of witnessing the performances of these mediocre touring companies, but the rest of India came to have an idea of the European drama only through the melodramatic and highly artificial renderings, of the travelling Parsi companies. *"Chitranaleeyam"* was, perhaps, the first notable original play written and produced in Telugu. It was written by Dharmavaram Krishnamacharyulu known as the *Andhra nataka Pitamaha. 'Chitra Naleeyam'* and *"Vishada Sarangadhara"* (the first tragic play in Telugu) of Sarasa Vinodini Sabha of Bellary used to cast a spell on the audience when staged by the stalwarts of the period.

The history of the Telugu drama has been a replica of that of Telugu literature in general. First came plays adapted from their Sanskrit parents. Then came elaborate super-structures over slender mythological anecdotes or frail historical nuclei. Then the Telugu playwright repaired to the regions of the here and the now and found dramatic tackle among the common people of a living society.

The movement of Natya Goshti was started by Abburi Ramakrishna Rau about 65 years ago. Ramakrishna Rau got enacted the play "Kanyasulkam" for the first time in Western Andhra at Tenali. Abburi Senior, a doyen of the theatre movement in India, used three dimensional settings in plays in our state for the first time.

The medium of film has ruined the theatre in Andhra, as it happened in

several foreign countries also. The State Nataka Akademy's contribution to the theatre movement is negligible. The magnificient work of 'Natya Goshti' is to be viewed from this angle and understood in this perspective. Natya Goshti's plays are the products of a rich imagination.

"Natya Goshti, Four Plays' contains a scholarly review of the development of Telugu drama. The book contains four plays.

"Jolapata" (Lullaby) is a powerful satire on modern society......It is a fantasy, an experimental play. Varada was inspired at the beginning of the Second World War by an English play and wrote the "Jolapata", which was first produced at Waltair. The music was scored by the veteran composer and musicologist Balantrapu Rajanikantha Rao. 'Pratima Sundari' is a period play written about 50 years ago and won rich praise from the titan of Telugu literature, Malladi Ramakrishna Sastry. It is an adaptation of the English play "The Prince who was a piper" written by Harold Brigghouse. It was produced more than 200 times in Andrha.

"Sampangi Thota" is a translation of Anton Chekhov's "Cherry Orchard". Varada teamed up with Sri Sri to write "Sampangi Thota". "Mukta Yatra" is a radio play written in 1954 and revolves around a woman who seeks freedom from the shackles of convention.

"Natya Goshti, Four Plays" slakes the thirst of the common lover of Telugu literature for good writing and one hopes that the plays will be widely staged by theatre groups. All in all, an excellent anthology.

The book is dedicated to Mantri Srinivasa Rao, well-known theatre artiste of Hyderabad. The cover is designed by 'Chandra'.

-('Indian Express', Hyderabad March 27, 1990.)



[బాలకృష్ణ, డా. పన్నూరి రామారావు లతో 'వరద']



[మిత్రులు రాచకొండ విశ్వనాథశాస్త్రి, వినాయక్, అజంతా గార్లతో 'వరద']



[ఆఖరి చెల్లెలి భర్త తిమ్మరాజా శివరాంతో 'వరద']



[మిత్రులు అజంతా, బీనాదేవి, శ్రీపతి గార్లతో 'వరద']



[తిరుపతిలో ఫణికుమార్, చిత్రల వివాహ సందర్భంలో–మిత్రులు నామిని సుబ్రహ్మణ్యం నాయుడు, పురాణం సుబ్రహ్మణ్యశర్మ, అజంతా గార్లతోనూ భార్యతోనూ 'వరద']



[మిత్రుడు కాళోజీ నారాయణరావుగారితో 'వరద' దంపతులు]



[మిత్రులు అజంతా, నగ్నముని, ఏల్చూరి సుబ్రహ్మణ్యం, హనూరావ్,
రాచకొండ విశ్వనాథశాస్త్రి.......గార్లతో 'వరద']



['బీనాదేవి'గారి సంతాప సభలో హనూరావ్, ఆర్.వి.ఆర్. చంద్రశేఖర్ రావు, శ్రీపతి, నాదిగం కృష్ణారావు, వాకాటి పాండురంగారావు; సనామ, వాసిరెడ్డి సీతాదేవి, ఓల్గా, లీలావతీ రాఘవయ్య, మొదలైన మిత్రులతో 'వరద']



[మిత్రులు నందిగం కృష్ణారావు, సమ్మెట నాగమల్లీశ్వరరావు, రాచకొండ విశ్వనాథశాస్త్రి, వరవరరావు, ఫణికుమార్,....., ఓల్గా గార్లతో 'వరద']

# దువ్వూరి రామిరెడ్డి సంస్మరణ కు ప్రయత్నం

*[నాట్యగోష్ఠి ఆధ్వర్యంలో "దువ్వూరి రామిరెడ్డి సంస్మరణసభ" అపూర్వ పద్ధతిలో ఏర్పాటు చేయాలని వరద రాజేశ్వరరావుగారు సంకల్పించి ప్రయత్నాలు ప్రారంభించారు]*

KVR
C/o. Dr. S. Ramakrishna, M.D.,
Santi Nursing Home
Opp. Nirmala Convent

Vijayawada-520010

విజయవాడ
8 -10 - 91.

శ్రీ వరదగారికి,

వందనాలు. మీ ఉత్తరం ఈ ఊరికి వచ్చి చేరింది. 20 రోజాలుగా నేనిక్కడ ఉంటున్నాను. మరో పదిరోజుల్లో కావలి వెళ్లిపోతాను.
దువ్వూరి రామిరెడ్డి సంస్మరణ సభ పెట్టడం చాలా మంచిదే గాని నేను వక్తను గాను, కవి కోకిల స్మృతికి మాటాల్లో జస్టిస్ చెయ్యలేను. పైగా నా ఆరోగ్యం అంత బాగుండటం లేదు. అయినా మీయిష్టం.

దువ్వూరి రామిరెడ్డి కుమారుడు, వేణు గోపాలరెడ్డి మరణించి పదేళ్ళు కావస్తూంది. మనుమడున్నాడు గాని లాభం లేదు. వేణుగోపాలరెడ్డి అల్లుడు అసలే పనికిరాడు. పుస్తకాలన్నీ చెల్లా చెదరై పోయాయి. కొన్ని కాపీలు 'విశాలాంధ్ర' ప్రచురణాలయంలో దొరకవచ్చు. నా వద్ద దాదాపు పూర్తి సెట్ ఉంది. ఫోటో కూడా దుర్లభమే. నా 'కవికోకిల' టైటిలు పేజీ లో ఉన్న ఛాయా చిత్రం పనికి రావచ్చు. అవసరమైతే, ఈ నెల 20 తర్వాత కావలికి రాయండి పంపుతాను.

..........

మీ
కె. వియార్



-[ఒక విందులో మిత్రుడు పేరెళ్ళ వేణు మాధవ్ గారితో 'వరద'] -

# జువ్వాడి గౌతమరావుగారి పద్యపఠనం: హైదరాబాదులో, విశాఖపట్నంలో

*[ జనవరి 1992లో హైదరాబాదులోని రిట్జ్ హోటల్ లో ఒక సాంస్కృతిక సదస్సు ఏర్పాటు చేశారు. అందులో శ్రీ జువ్వాడి గౌతమరావుగారు ప్రముఖ ఆధునికాంధ్రకవుల పద్యాలను హృదయంగమంగా పఠించారు. రాష్ట్ర ప్రభుత్వ సహకారంతో ఆ పద్యపఠన కార్యక్రమాన్ని విడియో, ఆడియో కాసెట్లరూపంలో భద్రపరిచారు. తరవాత మరొకసారి తీయించిన విడియోలో డా. మృణాళిని జువ్వాడి గౌతమరావుగారి పద్యపఠనానికిముందు ప్రతి కవినీ విశ్లేషణాత్మకంగా పరిచయం చేశారు.*

*మళ్ళీ జూలై 1992లో గౌతమరావుగారి పద్యపఠన కార్యక్రమాన్ని విశాఖపట్నంలో రాచకొండ విశ్వనాథశాస్త్రిగారి 71వ జన్మదిన అభినందన సభలో ఏర్పాటు చేశారు].*

శ్రీః

వరంగల్,
20.1.92.

ఆత్మీయులు,
శ్రీ వరద రాజేశ్వరరావు గారికి,
నమస్సులు.
ఉభయకుశలోపరి.

గౌతమరావు ఆధునిక పద్యపఠనకు సంబంధించిన కార్యక్రమ పత్రం మీరు పంపారు గదా! అది చూడగానే ఆనందమూ కలిగింది, విచారమూ కలిగింది.

ఆనందం కలుగటానికి కారణం చాలా నాళ్ల నుంచి అనుకొంటున్న కార్యక్రమం ఇప్పటికి ఏర్పాటయింది గదా అని,

విచారం కలుగటానికి కారణం, అందులో పాల్గొనే-ఇన్నాళ్లుగా ఎదురుచూసిన ఆనందకర సమావేశంలో పాల్గొనే అవకాశం పోగొట్టు కొన్నాను గదా అని.

ఎందుకంటే, నేను కాలేజి నుంచి ఇంటికి వచ్చేటప్పటికి మీరు పంపిన కార్డు ఉంది. ఆ క్రితం రోజే మా అమ్ముల కృష్ణమూర్తి షష్టి ఉత్సవాల నిర్వాహకులు ప్రధానవక్తగా నన్ను ఉండాలని వత్తిడి చేశారు. నిజానికి వాళ్లు వత్తిడి చేయనక్కరలేదు. ఎందుకంటే, కృష్ణమూర్తికి నాకూ ఉన్న అనుబంధం వత్తిడి అక్కరలేనిది. 1956 నుంచి చాలా గాఢమయిన అనుబంధమిది. ఆయన నాకు

గురువూ, ఆత్మప్రియ మిత్రుడున్నూ. (గౌతమరావుకే అత్యంతాప్తుడు) అందుకని ఆనందంగా ఒప్పుకొన్నాను. వాళ్ల కార్యక్రమం రూపొందించుకున్నాక, కాదనటానికి మనసొప్ప లేదు. అదీ అచ్చంగా 19వ తారీఖునే. రెండు సన్నివేశాల్లోనూ అన్వయించగల అవకాశం ఏమాత్రమూ లేకపోయింది. ఇందాకే గౌతమ్‌కు ఫోను చేసి సమావేశం వివరాలు తెలుసుకున్నాను. ఎంతో బాగా జరిగిందన్నారు. నా మనస్సు ఉసూరు మన్నది.

ఇక్కడ కృష్ణమూర్తి సభలో హైదారాబాద్ సమావేశం గూర్చి చెప్పాను గూడా. నేనిక్కడ ఉన్నా నా మనసంతా అక్కడే ఉండింది. ఏదేమయినా చాలా గొప్పగా సమావేశం జరిపినందుకు మిమ్మల్ని మనసారా అభినందిస్తున్నాను.

విశాఖ నుంచి రావిశాస్త్రి ప్రత్యేకంగా వచ్చారట గదా! వరంగల్ నుంచి నేను రాలేక పోయాను. "విధిరనతిక్రమణీయా" అంతకన్నా ఏమనుకోగలను! వీడియో తీశారు గదా! ఈ మధ్య హైదరాబాదు వచ్చినప్పుడు మీ ఇంట్లో అది చూస్తాను. ఆ విధంగానయినా తృప్తిపడతాను.

......................పునరభినందనలతో

మీ

సంపత్కుమారాచార్య.



27.3.92.

మిత్రులు శ్రీ వరద రాజేశ్వరరావుగారికి,

నమస్కారాలు.

మీరు చాలా శ్రమపడుతున్నారు. ఫొటో కావాలంటే మీరు Lamination కూడా చేయించినారు. మొత్తానికి ఈ ఫొటో మీద నాకు కొంత వ్యామోహం ఏర్పడ్డది. స్వతః ఫొటోం మీద శ్రద్ధ లేదు.... ................ మొత్తానికి ఒక ఉప్పు ఊప వదిలి పెట్టినారన్న తృప్తి నా కున్నది.

మళ్లీ మీ అవకాశాన్ననుసరించి ఎప్పుడు రమ్మన్నా సరే నేను వస్తాను. ఒక వారం రోజాలు ముందు చెపితే నేను కొంత దుమ్మూ ధూళికి దూరంగా జాగ్రత్తగా ఉంటాను. మళ్లీ ఆవ్వే పద్యాలు చదువుదామంటారా? ఉగాది 4th April న తేదీన ఉన్నది. ఆ తరువాత ఎప్పుడైనా సరే.

మీ

జువ్వాడి గౌతమరావు.

# చేరాతలు

## భావస్ఫూర్తి కలిగించిన పద్య పఠనం

.డా. చేకూరి రామారావు

నిజమెంతో తెలియదు కాని, తెలుగులో పద్య పఠనం లాంటిది ఇతర భాషల్లో లేదని తెలుగు వాళ్లు గొప్పలు చెప్పుకుంటారు... పద్యాలు రాగాలు తీసి పాడడం వేరు. భావానుగుణమైన విరుపులతో చదవడం వేరు...

పద్యకవులు పద్యం చదవడంలో తమ దైన ఒకబాణీ తయారు చేసుకుంటారు. కృష్ణశాస్త్రి గారు తమవీ, తమ సమకాలికులవీ పద్యాలు సభల్లో బాగా చదివేవారని విన్నవాళ్లు చెపుతారు. శ్రోతలు మంత్రముగ్ధులయ్యేవారట! ..... తెలుగు పద్య పఠనంలో (రచనలో లాగానే) విశ్వనాథ సత్యనారాయణగారి బాణీ ఒకటుంది.... ఆబాణీలో సత్యనారాయణగారి పద్యాలు ఆయన కన్నా ఆర్ద్రంగా చదువుతారు జువ్వాడి గౌతమరావు.

పద్య రచనలో ప్రాగల్భ్యంతో పాటు పద్యపఠనంలో ప్రావీణ్యం చూపగలవారింకా వున్నారు. మధునాపంతుల సత్యనాయణశాస్త్రి ఉత్పల సత్యనారాయణాచార్యులు, బేతవోలు రామబ్రహ్మం గార్లు వారిలో కొందరు. దాశరథి పద్యం చదివేతీరు ప్రౌఢంగా వుండేది......

మన దురదృష్టమేమిటంటేను కవుల పద్య పఠనం మన జ్ఞాపకాల్లోనే మిగిలిపోతున్నది. మౌనంగా చదువుకోదగిన రచనలు చేసే వచన కవులే క్యాసెట్లలో తమ గొంతు వినిపిస్తున్నారు- మంజీరా రచయితల సంఘం, ఎ.జి. ఆఫీసు వాళ్ల రంజని సౌజన్యం ఆసరాగా. గొంతెత్తి వినిపించాల్సిన పద్యం అచ్చు అక్షరాల్లో మరుగున పడుతున్నది. సంప్రదాయం భావితరాలకు అందించాల్సిన బాధ్యత ఈ తరానికి వుందా? లేదా? ఈపని ఎవరు చెయ్యాలి?.... విశ్వవిద్యాలయాల వారీ పని చెయ్యగలరో లేదో తెలీదు గాని, అబ్బూరి వరద రాజేశ్వరరావుగారు అంతపనీ తాను చెయ్యగలనని చేసి చూపించారు.

వరద చిత్రమైన మనిషి. తొలి పరిచయంలో తానో సినిక్‌నని మనల్ని భ్రమింపచేసి బోల్తా కొట్టించగలరు. కాని తానేదన్నా ఒక పని సాధించాలంటే పట్టుబట్టి సాధించగలరు. వనరులు సంచయించగల నేర్పరి కూడా. కార్యసాధకుడైన సాహసి. 1992 జనవరి 19 ఆదివారం పగలు పదకొండు-ఒకటిన్నర మధ్య హైదరాబాదు నగరం నడి ఒడ్డునున్న రిట్జ్‌హోటల్లో ఒక పద్య పఠనం ఏర్పాటు చేయించారు. జువ్వాడి గౌతమరావుగారు ఆధునిక కవుల పద్యాలు ఆర్ద్రంగా ఆహూతులకు చదివి వినిపించారు. ఈ కార్యక్రమం వీడియో తీశారు....

ఆరోజు రాయప్రోలు సుబ్బారావుగారి మధుకలశం నుంచి, అబ్బూరి రామకృష్ణారావుగారి మల్లికాంబ, ఊహాగానాల్లోంచి, దువ్వూరి రామిరెడ్డిగారి పానశాల నుంచి, జాషువా గారి ఫిరదౌసి, ఖండ కావ్యాల్లోనుంచి, ఆఖరున విశ్వనాథ సత్యనారాయణగారి ఆంధ్రభిక్షువు, సీరధము (వైతాళికుల్లో సంకలితం), శివధనుర్భంగం (రామాయణ కల్పవృక్షం) పద్యాలూ చదివారు.

బొమ్మకంటి శ్రీనివాసాచార్యులు ఈ కవులొక్కొక్కరిని గూర్చి ఒక్కో పద్యమో, పద్యశకలమో రాశారు.... ఆయా కవులను సాహిత్య సంప్రదాయ బద్ధంగా ప్రశంసించారు. ఈ వరసలోనే గౌతమరావు గారు ఆయా కవుల పద్యాలు చదివారు.

పద్యరచనలో శృంగార సౌకుమార్యమూ, తాత్విక గాంభీర్యమూ ప్రదర్శించి తన కవితా సర్వస్వానికీ పద్యాన్నే వాహికగా వాడుకున్న కవి నాయని సుబ్బారావు గారు పై వరసలో లేక పోవడం నాకు వ్యక్తిగతంగా కొంత నిరుత్సాహం కలిగించింది. అది పసిగట్టి కాబోలు వరద రాజేశ్వరరావుగారు రెండవ విడత పద్య పఠనంలో నాయని పద్యాలుంటాయని నన్నూరడించారు. అంటే ఇది ఆరంభమే కాని అంతం కాదని హామీ ఇచ్చారన్నమాట నిలబెట్టుకొంటారని ఆశిద్దాం.

గౌతమరావుగారు....స్పష్టమైన ఉచ్చారణతో ఆ సమాసాలను విరుపులతో భావస్ఫోరకంగా చదువుతుంటే శ్రోతలు మంత్ర ముగ్ధులయ్యారు....

ఇంత అద్భుతమైన కార్యక్రమం నిర్వహించిన వరదనూ, గౌతమరావు గారినీ అభినందించుకుంటూ ఆ సభలో శ్రోతగా వుండడం అలౌకికం కాకపోయినా అసాధారణానుభవం....

('ఆంధ్రజ్యోతి', ఆదివారం, 9.2.1992.)



## భాగ్యనగరాన పద్యగంగావతరణం

వల్లభాచార్య

*"అందము గా హెూయల్ వెడలు*
*నట్లుగ నొక్కొకచో తరంగ పా*
*ళిందుమికించుచున్ విధుర*
*లీలను నొక్కొకచో నొకొక్కచో*
*జిందుచు వక్రమే నిడివి*
*చెన్నుల పాయలుగా నొకొక్కచో*
*మంద్రముగా ద్రుతమ్ముగ క్ర*

*మమ్ముగ సౌఖ్యముగాగ"* గంగ భగీరథుని వెంట నడిచిందని విశ్వనాథ సత్యనారాయణగారు శ్రీమద్రామాయణ కల్ప వృక్షములో వ్రాశారు. అదే విధంగా రసపిద్ధులైన కవుల పద్యగంగ శ్రీ జువ్వాడి గౌతమరావు గళం నుండి జాలువారుతూ ఉంటుంది. అసలు విశ్వనాథవారి రామాయణానికి శ్రీ జువ్వాడి గౌతమరావు, శ్రీ మల్లంపల్లి శరభయ్య లవకుశుల వంటి వారని ప్రతీతి!

హైదరాబాదులోని "నాట్యగోష్ఠి" వారు ఇటీవల శ్రీ గౌతమరావు కావ్యపఠన కార్యక్రమాన్ని ఏర్పాటు చేశారు. ఓ ఆదివారం ఉదయం. హైదరాబాదులాటి ఉరుకుల పరుగుల నగరంలో

ఆదివారం వరప్రసాదం లాటిది. మిగిలిన రోజుల్లో కాలంతో పరుగు పందెం వేసే వారికి ఆదివారమే కుటుంబంతో గడిపేరోజు. అలాటి రోజున–అదీ ఉదయం 10.30 గంటలకు–ఈ కార్యక్రమం. అయినా వచ్చారు శ్రోతలు హాలునిండా. కవులకు అంతకన్న ఏంకావాలి? "సుకవితా యద్యస్తిరాజ్యేన కిమ్?"

ఈ కార్యక్రమంలో శ్రీ గౌతమరావుగారు ఆధునికాంధ్ర సారస్వతంలో షట్చక్రవర్తుల వంటి రాయప్రోలు సుబ్బారావు, అబ్బూరి రామకృష్ణారావు, విశ్వనాథ సత్యనారాయణ, దేవులపల్లి కృష్ణశాస్త్రి, దువ్వూరి రామిరెడ్డి, జాషువ ల కావ్యఖండాలను గానం చేశారు. ఒక్కొక్క కవి గురించి శ్రీ బొమ్మకంటి శ్రీనివాసా చార్యుల వారు రసవంతమైన పరిచయాన్ని సమకూర్చారు. మొత్తం కార్యక్రమాన్ని వీడియో రికార్డింగ్ చేసి భద్ర పరచటం 'నాట్యగోష్ఠి' చేసిన మంచిపని.

పద్యాన్ని చదవటం ఒక కళ. ఆ కళ పట్టుబడాలంటే, విశ్వనాథ వారు 'కాయిన్' చేసిన 'జీవుని వేదన' వంటిది ఉండాలి. చదివేవాడు కవితో తాదాత్మ్యాన్ని పొందాలి. పద్యము వినటమూ ఒక కళే. చెవికి శిక్షణ కావాలి. మంచి శ్రోత మాత్రమే మంచి పాఠకుడు కాగలడు. ఈ రెండూ పుష్కలంగా పండించుకొన్న శ్రీ గౌతమరావు రసవంతమైన పద్యాలను గానం చేశారు. పద్యభావాన్ని శ్రోతలకు అలవోకగా అందించారు. ఆ రససిద్ధికి ఓ ఉదాహరణః

ఈ కార్యక్రమానికి విశాఖపట్టణం నుండి ప్రముఖ రచయిత శ్రీ రాచకొండ విశ్వనాథశాస్త్రి పనిగట్టుకొని వచ్చారు. ఆయన "నాట్యగోష్ఠి" సభ్యులు కూడాను. శ్రీ గౌతమరావు కార్యక్రమంలో విశ్వనాథవారి"వరలక్ష్మీత్రిశతి" లోని "కృష్ణార్పణము" అనే భాగాన్నిచదివారు. విశ్వనాథవారు భార్య మరణానంతరం వ్రాసిన స్మృతి కావ్యం ఇది. కృష్ణానదిలో భార్య అస్థికలను నిమజ్జనం చేయడం ఈ కావ్యభాగంలోని వస్తువు. దీనిలోని చివరి పద్యం.......

*"ఒక ఏన్నో పుట్టుకలకు ముందరైన మ*
*ద్భార్యమీరీతి పరిణమించె*
*...................................*
*అంతె పేరున కంతెభార్యాస్థిగాని*
*నా శరీరాస్థి నిజము కృష్ణార్పణమ్ము"* ఈ పద్యం శ్రీ గౌతమరావు చదువుతూంటే రావి శాస్త్రి కళ్లలో నీళ్లు తిరిగాయి. ఈ ఖండికలోని ప్రతి పద్యమూ రావిశాస్త్రిని మనను కుదుళ్లనించీ కదిలించి వేసినట్లు కనిపించింది. రష్యాకన్న రసానుభూతి మిన్న, మెదడుకన్న హృదయంవెన్నకదా?

అలాగే దేవులపల్లి కృష్ణశాస్త్రి "స్నేహహస్తము", 'స్త్రీ' శీర్షికలూ అందరినీ అలరించాయి. జాషువ 'శిశు ప్రబోధము', 'స్మశానము' కదిలించాయి. అబ్బూరి వారి 'భవతి! భిక్షాందేహి' ఆలోచింపచేసే ఖండిక. దానిని శ్రీ గౌతమరావు సమర్థంగా పలికించారు. దువ్వూరి 'పానశాల', రాయప్రోలు 'ఆశుకవితా సన్యాసం' శ్రోతలకు ఎక్కువగా నచ్చే అంశాలు. శ్రీ గౌతమరావు తల్లీనతతో చదివే కవి విశ్వనాథ. ఆయన వ్రాసిన 'శ్రీహర్షుడు', 'అంధభిక్షువు', 'ధనుర్భంగము', 'కిన్నెరసాని' భాగాలను గౌతమరావు వినిపించారు.

ఇలా భిన్న భిన్న కావ్యగానాన్ని ఒకేసారి సాగించటం వల్ల వెంటవెంటనే వివిధ భావావస్థలలోకి మారటం కష్టం కాదా?' అని ఒక అనుమానం వచ్చింది. నాట్యగోష్ఠి అధ్యక్షుడు శ్రీ అబ్బూరి వరద

రాజేశ్వరరావు ఈ ప్రశ్నకు ఇలా సమాధానం చెప్పారు-

ఈ సంప్రదాయం ఎన్నటినుంచో ఉన్నదే. పాశ్చాత్య సాహిత్య ప్రపంచంలో డిలాన్ థామస్ ఇలాగే అనేకమంది కవుల కావ్యాలను గానం చేసేవాడు వరుసగా. మన కృష్ణశాస్త్రి కూడా తనవీ, ఇతరులవీ కవితలు వినిపించేవాడు. విశ్వనాథ కూడా ఆ పనిచేశారు. నాట్యగోష్ఠి ఈ కార్యక్రమాన్ని ఒక ప్రయోగంగా నిర్వహించింది. వివిధ కవులు పద్యాన్ని ఎలా నడిపించారు? ఆ నడకలలోని భేద సామ్యాలు ఏవిటి అనేది శ్రోతలకు పరిచయం చేయడం దీని ప్రధాన ఉద్దేశం. గౌతమరావు లాటి పాఠకులు ఈ పనిని సమర్థవంతంగా నిర్వహించగలరు. ఇలా ఈ ప్రయోగం వివిధ స్థలాలలో జరిగితే పద్యం పునరుజ్జీతమవుతుంది."

అంతేకాక "మనకు చెళ్లపిళ్ల వెంకట శాస్త్రి, వేలూరి శివరామశాస్త్రి వంటి వారి పద్య పఠనం రికార్డులు లేవు. దేవులపల్లి వారివీ లేవు. విశ్వనాథవారి పద్య పఠనం రికార్డు చేయాలని ప్రయత్నించాము కానీ అప్పటికే ఆయన గొంతు లేవలేదు. కనీసం వారి పద్యాలను వారి బాణీలో చదివేవారివైనా రికార్డు చేస్తే యువతరానికీ, ఆ తరువాతి తరానికీ పనికొస్తుందనే ఆశ నాట్యగోష్ఠి ఈ కార్యమాన్ని చేపట్టడానికి మూలం" అని శ్రీ అబ్బూరి వివరించారు.

నిజానికి ఈ పని ఎవరు చేయాలి? విశ్వవిద్యాలయాలు చేయాలి. కనీసం 'తెలుగో, తెలుగో' అంటున్న తెలుగు విశ్వవిద్యాలయం వారైనా చేయాలి. పద్యాన్ని పద్యంగా చదవగలవారు ఇంకా ఉన్నప్పుడే ఆ పని చేయకపోతే ఎలా? అలాటి గురుతర బాధ్యతను భుజాన వేసుకొన్న 'నాట్యగోష్ఠి'కి సాహితీ ప్రియులందరూ బహుదా కృతజ్ఞులు.

('ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రిక, ఫిబ్రవరి 12.18,1992)

## 'సప్తతి'లో రావిశాస్త్రి-
## ఇది రావిశాస్త్రిపై 'వరదా'భిషేకం

ప్రశ్న: రా.వి. శాస్త్రి గారిని మీరు చాలా సన్నిహితంగా ఎరుగుదురు. ఒక మిత్రుడిగా ఒక న్యాయవాదిగా ఆయన గురించి చెప్పండి.

అబ్బూరి: విశ్వనాథ శాస్త్రి నాకు బాల్య స్నేహితుడు. మా స్నేహం యీ యేడాది షష్టిపూర్తి చేసుకుంటోంది. శాస్త్రికి అభిమానులు ఎక్కువ. స్నేహితులన్నవాళ్లు చాలా తక్కువ. తనకి నచ్చిన లక్షణాలన్నీ ఉంటేనే మరొకాడితో నేస్తం కడతాడు. లేదా అంటే పరిచయమే. పరస్పరం మందహాసంతో మాట్లాడుకోవటం. స్నేహితుడంటే తనే. కించిత్తు భేదం కనిపించదు వాడికి. శాస్త్రి తండ్రిగారు మహాపెద్ద మనిషి. తల్లి విదుషీమణి. C.V. మాష్టరుగారి పత్యంక్షాంతేవాసి. శాస్త్రి తండ్రిగారు లా చదివారు. తీరా వృత్తి చేపట్టే సమయానికి ఆయన కావృత్తి మీద ఏహ్యభావం కలిగింది. ఎంచాతో లాయర్లంటే అబద్ధాలాడుతూండాలని. అబద్ధం ఆయన నిఘంటువులో లేని పదం. ఆయన లాయరు కాలేదు. శాస్త్రికా సంగతి తెలుసు. తండ్రి గారి మీద గౌరవం. అయినా వృత్తి చేపట్టాడు. న్యాయ స్థానాల్లోయెలా వాదిస్తాడో, మాట్లాడతాడో నేనెప్పుడూ చూడలేదు. అయితే నా ప్రత్యక్షానుభవం-వాడినోటివెంట నేనెప్పుడూ ఒక అబద్ధం ఈ అరవై యేళ్లలో విన్లేదు.

అంటే స్నేహితుల దగ్గర విజాయితీ అలా పాటిస్తాడు. స్నేహంలో ఓ ముఖ్యలక్షణం dependability. సర్వ్రతా శాస్త్రి విషయంలో యీ లక్షణం పుష్కలం.

సామాన్యంగా యితరుల గురించి-అంటే సాటి రచయితల గురించి-పరుషంగా మాట్లాడడు. ఎవరన్నాయేమన్నా అడిగితే-మౌనం వహించో-మందహాసం చేసో వూరుకుంటాడు. ఎంత చదువు కున్నాడో అంత చదవనట్లుగా ప్రవర్తిస్తాడు. ఇదంతా ఓరకం నటన అనుకునేవాళ్ళు లేకపోలేదు. శాస్త్రి అది మర్యాదగా పాటిస్తాడు. కవిత్వం రాయలేదు శాస్త్రి-రాయగలిగిన శక్తి వున్నా. కవిత్వం అంటే చెవికోసుకుంటాడు. ఇప్పటికీ అతనికి యెన్నో పద్యాలు కంఠస్థాయం. చక్కగా చదివి పాడి, టీకా తాత్పర్యం చెప్పగలడు.

నేను కథలు రాయటం మానేసి కవిత్వం ఒక్కటే పెట్టుకుని యాథాలాపంగా రాశాను. నేను తక్కువ రాస్తానని శాస్త్రి నామీద ఆరోపణ. అయితే మా యిద్దరికీ బాల్యం నుంచీ సాహిత్యమే అనుబంధం అయికూచుంది. సాహిత్యంలో మాఅభిరుచులు దాదాపు ఒకటే. రాజకీయాల్లో చాలా వరకు యేకోన్ముఖంగా వెళ్లిన వాళ్లమే. ఎప్పుడన్నా దారులు మళ్లినా మాకు అభిప్రాయభేదాలు తలెత్తలేదు. సాహిత్యం, స్నేహం ప్రధానం కనక. ఓ పదిహేనేళ్ల క్రితం మాస్కోలో నాసిరకం సిగరెట్లు కాల్చటం వల్ల శ్వాసకోశ వ్యాధితో ఢిల్లీ వెల్లింగ్టన్ ఆసుపత్రిలో చేరాను. చేరిన మరుక్షణం నుంచీ డాక్టర్లు గంట గంటకూ నా గుండె క్రమాన్ని ECG లో చూస్తున్నారు. దుర్భరమైన ఆయాసంతో బాధపడుతున్నాను. ఆక్సిజన్ యివ్వబోతున్నారు. ఆ పరిస్థితిలో డాక్టర్లలో ఒకాయన్ని చెయ్యి పట్టుకుని చెప్పాను. "డాక్టరు గారూ, నా హృదయం చాలా మంచిది. దాంతోనే యిన్నాళ్లూ పదిమందిలోనూ బతికాను. ఇంకా బతుకుతాను' అన్నాను. ఆ క్షణంలో యెవరూ మాట్లాడలేదు. ఎందుకంటే నానాడి శరవేగంతో కొట్టుకొంటోందిట! తరవాత రెండు వారాలకు నన్ను యింటికి పంపిస్తున్నప్పుడు ఆ వైద్యుడు-హృద్రోగ నిపుణుడు-వచ్చి "నిజం! నీగుండె చాలా మంచిది. ఎటువంటి లోపమూ లేదు" అన్నాడు!

అలా శాస్త్రి గుండె కూడా మంచిది. మా హృదయాలు మంచివి కనక మాకు సాహిత్యాభిరుచి ప్రధానం కనక యిన్నాళ్ళూ అంత యిబ్బంది లేకుండా బతికాము. చెళ్లపిళ్ల వెంకటశాస్త్రి గారి లాంటి ఉద్దండులం కాకపోయినా ఆయనచెప్పుకున్నట్లు మరో అర్థంతో ఆ పద్యాన్నే చెప్పుకోవచ్చు.

"కవనార్థం బుదయించితిన్ సుకవితాకార్యంబను వృత్తియా
భవమద్దాన ధరింతుతద్భవము మద్భాగ్యమ్ము సర్వమ్ముమ్మ
త్యువునే దాన జయించితిన్ రుజ జయింతున్ దాని చేనట్టినా
కవనమ్మున్ గురుదేమి లెక్కహరుడే కాదాడ వాదాడెదన్"-

సాహిత్యాభిమానం వల్లేకదా మేం ఇన్నాళ్లు బతకడం!

ప్రశ్న: రావిశాస్త్రి కథల్లో, నవలల్లో మీకు బాగా నచ్చింది ఏది? ఎందుకో చెప్పండి.

అబ్బూరి : శాస్త్రి నాకు సన్నిహితుడు, అప్తుడు కనక అతను రాసిన కథల్నూ,నవల్నూ అన్నీ బాగుంటాయి. అందులో బేరీజు వేసి ఫలానా కథ అత్యుత్తమం, ఫలానా నవల అన్నింటికన్నా మంచిది అని నేను చెప్పలేను. అదీకాక ఇవన్నీ చదివి యెన్నాళ్లయిందంటారు. వాడు రాయటం మానేసి యెన్నాళ్లయింది? ఈ మధ్య యేదో పని తగిలి శాస్త్రి పుస్తకాలన్నీ చదువుదామనుకున్నాను.

తీరా చూస్తే నా దగ్గిరలేవు. తీసుకుపోయిన వాళ్లు వాపసు చెయ్యలేదు. మళ్లీ చదివే అవకాశం అలా పోయింది. అయినా రాజు-మహిషి మంచి నవల అనుకుంటాను. శాస్త్రి సాహిత్యాన్ని క్షుణ్ణంగా అధ్యయనం చేసిన ఆచార్య పనూరావుగారు-శాస్త్రిగారి నవలల్లో అదే ఉత్తమోత్తమం అంటారు. ఆ నవల్లో మనకు తటస్థపడే పాత్రలు వాస్తవికమైన ఒక సామాజిక సంపూర్ణత్వాన్ని ప్రసాదిస్తాయి. ఏ పాత్రని యెలా మలిచి చూడాలో చూశాడు. ప్రతీ పాత్రనీ వివిధ స్థాయిల్లో ఆవిష్కరించాడు. కన్యాశుల్కంలో అప్పారావు గారు చేసిన ప్రయోగాన్ని మరో నేపథ్యంలో, మరో కథాకృతిలో శాస్త్రి చాకచక్యంతో సాధించాడు.

ప్రశ్న: రావిశాస్త్రి గారి రచనల్ని మార్క్సిస్టు ప్రమాణాలతోనే చూడాలా? ఇంకేమైనా ప్రమాణాలు ఉన్నాయా?

అబ్బూరి : విశ్వనాథశాస్త్రి రాసిన కథల్నీ, నవలల్నీ యే ప్రత్యేక కోణం నుంచీ చూడవలసిన అగత్యం లేదు. అలా అనుకోవటం పొరపాటు. కేవలం సాహిత్య దృష్టితోనే అధ్యయనం చేయాలి. అలా వాటిని చదివి నప్పుడే ఆనందించగలరు. నిబద్ధమయిన ప్రయోజనంతో రాస్తే ఆ రచనకి సాహిత్య ప్రమాణంలోపిస్తుంది. ఆలోపాన్ని యీనాడు నిబద్ధ రచయితలుగా వ్యవహరిస్తున్న వారి రచనల్లో మరింత ప్రస్ఫుటంగా చూడగలం. విశ్వనాథశాస్త్రి సాహిత్య ధ్యేయాన్నీ, లక్షణాన్నీ మనస్సులో పెట్టుకునే రచనలు చేస్తాడు.

ప్రశ్న: ప్రపంచ విఖ్యాత కథా రచయితల పక్కన రావిశాస్త్రిగారికి స్థానం ఉంటుందా? ఆయనతో పోల్చదగిన ప్రపంచస్థాయి కథారచయిత మీ దృష్టిలో ఎవరు?

అబ్బూరి : మనం ఒక రచయితని మరో రచయితతో పోల్చటం ఆరోగ్యకరమయిన విషయం కాదు. తెలుగువాట యిలాంటి అలవాటు వున్నమాట వాస్తవమే. అభినవ తిక్కన, కలియుగాంజనేయ, ఆంధ్రావర్డ్స్‌వర్త్, ఆంధ్రాషెల్లీ అంటూ మనవాళ్లు కొందర్ని పేర్కొంటూంటారు. విశ్వనాథశాస్త్రికీ మరో విఖ్యాత రచయితకీ పోలికే లేదు. ప్రపంచ రచయితలతో తులతూగతగ్గ వాడు శాస్త్రి. ప్రపంచ సాహిత్యంలో యింతో అంతో పరిచయమున్న వాళ్లకే సంగతి తెలుస్తుంది.

ప్రశ్న: రావిశాస్త్రిగారు స్త్రీ పాత్రలను కించపరుస్తూ రాశారని ఒక విమర్శ ఉంది. మీ అభిప్రాయం ఏమిటి?

అబ్బూరి : శాస్త్రి కథల్లో కానీ, నవలల్లో కానీ స్త్రీ పాత్రల్ని ప్రత్యేకంగా హీనదృష్టితో చిత్రించిన దృష్టాంతాల్లేవు. అతను అందర్నీ, తను సృష్టించిన పాత్రలనందర్నీ ఒకే విధంగా సమదృష్టితో అక్షరబద్ధం చేశాడు. తెలుగు సంసారంలో వివిధ వర్గాలకు చెందిన స్త్రీ పురుషుల నందర్నీ ఆయా సన్నివేశాల కనుకూలంగా విభిన్న రీతుల్లో ప్రదర్శించాడు. ఆ నేపథ్యంలో చూస్తే శాస్త్రి స్త్రీ పాత్రలను కించపరిచాడనే దుమారం దూరమవుతుందని నేననుకుంటున్నాను. స్త్రీల నెప్పుడూ రావిశాస్త్రి కించపరచలేదు. పంచనే ఉంచాడు. తారతమ్యం కనిపించకుండా ఉంటానికి. ఇంతకీ స్త్రీలంటే శాస్త్రికి ఉన్న గౌరవం అలవి విమర్శకులకు లేదని చెప్పగలను. స్త్రీల అనేక ఉద్యమాలపై వాడికి సానుభూతి యెక్కువ. నాకు తెలిసిన విషయం అయితే, అలాంటి ఉద్యమాల్లో తలెత్తిన వికృత ధోరణులంటే వాడికి నచ్చని మాట కూడా నిజం.

ప్రశ్న: రావిశాస్త్రి గారి అభిరుచులు ఎలాంటివి?

అబ్బూరి : ఆయన అభిరుచులంటారా? అన్నీ classic -సాహిత్యం, సంగీతం, స్నేహం-ఒకటేమిటి అన్నీ.

ఇంటర్వ్యూ భాస్కరం ('ఆంధ్రప్రభ', జూలై 30, 1992)



[విశాఖపట్నంలో జువ్వాడి గౌతమరావు పద్య పఠన కార్యక్రమం సందర్భంలో-]

## జువ్వాడి గౌతమరావుగారు

భ.రా.గో.

---జూలై 30 రాచకొండ విశ్వనాథశాస్త్రి గారి జన్మదినం. మొన్న జూలై 30కి ఆయనకి 70ఏళ్లు వెళ్లాయి. ఆ రోజున విశ్వనాథశాస్త్రిగారి బాల్య స్నేహితుడైన అబ్బూరి వరదరాజేశ్వరరావుగారు, వారి సతీమణి ఛాయాదేవి గారూ కూడా విశాఖపట్నంలో ఉన్నారు. విశ్వనాథశాస్త్రి గారి 71వ జన్మదినం తెలుగు కల్పనా సాహిత్యపాఠకులందరికీ పండగే. అబ్బూరి దంపతులు (ముఖ్య) అతిథులుగా రావడం డబుల్ పండగ. జువ్వాడి గౌతమరావుగారు పద్యపఠనం చెయ్యడంతో ఏవూళ్లో ఎలా వున్నా విశాఖపట్నంలో ట్రిపుల్ పండగ అయింది....

జువ్వాడి గౌతమరావుగారి పద్య పఠన కార్యక్రమం ముఖ్యంగా కావ్యకాలానంతర, వచన కవితాకాల పూర్వ-ఆధునిక కవుల రచనల మీదుగా సాగింది.... ఆ కవుల ప్రతిభకు దీటుగా ఆయన విద్య కూడా సమానంగా ఉంది... ఆ పద్యాలు చూసికొన్నీ, చూడకుండా కొన్నీ గౌతమరావుగారు చదివినప్పుడు బైట హోరున వర్షం పడుతున్నా సరే ఆయనకి చెమట్లు పట్టడం, గొంతు గద్గదం కావడం-అది ఆ అనుభవ తాదాత్మ్య విశేషం.

"పద్యాలు చదివి వర్షం రప్పించడం అనే సంప్రదాయాన్ని మీరు పునరుద్ధరించేరు" అని ఎవరో గౌతమ రావుగార్ని కాంప్లిమెంట్ చేస్తే, "నా ప్రతాపం ఏమీలేదు. అదుగో అక్కడ కూర్చున్నారు- 'వరద', వరద ఉన్నచోట వాన లేకుండా ఉండదు" అని అబ్బూరి వరద రాజేశ్వరరావు పరంగా చమత్కరించేరు గౌతమరావుగారు.

"పఠన" విద్య పక్కదారులు పట్టి, పద్య విద్య అనాదరణీయమై పోతున్న ఈ రోజుల్లో "పద్యపఠన విద్య" ను త్రికరణ శుద్ధిగా అవలంబిస్తున్న గౌతమరావుగారికి జేజేలు!

('ఆంధ్రభూమి', విశాఖపట్నం, బుధవారం, ఆగస్టు 5, 1992)

## విశాఖలో 'పద్య' పానం

చందు సుబ్బారావు

... తన జన్మదినోత్సవం అంటూ ఏదీ తలపెట్టడానికి, తలవంచడానికి పూర్తిగా నిరాకరించిన శాస్త్రిగారు అందమైన 'వరద' వ్యూహంలో చిక్కుకున్నారు. ...

ఆనక విందుకు కూర్చుందామన్నట్లు శాస్త్రి గారి పలుకుల్లో, అబ్బూరి వారి పలుకుల్లో, మలయవాసిని గారి పద్యలక్షణ సంయుత కవి పరిచయాల పంచదార చిలకల్లో అసలు కార్యక్రమం ఆరంభమైంది.

జువ్వాడి గౌతమరావుగారనే కరీంనగర్ న్యాయవాది, హృదయం ఖంగుమనే కంఠంతో పద్యాలు పాడటం ప్రారంభించారు. పద్యాలు చదివారు. ఆలపించారు. ఆవేశంతో, ఆవేదనతో రసవిస్ఫురిత కుసుమపరాగాన్ని అందించారు. వెయ్యేళ్ల తెలుగు వారి పద్య విద్యను కంఠంతో కౌగిలించారు!

... బయట వర్షం ఆరంభమైంది. గానానికి శిలలు ద్రవిస్తాయి అన్నారు కాని ఆకాశం వర్షిస్తుందని, అందులో పద్యగానానికి వర్షాల్లేని విశాఖగగనం హర్షిస్తుందని అనుకోలేదు.

... వేదికమీది అబ్బూరి వదనారవిందం నుంచి తొణికిసలాడిన సంతృప్తి కెరటం రావి శాస్త్రి గారిని ముంచెత్తి వరదలో ఆహూతులైన సవ్యకవి సమూహం యావన్మందినీ స్నానమాడించింది.

'పద్యరచనకు కాలం చెల్లిందనే వారున్నారేమో కాని, పద్యపఠనానికీ, పద్య శ్రవణానికీ కాదన్న' మలయవాసిని గారి సమీక్షావాక్యం మరువలేనిది...

('ఆంధ్రప్రభ సచిత్రవారపత్రిక, ఆగస్టు 26-1- సెప్టెంబరు, 1992)





[రా.వి. శాస్త్రిగారి ఇంట్లో బంధుమిత్రులతో 'వరద']



[ఢిల్లీలో సారీస్‌గారి ఇంట్లో బంధుమిత్రులతో 'వరద']

## 'కవితాసంచిక'

[వరదరాజేశ్వరరావుగారి కవితా సంపుటం "కవితాసంచిక" పేరుతో జనవరి 1993లో ప్రచురితమైంది. ఈ గ్రంథంలో కవితా ఖండికలతో పాటు, గ్రంథసంకలనకర్త డా. పరకాల ప్రభాకర్ వరదరాజేశ్వరరావుగారితో జరిపిన కవితా చర్చలోని కొంత భాగం కూడా చేర్చబడింది.]




[వరద రాజేశ్వర రావు గారితో డా. ప్రభాకర్ పరకాల జరిపిన ఇంటర్వ్యూలో కొన్ని భాగాలు]

### కవిత్వం అంటే.....

ప్రభాకర్: ఈనాటి కవుల్లో కొందరు ఛందస్సన్నది కాలానుగతమయిన వేగానికి అనుబంధిత మయిందంటారు. రథాలూ, పల్లకీలూ, గుర్రబ్బళ్లూ వెళ్లే దారిని తప్పించి మోటార్లూ, రైళ్లూ తిరిగే ఆధునిక యుగానికి తెలుగు కవిత్వాన్ని మళ్లించాడు గురజాడ–ఆదారిని మేము మరింత సుగమం చేసుకున్నామంటారు.

వ.రా: మొదట శ్రీరంగం శ్రీనివాసరావు యీ ప్రతిపాదన చేశాడు. ఇప్పుడు మనం చూస్తున్న వేగ వైపరీత్యం ప్రకృతిలోనే ఉంది. వెలుగు ప్రయాణం వేగం యెంత? తుపాను వేగం యెంత? ఉప్పొంగే వరద వేగం యెంత? అనాది నుంచీ కవులు అలాంటి శబ్దవేగప్రాబల్యానికి సుపరిచితులే. అందులో సందేహంలేదు. పద్యం నడకలో, వస్తు కల్పనా వైచిత్రిలో, భాషాశైలిలో మనం చూడవచ్చును. "కుప్పించి యెగసిన కుండలంబుల కాంతి గగన భాగం బెల్ల కప్పికొనగ" అన్నారు పోతన గారు. అదే ఆధునికత! ఆనాడూ, యీనాడూ అలాంటి వాటిల్లో మార్పు ఉండదు. ఛందస్సూ అంతే.

ప్రభాకర్: కొందరు ఛందస్సుతో సంబంధం లేకుండా కవిత్వం రాయాలంటున్నారు కదా?

వ.రా: ఛందస్సంటే ఏమిటో తెలియక. అదీకాక కవిత్వానికి అత్యంత ప్రాణప్రదమయినది ఛందస్సు. ఛందస్సు లేకుండా కవిత్వం లేదు. ఛందస్సంటే కట్టుబాటు. ఒక కూర్పు. ఒక యేర్పాటు. నియమబద్ధం, పదాలు కానీ, వాక్యాలుకానీ కవిత్వంగా మారినప్పుడు నిబద్ధమవుతయి. నియమబద్ధమయినది లయబద్ధమవుతుంది. అలాంటిదే కవిత్వం. అది టెక్నిక్‌కు సంబంధించినది. అప్పుడు కవిత్రం 'రసనాగ్ర నర్తకి' కావటానికి అనుకూలిస్తుంది. పూర్వకాలంలోనే ఛందస్సు అనేకాలు. అంచాతనే 'అనంతావై ఛందా' అన్నారు. అందులోని అనంత భావాన్ని యేమరచి అసలే వద్దనటం అయోమయాన్నే సూచిస్తుంది.

అదీకాక ప్రకృతి అంతా ఛందోమయం. ప్రకృతి లోని ప్రతి అంశానికీ ఒక గ్రామరు ఉంటుంది. ప్రకృతి ప్రతిబింబమే ఛందస్సు. ప్రకృతికి ప్రతి స్పందన కవిత్వం అనుకుంటాను. కవిలో అంతః ఘర్షణ ఆవిర్భవించినప్పుడు కవిత్వం రూపొందుతుందని యేట్సు అన్నాడు. ఒకసారి ప్రకృతిని చూడండి. ఋతువులూ, ఉదయాస్తమానాలూ భూభ్రమణం, గ్రహణాలూ—యివన్నీ నియమబద్ధంగా ఉంటాయి. అలాగే బండి నడుస్తున్నప్పుడు చక్రధ్వనీ, గుర్రాలడెక్కల చప్పుళ్లూ ఒక నియమం ప్రకారం వింటాము. మానవ శరీరంలో హృదయ రక్త ప్రసారమూ, శ్వాసనిశ్వాసలూ ఒక నిర్ణీత పద్ధతిలో ఉంటాయి. దానినే ఛందస్సంటాను. చందస్సులేనిదే సృష్టి లేదు. ఈ విషయంతో యింతవివాదం అనవసరమనుకుంటాను. ఛందస్సుయే కళారూపానికైనా అత్యంత సహజమైన ఆలంబం అని నా ఉద్దేశం.

ప్రభాకర్: సాహిత్యంలో యీ మధ్యతలెత్తిన ఉద్యమాలు మీరు పరిశీలించే ఉంటారు? వాటి మీద మీ అభిప్రాయం చెబుతారా?

వ.రా: సాహిత్యంలో ఉద్యమాలకి ఆస్కారంలేదు. ఉద్యమ పరిధిలో సాహిత్యాన్ని నిక్షేపిస్తే అది సంకుచితమై అర్థరహితమవుతుంది. యూరోపులో అనేక విధాల ఉద్యమాలు రావటం మనకు తెలును. అనతికాలంలోనే అవి అంతర్ధాన మయిపోయినయి. సాహిత్యమే నిలుస్తుంది. కవిత్వమే నాలుగు కాలాలపాటు నిలుస్తుంది. ఉద్యమ పరంగా వచ్చిన సాహిత్యం తాత్కాలికమే.

ప్రభాకర్: 'వచన కవిత్వం' గురించి మీరేమంటారు?

వ.రా: ఆ ప్రక్రియ మనం విదేశాలనుంచి దిగుమతి చేసుకున్నది. దాని లక్షణం పట్టించుకోకుండా రాస్తున్నారు. ఆ పేరే తప్పు. ఆ ప్రక్రియను శ్రీ శ్రీ తనకు దక్కవలసిన ప్రఖ్యాతి వచ్చిన తరవాత చేపట్టాడు. అతనితో పాటు నేనూ, కుందుర్తీ, ఏల్చూరీ, ఆరుద్రా, రామదాసూ, తిలకూ, రాజశేఖరూ కలిసి ఆ ప్రక్రియ ప్రచారానికి ప్రయత్నించాం. రామదాసూ, తిలకూ, నేనూ ఆ

ప్రక్రియ సవ్యంగా సాధించలేమనీ, దానికి భవిష్యత్తు అనుమానాస్పదమనీ తలచి వదిలేశాం. ఆ తరవాత వాళ్లిద్దరూ దివంగతులయ్యారు. శ్రీ శ్రీకి రావలసిన ప్రఖ్యాతి మాత్రం ఛందస్సు వల్లనే వచ్చింది. మన పూర్వీకులు కూడా 'వచనాలు' రాసేవారని తరవాత తరవాత కొంత మంది చెబుతూ వచ్చారు. అయితే ఆ వచనాలకు లక్షణం ఉంది. అయినా వాటికి ప్రాచుర్యం రాలేదు. అనుభవం అలా వుంటే యీనాటి 'వచన కవిత్వం' సంగతి ఊహించటం అంత కష్టం కాదు. ఈనాడు 'వచన కవిత్వం' లో కేవలం వచనమే కనిపిస్తోంది. నా మట్టుకు నేను ఆప్రక్రియలో కృతకృత్యుణ్ణి కాలేక పోయాననే నమ్ముతున్నాను.

ప్రభాకర్: మీరు ప్రతిపాదించిన లక్షణాలకి అనుగుణంగానే మీరు కవిత్వం రాశారా?

వ.రా: అలానని నేననుకోను. కవిత్వం మీదా, సాహిత్యం మీదా నా అభిప్రాయాలు నాకున్నవి. అవే నిజం అనే అభిప్రాయం కూడా నాకున్నది. ఆ అభిప్రాయాలు నా మనస్సులో ఉండగా కవిత్వంలో ప్రయోగాలు చేశాను. కొన్నిట్లో పరిపూర్ణంగా కృతకృత్యుణ్ణయ్యాననే విశ్వాసం నాకుంది. ఇంతకీ నేను రాసింది చాలా తక్కువ. అందులో లభ్యమయేవి మరీ తక్కువ. ఆ అల్పసంఖ్యలోనే అనేకానేక ప్రయోగాలు చేశాను.

ప్రభాకర్: సాంప్రదాయక ఛందస్సును యెందుకు వాడారు?

వ.రా: అందుకో కారణం వుంది. గురజాడ అప్పారావుగారు ముత్యాల సరాలు–ఇదీ ఒక సాంప్రదాయిక ఛందస్సే–అప్పారావుగారా పేరు పెట్టటంలో కొత్తదనం వచ్చింది. కొన్నిటివి శిష్టవ్యావహారికంలో రాశారు. ఆయన అభిమానులు–ఆనాటి నవ్యకవుల్లో చాలా మంది ఆ ఛందస్సును వాడారు. ఒక విశ్వనాథ సత్యనారాయణగారు తప్ప తక్కిన వారంతా గ్రాంథికంలో ఆ ఛందస్సును వాడారు. అప్పారావుగారు కూడా తాము కవితల్లో సగం భాగం పైనే సరళగ్రాంధికంలో రాశారని మనకి తెలును. అంచాత వ్యవహారిక భాష సాంప్రదాయిక ఛందస్సుకెందుకనుకూలించకూడదూ అని నేను ప్రయోగం చేశాను.

ప్రభాకర్: కవిత్వం అంటే యేమిటో చెప్పగలరా?

వ.రా: ఆ ప్రశ్నే తప్పు. రుచిని యెలా నిర్వచించగలం? పరిమళాన్ని యెలా నిర్వచించగలం? అనుభూతి మీదే తెలియాలి. శకుంతల గాథలో నన్నయగారి పద్యం చదవండి:

విపరీత ప్రతిభాష లేమిటికి
నుర్వీనాథ యీ పుత్రగా
త్ర పరిష్వంగ సుఖంబునే కొనుము
ముక్తాహార కర్పూరసాం
ద్ర పరాగ ప్రసరంబు జందనంబు
జంద్ర జ్యోత్స్న యుం బుత్రగా
త్ర పరిష్వంగమునట్లు జీవులకు
హృద్యంబేకడున్ శీతమే.

కవిత్వం అంటే అది. అలాగే మరో ఉదాహరణ చెబుతాను. శ్రీరంగం శ్రీనివాసరావు 'సుప్తాస్థికలు' అనే ఓ గీతం రాశాడు. అందులో అంతా కవిత్వమే. చివరి పద్యం:

నా కనుంగవ కన్నీళులై కరంగు
నని యొనర్చెదు నీరవాహ్వాన మెరిగి
ఇంత శోషిల్లు నేలొ నా హృదయపుటము
వణకు నేటికొ నా అస్థిపంజరమ్ము!

ఇదీ కవిత్వం! ఇలాగ యెన్నయినా చూపించగలను. అలంకారికంగా రసానుభూతి వైయక్తికం. ఒకరికి నచ్చింది మరొకరికి నచ్చకపోవచ్చును. తప్పులేదు. అయితే కవిత్వానికీ వచనానికీ మధ్యగల భేదాన్ని సరిగా అర్థం చేసుకోవాలి.

('కవితా సంచిక', పే. 165-168)



[సమీక్షలు]

చేరాతలు

## ఛందః ప్రయోగాల విపంచిక
## వరద కవితా సంచిక

డా. చేకూరి రామారావు

బ్రతుకంతా పాటలాగా సాగుతుందనీ, పాటలూ పద్యాలే బ్రతుకనీ అమాయకంగా నమ్మే రోజుల్లో (1954-1958) అబ్బూరి వరద రాజేశ్వరరావు (వరద) గారి కవిత్వంతో పరిచయం ఏర్పడింది. మాత్రా ఛందస్సుల్లో గేయాలూ, ముత్యాల సరాలూ వగైరా రాసుకుంటూ, పాడుకుంటూ తిరుగుతున్నప్పుడు మా క్లాసుమేట్ జగడం లక్ష్మీనారాయణ (జలనా) ఆడెన్, బార్కర్, స్పెండర్, రాంబో అంటూ ఇంగ్లీషు పేర్లతో మమ్మల్ని అదరగొడుతూ, వాళ్ల పుస్తకాలు చూపించి ఇంకా బెదరగొడుతూ వుండేవాడు. గురజాడ, శ్రీ శ్రీ భావకవిత్వమూ, ముత్యాలసరాలూ- ఇదీ అప్పటి నా సాహిత్య ప్రపంచం (ఇప్పటికీ అదేనని కొందరు చమత్కరించవచ్చు). వీడికీ పేర్లన్నీ ఎట్లా తెలుసా అని విచారిస్తే ఆ పుస్తకాల మీద వరద పేరు కనిపించింది. అప్పుడే "అందాకో" అనే వరద పద్యాల సంపుటి కూడా చేతపట్టుకు తిరిగేవాడు అతను(నేను సౌభద్రుని ప్రణయ యాత్ర పట్టుకు తిరిగినట్టు). అందమైన పసుపు పచ్చట్టతో ముచ్చటగా అచ్చయిన రెండో ముద్రణ కాపీ అది. ఆ పుస్తకం మీద మోజుపడి వరద ఇల్లు వెతుక్కుంటూ వెళ్లి ఆ పుస్తకం అడుక్కుతెచ్చుకున్నా.

అప్పట్నుంచీ వరద పద్యాలంటే అదో రకమైన మోజు! మరీ ముఖ్యంగా ఆయన ఛందస్సులో, వ్యక్తీకరణలో, పద్య గమనంలో చేసిన ప్రయోగాలంటే మరీ ఇష్టం. వస్తువుకన్నా రీతిపై అప్పట్నుంచే మోజుండేది కాబోలు.

"చెరకాలం మహాకావ్యం
అందాకా అందులోంచి కొన్ని భాగాలు" అని లోపలి మొదటి పేజీలో అచ్చయివుండేది. ఆ మహాకావ్యం కథ "అంతే సంగతులు". ఎప్పటికీ పూర్తి కాలేదు. రాసిన పద్యాలేపారేసుకుని అక్కడా ఇక్కడా దొరికిన పత్రికలాలు కూరిస్తే 'అందాకా' తయారయింది.

మళ్ళీ ఇన్నాళ్ళకి వరద కవిత్వం 'కవితా సంచిక' గా 1993 లో అచ్చయి ఏ ఆవిష్కరణ సభ

లేకుండానే నా కందిన మొదటి కాపీ చదువుతుంటే ఆయన కవిత్వాన్ని తనివితీరా అనుభవించిన పాత రోజులు (ఒకటి రెండు సంవత్సరాలు తక్కువగా నాలుగ శతాబ్దాలు) గుర్తు వస్తున్నాయి. జీవిత సందర్భాల్లో కూడా ఈ పద్యాలు వాడుకున్నాం. ఒక సారి మా 'జలనా' నన్ను డబ్బు అడిగితే ఖాళీ జేబు చూపించాను. అప్పుడతను వరదను కోట్ చేస్తూ -

*"ఎందుకొచ్చిన బాధ బాబు*
*చించి పారెయ్ ఖాళీ జేబు"*

అనేవాడు. అట్లాగా మూడ్ బాగాలేనప్పుడు, వరద నుంచే కోట్ చేసుకుని

*"జగతి బాధావరిచ్ఛేదము*
*కవిత క్షుధా హృదయక్లేదము*
*నీ విషాదం వతిదండుగ*
*ఈ ప్రమాదం మన వండుగ*
*బ్రతుకు మిథ్యా శృంఖలితము*
*చదువు బాధా సంకలితము*
*జయిలు లోపల స్వేచ్ఛకలదు*
*బయట క్షణమ్మయినా వలదు"*

అని విషాద కవిత్వాన్ని విశ్వసించేవాళ్లం. అట్లాగే ఎక్కడున్నా దూరాన పాట వినిపిస్తే 'ఎవరక్కడ పాడేది యింతరాత్రి' అనే వాళ్లం. వరద 1954లో 'ముక్తయాత్ర' అనే నాటిక రేడియోలో ప్రసారం చేశారు. దాన్ని కొన్ని కాపీలు తీసి మిత్రులకు పంచి పెట్టారు. అందులో మధ్య మధ్యలో పాటలు వస్తాయి. ఒక చోట-

*"విరియ విరిసిన విరుల గుబురుల హొరు గాలి*
*కలల కురిసిన వలపు లెవరివి తోట మాలి"*

అని ఒక చరణం వుంది. ఇది మనసులో ఎంతగా నాటుకుపోయిందంటే 1987 ప్రాంతంలో ఒక చైనీస్ ప్రేమగీతాన్ని అనువదిస్తూ

*"విరియ విరిసిన విరుల గుబురుల*
*వింత తావుల గుబాళించెను*
*మింటి కెక్కిన తరుణ చందురు*
*ధవళకాంతుల పిసాళించెను"*- అనే ముత్యాల సరంలో మొదటి పాదాన్ని వాడుకున్నాను. (శ్రీ శ్రీ మాటల్లో 'ఇది ఇమిటేషన్ కాదు కొటేషన్' కొటేషన్ మార్కుల్లేక పోయినా).

ఎందుకో నాకు తెలీదు గాని వరద కొన్నాళ్లు జెయిలు జీవితం అనుభవించారు. బహుశా ఆయనతో మధిర తాలూకా కాంగ్రెసు నాయకుడు మాడపాటి రామచంద్రరావుగారు కూడా వున్నారేమో! ఇందులో ఒక చోట

"ఎర్రుపాలెపు మురికి కాలువ
చీకటి కప్పుకున్న శాలువ"

అనీ, మరో చోట ఎక్కడో "ఏమీ బంధం మాడపాటికి" అనీ అంటారు. మాడపాటి

రామచంద్రరావు గారిది మధిర పక్కనే వున్న 'ఎర్రుపాలెం'.

"జైల్లో ఉరి కోసం నిరీక్షిస్తున్న ఖైదీ వుంటాడు. అతను కటకటాల మధ్య నిరంతరం మృత్యు సన్నిధిలో వుండేవాడు. అతను నిరపరాధినని చెప్పుకుంటూ తనపై అధికారులు మోపిన నేరం గురించి బాధపడేవాడు. తనకెలాగు చచ్చిపోవాలని వుంది. తనపై ఆరోపించిన నేరం గురించి బాధపడేవాడు. అప్పటి రాజకీయ పక్షాలన్నిటిలోను పనిచేశాడు. ఎవరూ తనకావల్సిన సహాయం చెయ్యలేక పోయారు. నిరుద్యోగంలో కఠిన దారిద్ర్యంలో-కుటుంబం-భార్యా పిల్లలూ, ఆకలికి తట్టుకోలేక పోయారు. అందరూ కలిసి ఆత్మహత్య చేసుకుందామనుకున్నారు..." తరువాత కథ చెప్పక్కర్లేదు. ఊహించుకోవచ్చు. ఇది విన్న వరద మనసు విచలితమై దాదాపు అతని కవిత్వాన్నంతా ప్రభావితం చేసింది. ఆయన కవిత్వం లో కనిపించే నిరాశా నిస్పృహలకు, సినిసిజంకు ఇది నేపథ్యం. బహుశా ఆయన ప్రాపంచిక దృక్పథాన్నే ఈ సంఘటన మలిచినట్టు కనిపిస్తుంది. ఆయనతో మాట్లాడుతున్నా చాలా విషయాలమీద నిర్లిప్తత కనిపిస్తుంది.

వరద కవిత్వం ప్రయోగాలనిధి. శ్రీ శ్రీతో పాటు తాను కొత్త శైలి కోసం అన్వేషిస్తూ చేసిన ప్రయోగాలు ఈ 'కవితా' సంచికలో కనిపిస్తాయి. ఈ ప్రయోగాలు పద్యాల్లోనూ మాత్రా ఛందస్సుల్లోను కనిపిస్తాయి. మాత్రా ఛందస్సులో ప్రయోగాలను 1958 ఆగస్టు అభ్యుదయలో కొన్నింటిని విశ్లేషించి చూపించాను. పద్యం అనిపించకుండా పద్యం రాయటం వరదకు ఒక సరదా.

*"కాలం మారింది నేస్తం!*
*కల నిజమయి లోకం సమస్తం మరోలా*
*పాలించే మంచి రోజే*
*ప్రథనమయి జనం బానిసత్వం నశిస్తే*
*కౌలీనం మారణం రక్తనద విహరణం*
*కానిపించే చరిత్రంతా*
*లోపిస్తుందిలే! నీ*
*తరుణ హృదయ గాథా రహస్యం యిదేలే"!* ఇది స్రగ్ధర అని కొంచెం నిదానించి చూస్తే కాని తెలీదు.

*"నువ్వు చచ్చిపోయిన రాత్రి నవ్వలేదు*
*తరుణ మేఘావృతమ్మొక తారకేని"*

అన్న చోట గీతం నడక స్పష్టంగానే తెలుస్తున్నది.

*"వెలుగు చూడలేపోయ్ మన విలితికనులు*
*పీక తెగినా*
*నరే గుండె విప్ప బోకు"*

అన్న చోట రెండోసారి చదివితే గాని గీతం అని గుర్తు రాదు. అట్లాగే పాములాగా మెలికలు తిరుగుతున్న కింది భుజంగ ప్రయాతం చూడండి.-

*"నిజంగా విషాద ప్రణీతం ప్రపంచ*
*ప్రజానీక గాథా ప్రబంధం సమస్తం*

రుజా చెయ్యి నీవే మరోసారి నేస్తం
అజన్యానికే లోకమంతానిబద్ధం."

ఆధునిక భావ వ్యక్తీకరణకు, వాడుక భాషా ప్రయోగానికి పద్యం కూడా పని కొస్తుందని వరద చేసిన ప్రయోగాల లక్ష్యం అనుకుంటాను. రెండో విషయమేమోగాని మొదటి ప్రయోగంలో విజయాభవుడైన కవి వరద. భావగర్భితంగా రాస్తూనే పద్యాన్ని అలవోకగా నడపటం వరద సాధించిన ఈజ్ (ease) చూడండి ఈ వృత్తంలో-

"నాకయి నేను దుఃఖపడ
నా, జనపాలనమే వియంత్రబా
ధాకులమైన దంచునువ్య
ధాచిత చిత్తములో కృశింపనా,
లేక మహాపరాధినని
లేని స్వయంకృత దోషమింతనే
నే కాని తెచ్చుకోన, కరు
ణించెదు నేత్రము లేని రాత్రులన్"

వరద మాత్రాఛందస్సులలో-మరీ ముఖ్యంగా ముత్యాల సరాల్లో చేసిన ప్రయోగాలూ అధిక సంఖ్యలో వున్నాయి. ముత్యాల సరంలో గణ వ్యత్యయం చేసి గతి వైవిధ్యం సాధించడం ఒక ప్రయోగం.

"నువ్వు పోయిన సాయంటైనం
నవ్వలేదొక తారకూడా
జలదరించిన ఆకాశమే
ఒక్కపెట్టున నవ్వుకొన్నది"

గణ వ్యత్యయమంటే మూడు-నాలుగు మాత్రల గణాల వరస బదులు నాలుగు-మూడు క్రమం వాడటం. ఇది శ్రీ శ్రీ, ఆరుద్రలలో అరుదుగా కనిపిస్తుంది. విశ్వనాథవారి 'కోకిలమ్మ పెళ్లి' లోనూ, వరదలోను ఎక్కువ కనిపిస్తుంది. మాత్రా ఛందస్సుల్లో మిశ్రగతులు సృష్టించడం వరదకు సరదా!

"దిక్కులేని జనులకు
తెలుపుకనని కనులకు
పురాతనం మంచిది
పురోగమన మెందుకు"

ఇక్కడ చతురశ్ర గతిని త్రిశ్రంతో అంటుగట్టారు.

ఒక్కోసారి ఈ ప్రయోగాలు అతి వేలంగా జరిగిన ఘట్టాలున్నాయి.

"పదముందుకు వెనక ఆపద
ముది కనులకు లేదు కౌముది
గదిలోపలి నలువు మూగది

*వద నేస్తం వెనక ఆవద*
*ధర పెంచిన పాటలా ధర*
*వలపించే పసిడి త్రోవల*
*ఎదగాలికి రేగు పయ్యెద*
***వదముందుకు! వెనక అవద.***

త్రిశ్రగతిలో ప్రతి పాదం చివర నాలుగు మాత్రల గణం వెయ్యటం కాక ప్రతిపాదం :
రెండక్షరాలు ఒకటిగా వుండేట్టు చూడటం ఇందులో వైచిత్రి. ముక్త పదగ్రస్తం అనే అలంకార
ప్రతిబింబం (mirror image) లాగా వుంది. బహుశా దీన్ని ఆది పదగ్రస్తం అనొచ్చునేమో

అట్లాగే ఇంకో ప్రయోగం చూడండి-

*"నయం నేడు నీ పాడు ముఖం*
*భయం వల్ల రాబోదు సుఖం*
*కనీ వేడి కన్నీళ్ల చిలుకు*
*స్తవం మాని వాస్తవం వలుకు"*

త్రిశ్రగతి పాదాన్ని ఒక గురువుతో విడదీయటం వల్ల ఈ పద్యం ఏర్పడింది. 14 మాత్రలు
ఇది ముత్యాలసరం కాదు.

అన్ని ప్రయోగాలు చేసినా, వచన కవిత్వం రాసినా వరద ఛందోబద్ధ కవిత్వాన్ని, ప
ముఖ్యంగా వృత్తాలను ఎక్కువ అభిమానించినట్టు అగుపిస్తారు.

"ప్రకృతి అంతా ఛందోమయం. ప్రకృతిలోని ప్రతి అంశానికీ ఒక గ్రామరు ఉంటుంది. ప్రక
ప్రతిబింబమే ఛందస్సు. ప్రకృతికి ప్రతి స్పందన కవిత్వం అనుకుంటాను.... ఒకసారి ప్రక
చూడండి. ఋతువులూ, ఉదయాస్తమానాలు, భూభ్రమణం, గ్రహణం-యివన్నీ నియమబద్ధంగా
వుంటాయి." ఇట్లా వివరించుకుంటూ పోతారు. పద్యం మీది ఈ అభిమానం వల్లనే ఆయ
గౌతమరావు గారితో ఆధునిక కవుల పద్య పఠన కార్యక్రమం ఏర్పాటు చేయించారు.

వరద కవిత్వాన్ని ఒక మాటలో, వాక్యంలో వర్ణించడం కష్టం. నిరాశా నిస్పృహలు చాలా చో
కనిపించేమాట నిజమే. అయితే అది మాత్రమే ఆయన కవిత్వం కాదు. ఏమిటీ బ్రతుకు పరమార్థ
అనే ప్రశ్న వేసుకుంటారు?

*"ప్రశ్న ప్రశ్న లాగే ఉంటుంది*
*ఎక్కడిదీ జగత్తు*
*పరమాణువు విరజిమ్మిన మహావిపత్తు*
*అన్నదియమ్మేది భవదియమ్మేది*
*బతుకెందాక?*
*ఆవరించిన భగవద్గీత వెనుక వ్యక్తి పాలికేక!"*

ఈయన కవిత్వంలో చాలా చోట్ల కనిపించేది వ్యక్తి ప్రాధాన్యం. అప్పుడప్పుడది సమాజ
నిరసనగా కూడా కనిపించొచ్చు. సమాజం వ్యక్తిని అణచిపెట్టటాన్ని నిరసిస్తున్నారనుకుంటా. త
తాత్త్విక భూమికతో రాసిన ఈ పదాలు చూడండి. మానవ పరిణామాన్ని చిత్రిస్తూ-ఒక చోట

*"సమాజం జనించి, సమిష్టి జనభారం*
*సమూహం; జాతి, కులం, మతం విహారం*
*పెనుగాలి వలె వేగ; నాగరికత రెచ్చి*
*విధి విరామం లేని సంఘ గమనంలోన*
*వ్యక్తి చచ్చి*
*మన పురాతన దైవాల ప్రాబల్యం, జీర్ణించి*
*మనుములారాధిస్తున్నారు సమాజాన్ని సమూహాన్ని తెగవర్ణించి."*

అని అంటారు. వ్యక్తిప్రాధాన్యానికి అనుబంధంగా మానవ స్నేహాన్ని కాంక్షించడం కూడా కనిపిస్తుంది.

*"ఈ చీకటి నుంచి, కాలాంతరం విస్మృత*
*వీధుల నుంచి*
*ఇత దృష్టి లేని నోచుకోని విగతమను*
*పంజరం చించి*
*కోరుతున్నానొక పిడికెడు వలపునేస్తం!"*

కవుల సీరియస్ పద్యాలు ఎంత పఠనీయాలో చమత్కార పద్యాలు కూడా చదవటానికి హాయిగా వుంటాయి. 'రాక్షస గీతం' అని రాసిన గీతంలో

*"ఇది గాదిలోంచి తీసిన ఉగాది*
*ఇది ఖాదీ చూత పల్లవ ఖాది"*

అని 1975 లో రాశారు.

శాస్త్రి గారి కోసం రాసిన ఉత్తర ఖండికలో-

"తనకు తానై అజంతా యథార్థ మెరిగి
అతి విశిష్ట మార్గ స్రష్టయయ్యె; ముక్త
కవిత కాతడె యుగకర్త; కలుగుగాక
అతని కవితాత్మకే నాటికైన శాంతి"

అజంతా కవిత్వాని కాత్మశాంతి కలగాలన్న మాటలో ధ్వని స్పష్టం గానే వున్నదనుకుంటాను.

కాలమిస్టుగా, కవి మిత్రుడుగా చాలా మందికి తెలిసిన అబ్బూరి వరద రాజేశ్వరరావుగారు కవిగా ఎక్కువ మందికి తెలీదు. ఒక తరంలో సమకాలికులతోపాటు ప్రయోగాలు చేసిన వరద తన కవిత్వం పట్ల తానే నిర్లిప్తతతో రాయటం మానేశారు. రాసినవి అచ్చేయడం మానేశారు. ఆధునిక కవిత్వం ఒకరి ప్రవక్తృత్వంతోనే ఏర్పడలేదు. ఎంతో మంది ప్రయోగాల వల్ల ఏర్పడింది. రూపాన్వేషణ ప్రస్థానంలో వరద కవిత్వం ప్రయోగాల నిధిగా కలకాలం పాఠకులకు, పరిశోధకులకు ఆహ్లాదాన్ని కలిగిస్తుందనీ, ప్రయోజనకారిగా వుంటుందని నాకు నమ్మకం. వృత్త,గేయ ఛందస్సుల్లో వైవిధ్యం చూపించిన ప్రయోగశీలిగా వరదకు తెలుగు సాహిత్య చరిత్రలో సముచిత స్థానం లభించాలని నా ఆకాంక్ష, లభిస్తుందని నా ఆశ.

('ఆంధ్రజ్యోతి', ఆదివారం, 17 జనవరి, 1993)



గోపాలరాగ
గోపాల చక్రవ

కవితా సంచిక . . .

ఆధునిక సాహిత్యానికి ఆధునికత తీసుకువచ్చిన కొద్దిమందిలో అబ్బూరి వరద రాజేశ్వరరావుగా ఒకరు. వరద విలక్షణమైన వ్యక్తిత్వం గల రసహృదయుడు. సహజంగా తండ్రిరామ కృష్ణారావు గా ప్రభావం ఆయన మీద అమితంగా ఉంది. తండ్రిగారి వలె ఈయన కూడా నిరంతర గ్రంథ పఠనాసక్తుడు. ఆయన వలెనే చమత్కారప్రియుడు. మేధావి.

అబ్బూరి రామకృష్ణారావుగారి స్వస్థలం తెనాలి అయినా, ఆంధ్ర విశ్వకళా పరిషత్తుల ఉద్యోగం చేయడం వలన ఆయన జీవితంలో చాలా భాగం విశాఖపట్నం, గుంటూరు, విజయవాడ మొదలైన పట్టణాలలో గడిచిపోయింది. అందువలన వరదకు అన్ని ఊళ్లలో స్నేహితులున్నార ముఖ్యంగా విశాఖపట్నంలో ఆయన, రావిశాస్త్రి కలిసి చదువుకున్నారు. కమ్యూనిస్టు మేనిఫెస్టోను అబ్బూరి రామ కృష్ణారావుగారు శ్రీ శ్రీకి పరిచయం చేశారు. దానివల్ల శ్రీ శ్రీ చాల ప్రభావితుడయ్యాడు. శ్రీ శ్రీకి అబ్బూరి కుటుంబంలో ఒక ప్రగాఢ అనుబంధం ఏర్పడింది. అందుకే వరద "చెరకాలం" కావ్యం ముందు పద్యాలలో శ్రీ శ్రీ ఇలా అంటాడు-

*"అలవైబాగున మన అ*
*టలు మన పాటలు జ్వలించడం అది సరిదా*
*శ్రీ మాన్ మీ ఫాదరు నా*
*కో మాదిరి నాన్నగారె ఒకటే కొరదా*
*ఏమయితేనేం? ఇరువురి*
*క్షేమం ఒక కావ్యమై ధ్వజించెను వరదా!"*

తండ్రిగారితో ఉన్నప్పుడు 'నటాలి' సంస్థ ఆధ్వర్యంలో వరద 'కన్యాశుల్కం' నాట ప్రదర్శనలు ఏర్పాటు చేసేవాడు. 'నటాలి' లో వంగర, పసుమర్తి కృష్ణమూర్తి మొదలై ప్రముఖులు పనిచేసేవారు.

1944లో వరద కొంతకాలం 'ఆంధ్రప్రభ'లో పని చేశాడు. ఆ రోజుల్లో ఆ పత్రికకు నార్లవారు సంపాదకులు గానూ, న్యాపతి నారాయణమూర్తి సహాయ సంపాదకులుగానూ ఉండేవారు. తర్వా వరద 'ప్రభ' నుంచి 'ఇండియన్ ఎక్స్‌ప్రెస్' కు మారాడు.

తర్వాత వరద కార్యక్షేత్రం హైదరాబాదుకు మారింది. 1950లో ఆయన అఖిల హైదరాబా పాత్రికేయుల సమావేశం ఏర్పాటు చేశాడు. సుప్రసిద్ధ పాత్రికేయుడు కోటం రాజు రామారావుగా ఆ సభకు అధ్యక్షత వహించారు. ఆ రోజుల్లో ఆయన పాట్నా నుండి వెలువడే 'సెర్చిలైటు' దినపత్రిక సంపాదకులుగా ఉండేవారు. ఆ సభను సుప్రసిద్ధ రచయితా, పాత్రికేయుడూ ఖ్వాజా అహమ్మద్ అబ్బాస్ ప్రారంభించారు. తర్వాత హైదరాబాదు వర్కింగ్ జర్నలిస్టుల సమాఖ్యక

వరద సాధారణ కార్యదర్శిగా పనిచేశారు. భారతీయ వర్కింగు జర్నలిస్టుల సమాఖ్య స్థాపకులలో వరద ఒకరు. ఈ సమాఖ్య 1952 లో ప్రారంభింపబడింది. దీనికి సుప్రసిద్ధ సంపాదకుడు ఎమ్. చలపతి రావు గారు అధ్యక్షులుగా ఉండేవారు. ఈ సమాఖ్యమండలిలో వరద కొన్నాళ్లు సభ్యులుగా ఉండేవారు.

ఢిల్లీలో భారతీయ సాంస్కృతిక సంబంధాల మండలి ప్రచురించే సాంస్కృతిక వార్తలు అనే పత్రికకకు ఒక సంవత్సరం (1960) వరద సంపాదకుడిగా ఉండేవాడు. తర్వాత "ఎలైడ్ పబ్లిషర్స్" అనే ప్రచురణ సంస్థలో సంపాదకుడిగా చేరి పదిహేనేళ్లు పనిచేశారు. ఆ రోజులలో సంచలనం సృష్టించిన జి.ఎమ్.కౌల్ పుస్తకం 'అన్‌టోల్డ్ స్టోరీ' కి వరద సంపాదకత్వం వహించారు. ఈ పుస్తకం 'రోజుల్లో' నే నలభై వేల కాపీలు అమ్ముడు పోయాయి. రచయితకు పారితోషికం క్రింద లక్షరూపాయలు ఇచ్చారు. భారతదేశం లోని అన్ని దినపత్రికలూ ఈ పుస్తకం గురించి సంపాదకీయ వ్యాఖ్యలు రాశాయి.

ఇంతటి బహుముఖ ప్రజ్ఞాశాలి కవితల్ని 'కవితా సంచిక' అనే శీర్షికతో డాక్టర్ ప్రభాకర్ వరకాల సంకలనం చేశారు. ఈ పుస్తకం జనవరి మొదటి వారంలో వెలువడింది.

ఈ సంకలనంలో 'చెరకాలం' అనే సమగ్ర కావ్యానికి చెందిన శకలాలూ, వివిధ పత్రికల్లో అచ్చయినవీ, లభ్యమయినవీ వరద రాజేశ్వరరావుగారి కవితా సంకలనకర్త చేర్చారు. నాలుగున్నర దశాబ్దాల క్రితం వరద 'చెరకాలం' రాశారు. ఇంచుమించు అరవై ఏళ్ళ క్రితం ఆయన రాసిన పద్యం కూడా ఇందులో ఒకటుంది.

"చెరకాలం" గురించి వరద ఇలా అంటారు: "[చెరకాలం] జీవితంలో యాదృచ్ఛికంగా సంప్రాప్తమయిన అనుభవానికి ఆలంబమయిన గాథ..." జైలు కటకటాల మధ్య ఉరి కోసం నిరీక్షిస్తున్న ఓ ఖైదీ కథ ఇది. ఈ ప్రపంచం ఓ రకమయిన కారాగారం, అందులో మనం జీవితాంతం బంధితులుగానే ఉంటాం అనే భావం ఈ కావ్యంలో ఉంది" ..... ఈ కావ్యం గురించి మహాకవులు ఇద్దరు ఇలా అన్నారు.

"కావ్యమునకు కావ్యమె పూ
ర్ణ వ్యాఖ్యాన మటంద్రు ప్రాజ్ఞులు, యీచీ
నవ్యకవితా కృతికి నం
భావ్యము పద్యప్రశంస భద్రము వరదా"

విశ్వనాథ

"నీ వ్రాసిన చెరకాలం
తీవ్రంగా చదువ చదువ తెరలెనువరదా
నీ వ్రయ్యలైన హృదయవు
చేవ్రాలే కావ్యమెరసించెను వరదా"

శ్రీ శ్రీ

"చెరకాలం/లోని కొన్ని భాగాలు-
'రానున్నది చీకటికల

రాబందుల రెక్కల వల
ఏం లాభముంది భయపడి
ఈ పెదదారివి దిగ్గబడి
మనిషికి మేధా సంపద
మనుగడకే ఒక ఆపద
లేకుంటే యీ న్యాయం
ఏ కష్టపుటాదాయం?"
"జాతి, కులం, మతం, విహారం
పెనుగాలివలె రేగ, నాగరికత రెచ్చి
విధివిరామం లేని సంఘగమనంలోన వ్యక్తిచచ్చి
మన పురాతన దైవాల'ప్రాబల్యం జీర్ణించి
మనుషులారాధిస్తున్నారు సమాజాన్ని
సమూహాన్ని తెగవర్ణించి"

ఆనాటి "చెరకాలం"లోని ఈ భాగం 1993 లో జరుగుతున్న సంఘటనలకు కూడా అన్వయించవచ్చు.

"బతుకు బరువు చేసి
తూకంలో లాభం కాజేసి
లక్షలు లక్షలు లాభం చేసిన
లక్షింపతీ! సలాం!
అడక్కుండా, విప్పివ్వకుండా, చెప్పకుండా
ఇల్లు ఖాళీ చేయించి
తమపేరు ముద్ర వేయించి, మనుషులకోసం
మనుషుల్ని నలిపి, పేదలకోసం పేదల్ని చిదిపి
మా కోసం మమ్మల్ని
మమ్మల్ని మీ కోసం
పీక్కునిరక్కేస్తున్న ద్వారబంధంలేని కాంపలకి
నాథుల్లారా! జోహారు!"

"చెలీ! నెచ్చెలీ" అనే కవితలో సామాన్యుడి జీవితాన్ని వర్ణిస్తూ కవి ఇలా అంటారు:

"పడుకునేందుకు చోటులేదు పార్కుతప్ప
వెళ్లి పొమ్మన్నాడు కావలావాడు తాగి తప్ప
సగం రాత్రి చీకటిని కావలించుకున్నాను
చెలీ! చలితో నిద్రను పంచుకున్నాను.
అధికార్ని అర్థించాను ఉద్యోగం కోసం
ఆయనకు తీరికన్నా లేదు వినేందుకు కనీసం

ఇవాళెలా గడుస్తుంది చెలి
ఎవరున్నారు మనకీభూస్థలి"

పుస్తకం చివర వరద రాజేశ్వరరావుగారితో పరకాల ప్రభాకర్ జరిపిన ఇంటర్వ్యూ నుండ కొన్ని భాగాలు ప్రచురించారు. వచన కవిత్వం గురించి మీరేమంటారు అన్న దానికి వరద సమాధానం:

"ఆ ప్రక్రియ మనం విదేశాల నుంచి దిగుమతి చేసుకున్నది.... ఆ పేరే తప్పు. ఈ ప్రక్రియను శ్రీ శ్రీ తనకు దక్కవలసిన ప్రఖ్యాతి వచ్చిన తరవాత చేపట్టాడు... శ్రీ శ్రీకి రావలసిన ప్రఖ్యాతి మాత్రం ఛందస్సువల్లనే వచ్చింది....ఈనాడు 'వచన కవిత్వం'లో కేవలం వచనమే కనిపిస్తోంది."

ఇది వివాదాస్పద అభిప్రాయం. అయితే వరద మాత్రం 'ఛందస్సు లేనిదే గానం లేదు, కవిత్వం లేదు. ఛందస్సు ఏ కళారూపానికైనా అత్యంత సహజమైన ఆలంబం" అని గట్టిగా చెప్పారు. టి.ఎస్. ఇలియట్ వలె వరద కూడా సంప్రదాయాలు నుండి వచ్చిన ఆధునికుడు.

వరద "కవితా సంచిక" కవితా ప్రియులందరూ అవశ్యం పఠించవలసిన గ్రంథం. ప్రతి పుటలోనూ వరద ముద్ర ప్రగాఢంగా కనిపిస్తుంది. ఇంతమంచి సంచికను తీసుకువచ్చిన ప్రభాకర్‌ను మనసారా అభినందిస్తున్నాను.

('ఆంధ్రప్రభ', జనవరి 22, 1993)



## వరద కవిత్వం
## నిత్యసౌందర్యారాధన
## నిశ్చల దీపికళిక

కవితా సంచిక...

రామమోహనరాయ్

"కవిత్వం విధ్వంసక కారణ విచ్ఛేదన
కవిత్వం నిత్యసౌందర్యారాధన!" అని గాఢంగా నమ్మిన కవి శ్రీ అబ్బూరి వరద రాజేశ్వరరావు. "అరచాటగు నాంధ్రవధూటి" సౌందర్యం లాగ కవిత్వం ఛందోబద్ధంగా, వాడుక భాషలో కొత్త పాతల మేల్కలయికగా ఉండాలని భావిస్తారు వరద. సుప్రసిద్ధకవి, నవ్య సాహిత్యోద్యమానికి మార్గదర్శకులూ అయిన శ్రీ అబ్బూరి రామకృష్ణారావుగారి కుమారులు కావడం వల్ల సంస్కృతాంధ్ర సారస్వతాలలోని మేలిరచనలను, పాశ్చాత్య సాహిత్యాల జీవసారాన్ని చిన్న వయస్సులోనే శ్రీ వరద రాజేశ్వరరావు గ్రహించారు. వాగర్థాల శక్తిని, హృదయదఘ్నంగా అనుభవించినందువల్ల తండ్రి గారిలాగే తక్కువ సంఖ్యలో రచనలు చేశారు. కవిగా తనను లోకం గుర్తిస్తున్నదా? లేదా? అని ఎప్పుడూ వెనుదిరిగి చూసుకోకుండా, "హృదయం కదిలితేనే గళద్వారం విడటం" అనే నియమంతో రచనలు సాగించిన శిష్టా ఉమామహేశ్, బెల్లంకొండ రామదాసు, శ్రీరంగం నారాయణబాబు, ఆలూరి బైరాగి, పఠాభి, అజంతా కవుల కోవలో కవిత్వాన్ని ఒక అపురూప శక్తిగా ఆరాధించారు.

శ్రీ వరదరాజేశ్వరరావు పేరు తలచుకోగానే ముందుగా జ్ఞాపకం వచ్చేది ఆయన ఆరుద్రతో కలిసి రచించిన సాహిత్యోపనిషత్ (1954); మరొకటి "చెరకాలం" అనే సమగ్ర కావ్యం కనిపించకుండా పోయినప్పుడు, అందులో అక్కడక్కడ అచ్చయి మిగిలిన భాగాలతో కూడిన 'అందాక'.

*"జీమూతం పరిధి*
*జీవితం పరమావధి*
*ఎరువుదిగని సంజెవేళ*
*ఏ సంకేతాల స్వరమేళ*
*భయపెడుతోంది వీళ్లని?*
*ప్రార్థించమంటున్నది దేవుళ్లని?"*

(స్వవిషయసూచిక)

అని ప్రశ్నించిన వరద అభ్యుదయ కవి అనటానికి సందేహించనక్కరలేదు. అభ్యుదయోద్యమం ఉన్నత స్థితిలో వున్న దశలో కూడా శ్రీ వరద మార్క్సిజాన్ని అభిమానించలేదు. అప్పటికే ఆయన ఆలోచనలు ఎం.ఎన్.రాయ్ ప్రవచించిన రాడికల్ హ్యూమనిస్టు భావజాలంతో ముడిపడి వున్నాయి.

శ్రీ వరద రాజేశ్వరరావు చిన్న వయస్సులోనే శ్రీ శ్రీ గారికి సన్నిహిత మిత్రులయ్యారు "శ్రీమాన్ మీ ఫాదరు నాకో మాదిరి నాన్నగారె" అని శ్రీ శ్రీ పలికేటంతటి గాఢమైన అనుబంధం వారిది. రాజకీయ భావ సాన్నిహిత్యం లేకపోయినా సాహిత్యబాంధవ్యం మాత్రం శ్రీ శ్రీ గారి మరణందాకా కొనసాగడం విశేషం.

లఘురచనలతో కాలక్షేపం చేస్తున్న వరదకు సమగ్ర కావ్యం రాయాలన్నకోరిక 1948 ప్రాంతాలలో కలిగింది. నిరుద్యోగంలో కఠిన దారిద్ర్యంలో భార్యాపిల్లలూ–ఆకలికి తట్టుకోలేకపోయిన పరిస్థితిలో అందరూ కలిసి ఆత్మహత్య చేసుకుందామనుకున్న కుటుంబ గాథ యీ కవి దృష్టి వచ్చింది. ముందు భార్యనీ, పిల్లల్నీ చంపిన తర్వాత తాను కూడా కత్తితో పొడుచుకున్నాడు కుటుంబయజమాని. ఆ పరిస్థితిలో పోలీసులు వచ్చి పట్టుకున్నారు. ఫలితంగా ఆ మనిషికి మరణం తప్పి జైలుపాలయ్యాడు. ఈ ప్రపంచంలో తనకు ఆధారం లేనప్పుడు ప్రపంచాన్ని వదిలేసి పోవటానికి తనకి హక్కులేదా? అని అతని వాదన. ఈ సంఘటన ఆధారంగా సమాజంలో అంతర్గతంగా వున్న పరస్పర వైరుధ్యాలను విశ్లేషిస్తూ 'చెరకాలం' అనే సమగ్ర కావ్యం (ఎనభై పేజీలు) రచించారు.

'చెరకాలం', స్రగ్ధర, భుజంగ ప్రయాతం, గీతం, కందం, చంపకమాల లాంటి సాంప్రదాయక ఛందస్సులో, భావమాత్రం వాడుక భాషలో రాయబడిన కావ్యం. ఛందస్సులో వాడుకభాషను ప్రవేశపెట్టే ప్రయత్నం శ్రీ గిడుగు సీతాపతి 'భారతీ శతకము'లో చేశారు. కాని అది విజయవంతం కాలేదు. వరద 'అందాక' తర్వాత కూడా ఛందస్సులో వాడుక భాషను చొప్పించే ప్రయత్నాలు సమర్థవంతంగా సాగలేదు.

వరద రాజేశ్వరరావుగారి ఖండకావ్యాలు 'అందాక' లోనె గాక చెరకాలంలోని మరి కొన్ని భాగాలు ఇటీవల 'కవితా సంచిక' రూపంలో వరకాల ప్రభాకర్ సంకలనం చేశారు.

"జగతి బాధావరిచ్ఛేదము

కవిత క్షుధా హృదయ క్లేదము
బ్రతుకు మిథ్యా శృంఖలితము
జయిలు లోపల స్వేచ్ఛ కలదు
బయట క్షణమ్మయినా వలదు!"
అనే తలపులు లోకాన్ని చెరసాలగా భావించేవారి మనోభావాలకు ప్రతిధ్వనులే.
"ఎవరక్కడ
పాడేది యింతరాత్రి?
నిద్రపోతోంది
పాపం, దరిద్ర ధాత్రి" పంక్తులలోని భావ వ్యక్తీకరణ రసజ్ఞుల్ని ఆకట్టుకొంటోంది–
"తరలించకు బ్రతుకు జాతర
పరమాత్మకు విప్పిచెప్పర
కలికాలపు బ్రతుకుటాకలి
గతి తప్పిన జగతి సంగతి" అనటంలో కవి ఆక్రోశం;
"నువ్వు పోయిన
సాయంతనం
నవ్వలేదొక తారకూడా"
"నిజంగానే నీకు తెలియదు
భువనమంతా బుద్బుదమ్మని" అనటంలో నైరాశ్యం శైదీ మనస్సు నావరించిన కారు చీకటిని చిత్రిస్తాయి.
కవి శైదీని ఉద్దేశించి
"ఓ ఆక్రోశించే చెలికాడ
ఈ అన్యాయపు టడవిజాడ
నరుని మున్నెరుగని విధాన
నడిపిస్తున్నదొకే ముఖాన
.......
భీకర సంగ్రామం మధ్య దైవం గొంతువిప్పదు
బ్రతుకునీ, కళేబరాన్ని బాబు, కొన్నేళ్లదాక"
అనటం సమాజంలో జరుగుతున్న అన్యాయాలను ఎదిరించగల శక్తి సామాన్యులకు లేదని చెప్పటమే!
"క్షుధావ్యధకు చిక్కి
అధోగతికి దక్కి
దీనజనులకెందు
దిక్కుగలదు నేడు"?
అని కవి సమాజాన్ని సూటిగా ప్రశ్నించారు.

"ఏయిజమైనా ఒక పెను
మాయగ సత్యమును దాచు మార్గముగానే
పోయెను గానీ మరిపో
నీయదు నరుని ముందు కిసుమంతైనా!"
అనేది వరద రాజేశ్వరరావు విశ్వాసం-
'చెరకాలం' చదివి మహాకవి శ్రీ శ్రీ
"చెరకాలపు చిరదారుణ
మరణారుణ చరమ కేక మనకో వరదా
దురితాలలో ద్రవించిన
చిరబాధే కావ్యమై హసించెను వరదా?" అని మెచ్చారు.
శ్రీ వరద రాజేశ్వరరావు కవితల్లో భావకవిత్వ ఛాయలు కూడా వున్నాయి.
"ఈ గగన తలమ్మున విహరింతును
స్వేచ్ఛా శారికరీతిగ
విచ్చేయుమోయి నాతో-పోదము జంటగ"! స్వేచ్ఛా ప్రియత్వం ఆ రోజుల తీరు.
శ్రీ శ్రీ, ఆరుద్రలతో కలిసి వరద రాసిన 'మేమే'లో ప్రతి గీతంలో మృత్యువు పసక్తి వున్నది. 'సామిధేని'-అనే సుదీర్ఘ గీతంలో శ్రీ వరద "మృత్యువు కోటలో
చీకటి తోటలో
చిగురించిన హంసలా
మృత్యువువేటలో
చీకటి బాటలో
వకిలించిన మోహంలా
సమీపిస్తున్నది ముహూర్తం"
అని మృత్యువును యథార్థమైనదిగా తలంచటమే గాక
"దీర్ఘనిద్రకై బ్రతుకు
వెలితిలో వేయికనుల
వెత్రితనవుటన్వేషణ" అంటూ మానవుని నిస్సహాయతను వెల్లడించారు.
"అన్నా! యీ బ్రతుకు చేదు
అంతకన్న తెరువులేదు!
అన్నాయీచరుగు వృథా
ఆగిపోవటం మంచిది!" అంటూ
చేదుపాట పాడేరు.
నిస్సహాయ మానవుని నుదిటి వ్రాతను చెరుపబూనుకొన్న అభ్యుదయ కవులతరంలో శ్రీ వరద కవిత
"అన్నా! ఏమున్నదింక తెరువు

*అవధి యెరుగదు బ్రతుకు బరువు"*

అంటూ నిస్పృహాయతను వ్యక్తం చెయ్యటమేనా? అంటే

కాదు-

*"ఇంద్రియాలను త్యజించి*

*హృదయనేత్రం విప్పగలది".* కాబట్టే శ్రీ శ్రీ కవిత్వం లోని అంతస్సారాన్ని, రా.వి. శాస్త్రి రచనల్లోని జీవశక్తిని ముందుగానే గుర్తించి అభినందించారు. రా.వి. శాస్త్రిని గురించి తెలుగుసాహితీ *"జగతి ప్రదీప్తమవును నీ వలన ముందు కాలాన నీ కలాన"* అని ఆశావహులై పలికారు.

'కవన కుతూహలం' రచించి యీ శతాబ్దపు తెలుగు కవిత్వపు తేజస్సును ముందుతరాలకందించిన వరద రాజేశ్వరరావు

*"ఎక్కడేని ఆశాద్యుతి యింత విరియు*

*నేని మన జీవితమ్ముల కెంత తృప్తి?*

*ఈ తరుణగవేషణమే యీ యావదాంధ్ర*

*మందు సత్కళానిష్ఠితులాశపడగ?"*

నని పలికి సత్కళావిర్భావానికి తమ స్వరాన్ని జోడిస్తున్నారు. ప్రతిభకు వ్యుత్పన్నత తోడైనప్పుడు కవిత మిరుమిట్లు గొలపదుగాని విశ్వల దీపమై ప్రకాశిస్తుంది- వరద కవిత్వం విశ్వల దీపకళిక.

(సాహిత్యవేదిక 'ఆంధ్రజ్యోతి', సోమవారం, మే 17 1993)



## అబ్బూరి పద్యం ఆ 'పద్యం' కాదు

వల్లభాచార్య

కవితా సంచిక

*"నేటి తెలుగు సాహిత్యవీధి*

*కేవల నిరక్షరాస్యులు, కృతకవేత్త*

*లెంత పెత్తనమ్ము చలాయింపగలరొ*

*నాడెప్పుడైన తలపోసినామ మనము?"*

అన్న అబ్బూరి వరద రాజేశ్వరరావు పద్యంలో పుట్టి పెరిగి, వచన కవితలోకి మళ్ళి, మళ్ళీ పద్యానికి తిరిగి వచ్చినవాడూ, ఛందస్సు లేకుండా కవిత్వం లేదని నమ్మినవాడూ, సాహిత్యంలో 'ఉద్యమాలు' అనే మాటను అంగీకరించనివాడూ, తెలుగు సాహిత్యం మరీ ముఖ్యంగా కవిత్వం పోతున్న పోకడలను ఎప్పటికప్పుడు ఆకళించుకొని, ప్రాచ్య పాశ్చాత్య సాహిత్య సిద్ధాంతాల తూనిక రాళ్లతో ఖరీదు కట్టగల కొద్దిమంది షరాబులలో ఆయనా ఒకడు. ఆయన 50 ఏళ్ళ క్రితం రాసిన "చెరకాలం" ఇతర కృతులతో 'కవితా సంచిక' వెలువరించారు ఇటీవలే. దీనిలో నిన్నటి మొన్నటి కవితల వరకూ సంకలించారు.

వీటిలో "చెరకాలం" ప్రత్యేకంగా చూడవలసిన కృతి. ఎనభై పుటల సమగ్ర కథా కావ్యంగా ప్రారంభించినది తన 'కలకాలం'తో కలిపి అచ్చువేస్తానన్న శ్రీ శ్రీ రాతప్రతిని తీసుకువెళ్లి

పోగొట్టుకోగా, అప్పటికి అచ్చయినవి, నోటు పుస్తకాలలో దాక్కొన్నవి మిత్రుల ప్రోద్బలంతో తవ్వి తీసి కూర్చగా ఏర్పడిన రూపాన్ని ప్రస్తుతం మనం చూడగలం. ఈ "చెరకాలం" అన్నది వరదను ప్రయోగశీలిగా నిలిపేకావ్యం. పద్యం ఒకానొక స్తబ్ధతకు గురయిన రోజుల్లో దాని భాషను మార్చడం, వస్తువును సంప్రదాయ వస్తువుకు భిన్నంగా ఎన్నుకోవటం సాహస ప్రయోగమే. అసలది పద్యమే కాదన్నట్టు రాయడం ఛందోప్రభుత్వానికి నిదర్శనం. ఆ రహస్యం తెలియని వాళ్లకు అది గేయమో, వచన కవిత అనో అనిపిస్తుంది! సంప్రదాయ ఛందస్సులను శక్తిమంతుడైన కవి ఏ విధంగానయినా నడిపించగలడని, అభివ్యక్తికి ఛందస్సు అడ్డం కాదని నిరూపించడానికి ఈ "చెరకాలం" సాక్ష్యం.

దీనిలో ఎన్నుకొన్న వస్తువూ అలాటిదే. జైలులో మరణ శిక్షకు ఎదురుచూస్తున్న వ్యక్తి మనోభావ చిత్రణం ఇది. సంప్రదాయ పద్య కవితా వస్తువుకు భిన్నమైనది. వస్తువూ, దృక్పథం మారినా రూపం మారవలసిన ఆవశ్యకత లేదని, ఆ మార్పు అనివార్యం అంటే కాదనడానికి ఈ కావ్యం ఉదాహరణ.

మహాకవి 'ఛందస్సుల సర్ప పరిష్వంగం వదలి' అన్నప్పుడు దాని అర్థం ఇదే. ఛందస్సుల బిగింపులో ఇరుక్కుపోకుండా వాటిని తన ఇచ్ఛ వచ్చినట్లు ఆడించగలనని భావం. మహాకవి ఛందోరహస్యం ఎరిగిన వాడు కనుక ఆమాట అనగలిగాడు. అబ్బూరి వరద దానిని 'మహాకవి' కన్నా ముందే చేసి చూపించాడు!

పద్యంలో కొత్తదారిన కథా కావ్య రచన వరద తండ్రి శ్రీ అబ్బూరి రామకృష్ణా రావు గారు చేశారు. 1915 లోనే రాసిన "మల్లికాంబ" అలాంటిదే. స్నేహితురాలికి వచ్చిన ప్రేమ లేఖలను తాను దాచిపెట్టి, అది భర్త కంటబడి, నింద నెత్తినబడి, భర్త చేతిలోనే మరణించిన మల్లికాంబ కథ అది. ఇదీ సంప్రపదాయ పద్య కవితా వస్తువుకు భిన్నమైనదే. కానీ దానిలో భాష 'పద్య భాష'! చూడండి.

*"దుష్ట సంకల్ప కశ్మలాత్ములకు నెట్లు*
*పావనస్త్రీ ప్రసన్న భావములెల్ల*
*ప్రకృతి పూర్ణత్వమునఁగనుపట్టఁగలవు?*
*నిజమహోనులిందిన పావనయతిగాక!"*

ఇది తండ్రి బాట కాగా కుమారుని మాట వేరు. కారణం శ్రీ పరకాల ప్రభాకర్‌కు ఇచ్చిన ఇంటర్వ్యూలో వరద చెప్పారు-" ఆ రోజుల్లో ఆధునాతన శైలిలో కావ్యాలు రాలేదు. శ్రీ శ్రీతో పాటు మేమంతా ఒక కొత్త శైలి కోసం అన్వేషిస్తున్న రోజులు. అంచాత ఆ ప్రయత్నం చేయాలనిపించింది" అని. ఆ అన్వేషణ ఫలితంగా పద్యం బాణీ, వాణీ మారాయి.

*"కాలం మారింది నేస్తం!*
*కల నిజమయిలోకం సమస్తం మరోలా*
*పాలించే మంచి రోజే*
*ప్రభవమయి జనం బానిసత్వం నశిస్తే*
*కౌలీనం మారణం రక్తనద విహరణం*
*కానిపించే చరిత్రంతా*

*లోపిస్తుందిలే? నీ*
*తరుణ హృదయగాథా రహస్యం ఇదేలే!" (చెరకాలం)*

అంటూ పద్యం సంప్రదాయ వేషాన్ని విడనాడింది. భాషను మార్చుకుంది. వచన కవితలాగ, గేయంలాగ పరుగు అందుకుంది. కానీ ఇది అచ్చమైన 'స్రగ్ధర' అనే వృత్తం! స్రగ్ధరను ఇలా రాయవచ్చని ఆనాటి పద్య కవులు ఊహించి వుండరు. వచన కవులకు స్రగ్ధరే తెలియదు కదా! ఇలా సంప్రదాయ ఛందస్సులను తన భావానికి అనుగుణంగా సమర్థుడైన వాడు ఒదిగించుకోవచ్చునని నిరూపించినవారు వరద.

కంద పద్యం అనగానే సుమతీ శతకం గుర్తుకు వచ్చే వాళ్ళూ, అది తప్ప తెలియని వాళ్ళూ దీనిని గుర్తుపట్టలేరు-

*"భూగర్భం అట్టుడుగున*
*సాగిందొక ప్రొక్తనాస్థి*
*నంకుల సమరం*
*రేగిందొక పెను ప్రళయం*
*మ్రోగిందాఖరి తుఫాను*
*పూర్వాశలలో"*

ఇది ఏ విప్లవ కవీ రాసిన గేయకవితకాదు. అచ్చం కంద పద్యం. అలాగే 'గేయం' అని ఛందస్సు తెలియని వారు ప్రమాదంలో పడిపోయే రచన ఇదుగో-

*"నిన్న స్వేచ్ఛావహం; నేడు కారాగృహం*
*అన్నలం, తమ్ములం, బంధులం అందరం*
*తప్పిపోకండి సత్యం శివం సుందరం*
*కన్ను మూసింది మా కంటె ముందే జగం"*

ఛందస్సుల పుస్తకాలలో వెతికితే 'స్రగ్విణి' అని ఒక వృత్తం ఉంటుంది. అదే ఇది!

*"నీ ముని పుత్రునిచే నెన్నియో భంగులన్*
*నేనుఱుంబాటు నీ వెంట భావించుచున్*
*సాము సంపాదివై సైపు మాలప్పులన్*
*భీమహత్వంబు సంధిల్లు నీకిమ్మెయిన్"*

అన్న తెలుగులో రెండవ స్రగ్విణి-తిక్కన రాసినది. అక్కడి నుండి 'స్రగ్విణి' ఎలా మార్పాడో చూస్తే అబ్బూరి ప్రయోగం తెలుస్తుంది. ఛందస్సులను నడిపించడంలో వైవిధ్యం, అవకాశం అవగతమవుతాయి.

*"వినీతుండవై ధర్మవేదిత్వబుద్ధిన్*
*దనర్పొందు నీవిట్లు దైన్యాతిరేకం*
*బునం బొంది శోకాగ్నిఁబొక్కంగఁగుంతీ*
*తనూజాగ్రజుండాత్మఁదాఁగుందకున్నే?"*

అన్న తిక్కన భుజంగ ప్రయాత రచనకీ వరద భుజంగ ప్రయాతానికీ తేడా చూడండి

ఇదుగో-

*"నిజంగా నిపాత ప్రణీతం ప్రపంచ*
*ప్రజానీక గాథా ప్రబంధం నమస్తం!*
*రుజాచెయ్యి నీవే మరో సారి నేస్తం!*
*అజన్యానికే లోకమంతా నిబద్ధం"*

ఈ పద్యంలో భావం, భాష, అభివ్యక్తి మారాయికదా? దానికి తోడు ఇది భుజంగ ప్రయాతమని తెలియకపోతే గేయంలా ఉరకలతో పాడుకోవచ్చుకదా! ఇదే వృత్తాన్ని ఎన్ని రకాలుగా నడిపించవచ్చునో చూపించారు వరద-

*"మరెన్నాళ్లు బాబూ! ప్రమాదం ప్రమాదం*
*పరిచ్ఛిన్నులం మేము, ప్రాణాలకోసం*
*పరాధీనులం, మమ్ము బాధించమోసం*
*ఖరీదెంత? ఇంకెంత కాలం వివాదం?"*

ఇదంతా చూసే విశ్వనాథ వారు ఇలా అన్నారు-

"నీ స్నేహితులంతా చందస్సుమీద విరుచుకు పడతారేం? వాళ్ళకు చాతకావాలి. కాని అందులో రాయటానికేం బాధ? నువ్వు రాసి చూపించావు కదా- ఇంకా ఏం కావాలి వాళ్లకి?" అని వరదతో!

ఏదైనా రూపాన్ని గురించి మాట్లాడేటప్పుడు ఆ రూపం మీద పరిపూర్ణ తధికారాన్ని సంపాదించాలి ముందుగా. తరువాత అది పనికి రాదంటే అది తెలిసి పలికిన మాట అవుతుంది. అసలు ఆ రూపాన్ని గురించి తెలుసుకోకుండా, దానిలోని లోతు, ఎత్తు, వైశాల్యమూ అవగతం కాకుండా, దానిలో ఎలాటి ప్రయత్నమూ చేయకుండా దాని 'నోట్లో వడ్ల గింజలు వేయుట, నారాయణ మంత్రము చదువుట, కపాలం మోక్షం' (కపాలమోక్షం అనాలని కూడా తెలియక) వంటి మాటలు మాట్లాడుట విజ్ఞులు పలికే మాటకాదు. దానివి విజ్ఞులు పట్టించుకోరు. ఆ అవసరమూ లేదు.

అబ్బూరి ఇలాంటి ప్రయోగాలు ప్రచారంలో లేని వృత్తాలలో చేశాడూ అంటే అదేమీలేదు. అందరికీ అందు బాటులో ఉండేవి, పద్యం రాయదలచిన ప్రతివాడూ మొదట ప్రయత్నించేవి అయిన తేటగీతి, ఆటవెలది వంటి వాటిలోనూ చూపించారు ఆ వైవిధ్యాన్ని

*"ఎవరక్కడ*
*పాడేది యింత రాత్రి?*
*నిద్రపోతోంది*
*పాపం ధరిత్రి!*
*ఓదగావద్ద*
*జనులార! ఉరికి వెరచి*
*గాయపడిన*
*గుండెల్లార! కళ్లు తెరచి*

*బతుకుపెల్లలు*
*వెతకండి! చితులవెనుక*
*నిత్యచైతన్య*
*రాగముందేమో? కనక*
*లాభమేముంది*
*మీతుదిక్షభవంన?"*

అన్నది గేయంలా పాడుకుంటానంటే అభ్యంతరం ఉండదు. కానీ ఈ నిలువు ముక్కల వెనుక దాగివున్నది 'తేట గీతి' అని మాత్రం గుర్తు చేయాలి.

కంచుడేగలు, వెలుగు పిలుపులు పద్యానికి కొత్తవి. అవి వచన కవితల వారికి ఏమి అందిస్తాయో కానీ వరద రచనలో ఆటవెలదిలో ఒదిగిపోయాయి-

*"కలల నంజమనక కనుమూయ బోనీక*
*కళవళించు గుండె కంచుడేగ!*
*ఎలుగు మూగపోయి వెలుగు పిలుపు లేక*
*తెక్కలార్చు కొనుము రేయి పవలు"*

ఇలా స్రగ్ధర, భుజంగ ప్రయాతం, స్రగ్విణి, గీతం, కందం, ఆటవెలదిల వంటి సంప్రదాయ ఛందస్సులలో భాషలో, అభివ్యక్తిలో పరివర్తన తెచ్చిన వారు వరద. ఆయన చేసిన ఈ ప్రయోగం తర్వాతే ఆరుద్ర ఈ ప్రయోగం చేశారు 'త్వమేవాహం'లో.

అయితే ప్రయోగం ప్రయోజనం ఏమిటి? అనేది ఒక ప్రశ్న అవుతుంది. ప్రయోగం కవిలోని 'జీనియస్' లక్షణం. సాహసికి ఆత్మలోని దినుసు. సాహసి అయిన వాడు తన మేధోమధనం లోనించిప్రయోగాన్ని ఆవిష్కరిస్తాడు. అప్పటిదాకా వున్న రూప, భావ, అభివ్యక్తులలో నూత్న వైవిధ్యాన్ని సంధానిస్తాడు. తరువాతి వారు దానిని అంది పుచ్చుకుంటే మొత్తంగా కవితారూపంలో మార్పు వస్తుంది. మరి అబ్బూరి వరద ప్రయోగం ఏ ఫలితాన్ని సాధించింది? అంటే-

సంప్రదాయ ఛందస్సులలో రాసే పద్య కవులు తమ ప్రాపంచిక విజ్ఞానాన్ని పెంచుకోవడంలో వెనకబడ్డారు. పండగలకీ పబ్బాలకీ పద్యాలు రాస్తూ తృప్తిపడ్డారు. పద్యం రాస్తే బి.సి. నాటి ఫెలో అంటారేమోనని కొందరు భయపడ్డారు. "నవ్విపోదురు గాక నాకేటి సిగ్గు"అంటూ ఆ వెన్నెలే, ఆ పువ్వులే, ఆనాటి హసద్విశాలనయనలే ఆ వ్యూహమే అయిపోయారు. పైగా "పద్యానికేమీ ఆపద లేదు. అదలా నిలిచి పోతుంది. మిగిలినవన్నీ గాలి కవితలు" అనే ధీమా పెట్టుకున్నారు. పద్య కవులలో చాలా కొద్దిమందికే విశేష ఛందాలతో పరిచయం. ఎంతసేపూ నాలుగు వృత్తాలూ, కందం, ఆటవెలది, తేటగీతి, సీసం-మరో రెండు మూడు ఛంధస్సులు అంతే! ఇలా కూపస్థ మాండూక్యంతో రాసే పద్య కవి నిజమైన పద్యహంతకుడు!

ఆ పరిస్థితిలో వరద చేసిన ప్రయోగాన్ని అందుకున్న వారెవరు? పైగా 'పద్యభాష' మార్చడం 'పంచమహాపాతకాలు కాక ఆరవది" అనే అంధభక్తి ఉందాయె! వరద పద్యకవులకు మార్గాన్ని చూపించారు. సామర్థ్యానికి ఒక గీటు రాయిని చూపించారు. దాని మీద ఎవరి సామర్థ్యాన్ని వాళ్ళు పరీక్షించుకోవచ్చు. కాదంటారూ వరదకేమీ నష్టం లేదు-పద్యానికే ఆ నష్టం ఏదో! నాస్తి

'తేషాంయశః కాయేజరా మరణజం భయం'!

[అబ్బూరి వరద రాజేశ్వరరావుకి-ఋషి ఋణ విముక్తి కోసం]-వల్లభ

('ఆంధ్రప్రభ', మే 24, 1993)

**Freedom within prison walls**

**Prema Nanda kumar**

The passing away of Abburi Varada Rajeswara Rau recently has meant a definite loss for modern Telugu poetry. Varada was no prolific poet, but he began writing early. It was not surprising, for his father Abburi Ramakrishna Rau had already created waves as a poet and political activist. Like his father, Varada's interest in dramatics naturally left him no time to take on major topics for epic creations. A lyricist, Varada's most ambitious attempt was Cherakalam (Prison-time) which he wrote forty-five years ago. He was then in his twenties and was considered as a poet of great promise.

In a recent re-issue of this work as part of his *Kavitha Sanchika* (1993), Varada has spoken of the events that led to his writing *Cherakalam* and the accident that prevented his publishing the same. Those were the days when youngsters like Sri Sri and himself were searching for a medium suitable to thier socialist learnings. Varada heard of a man imprisoned for killing his wife and children due to poverty. He had been restrained from suicide. When the world could not sustain him, how come it will not let him commit suicide either. Varada made use of this paradox to project the hapless condition of the poor people of this land. "This world is a kind of prison. We are bound forever within the walls'.Such is the philosophy of the poem which was commended by Sri Sri (who wrote a poem *Kalakalam* at about the same time):

*"Our songs and play*
*in Vizag of yore*
*shone brilliant:*
*that was wonderful.*
*Dream-Time and Prison-Time*
*blossomed as our first epyllions!*
*O Varada!"*

It was said that Sri Sri borrowed the only manuscript copy of Cherakalam from Varada and lost it. Varada could never get back the original mood. He managed to put together what he could find in rough notes and collection titled *Andaka* was received well. But for forty years the book has remained out of print. Fortunately Prabhakar Parakala has brought out a new edition of

the work with the original title affixed to the *Andaka* group.

How far is Prison-Time relevant today. And how does it compare with contemporary poetry. *Cherakalam* was the work of an angry young man. There are angry young poets today as well. Whereas the diction used by our young poets spewing out anger is desecratory in the extreme, it is interesting to note that even when giving vent to frustration, Varada's poems have a consecratory tone. This is no doubt because of the highly romantic diction that throws out traditional similies and metaphors with a prodigal hand. It is natural for him to speak of the "reddish brilliance of the feet of the directions-bride" *(digvadhu charanaruna deepti)* or "my silent heart's longings of the autumnal night *(nirupeda mowna hridayechchanu neti saradvibhavarin).*

Again, despite all the present ills, the opening bars of *Cherakalam* avoid any call to violence and speak of a definite bright future:

*"It is not like the past.*
*The olden days*
*have passed by.*
*Sign draw close to us*
*of the way to man's freedom!"*

And the present . Is'nt it terrible. The poet assures us that this is the last hell for humanity.

*"This is not the way*
*for the world to be on the move.*
*Will you not hear*
*the first dream*
*of our prisoner*
*sleeping in a room*
*void of light".*

The new earth can be ushered in only by a fearless humanity. As long as we would not allow the message of freedom that had been born in the course of history to be lost in selfishness, all will be well. But if we would allow the movement for freedom to break into festering sores due to pockets of egoism, woe unto man's future! What we need is not frustration but stern laughter. Remember, this crisis is our festival! *Ee Pramadam mana panduga!*

Freedom is but a state of mind, says Varda's prisoner. *"There is freedom with in the prison walls/No moment of liberty in the outside world!"* Where is the meaning to life if one does nothing but run after earnings and food. Day-to-day living is a waste if it is one long morning! How purposeless the life that is bound in the shackles of slavery! The prisoner of life wonders: Should he pity his own condition or mourn the condition of humanity. As for himself (the prisoner, the poet), this endless night is possibly the last pure moment of peace:

*"In the hopeless life of darkness*
*I was a constant traveller*
*of dream-pathways.*
*For gaining Ananda*
*I sought the good way*
*in the writings of yeasterday.*
*In the dark yesterdays*
*I longed for*
*the unattainable good.*
*I am now left with a dream-life*
*with houses made of airy-nothing".*

And yet the prisoner has dreamt a great dream and would rather warn his listeners. No return to the past! Do not be a reactionary to escape the present! That way lies racial suicide. For ever, march forward! Man had learnt the value of mutual help when tilling the soil. But civilization as such has been a suffocationg coat of mail. The possibility of gaining liberty from the present civilisation by entering the super-conscious state had been posited by Sri Aurobindo. But alas, he too died. But should that mark the condition as hopeless.

*Cherakalam* is literally choked with death imagery and concludes with a sharp focus on the prisoner's wife:

*"Sita and Chandramati*
*were wives of rich princes.*
*My unfortunate wife*
*was the daughter of naked hunger.*
*Born in poverty*
*and to die in want*
*is our life:*
*a daily affair*
*we decided to escape*
*by committing suicide.*
*First I killed*
*my darling wife."*

Containing the early blossoms of a sincere artist *Cherakalam* has not lost any of its significances. Humanity continues its purblind attempts to peer at a possible light at the end of the tunnel that is choked by the nuclear menace. The poor and the downtrodden citizens of nations continue to destoy their near and the dear out of frustration and themselves seek freedom through a violent end. Sorrowing lies our land where the moral fibre is in tatters. The 'last hell' continues to be active and hence Varada's angiushed cry remains alive, emotionally provocative, a message of the wounded wayfarer, bloody

but unbowed:

*Walk by yourself*

*under the light of self-consoling eyes*
*unconversing with the walking defeats*
*Walk tireless*
*Along streets straight and unreaching*
*Do not lift the eyes*
*At the reeling stars, unwatching*
*The Weeping sky's prayer*
*Walk in seach of unreached truth."*

('Newstime', Sunday August 1, 1993)





# అధికారభాషాసంఘం అధ్యక్షత

*[మార్చి 1993లో అబ్బూరి వరదరాజేశ్వరరావుగారిని ఆంధ్రప్రదేశ్ అధికారభాషాసంఘం అధ్యక్షులుగా నియమించడం జరిగింది.]*



గుంటూరు,
13.3.93.

మాన్యశ్రీ వరదరాజేశ్వరరావుగారికి

నమస్కారం.

'అధికార భాషా సంఘం' అధ్యక్షపదవి మీకు ఇవ్వటం చాల ఆనందం కలిగించింది.

తెలుగును 'విద్యాద్వారం' గా తీర్చిదిద్దటానికి మీరుకృషి చేస్తారని ఆశిస్తాను.

మీ వంటి మంచి కవిని, విద్వాంసుని భాషా సంఘానికి అధ్యక్షునిగా నియమించిన వారి అభిరుచిని అభినందిస్తాను.

'అధికార భాషా సంఘం' పర్యటనలో మీరు తప్పకుండ గుంటూరు వస్తారని, వచ్చి మా ఆతిథ్యం స్వీకరిస్తారని ఎదురు చూస్తాను.

మీరింకా ఎన్నెన్నో మంచి కవితలు రాయాలని నా కోరిక.

4-5-41,
కల్యాణిరోడ్డు,
చంద్రమౌళినగర్,
గుంటూరు-7.

మీ
రామమోహనరాయ్.

•

ముద్దసాని రాంరెడ్డి,
ఊటూరు పోస్టు,
కరీంనగర్-505505

ఊటూరు,14.3.93.

శ్రీయుతులు రాజేశ్వరరావుగారి దివ్యసముఖమునకు నమస్కారములు.

నిన్నటి "ఈనాడు"లో మిమ్మల్ని అధికార భాషా సంఘానికి అధ్యక్షులుగా ప్రభుత్వం నియమించినట్లు చదివి చాలా ఆనందించాను. మన భాషపట్ల, అభిమానం, అనురాగం, ఆదరణ గల మీలాంటి భాషాభిమానిని అధికారభాషా సంఘ అధ్యక్షులుగా నియమించడం అభిలషణీయం. అభినందనీయం. మిమ్మల్ని హార్దికంగా అభినందిస్తూ శుభాకాంక్షలు తెలుపుతున్నాను. ...............
శుభమస్తు!

మీ
రాంరెడ్డి.

•

Rustumbada
Machilipatnam
15.3.93

DR. M.A Padmanabha Rao L/N
Dear వరదా!

13వ తేదీ ఆంధ్రజ్యోతి వార్త-'అధికార భాషా సంఘం అధ్యక్షుడుగా అబ్బూరి' అని. చాలా సంతోషించాను అని వేరే వ్రాయక్కరలేదు! 'దివి నుండి భువికి' వచ్చావనిపించింది! ఆ సంఘ కార్యకలాపాల్లో నీదైన ప్రత్యేక విధానం-ముద్రవేస్తావని ఆశిస్తాను.

నీకు నా శుభాకాంక్షలు; అభినందనలూను.

— పద్మనాభరావు.

•

జ్ఞానపీఠ పురస్కార గ్రహీత, పద్మభూషణ్
డా. సి. నారాయణరెడ్డి, ఎం.ఏ., పిహెచ్.డి., డి.లిట్.
రాష్ట్ర ప్రభుత్వ సాంస్కృతిక, విద్యావ్యవహారాల సలహాదారు



కార్యాలయం : 242082
గృహం : 248451
కాచిగూడ, హైదరాబాద్-500 004.

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం

18.3.93

శ్రీ అబ్బూరి వరదరాజేశ్వరరావు గారికి

నమస్కారాలు

భాషా సాంస్కృతికశాఖల్లో అపారానుభవం వున్న మిమ్మల్ని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం అధికార భాషా సంఘం అధ్యక్షులుగా నియమించడం ఎంతో సంతోషాన్ని కలిగించింది. మీకు నా అభినందనలు.

మీ సారథ్యంలో తెలుగుభాష పరిపాలనారంగంలో అన్ని దశల్లో సముచిత స్థానం సంపాదించుకుంటుందని ఆశిస్తున్నాను.

మీ



SRIVIRINCHI

POST BOX NO. 5018
BESANT NAGAR, MADRAS 600 090

1.4.93.

శ్రీ అబ్బూరి వరద రాజేశ్వరరావుగారికి,

నమస్కారం.

మీరు అధికార భాషా సంఘానికి అధ్యక్షులుగా నియామకం అయినారని ఆంధ్రప్రభ వారపత్రిక వల్లభాచార్యులవారి వ్యాసంలో చూచాను.

చాలా సంతోషం. అభినందనలు.

మీవల్ల తెలుగుకు మరింత ప్రాముఖ్యం. శ్రేయస్సు చేకూరు తాయని ఆశిస్తూ

భవదీయుడు
శ్రీ విరించి.

•

ఉగాది తర్వాతి 3వ రోజు.
3.4.139 బర్కత్‌పూర.
హైదరాబాద్-27.

శ్రీ వరదుడు అబ్బూరికి- రావలసిన గొప్ప పదవి రానే వచ్చెన్!
ఈ విధమగు నాలస్యము కోవిదులకు తప్పదయ్యేకుమతుల వలనన్॥
వేచి వేచి చూచి వేస్తివి పెద పెట్టు
శ్రీ ముఖంబు చలువ చెప్పతరమె!
కనుక పలుకు చుంటి కంగ్రాచులేషన్సు
ఇప్పుడైన స్వీకరించి మిడుకు!!
అంకితము జేస్తి బూతుపద్యాలనెన్నొ
పంపియుంటిని మానాన్నప్రచురణముల
కాని కార్డైన టెలిఫోను కాలునైన
జేయకున్నను మానె, జేజేలు నీకు!!
శుభాకాంక్షలు
అధికారభాషకమీష
న్నధికారికి మిత్రవర్యుడబ్బూరికినీ
విధమగు శుభసందేశము
గ్రథియించితి పద్యములలో
కైకొనుమార్యా-

శుభంభూయాత్

ఇట్లు
తమవాడు
బూర్గుల రంగనాథశాస్త్రి
(బూర్గుల రంగనాథశాస్త్రి)



# అనారోగ్యం - అంతిమ యాత్ర

*[1993, ఏప్రిల్ మొదటివారంలో శ్వాసకోశవ్యాధి వల్ల వరదరాజేశ్వరరావుగారు అనారోగ్యానికి గురై, రాజధానిలో నిజాం ఆసుపత్రిలో ఏప్రిల్ 5 వ తేదీన చేరారు.*

*రాజేశ్వరరావుగారు సత్వరం కోలుకోవాలని కోరుకుంటూ, ఆయనకి ధైర్యం చెబుతూ దూరానవున్న బంధుమిత్రులు ఉత్తరాలు రాశారు. ఊళ్ళో ఉన్నవాళ్ళు తరుచు చూడటానికి వచ్చేవారు. వారందరితో ముచ్చటించాలని ఉన్నా ముక్కులో గొట్టాలు ఉండటం వలన మాట్లాడలేకపోయేవారు. తాము పడుతున్న బాధని నోటితో వ్యక్తం చేయలేక చిన్న చిన్న మాటల్లో నోట్ బుక్స్‌లో రాసేవారు. అంతబాధలోనూ ఆయన మాటల్లో చురకలూ, చెణుకులూ చెక్కుచెదరలేదు. ]*



R. Viswanatha Sastry

15.12.15, Maharanipeta,
Visakhapatnam,
Dt. 13.04.1993.

Dear Rajeswara Rao,

I was shocked to learn you have been ill. I am now relieved to know that you now I improving. I hope and wish that you would soon be your joyous and healthy self again. I have a strong desire to come and see you myself. But my doctors here have strictly advised me not to stir out and not even to go to court. I am managing somehow with my juniors. My kidneys have proved disloyal to me and that is the whole trouble.

I wish that there should be God or Gods above us so that I can pray him or them for you to get well sooner than later. We all cannot afford to see you ailing, and in bed. I am sure you will be very soon your old and young jolly and joking self again, going out of your way to help all and sundry and especially your friends.

I have completed the novel which I promised to dedicate to Hanurao's daughter. Those who have read it, say it is good. if you are in a mood to read it I will send you xerox copies of the same. Apart from Hanurao's daughter, I am dedicating the novel to my wife Ramam also who left me suddenly and in great frustration which event has left me in greater sorrow and troubles than I would like to admit. I am so longing to see you and share my joys and sorrows with you.

You are a true friend. You are a noble soul. There is none like you. With best wishes for your speedy recovery.

Affectionately yours,
(R.V. Sastry)



[వరద రాజేశ్వరరావుగారి ఆఖరి చెల్లెలు తిమ్మరాజు ఛాయాజానకి అమెరికానుంచి]



My dearest Annayya,

We are all praying for your quick recovery. If there is anything I could send from here let me know. I'll be seeing you in a few weeks.

With all my love

...to get out of that hospital!

Chaya

4/16/93



9.19.3 CBM Compound
Visakhapatnam.

17.4.93.

ప్రియమైన వరద రాజేశ్వరరావుగారికి,
నమస్తే!

మీ ఆరోగ్యం కబుర్లు హనూరావుగారి ద్వారాను, గోపాలకృష్ణగారి వుత్తరం ద్వారానూ తెలుస్తూనే వున్నాయి. మీరు త్వరగా కోలుకుని మళ్లీ మీ నవ్వులు చిందిస్తారని ఆశిస్తున్నాం. మీ ఆరోగ్యం పూర్తిగా బాగుంటుంది. అధైర్యపడకండి. మళ్లీ మనమందరం మన విశాఖలో త్వరలో కలుద్దాం. నవ్వుల ఆనందపు పార్టీలు చేసుకుందాం. శాస్త్రిగారు నవల పూర్తి చేసి చాలా ఆనందంగా వున్నారు. మీ అనారోగ్యం కబురుతో ఆయన ఆందోళన పడ్డారు. రోజూ వెళ్లి ఆయన చుట్టూ చేరి మీ కబుర్లు, నవల కబుర్లు ఆడుకుంటున్నాం. ఛాయాదేవిగారిని ధైర్యంగా వుండమనండి. మీరు త్వరలోనే అనారోగ్యం నుంచి రిలీజు అవుతారనీ, సంపూర్ణ ఆరోగ్యంతో మళ్లీ మా వరద రాజేశ్వరరావుగారిగా జోకులు పేలుస్తారనీ ఆశిస్తున్నాం. ఆ రోజు కోసం ఎదురు చూస్తూ-వుంటాను.

మీ
అత్తలూరి నరసింహారావు



[ఆసుపత్రిలో మంచం మీద ఉండగా మాట్లాడలేని స్థితిలో నోట్ బుక్ లో వరద రాజేశ్వరరావుగారు రాసిన లఘు వ్యాఖ్యలు:]

[న్యూస్ పేపర్ చదివాక]

['వెంటిలేటర్' తీసేశాక.]

[ఒక డాక్టరుగారిని 'ప్యూర్ తెలుగు కాఫీ'-తెప్పించి ఇస్తాను తాగుమని కోరారు]

['ఆక్సిజన్ మనింట్లో పెట్టుకోకూడదా అని అడిగారు]

the
wheel
chair

As normal
man I
can't
go
home
stay on
wheel chair
for a while

[illegible]

[ఆసుపత్రిలో ఒక రోజున రెస్పిరేటరీ ఇన్టెన్సివ్ కేర్ యూనిట్ (RICU) పక్కన ఒక గదిలో ఉన్న ట్రాన్స్‌ఫార్మర్ పేలిపోయి పెద్ద పెద్ద మంటలూ పొగలూ లేచాయి. ఆ తరవాత రెండు రోజులపాటు RICU లో సరియైన విద్యుత్ సరఫరా లేక ఎయిర్ కండిషనర్స్‌గానీ, ఫాన్స్ గానీ పనిచెయ్యలేదు. పైగా వరండా పక్కన మరో 'అంతస్తు', నిర్మాణం జరుగుతోంది. అప్పుడు వరద రాజేశ్వరరావుగారి 'రియాక్షన్స్'.]

VERY
WARM

Revival
to be
arranged

[illegible]

Power

[illegible]

CRISIS

HOW LONG
THIS ORDEAL ?

AC-[illegible]

VERY
WARM

[illegible]

HOW LONG

*[1993, మే 3వ తేదీన అబ్బూరి వరదరాజేశ్వరరావుగారు ఆఖరి శ్వాస తీసుకున్నారు.]*



[అబ్బూరి వరద రాజేశ్వరరావుగారికి శ్రద్ధాంజలి ఘటిస్తున్న
ముఖ్యమంత్రి శ్రీ కోట్ల విజయభాస్కర రెడ్డి గారు, శ్రీ పి.వి. రాజేశ్వరరావుగారు,
శ్రీ పి. జనార్ధనరెడ్డి గారు, మొదలైన వారు]

## సాహితీమూర్తి అబ్బూరి కన్నుమూత

[మాడభూషి శ్రీధర్]

మహానగర్ ప్రత్యేక ప్రతినిధి

హైదరాబాద్, మే 3ః శ్రీ అబ్బూరి వరద రాజేశ్వరరావు మరణించారు. ఈ రోజు ఉదయం నిజామ్స్ వైద్య విజ్ఞాన సంస్థలో ఒక ప్రముఖ సాహితీమూర్తి కన్ను మూశారు. నిరంతరం సాహిత్యాన్ని, ప్రజాహితాన్ని ఉచ్ఛ్వాస నిశ్వాసాలుగా జీవించిన అబ్బూరి కృత్రిమ శ్వాస పరికరాల సాయంతో నిమ్స్‌లో కొద్ది రోజులుగా శ్వాసకోసం పోరాడుతున్నారు.

శ్వాసకు సంబంధించిన ఇంటెన్సివ్ కేర్ యూనిట్‌లో కోలుకుంటున్నారని అందరూ అనుకుంటున్న తరుణంలో అబ్బూరి మరణించడం దిగ్భ్రాంతి కలిగించింది. స్వేచ్ఛా జీవి, సంభాషణా చతురుడు అయిన అబ్బూరి ఆసుపత్రిలో కృత్రిమ శ్వాసయంత్రాల వైర్లతో, ఆక్సిజన్ గొట్టాంతో, ఇంట్రావీనస్ సూదులతో, మానిటర్లు, ప్లాస్టర్ల మధ్య బంధించిన యోధుడులా కన్పించారు. స్వతంత్ర వ్యక్తిత్వమే ఊపిరిగా బతికిన అబ్బూరి ఊపిరి కోసం యంత్రాలమీద ఆధారపడడాన్ని కూడా సహించలేదు. ఎన్నోసార్లు వాటిని లాగేసుకుంటే ఆయనకు నచ్చజెప్పడం ఎవరి తరమూ కాలేదు. ఈ యంత్రాలవల్ల, బలహీనతవల్ల ఆయనకు హాయిగా మాట్లాడుకునే

అవకాశమే లేకపోయినా మాట్లాడినంత సూటిగా, ఘాటుగానే వాక్యాలురాసేవారు. గొట్టం ద్వారా ద్రవ పదార్థాలనే స్వీకరించిన అబ్బూరి వణికే చేతులతో చిన్న కాగితాల మీద చేసిన అనుపత్రి సంతకాలు ఆయన చతురతకు చివరి సాక్ష్యాలుగా ఆయన భార్య అబ్బూరి ఛాయాదేవి వద్ద భద్రంగా ఉన్నాయి. ................

"మానాన్నగారు అబ్బూరి రామకృష్ణారావు వలె నేను సాహిత్యాన్ని సీరియస్‌గా తీసుకున్నాను. అంతేగాని సీరియస్‌గా పనిచేయలేదు. నేనూ అంతే" అని ఒక ఇంటర్వ్యూలో శ్రీ అబ్బూరి వరద రాజేశ్వరరావు చెప్పుకున్నారు. "నేను సాహిత్యాన్ని సీరియస్‌గా తీసుకున్నాను గనుకనే కొద్దిగా రాశాను. రాజకీయాలకు దూరంగా ఉంటాను. నాది నవ్య మానవతావాదం. ఎం.ఎన్.రాయ్ గారి ప్రత్యక్ష అంతేవాసిని. నా జీవితంలో నాకదో గర్వకారణమైన అనుభూతి" అని శ్రీ వరద రాజేశ్వరరావు స్వయంగా చెప్పారు...........

## ముఖ్యమంత్రి నివాళి

హైదరాబాద్, మే 3ః ఆంధ్రప్రదేశ్ అధికార భాషా సంఘం అధ్యక్షుడు, ప్రముఖ సాహితీ వేత్త, జర్నలిస్టు శ్రీ అబ్బూరి వరద రాజేశ్వరరావు ఈ రోజు ఉదయం నిమ్స్‌లో మరణించడం ముఖ్యమంత్రి, ఆయన మిత్రుడు శ్రీ కోట్ల విజయభాస్కరరెడ్డి తీవ్ర సంతాపాన్ని, దిగ్భ్రాంతిని వ్యక్తం చేశారు.

సంతాప సందేశంలో శ్రీ కోట్ల అబ్బూరితో తన చిరకాల స్నేహాన్ని ప్రస్తావిస్తూ తెలుగు సాహిత్యానికి, నాటకానికి, పుస్తకప్రపంచానికి, పాత్రికేయ రంగానికి అబ్బూరి సేవలు మరువ జాలనని అన్నారు.



'వరద' చిత్రపటానికి పూలమాల వేసి
[శ్రద్ధాంజలి ఘటిస్తున్న ముఖ్యమంత్రి శ్రీ కోట్ల విజయభాస్కరరెడ్డిగారు]

అబ్బూరి నిలకడైన మేధావి. ఆలోచనల్లో అసమానమైన ఔన్నత్యం కలిగినవ్యక్తి. అబ్బూరి సమయస్ఫూర్తి, హాస్య వ్యంగ్య ధోరణి నన్నెప్పుడూ ఆకర్షించేవి అని శ్రీ కోట్ల విజయభాస్కరరెడ్డి పేర్కొన్నారు. అంతటి మంచి స్నేహితుడిని కోల్పోవడం నాకు వ్యక్తిగతంగా తీరని నష్టం అని ఆయన అన్నారు.

ముఖ్యమంత్రి శ్రీ కోట్ల ఈ వార్త తెలియగానే బాగ్‌లింగంపల్లిలోని శ్రీ అబ్బూరి ఇంటికి వెళ్లి ఆయన మృతదేహంపై పుష్పగుచ్ఛాన్ని ఉంచి నివాళులర్పించారు. ఆయన భార్య శ్రీమతి ఛాయాదేవిని ఇతర కుటుంబ సభ్యులను ఓదార్చారు.

శ్రీ అబ్బూరి వరద రాజేశ్వరరావు భౌతిక కాయానికి అధికార లాంఛనాలతో అంత్యక్రియలు జరుగుతాయని ప్రభుత్వ ప్రతినిధి ఒకరు చెప్పారు.

('మహానగర్', సోమవారం, 3.5.1993)



[అబ్బూరి వరద రాజేశ్వరరావుగారి సంస్మరణార్థం వేద పఠనం చేస్తున్న సందర్భంలో– బాగ్‌లింగంపల్లిలోని స్వగృహంలో]



[అబ్బూరి వరద రాజేశ్వరరావుగారి అస్థికల విమజ్జనం చేస్తున్న అబ్బూరి గోపాలకృష్ణ, అత్తలూరి నరసింహరావు, హరి, మొదలైనవారు-విశాఖపట్నం సముద్రంలో]

## ఆధునికులలో అతినవ్యుడు వరద

### గోపాల చక్రవర్తి

నిమ్స్ ఆసుపత్రిలో మృత్యువుతో ఇంచుమించు ఒక నెల రోజులు హోరాహోరి పోరాడి ఆఖరి నిమిషంలో ఎందుకో వరద పోరాటం చాలించాడు. లేకపోతే ఆయన ఇంత త్వరగా నిష్క్రమించడం ఏమిటి? ఇంకా సాయంకాలాలు, ఉదయం కృష్ణారావుగారితో ఆయన వాహ్యాళి వెళ్తున్నట్లుగానే వుంది. రోజుకు నాలుగు సార్లు ఫోను చేసి పిచ్చాపాటి మాట్లాడుతున్నట్లుగానే వుంది.

"అచట పుట్టిన చిగురు కొమ్మైన చేవ" అన్నట్లు అబ్బూరి వారింట్లో అంతా కళారాధకులే. సాహిత్యంలో, చమత్కార సంభాషణలో అబ్బూరి రామకృష్ణారావుగారి తనయుడనిపించుకున్నాడు వరద. ఆయన పాత తరానికీ నేటి తరానికీ సేతువు వంటి వాడు. టి.ఎస్.ఇలియట్ వలె వరద గొప్ప క్లాసిసిస్టు. మళ్లీ ఆధునికులలో ఆధునికుడు.

......ఆయన బహుముఖ ప్రజ్ఞాశాలి. రాష్ట్ర ప్రభుత్వం ఆయనను అధికారభాషా సంఘం అధ్యక్షుడిగా ఇటీవలనే నియమించింది. కాని విధి మరోలా తలిచింది.

వరద చేయకుండా వదిలేసిన పనులు చాలా ఉన్నాయి. అందులో ఒకటి "స్వీయ కథ" రాయడం. ఇది నిజంగా ఒక ఆధునిక క్లాసిక్ అయేది. కొన్ని రాష్ట్రాల ముఖ్యమంత్రులతోనూ, కొందరు కేంద్ర మంత్రులతోనూ ఆయనకు సన్నిహిత పరిచయం వుండేది. ఈనేపథ్యంలో ఢిల్లీ రాజకీయాల గురించి ఆయన ఒక గ్రంథం రాస్తే ఎంతో సమాచారం మనకు లభించేది.

ఇటీవలి కాలంలో అంత చమత్కార ప్రియుణ్ణి మరొకరిని చూడలేదు. మనం ఏ పదం ఉచ్చరిస్తే దాని మీద 'పన్' చేయగల సామర్థ్యం ఆయనకుండేది.

అంత త్వరగా వరదమనల్ని వదలి వెళ్లిపోతారని ఎప్పుడూ అనుకోలేదు. వరద మేడిసన్‌లో వున్నా బాగ్‌లింగంపల్లిలో ఉన్నా ఆయన బాణీ వొక్కటే. ఇప్పుడు స్వర్గవాసులు ఆయన హాస్యానికి తల్లక్రిందులవుతూ వుంటారు.

వరద వరదే. అటువంటి సాహిత్యవేత్తను ఇంకొకర్ని నేను చూడలేదు. ఆయనకిదే శ్రద్ధాంజలి.

('ఆంధ్రప్రభ, మే 4, 1993.)

## సాహిత్యోప జీవి

*దిక్కులేని జనులకు*
*తెలుపు కనని కనులకు*
*పురాతనం మంచిది*
*పురోగమన మెందుకు?*

*బలంలేని జనతకు*
*ఫలం చెడిన చరితకు*
*మరోయుగం దేనికి*
*మంచికాని దానికి*

*పసిడికలల బొమ్మకు*
*భావికాలమ్మకు*
*మందిమేలు కోరక*
*ముందు చూపు చూడక!*

దాదాపు నలభై ఏళ్ళ కిందట అబ్బూరి వరద రాజేశ్వరరావు ఇలా కవిత్వం రాసినప్పటి రోజులతో పోలిస్తే ప్రస్తుతం తెలుగు కవితా రీతికి పోల్చుకోలేనంత తేడా కనిపించొచ్చు. అబ్బూరి వరద రాజేశ్వరరావుతో పాటు కలం పట్టిన అనేక మంది కలాల్లో సిరా ఏనాడో ఇంకి పోయి ఉండొచ్చు. వారి చిరునామా కనుక్కోవడం విశ్వవిద్యాలయాలలో ఏటేటా కుప్పతెప్పలుగా ఉత్పత్తి చేస్తున్న పరిశోధకులకు తప్ప అన్యులకు సాధ్యం కాకపోవచ్చు. మరికొంతమంది వారే ఊహించలేని కవితా శిఖరాలు అధిరోహించి ఉండొచ్చు. ఈ రెండు జాబితాల్లో వరద రాజేశ్వరరావు కనిపించకపోవచ్చు.

మరణించే నాటికి అబ్బూరికి 70 ఏళ్లు కాని ఆయన కలానికి షష్టిపూర్తి అయింది. పదో ఏట 'తపోభంగం' ఏకాంకిక నాటిక ప్రచురించారాయన. ఈ అరవై ఏళ్ళ కాలంలో తెలుగు సాహిత్య రంగంలో వచ్చిన ప్రతి మార్పుకు చేర్పుకు ఆయన ప్రత్యక్ష సాక్షికాదు, ప్రతి క్షణంలోనూ పాత్రధారి. ఈ అరవై ఏళ్ళ కాలంలోనూ పుట్టిన గిట్టిన సాహిత్య ప్రక్రియలు, సాహిత్య జీవులు

'వరద'ను కాదని జరిగిన సంఘటనలు కావు. ఆయనే చెప్పుకున్నట్లు ఆయన జీవితమంతా సాహిత్య లోకంలోనే గడిచింది. అయితే రాయడం కోసమే రాయకపోవడం వల్ల ఆయన రచనల రాశి పెరగలేదు. ఆయన జీవిత కాలంలో సాహిత్య రంగంలోనే కాక, సామాజికంగా వచ్చిన మార్పులకు కూడా ఆయన దూరంగా ఉండలేదు. ఎప్పటి కప్పుడు ప్రతిస్పందిస్తూనే ఉన్నారు.

అబ్బూరి రామకృష్ణారావుగారి వ్యక్తిత్వం కూడా వరద రాజేశ్వరరావు మీద గాఢమైన ప్రభావం చూపింది.

రామకృష్ణారావుతోపాటు కలిసి 'నటాలి' తరపున నాటకాలు ప్రదర్శించడం దగ్గర్నుంచి నిత్యం సాహిత్య జీవుల్తో కలగలసిపోయి తిరిగే అవకాశం వరద రాజేశ్వరరావుకు కలగడంవల్ల ఆయన బతికున్నన్నాళ్ళూ అదే సాహితీ స్రవంతిలోనే గడిపారు. పైగా తెలుగు సాహిత్యం ఆధునిక రీతుల్ని లొంగదీస్తున్న సమయంలో ఉన్నందువల్ల వరద రాజేశ్వరరావు ప్రయోగాలు చేయడానికి కూడా వీలైంది. 1953 డిసెంబర్‌లో హైదరాబాద్‌లో తెలంగాణా రచయితల సంఘం ప్రథమ వార్షికోత్సవ సభలకు శ్రీ శ్రీ, ఆరుద్ర ప్రత్యేక ఆహ్వానితులుగా వచ్చి వరద ఇంట్లోనే మకాం పెట్టారు. ఆ రెండు రోజుల్లో శ్రీ శ్రీ, ఆరుద్రలతో కలిసి అబ్బూరి 'మే మే' రాశారు. ముగ్గురు రచయితలు కలిసి సంయుక్తంగా రాయడం అప్పటికదే మొదటిది కావచ్చు. ఆ తర్వాత ఒకరికన్నా ఎక్కువమంది, మరీ ఇటీవలి కాలంలో అయిదుగురు కలిసి రాసిన కవితలు వచ్చాయి.

తెలుగుసాహిత్యానికి ముగ్గురేసి కవులకు కలిసి ఏదోవిచిత్రమైన లంకె ఉన్నట్లుంది. ప్రాచీన సాహిత్యంలో కవిత్రయం ఉంది. ఆ తర్వాత శ్రీ శ్రీ లెక్క ప్రకారం తిక్కన, వేమన, గురజాడ- ఈ ముగ్గురే ఎన్నదగిన కవులు. దీన్ని ఆరుద్ర కొంత సవరించి వేమన, గురజాడ, శ్రీ శ్రీ మాత్రమే మెచ్చదగ్గ కవులన్నారు. కాని ఆరుద్ర ఆ తర్వాత మనసు మార్చుకుని శ్రీ శ్రీ మరణం తర్వాత ఈ జాబితాలోంచి శ్రీ శ్రీని తొలగించి నారాయణబాబు పేరు చేర్చారు. ఈ కవిత్రయాల దృష్టితో చూస్తే తొలిసంయుక్త కవిత 'మేమే' లో వరద ఉండడం ప్రత్యేకంగా గమనించదగ్గ విషయం. అంతకన్న ముందు (1943) ఏల్చూరి, కుందుర్తి, బెల్లంకొండ రామదాసు కలిసి 'నయాగరా' వేయకపోలేదు. కాని అది సంయుక్త కవిత కాదు.

ఇలా అన్ని సాహితీ స్రవంతులతోనూ వరద రాజేశ్వరరావుకు సన్నిహిత సంబంధం ఉండడం వల్లే ఆయన జ్ఞాపకాల పుట్ట 'కవన కుతూహలం' ద్వారా తెలుగు సాహితీ చరిత్రకు కేవలం తారీఖులు దస్తావేజుల తబిసీళ్ళు కాక వ్యక్తులు, వారి అనుబంధాల సముచ్చయాన్ని అందించగలిగారు.

అబ్బూరి రామకృష్ణారావు కుమారుడు అయినందువల్ల, విపరీతమైన సాహిత్యాభిలాష, అభినివేశం కల వారైనందువల్ల, ఆయన జీవిత భాగస్వామి కూడా సాహిత్యోప జీవి అయినందువల్ల ఆయన బతుకంతా సాహితీ రంగంలోనే కలిసింది.

సాహితీ రంగాన్ని అంటిపెట్టుకున్న వాళ్ళందరికీ తప్పని తిప్పలు వరద రాజేశ్వరరావును కూడా వదలలేదు. రాను రాను ఆయనలో సినిసిజం ఛాయలు పెరిగాయి. దీనితో లోకం తననుదాటి పోలేదన్న అహం పెరిగింది. ఆయనను దగ్గరగా ఎరిగినమిత్రులు ఈ లక్షణాలు బాగా గమనించగలిగారు. 'మేమే' రాసింది 'నేనే' అనే దాకానూ, కవులంటేముందు రామకృష్ణారావు, ఆ తర్వాత తనూ అనే దాకా వెళ్ళింది ఈ అహం. ఇలాంటివాటిని వదిలేస్తే వరద ఆద్యంతం సాహితీ వరదలో జీవించిన సాహిత్యోపజీవి.

(సంపాదకీయం, 'ఆంధ్రభూమి', ఆదివారం, మే 9, 1993)

## రాజకీయ, సాహిత్య రంగాల్లో కలగలసిన 'వరద'

సుల్తాన్ బజార్, మే. 14 (న్యూస్‌టుడే):

ఏ వ్యక్తిలోనైనా ప్రత్యేక లక్షణాలు కలగలిసి ఉంటే వాటిని వెలికి తీసి అవి అందరికీ తెలిసేలా, జాతికి ఉపయోగపడేలా చేయాలనే తపన అబ్బూరి వరద రాజేశ్వరరావులో ఉండేదని డా॥ బూదరాజు రాధాకృష్ణ అన్నారు. శుక్రవారం సాయంత్రం సుల్తాన్ బజార్ లోని శ్రీ కృష్ణదేవరాయాంధ్ర భాషా నిలయంలో అభ్యుదయ రచయితల సంఘం ఆధ్వర్యంలో జరిగిన అబ్బూరి సంస్మరణ సభకు ఆయన అధ్యక్షత వహించారు. ఈ సందర్భంగా ఆయన ప్రసంగిస్తూ వరద రాజేశ్వరరావు తన రచనల్లో వ్యక్తులను ద్వేషించారు కాని సాహిత్యాన్ని ద్వేషించలేదన్నారు. రాజకీయంగా సంబంధం ఉన్న వారికి రాజేశ్వర్‌గా, సాహిత్యపరంగా సంబంధం కలిగి ఉన్న వారితో వరదలా ఆయన కలిసిమెలిసి ఉండేవారన్నారు. వరద బాల్యం నుంచే తన తండ్రితో తిరుగుతూ నాటకరంగంలో ఆసక్తి పెంచుకొన్నారని అన్నారు. రాజేశ్వరరావు తన 14వ ఏటనే ఒక పుస్తకాన్ని రచించిన గొప్పకవి అని ఆయన కొనియాడారు. రాజేశ్వరరావు చేసిన సేవలను ప్రముఖ కవులందరూ కలిసి ఒక పుస్తకంగా రచించి ముందుతరానికి తెలిసేలా కృషి చేయాలన్నారు.

కోదాటి నారాయణరావు మాట్లాడుతూ, రాజేశ్వరరావుతో తనకున్న పరిచయం, తీపి గుర్తులను సభలో తెలుపుతూ స్మరించుకొన్నారు. భాషా నిలయం కార్యదర్శి ఎం.ఎల్. నరసింహారావు మాట్లాడుతూ రాజేశ్వరరావు ఒక మేధావి, స్నేహశీలి, రచయిత అని కొనియాడారు. వరద అభిప్రాయాలను నిర్మొహమాటంగా చెప్పే గొప్ప వ్యక్తి అని అన్నారు. తదనంతరం సభలో పాల్గొన్న ప్రముఖులు వరద రాజేశ్వరరావును కొనియాడుతూ వారి అభిప్రాయాలను, గత జ్ఞాపకాలను సభలో వెల్లడించారు. అంతకు ముందు కోదాటి నారాయణరావు అబ్బూరి చిత్రపటానికి పూలమాలవేసి శ్రద్ధాంజలి ఘటించారు.

('ఈనాడు', శనివారం, 15 మే 1993)

శ్రీమతి ఛాయాదేవి గారికి,

నమస్కారం

శ్రీ వరద రాజేశ్వరరావుగారి మరణం నాకు చాలా దుఃఖం కలిగించింది. ఏదో చిన్న complaint తో hospital లో చేరారను కున్నాను గాని మృత్యువు కబళించనున్న దనుకోలేదు.

అధికార భాషా సంఘం అధ్యక్షుని హోదాలో గుంటూరు వస్తారని, మా ఇంటికి వస్తారని ఆశిస్తున్న సమయంలో యీ ఘోరం జరిగింది.

మేధావి, సాహితీవేత్త, స్నేహశీలి, వరదగారు లేరంటే మా బాధ చెప్పలేనిది. మీ అనుబంధం గొప్పగా మేమందరం తలచుకొనేటంత గాఢమైనది. పరిణతమైన విద్యాబుద్ధులు గల మీరు ఆయన లేని ఒంటరి జీవితాన్ని గడపటం కష్టమైనా ఆత్మస్థైర్యంతో ముందుకు సాగగలరని ఆశిస్తాను.

ఇట్లు

రావెల సోమయ్య నరసింహారావు

Dr. D.N. Rao &
Mrs. D. Visalakshi,

Vizag.
Dt. May 4, 1993.

Dear Chaya Devi garu,
The news of Varada's demise was most shocking. Words cannot express the depth of our feeling of loss. Our most heart- felt condolences to you on the sad bereavement.

Yours sincerely,

•

శ్రీమతి అబ్బూరి ఛాయాదేవి గారికి,

శ్రీ వరదరాజేశ్వరరావు గారి అకాలమృతి నాకు తీవ్ర సంతాపాన్ని కలిగించింది. అధికార భాషా సంఘం అధ్యక్షులుగా ఆయన నియామకం జరిగినప్పుడు నేను రాసిన అభినందన లేఖకు ఫోన్ ద్వారా కృతజ్ఞతలు చెప్పారు.

ఇంతలోనే ఆయన వరమ పదిస్తారని ఎవ్వరూ అనుకోలేదు.

మీకూ, మీ కుటుంబ సభ్యులకు నా హార్దిక సంతాపం తెలియజేస్తున్నాను.

4.5.93

డా॥ సి. నారాయణరెడ్డి.

•

Nanduri Ramamohna Rao

శ్రీమతి ఛాయాదేవి గారికి,

ప్రఖ్యాత సాహితీవేత్త, సహృదయ మిత్రులు శ్రీ అబ్బూరి వరద రాజేశ్వరరావుగారి మరణ వార్త విని దిగ్భ్రాంతి చెందాను. ఈ దుఃఖ సమయంలో మీకు నా గాఢసంతాపం తెలియ జేస్తున్నాను.

•

## G.S. Bhargava

B-101, Gulmohar Park,
New Delhi.
May 7, 1993.

చి॥ ఛాయాదేవిగారికి ఆశీర్వచనములు.

I was shocked to read the sad news in the newspapers. I feel bereaved by the loss of a friend of more than three decades of association and shared interests. So I can imagine your loss. But as an elder person, let me console you and try to share some of your sorrow. The very strength of your love for him should sustain you through this ordeal. May God be with you in the effort.

May his soul rest in peace.

జి. ఎస్. భార్గవ

•

7.5.93,
నరసాపురం.

సోదరి ఛాయాదేవిగార్కి,
అశ్రుపూరిత అభివందనాలు.

శ్రీ రాజేశ్వరరావుగారు మరణించారనే వార్త విని అవాక్కయిపోయాను. పుట్టెడు దుఃఖం పొర్లుకుంటూ వచ్చింది.వెంటనే వచ్చి వాలి పోదామనుకున్నాను. కానీ? టిక్కెట్స్ లేవు. నడిచి అయినా వచ్చేద్దామనే ఆత్రుత. ఉత్తరం రాద్దామంటే మనస్సు ఒప్పడం లేదు. చేతులు రావడం లేదు.

ఏదైనా ఊరు వెడితేనే ఎప్పుడొస్తారా అని ఎదురు చూస్తుంటాం. తిరిగి రాని ప్రయాణం- వెళ్లిపోయారు అదీ చెప్పకుండా! ఇహ ఆబాధ వర్ణనాతీతం. అది అనుభవిస్తున్న వాళ్లకే తెలుస్తుంది.

ఎల్లప్పుడూ జోక్స్ వేస్తూ నవ్వుతూ నవ్విస్తూ మల్లెపువ్వులా ఉండే మన రాజేశ్వరరావుగారు ఇహ మనకు లేరంటే నేను నమ్మలేకుండా ఉన్నాను. హాస్పిటల్ లో చూసిన చూపే ఆఖరి చూపు అవుతుందని ఊహించలేకపోయాను.

చక్కగా జంటపక్షుల్లా ఉండేవారు. ఆ జంటని విడదీసేశాడు. ఎంతో మందికి ఉపయోగపడే వార్ని తీసుకెళ్లే బదులు నాలాంటి సత్తురూపాయిని తీసుకెళ్లకూడదూ? వాడికి మంచి వాళ్లే కావాలి.

ఇన్నాళ్లకి, ఇన్నేళ్లకి ఆయన్ని గుర్తించి మంచి పదవి ఇచ్చారు. ఆ పదవికి పదును పెట్టకుండానే ఆయన్ని తీసుకెళ్లిపోయాడా భగవంతుడు. ఆ పదవి ఆయన్ని ప్రభుత్వ లాంఛనాలతో తీసుకెళ్ళడానికే ఉపయోగపడిందా అనే బాధ కలుగుతోంది.

మాహారికి మంచిమిత్రులు. మా పిల్లలికి మంచి సలహాలిస్తూ మంచిబాటలో నడిపిస్తూ పెద్ద దిక్కులా మా కుటుంబం పట్ల మీ ఇరువురూ చూపించిన ఆదరాభిమానాలకు మీమెంతో ఋణపడి ఉన్నాం.

పిల్లలు లేరనే లోటు లేకుండా అందరి పిల్లల్ని మీ పిల్లల్లాగే చూసుకున్నారు. ఢిల్లీలోనూ, హైదరాబాదులోనూ మా పిల్లలున్నా మీరున్నారనే ధైర్యంతో ఉన్నాను. ఇప్పటికీ ఎప్పటికీ వాళ్లు మీ పిల్లలే. వారులేని లోటు ఎవరూ తీర్చలేరు. పిల్లలు మీపట్ల ఇదివరకటికంటే ఇప్పుడు మరింత బాధ్యతగా ఉంటారు. ఉండాలి. తప్పదు.

భగవంతుడు వేసిన శిక్ష అనుభవించక తప్పదు. జరిగినవి నెమరువేసుకుంటూ జరగబోయేవి ఊహించుకుంటూ సమస్యల్ని ధైర్యంగా ఎదుర్కొంటూ, వారు మనప్రక్కనే ఉన్నారని ఊహించుకుంటూ కాలక్షేపం చెయ్యడం కంటె మనం చేసే దేమీ లేదు.

మీరు చదువుకున్నవారు. కవయిత్రులు. ఎన్నో చూసిన వారు. నేను మీకు చెప్పే అంతటి దాన్నికాదు గాని నామనస్సుండబట్టలేక ఈ నాలుగు ముక్కలు రాయలేక, గుండె బరువుని, దుఃఖాన్ని నాలో నేను అణచుకుంటూ రాస్తున్నాను.

ధైర్యంగా ఉండండి. మీ ఆరోగ్యం జాగ్రత్తగా చూసుకోండి. ఆయన బాధ్యతలు మీమీదపెట్టి వెళ్ళారు. సమాజానికి మీ సేవ ఎన్నో విధాలా అవసరం. ఆ తృప్తితోటి జీవితాన్ని సాగించాలి.

ఇద్దరూ ఒకసారి పుట్టామా? ఒకసారి పోవడానికి అంటారు పెద్దవాళ్లు. అవన్నీ ఊరడింపుమాటలు. కష్టసుఖాల్లోపాలు పంచుకుంటూ కలిసి కాపురం చేసినవారు అంతతేలిగ్గా తీసుకోగలమా? మరణం సహజమని తెలిసినా సరిపెట్టుకోలేం. మానవ మాత్రులం. అయినా తప్పదు. గుండె దిటవు చేసుకోండి.

ఆయన ఆత్మకు శాంతిని, మీకు సానుభూతిని తెలియజేస్తూ,

ఇహ ఉంటాను.

ఇట్లు

P, కాళికాంబ

[పరకాల కాళికాంబ].

నేరెళ్ళ వేణుమాధవ్, వాసవీకాలనీ

అస్మద్ శ్రేయోభిలాషులు వరంగల్-12.

శ్రీమతి అబ్బూరి ఛాయాదేవిగారికి 8-5-93.

మీ వేణుమాధవ్ నమస్కారములు.

మీ వారి మరణవార్త, వార్తా పత్రికలలో చదవగానే నా మనస్సు కకావికలై పోయింది. ఇలా జరుగుతుందని కలలో కూడా ఊహించలేదు. ఘోరం జరిగిపోయింది. రోజూ బయల్దేరు దామని అనుకోవడం ఎండ తీవ్రత వల్ల బయల్దేరలేకపోవడం జరుగుతుండడం వల్ల ఉత్తరం వ్రాస్తున్నాను. మీరు ధైర్యంగా వుండాలి...

అస్మద్ శ్రేయోభిలాషులు, మీ వారికి ఆత్మశాంతి కలగాలని కోరుకుంటున్న

మీ

నేరెళ్ళ వేణుమాధవ్

M-35 Greater Kailash-I,
New Delhi-110048.
May 8, 1993.

Dear Mrs. Rau,

It is with deep shock that we came to know of the passing away of my very dear friend. My wife and I wish we could be with you at this time.

please do accept our heatfelt condolences.

Although Rajeswar and I didn't meet each other since my visit to your place a few years back, we have always remembered you and thought of you.

With regards from both of us,

[PS]

It's only this morning that I came to know (from a friend) of the sad news- I missed the news item in the papers.

yours sincerely

R.M. Pal.

•

S.M.Y. Sastry M.A.B.L.

Retd. Deputy Municiapal Commissioner. 10.5.93

అబ్బూరి ఛాయాదేవి గారికి,

ఒక రోజా సాయంకాలం, రేపు వరదకి ఉత్తరం వ్రాయాలి, ఈ నెలాఖరిలోగా హైదరాబాదు రానున్నాననీ, కొన్ని విషయాలు మాట్లాడాలనీ పేర్కొంటూ, అనుకున్నాను. ఆ మరునాడు ఉదయమే వరద రాజేశ్వరరావు పోయాడన్న వార్త రేడియోలో విని నిర్ఘాంత పోయాను.

ఆసుపత్రిలో మరణం సంభవించిందని తరవాత Times లో చదివాను.........

1933లో కాబోలు అతనిని మొదట చూసినది. నాకు కావలసిన వాళ్లు. నాకంటె చిన్నగానే పోయారంటె మరీ బాధపుడుతోంది. నాకు కలిగిన ఖేదం. మీకు కలిగిన వియోగానికి సానుభూతి తెలియజెప్పుకోడానికి, తిన్నని మాటలు స్ఫురించడం లేదు.

భవదీయుడు,

యజ్ఞన్నశాస్త్రి.

•

G.V.G Krishnamurty

Res: 9B Dr. Zakir Hussain Marg,
New Delhi-110003
10th, May 1993.

Dear Smt. Chaya Devi Garu,

The sudden news of demise of my valued friend Shri Abburi Rajeswara Rau, whom I always treated as my elder brother shocked me so much that I could not do a thing except sending a phonogram expressing condolences to you on behalf of myself and my family. I enjoyed his guidance and affection for nearly three decades. I always admired his razor-sharp mind, his intellectual excellence and magnificiet sense of humour even in times of extreme difficulties. As a poet, writer and thinker he earned a valued place not only among his contemporaries but admiration as well of younger generations.

I can never forget in mylife, the appreciation, encouragment and support I received from both of you in my most trying years. When I was getting the news on telephone and from others that he was steadily improving, myself, Padma and Babu felt relieved. But we never imagined God to snatch him away from us so soon. I spoke to my wife Padma, who is still in Chirala, on phone and she was also stunned and shocked by the news.

What Can I write to you expect expressing our deep condolances to you in your terrible time of distress.

Only thing we could do is to pray God that his noble soul may rest in peace.

Most Sincerely Yours

G.V.G. Krishnamurty

*

కాళీపట్నం రామారావు
గజపతినగరం
తే. 12.5.93.

శ్రీమతి ఛాయాదేవి గారికి-

నమస్తే,

అమ్మా! జరిగిన దానిని, మాబోటి వారిమే తట్టుకోలేక పోతున్నాము. మిమ్మల్ని ఎలా ఊరడించగలం? అయినా తప్పదు. మనసు దిటవు పరచుకొని వారు దిగవిడచిన పనులుంటే పూర్తి చేస్తూ, రచనలో బాధను మరిచి పోయే ప్రయత్నం చేయండి. అది సాధ్యమా? సాధ్యమని రాచకొండ విశ్వనాథశాస్త్రిగారు చేసి చూపేరు. రామంగారి కాల ధర్మం, రావిశాస్త్రి గారిని ఎంతగా కుదిపిందో దగ్గరున్న వాళ్లకే తెలుసు. వలభై యేళ్లగా సన్నిహిత వరిచయంలో ఆయన కంటతడి చూసి ఎరగను. రామంగారి మృతికి ఓ రోజల్లా ఆయన కన్నీళ్లు కార్చగా చూసేను. ఆ తర్వాత-

ఆ తర్వాత యీ దుఃఖానికి తోడు యింకెన్నో ఒత్తిళ్లలో ఉన్న శాస్త్రిగారు అంతవరకూ రాస్తూ వచ్చిన నవలలో (ఆరు నెల్లుగా) మిగిలిన సగం నిండా నెల కాకండా రాసి ముగించేరు. మొత్తం నవల మూడు వందల పేజీలు పైన.

ఉంటాను.

కా. రామారావు.

P.S. నిన్ననే వారిని కలిసేను. వెళ్లగానే వరద పోయేడు అన్నారు. ఆయన ఆరోగ్యం ఏమీ బాగులేదు. బయటకు రావడం లేదు. కారా.

•

15.5.93.

సోదరీ, వరదకు ఛాయవలె ఇంతకాలం సాగించిన నీబతుకులో ఇవాళ ఛాయ మాత్రమే మిగిలింది. వరద ఆస్పత్రిలో చేరిన రోజున నేను ఉస్మానియాలో గుండెజబ్బుతోనే ఉన్నాను. మా అమ్మాయి వై. లలిత ఏప్రిల్ 29న వరద ఆ క్రితం రోజే నిమ్స్‌లో చేరినట్లు చెప్పింది. నేను ఏప్రిల్ 16న ఆస్పత్రిలో చేరి 27న డిస్చార్జి అయినాను. వరద కొత్త ఉద్యోగవార్త నన్ను ఎంత ఆనందపరచిందో, మే 3వ తేదీ రాత్రి టి.వి.లో మరణవార్త అంత దిగ్భ్రాంతి కలిగించింది. యస్. కృష్ణారావుగారికి వెంటనే ఒక కార్డు రాశాను. నా ఆరోగ్యం సరిగా లేక ఆస్పత్రికి కాని మీ ఇంటికి కాని రాలేకపోయాను. నీకు నా ప్రగాఢ సంతాపం తెలియచేస్తున్నాను. అంతకన్న ఏం చేయకలం ఎవరైనా.

ఎ.యల్. నరసింహారావు.

•

M.Ram Reddy, M.A. B.C.J.
F.L. Journalist.

Post: UTOORU,
Karimnagar,

Dt. 15.5.93.

శ్రీమతి ఛాయాదేవిగారికి నమస్కారములు.

మీరు దయతో పంపిన శ్రీ రాజేశ్వరరావుగారి ఛాయా పటం అందింది. 37 వసంతాల దీర్ఘ కాలానంతరం నా మిత్రున్ని నా బంధువును కలుసుకున్నంత ఆనందం కలిగింది. "గోలకొండ" పత్రికలో పని చేస్తున్నపుడు మీ ఇంటికి మిత్రులతో రావడం జరిగింది. నాటినా స్నేహశీలి, ఆత్మీయుడు, సహృదయుడు ఇక లేడన్న పరితాపం నన్ను పదిరోజుల నుండి వెన్నాడుతూనే ఉంది. ఒక్కొక్కరుగా మా కాలంవారంతా కన్ను మూస్తున్నారు. రసిక జనంలేని ఈ సమాజంలో నేనెందుకుండాలి? రావుగారి కంటె నేను రెండేళ్ళు చిన్నవాన్ని. 27 సంవత్సరాల నుండి మోడుబారిన వృక్షంలా నిరర్థకంగా, పేలవంగా నన్నాదేవుడెందుకు బ్రతికించాలి? అన్నీ సవ్యంగా ఉన్న వారి జీవిత గమ్యాలు " వెలుగు లేని వైరాగ్య" జీవితాలైనపుడు, నా బ్రతుకునకొక

అభిలషణీయమగు "దివ్య పదార్థం" ఉంటుందా? రావుగారి జీవితమే స్వప్నాల తూలిన బ్రతుకైనపుడు, నా జీవిత ధ్యేయం గాలి మేడల పేకమేడ గాక మరొక ఎలాకాగలదు.......

•

Dr. A. Jaya Prabha
A-43,
Moulali Railway Colony,
Hyderabad.

Hyderabad,
19.5.'93.

అబ్బూరి ఛాయాదేవిగారికి,

రైల్లో విశాఖ వెళుతూ, పేపరులో వరదరాజేశ్వరరావుగారింక లేరన్న వార్త చదివాను. కవన కుతూహలమైన ఆయన కబుర్లు గుర్తొచ్చాయి నాకు. నవ్వుతూ, నవ్విస్తూ మల్లెపువ్వులాంటి నలగని బట్టలతో కూర్చునే, సాదరంగా వరదరాజేశ్వరరావుగారి రూపం ఒక్కసారి నా కళ్లముందు స్ఫురించింది. బాధగా నేనూ, సూర్యనారాయణా ఆ జ్ఞాపకాలన్నీ పంచుకున్నాము. ఆయన ఎడబాటుని తట్టుకోగల శక్తి మీకుండాలని కోరుకుంటూ,

ఆత్మీయంగా
జయప్రభ

•

20.5.93
వరంగల్లు.

శ్రీమతి అబ్బూరి ఛాయాదేవిగారికి,

నమస్కారం.

వరద రాజేశ్వరరావుగరారి వియోగ దుఃఖంలో వున్న మిమ్మల్నెలా సమాశ్వాసించాలో తెలియటం లేదు. మీరీ పరిస్థితిని ధైర్యంగా ఎదుర్కొని నిలబడాలని మా కోరిక. వరద రాజేశ్వరరావుగారు లేని లోటు మీ ఒక్కరిదే కాదు. మొత్తం సాహిత్య ప్రపంచానిది. మీ దుఃఖంలో పాలు పంచుకొనే సాహితీ బంధుబృందం వుందని గుర్తుంచుకోండి. మీరు ఒంటరికాదు. మేమందరం మీతో ఉన్నాం.

ఉంటానిక,
మీ
కాత్యాయని.

Viswanatha Publications,
31-3-7, Viswanadhapuram

Maruthinagar, Vijayawada-520004. 1-6-93.

పూజ్యులైన వదినగారికి,

నమః.

అన్నగారైన 'వరద' గారితో నా వ్యక్తిగత పరిచయం కొద్దికాలం నుంచే అయినా వారితో సంభాషిస్తున్నంత సేపూ నాపసితనం నుంచీ సన్నిహితంగా ఉన్నట్టుగా ఉండేది. అదే జన్మాంతర సౌహృదం కదా!

ఎప్పుడూ హుషారుగా పలకరించే ఆయన ఇకలేడు అనుకోవడం బాధగానే ఉంది. కాని ఈ మృత్యువు అని వార్యమైన "సనాతన" ధర్మం. ఎవరి "చివరి మాటైనా" యిదే!

త్వరలోనే హైదారాబాద్ వస్తాము.

మీకు చెప్పగల వాణ్ణిగాను. ధైర్యం అవలంబయేత్!

పుత్రసమానుడైన మీ మరిది

విశ్వనాథ పావని శాస్త్రి.

భీమ్లి,
9-6-93.

ఛాయాదేవిగారికి,

వరద పోయినట్టు పేపర్లో చూశాం. మీ అడ్రస్ తెలియక ఇన్ని రోజులుగాను మీకు ఉత్తరం రాయడానికి.

మీకు నా హృదయ పూర్వక సానుభూతి. మిమ్మల్ని హైదరాబాదులో చూసినప్పుడు ఎంతో సంతోషమైంది నాకు. అన్నేళ్ల తరవాత మళ్లీ వరదని కలుసుకోవడం. వరదేకాకుండా మిమ్మల్ని చూడడం ఎంతో బాగుంది.



"KALAPRAPURNA"
Dr. B. Rajanikanta Rao

Vijayawada.
26.6.93

శ్రీమతి అబ్బూరి ఛాయాదేవికి,

నా సోదరుడు, ఆప్తమిత్రుడు, సచ్ఛాత్రుడు, వరద ఇంత త్వరగా కాలపు తరగల "వరద"లో సుడిగా పోతాడనుకోలేదు. వార్తా మాధ్యమాలు 70 ఏళ్ల దాటినట్లు ప్రకటించినా అటువంటి సర్వాదరపాత్రుడయిన మిత్రుడు ప్రయోజకుడు అనుకోకుండా వెళ్లిపోతే అకాల కాలగతే!

మీ వెలితినీ, బెంగనీ పంచుకోడానికి ఆలస్యంగా అయినా, నా తరఫునా మా ఆవిడ సుభద్ర తరఫునా, మీకూ మీ ఆడపడుచులకూ మరుదులకూ కుటుంబాలకూ మా హృదయపూర్వక సహానుభూతి.

•

శ్రీమతి అబ్బూరి ఛాయాదేవి గారికి, 29.6.93

అమ్మా!

వరద రాజేశ్వరరావుగారు ధన్యజీవి. ఆయన తీపి గుర్తులను మననం చేసుకోవడం తప్ప మనం చింతించనవసరం లేదమ్మా!

ఇట్లు
నమస్కారములతో
నాయని.

•

ఆరుద్ర 20.7.1993.

ఆప్తులు ఛాయాదేవిగార్కి నమస్కారాలు. వరద మరణ వార్త పేపర్‌లో చదివాక నా ప్రగాఢ సంతాపాన్ని, హృదయ పూర్వకమైన నా సానుభూతిని మీకు తెలియచేయలేకపోయాను. కారణం మీ చిరునామా నా దగ్గర లేకపోవడమే.

'వరద జ్ఞాపకాల వరదలో....' అనే వ్యాసం ఆంధ్రజ్యోతిలో రాశాను. సమగ్ర ఆంధ్రసాహిత్యం-ఆధునికయుగం మలికూర్పు రాసేటప్పుడు వరద గురించి రాస్తాను.

ఈసారి హైదరాబాదు వచ్చినప్పుడు మీ ఇంటికి వచ్చి స్వయంగా ఇంకోసారి నాసానుభూతి తెలియచేస్తాను.

భవదీయుడు

•

M. Pattabhiram
Deputy Editor

The Hindu
Madras-2,
10.8.93.

Dear Chaya Devi garu,

I never thought I will write to you. When Rajeswara Rau passed away, I heard the news in Delhi which I was vising after 10 years. My son Naga is there and I and my wife went to visit him. The news came as a big shock for only a few days earlier I learnt about his new assignment...Three days later Rajeswar Rau was no more. I was greatly upset and so did members of my family. Please accept our sincere condolences on your bereavement. As Viswanatha Sastri wrote in his article, we have known him for 60 years and we maintained the most cordial relations. It was my luck that I renewed my contacts with him in Delhi and those 15 yrs are unforgettable. I imagine we met almost everyday. Sastri wrote a graphic account.... As a student he never bothered about his studies in the sense that he had no ambition to top the list. He had a contempt for people who laboured hard to achieve small gains. He loved his friends and was deeply loyal to them. I was one of them and I enjoyed his friendship immensely. It is a great pity he passed away so suddenly.

I can't write more and I hope to see you when I come to Hyderabad.
with Best wishes

yours sincerely

Pattabhi.

[ఇంకా సంతాప సందేశాలూ, లేఖలూ పంపినవారిలో – డా॥ ఏల్చూరి విజయరాఘవరావు, శ్రీ గిరిజా కుమార్, శ్రీమతి ఎస్. అష్రఫ్, శ్రీ శ్రీ విరించి, శ్రీ వేమూరి వెంకయ్య, డా॥ బి. మినోఛా, డా॥ ఎ. గజానన్‌రావు, శ్రీ కె. సాబాజీరావు, శ్రీ కె. శ్రీరామమూర్తి, శ్రీమతి పి. విశ్వేశ్వరీ శివరామన్, శ్రీమతి మాలతీరావ్, శ్రీ నరేందర్, శ్రీ ఎం.వి. రావు, డా. ప్రేమా నందకుమార్, శ్రీ సత్తిరాజా వెం.న. సోమయాజులు, శ్రీ ఎన్.ఎస్. సాయిబాబా, శ్రీ సిహెచ్. కామేశ్వరరావు, , శ్రీ రాపోలు సత్యనారాయణ, శ్రీ ప్రేమ్‌చంద్, శ్రీమతి సరోజిని, శ్రీ ఊట్ల కొండయ్య మొదలైన వారూ, జవహర్‌లాల్ నెహ్రూ యూనివర్సిటీ లైబ్రరీ ఉద్యోగులూ ఉన్నారు. ]

*

## అబ్బూర మాతని బహురూపం!

వాకాటి పాండురంగారావు

*"దేహయాత్రయె నేడు సందేహమయ్యె*
*దేశమెల్ల రాజక బహిర్దేశమయ్యె*
*ప్రస్తుతాంధ్ర సారస్వత రంగమందు*
*వంది మాగధులే పేరు పొందగలరు!"*

అంటూ కవితలకు తప్ప అన్యములకు తలవంచని ఏడు పదుల వీరుడు ఏడేడు లోకాలు దాటి వెళ్లిపోయాడు.

1963 లో నేను ఢిల్లీలో మొదట కాపురం పెట్టినప్పుడు, అద్దె కొంప కోసం వెతికి చివరికి కరోల్ బాగ్‌లోని పూసారోడ్డు మీద 15వ నంబరింటి డాబామీద వాటాలోకి దిగాను. దిగగానే ఆ ఇంటి పంజాబీ యజమాని 'ఫస్ట్ ఫ్లోర్‌మే ఏక్ మదరాసీ రావ్ సాబ్ రహ్‌తే హై' అన్నాడు.

ఆ తర్వాత క్రింది వాటాలోకి వెళ్లితే ఎదురయ్యారు జలపాతం వంటి నవ్వుల వరద రాజేశ్వరరావుగారూ, ప్రశాంత గోదావరిలాంటి ఛాయాదేవిగారూ!

ఆ రోజుల్లోనే వాళ్లింట్లో ఒక పెద్ద మ్యూజిక్ సిస్టమ్ ఉండేది. ఆయన వద్ద దేశదేశాల సంగీతాల రికార్డులుండేవి. అందులోని ఈజిప్షియన్, అరేబియన్ వాద్య సంగీతం గుండెను తొలిచి వేసేలా వుండేవి.... ఆయన అలైడ్ పబ్లిషర్స్‌లో ఎడిటరు. వాళ్ల ఇల్లు ఒక సరస్వతీ మహలు. ఆ రాజధాని నగరంలోని ఎపీలు, వివిపిలే కాక ఆంధ్రనుండి వచ్చిన నటులు, ప్రయోక్తలు, కవులతో కళకళలాడుతుండేది.

ఆ తర్వాత, ఇటీవల ఆయన భాగ్యనగరంలో స్థిరపడ్డాక చాలా సార్లు కలిశాను. సాహిత్యరంగంలో దిగజారిన విలువలను చూచి ఆయన ఎంతో ఆవేదనతో మాట్లాడేవాడు. శ్రీ శ్రీ, కుందుర్తి, జరుక్, పురిపండా లాటి హేమాహేమీలతో నేస్తం నెరపిన ఆ అసలు సిసలు కవి "స్వీయకృతి నొక దాని చేధరించి పదవులకయి నానా మంత్రి పదములంట పద్యకర్తలు, సాహితీ వర్తకులును" భ్రష్టుపట్టిస్తున్న సాహిత్యపు విలువల గురించి కన్నీరు కార్చేవాడు అబ్బూరి.

పద్యమంటే ఆయనకు ప్రాణం. "తెలుగు పద్యాన్ని ఒక్కొక్కళ్లు ఒక్కొక్క విధంగా చదువుతారు, పాడతారు. అట్లా వివిధ రీతుల్లో పాడేవారి నందరినీ ఒక వేదిక మీదకు చేర్చాలి. An evening with Telugu poetry అని అల్లాటప్పా సభా మందిరాల్లో కాక దర్జాగా ఒక ఫైవ్ స్టార్ హొటల్లో పెట్టించాలి. వీడియో తీయాలి. ముందు తరాలకోసం దాచాలి. తెలుగు పద్యాన్ని అంబారీ మీద కూర్చోపెట్టి ఊరేగించాలి" అని తహతహలాడేవాడు.

అట్లాగే జువ్వాడి గౌతమరావుగారి 'రామాయణ కల్పవృక్ష' గానాన్ని వీడియో తీయించాడు. హైదరాబాదు రిట్జ్ హొటల్లో, విశాఖలో రావి శాస్త్రి సప్తతి సందర్భంగానూ ఆ గానాన్ని ఏర్పాటు చేయించాడు.

దువ్వూరి రామిరెడ్డి పద్యాలను పాడించడానికి 'న భూతో న భవిష్యతి' అన్న చందాన ఒక సభ ఏర్పాటు చేయాలి అన్న ఆయన కల నిజమయి 1992 లో ఇంచుమించు అంతా సిద్ధమైన దశలో

ఆ సభకు అధ్యక్షత వహించవలసిన శ్రీ లక్షణయతీంద్రులు కన్నుమూయడంతో అది వాయిదా పడింది. ఆ పండుగను గనుక ఏ తెలుగు విశ్వవిద్యాలయంవారో ఏర్పాటు చేస్తే ఆనాటి ఆ ఆకాశమ్మీద అబ్బూరి తప్పకుండా అవతరిస్తాడు, ఆనందిస్తాడు!

కవిత, నాటకం, ఇంగ్లీషు ఎడిటింగ్–ఈ మూడులోకాలను ఔపాసన పట్టిన త్రివిక్రముడు-ఒకనాటి ఉజ్వల యుగం నుంచి నేటి నికృష్టపక్షం దాక చూచిన అపురూప యాత్రికుడు, అందరికీ నెచ్చెలి, జోకుల సమ్రాట్టు, నిష్కల్మషమైన నవ్వుల రేడు అబ్బూరి వరద రాజేశ్వరరావు. 'నాట్యగోష్ఠి', 'కవన కుతూహలం' లో ఆయన విశ్వరూపం కానవస్తుంది. కంకర రాళ్ల కైలాస పర్వతాలుగా చలామణి అవుతున్న నేటి ప్రపంచాన్ని చూడలేక దూరంగా వెళ్లిన హిమగిరి శిఖరం అబ్బూరి.

A very worthy son of a worthy father ! ఆయన్ని తెలుగు వాళ్లు మరవలేరు!

(సంపాదకీయం, ఆంధ్రప్రభ సచిత్రవారపత్రిక, మే 19.25, 1993)

**Abburi Varada Rajeswara Rau**

**[P. Vaman Rao]**

The ways of destiny are inscrutable, whether it is in respect of individuals or nations, the hour of triumph may also turn out to be a moment of defeat or set back. It is a sign of a jsut order, if merit in anyone if he chose to withdraw into a cell of seclusion, is recognised. ....the appointment of Sri Abburi Varada Rajeswara Rau, a fine writer, a fine poet and a journalist who contributed to Telugu literature without any hope of reward or return has to be welcomed. It is sad that within a short time of his taking charge as Chairman of the Official Language Commission, Sri Rajeswara Rau passed away on May3, after battling for life for about 4 weeks in the hospital, even as he had struggled in his early career to get work according to his taste. In addition to all his literary endeavours, it was as Editor in the Allied Publishers, New Delhi, where he worked for several years that he seems to have found satisfaction.

"Varada" as he was affectionately called by his friends came from a literary background. His father late Sri Abburi Ramakrishna Rau was, a literateur with a revolutionary fervour. Father and son came under the influence of M.N. Roy whose battle-cry was radical humanism. Varada was well-versed in theatre arts and....he produced plays.

He made good friends in political and literary circles and maintained good contacts with influential persons by the charms of his personality, his

ability to converse meaningtully with onginality and outspokenness.....

I have known Rajeswara Rau for well-nigh 45 years. We were in close touch with each other in all his ups and downs till he left Hyderabad. He was a lively conversationalist, with a cutting humour which came to him irresistibly and flowed like water. while he could be relentless opponent, he could also be a staunch friend who could stand by you solidly...

His death is a loss to the State and to the Telugu literature in particular...

('New Swatantra Times' May 1993.)

## 'వరదకలం'

ఆస్పత్రిలో చేరడానికి ఒక్క నెలరోజుల ముందు ఆయన అధికారభాషా సంఘానికి అధ్యక్షుడయ్యారన్న వార్త అందరికీ ఆనందం కలిగించింది. అధికార భాషా సంఘానికి ఇప్పటికి అర్హుడైనవారు నాయకత్వం వహించబోతున్నారు...ఈయన హయాంలోనైనా తెలుగుభాషకు కొంత మర్యాద దక్కవచ్చు అని చాలా మందే ఆశించివుంటారు. అటువంటి అవకాశం తెలుగు భాషకు లేదో.... తెలుగువాళ్ళకే లేదోకానీ, అధికార భాషా సంఘంతో హస్తస్పర్శ కూడా చేయకుండానే అబ్బూరి వరద రాజేశ్వరరావుగారు అనారోగ్యం కౌగిలిలోకి వెళ్ళవలసి వచ్చింది. ఆ కౌగిలి బిగి కౌగిలేఅయి, ఈ నెల 3వ తేదీన ఆయన కన్నుమూశారు. అబ్బూరి వరద రాజేశ్వరరావుగారు అప్పటికి దెబ్బయ్యేవ పడిలోవున్నా, మానసికంగా గట్లొరసిపారే సాహిత్యపు వరదకాలంలోనే వున్నారు. మొక్కవోని కవన కుతూహలంతోనే వున్నారు. ప్రథమ ప్రణయమంత మధురంగా పద్యాన్ని మరింత ప్రాణప్రదంగా స్మరించుకుంటూనే వున్నారు. నన్నయ్య చెప్పినట్లుగా, పుత్రగాత్ర పరిష్వంగ సుఖంపొందు తున్నట్టు పద్యాన్ని హృదయానికి హత్తుకునేవున్నారు. అబ్బూరి వరద రాజేశ్వరరావు గారు అబ్బూరి రామకృష్ణారావుగారంతటి వారి అబ్బాయి అన్నది అందరికీ తెలిసిందే. శ్రీ శ్రీ, విశాఖ తనకు చిన్ననాటి నేస్తాలేకాదు, చిరకాలపు నేస్తాలు. ఆయన తన విశిష్ట సేవలందించింది ఒక్క సాహిత్యానికే కాదు, జర్నలిజానికి కూడా.... అబ్బూరి వరద రాజేశ్వరరావుగారి రచనలను అబ్బురంగా చూసేవారుకూడా ఆయన నుంచి, ఇంకా రచనలు రావాలని కోరుతుండగా, 'స్వీయకథ' లాంటిది కూడా పూర్తి చేయక పోవడం ఆశాభంగం కలిగించేది. అందుకు 'అందాకా' వున్నవే చాలు అనుకోవడమే మిగిలింది.

*"వర్తమాన కవిత ఏమిటో తెలుసా వరదా?*
*అది భూతభవిష్యాలమధ్య*
*ట్రాన్స్‌పరెంట్ వరదా".*

('ఆంధ్రజ్యోతి సచిత్ర వారపత్రిక', 21.5.93)



## వరద రాజేశ్వరరావుకొక పూలహారం!

నామిని సుబ్రహ్మణ్యం నాయుడు.

1982లో నేను ఎస్వీ యూనివర్శిటిలో ఎమ్మెస్సీ చదివేటప్పుడు మెయిన్ బిల్డింగ్ ముందర, "సెనేట్ హాలులో ఈ రోజు 'భాష-సాహిత్యం' అనే అంశం మీద ఆరుద్ర మాట్లాడతాడు. అందరూ రండి!" అని ఒక బోర్డు పెట్టుండినారు. మెయిన్ బిల్డింగ్స్‌లో మేథమేటిక్సూ, స్టాటిస్టిక్సూ, ఎకనామిక్సూ మాత్రమే చెప్తారు. నేనా బోర్డు చూసి, "కోతి నాకొడుకులు! తెలుగూ ఇంగ్లీషూ చెప్పే ఆర్ట్స్‌బ్లాక్ ముందర పెట్టాల్సిన బోర్డును ఈడపెట్టేసినారు!" అనుకుంటా మేథ్స్ డిపార్టుమెంట్‌లోకి దూరేసి సందేళకంతా-బతికి పాయ్ నాంరా బగుమంతుడా-అని చెప్పి యూనివర్సిటీ రోడ్డెక్కేసి చూద్దునుకదా! నాపక్కన్నే ఆరుద్ర! జుబ్బాపై జామాతో బుజానికొక సంచీ తగలేస్కొని మల్లెపువ్వుమాదిర్తో పోతావుండాడు కవి.

ఆయన్ను ఆరుద్ర అని నేనెట్ట కనిపెట్ట గలిగినానంటే-అప్పట్లో తిరప్తిలో మల్లెపూవు అని ఒక సిల్మా ఆడింది. దాంట్లో ఒక కవి వుంటాడు. వాణ్ణెత్తి నెత్తిన బెట్టుకొని పూజించకుండా లోకమంతా దాని పనిలో అది వుండి పోతింది. అయితే ఆ కవి చచ్చిపాయ్‌నాడూ అని తెలియంగానే లోకంలో వుండే వాళ్లందరూ ఎవరి నెత్తిమింద వుండే బరువును వాళ్లు పారేసి ఆ కవి నెత్తి పెట్టుకొని టెంకాయలు కొట్టడం, కర్పూరాలు వెలిగించి ఆరతులు పట్టడం! ఇట్లా ననననగా నడస్తాది సిల్మా.

ఆది కవిని గురించి తీసిన సిల్మాగదా దాంట్లో కవుల్ని చూపిద్దాం కాసేపు పాపం-అనుకొని డైరెక్టరు ఆరుద్రనూ వేటూరి సుందర్రామమూర్తినీ చూపించినాడు. కెమరాముందు కొచ్చినందుకు-ఇదెక్కడి పీడరా సామినారాయణా! అని ఆరుద్ర సిగ్గు పడతా తలకాయ గీరుకొని కొంచేపు గమ్మునుంటే కెమెరా వాటికి కెమెరా చేసేదేంలేక శోభన్‌బాబు దగ్గిరికెళ్ళి పొయ్యుండేది. అవితే, ఆరుద్ర ధాటిగా వుండి, "కవిత కోసమె నేను పుట్టాను, కవిత కోసమె కలం పట్టాను" అనే రీతిలో ఏదో పద్యం వినిపించినాడు.

అదంతా చూసినోణ్ణి గావడంవల్ల ఆరుద్రను పక్క కొరికినంత సేపుట్లో గుర్తు పట్టేసి, "నమస్కారం సార్" అన్నాను. ఆయన గూడా నిమ్మళంగా "నమస్కారమండీ" అన్నాడు. "ఏం సార్ నడిచొస్తుండారు?" అన్నాను. దీనికాయన, "కాసేపునడిస్తే మంచిది గదండీ. నాకిది అలవాటు!" అన్నాడు. అంతటితో గమ్మునుండి పాయ్ నేనాయన్ని దాటుకొని నాదోవన్నేను

వొచ్చేసునంటే నేను మిట్టూరోళ్లెందుకవతా? "ఏం సార్, ఈ మధ్య సిన్మాపాటలు రాయకుండా బాగా తగ్గించేసినారే!" అన్నాను. "ఇప్పుడు చాలా చెత్తవస్తోంది గదండీ. మనమేమిటి రాస్తాం, వాటితో సమానంగా!" అనేసి అన్నాడు. ఈయన వేటూరి మింద దొబ్బుదలతో వుండాడనుకోని నేనాయన్ని క్రాసు చేస్తా, "అదేం అయ్యుండదు లెండి, మీరు వేటూరితో పోటీ పళ్లేరనుకుంటా. ఆరేసుకోబోయి పారేసుకున్నాను-తీస్కోండి, గుగ్గు గ్గుగ్గు గ్గుడిస్పుందీ తీస్కోండి, అంత హిట్ సాంగ్స్ మీతో అయ్యేవనేనా?" అని ఆయన మానం తీసేసినాను. నన్నాయన కంటద్దాల్లో నుంచి నిమ్మళంగా చూసి నవ్వినాడు. అంతే, ఏమన్లేదు.

మళ్ళా నేనే, "మీకు పాటకు ఎంతిస్తారుసా?" అనడిగినాను. "ఇంత అని ఖచ్చితంగా ఏముండదండీ. అయిదొందలూ ఇచ్చే వాళ్లుంటారు, వెయ్యేసి ఇచ్చేవోళ్లూ వుంటారు. మ్, చెప్పండి" అన్నాడు. ఇంతలో టౌన్ క్లబ్ వొచ్చేసింది. నేనక్కణ్ణుంచి వేశాలమ్మ వీధిలోకి టర్న్ అయి రాయల్ చెరువు బస్టాండుకు రావాల. "మంచిది సార్, నేనింకా పోదునా?" అన్నా. "మీరు నాకొక సాయం చెయ్యాలి. నాకు పుత్తూరొక్కపొడి అంటే ఇష్టం. అదెక్కడ దొరుకుతుందో కాస్తంత చెప్పరా?" అని అడిగినాడు. సరే. నేనాయన్తో గూడా డీలక్సు హోటల్ దాకా నడిచి 'పుత్తూరు వక్కపొడి అమ్మబడును" బోర్డు చూపించినా. ఆయన రెండు పట్లాలు తీసుకుని సంచిలో వేసుక్కున్నాడు. "నేనింక వస్తాను సా అయితే!" అన్నాను. "వెల్లేదు, డీలక్స్ హోటల్లో చాయ్ తాగుదాంరండి" అని పిలిచి నాడు. ఆ భోగం వుండొద్దా! నేనెంతో పొంతంగా ఆయన చేతులు బట్టుకోని, "నేను పోతాలేసా! మళ్ల బస్సు దొరకదునాకు!" అన్నాను. "చాలా మంచిదండీ, చాలా థాంక్సండీ మీకు" అని ఆయన అంటావుండె నా వినిపించుకోకుండా 'నో మెన్షన్' కూడా చెప్పకుండా మా బస్సుకోసం పట్టావరుగు!

-హైదరాబాదులో ఇంతకంటె హీనంగా అబ్బూరి వరద రాజేశ్వరరావుతో కత నడిపించినాను. ఇక్కడ తప్పు చేసి నోడు మాత్రం వరద రాజేశ్వరరావే. నేను పత్రికలో పనిచేస్తుండినంత మాత్రాన నన్నాయన ఇరవై నాలుగేండ్ల మేధావి అనుకొని నాతో మాటలు బెట్టుకోవడం-గుంజిళ్లు పెట్టాల్సినంత తప్పు. అదెందుకో లోకంలో చానా మంది పత్రికల్లో పన్జేసే వాళ్లను మేధావులని గౌరవిస్తారు. నా అట్టాళుంతలు పత్రికల్లో ఎక్కడ జూసినా కనిపిస్తారు. అందాకా ఎందుకు? మొన్న వరద రాజేశ్వరరావు చచ్చిపాయ్‌నాడనే వార్తను టెలిప్రింటర్ మీద చూడంగానే గబిమనింది. ఆ వార్తను మొదటి పేజీలో పెడితే చూసి సంతోషిద్దాంగదాని ఫస్ట్‌పేజీకాడికి పోతే-నిజంగానే ఫస్ట్‌పేజీలో పెట్టుండారు. నేను చానా కుశాలపడి, "ఫస్ట్‌పేజీ వాళ్లూ, ఫస్ట్‌పేజీవాళ్లూ! మీరు చానా మంచి పనిచేసినారు-వరద రాజేశ్వరరావు వార్తను ఫస్ట్‌పేజీలో పెట్టి!" అన్నాను. అందుకు ఫస్ట్ పేజీ వాళ్లు, "అమ్మా, మాకా మాత్రం తెలీదా! ఆయన మొన్ననే అధికార భాషా సంఘం అధ్యక్షుడయ్యాడుగదా! వార్తలోవుంది కళ్లు బాగా పెట్టి చూడు! అధికార భాషా సంఘం అధ్యక్షుడంటే-మోర్ దేన్ ఐఏఎస్ ర్యాంకు! ప్రిన్సిపల్ సెక్రటరీ హోదా అనుకో! ఫస్ట్ ఎడిషన్‌కేగాదు సిటీ ఎడిషన్ దాకా ఈ వార్త ఫస్ట్‌పేజీలో వుండాల్సిందే!" అన్నారు. అదీ కత!

నేను 'ఉదయం' పేపర్లో చేరినాకనే నాకు వరద రాజేశ్వరరావు పేరు తెలిసింది. నా తెలివి తనంతో నాకూ ఆయనకూ పెద్ద తేడా లేదనుకున్నాను. ఆయన మంగళవారం మంగళవారం

ఎడిట్ పేజీలో 'వరదకాలం' అని రాసేవాడు. నేను బుధవారం బుధవారం 'పచ్చనాకు సాక్షిగా' రాసేవాణ్ని. ఒక రోజే గదా అడ్డం–అనుకొన్నంతగా ఆయన్ని నేను 'నా కంటే పెద్ద గొప్పేంకాదులే' అనుకున్నాను గూడా. రెండుమూడు వారాలు నేనాయనవి శ్రద్ధగానే చదివినాను. నేను మా యమ్మను గురించి రాస్తుంటే ఆయన వాళ్ల నాయిన గురించి రాసేవాడు. అయితే వాళ్ల నాయిన అబ్బూరి రామకృష్ణారావు చానా గొప్పవాడనిపించేది. ఇంతకు మించి నేనువరద రాజేశ్వరరావు గురించి ఆలోచించింది లేదు.

ఒకసారి ఏబీకే ప్రసాదు హడావిడిగా నన్నుపిలిపించి "నిన్ను వరద రాజేశ్వరరావుకి అటాచ్ చేస్తున్నాను. ఆయన బాగ్‌లింగంపల్లి క్వార్టర్స్‌లో వుంటాడు. ననబెట్టి రాయించుకుంటే గాని ఆ మనిషి రాయడు. నా చేతిలో ప్రస్తుతానికి ఆయన కాలం ఒక వారానికే వుంది. మరో రెండు రాయమని చెప్పు, అర్థంటు, ఆ మనిషి ఆపేస్తే కష్టం. ఆయన కాలం మన పత్రిక్కి ఎంతో ఫెచ్చింగు తెల్సా!" అని వరసబెట్టి ఏదేదో మాట్లాడేసినాడు. దాని సారాంశం–నేను వరద రాజేశ్వరరావు దగ్గరికి పొయ్ అప్పుడప్పుడూ ఆయన వ్యాసాలు తెచ్చి ఈయన చేతికిస్తుండాల.

ఏ మాటకామాటే గదా! పనిజెప్పి చెయ్యించుకోవడంలో ఏబీకే ఇక్లామార్క్కుడు. ఇదొక్కటే ఆయన్లో వుండె మంచి గుణం. నేనాయన నోటికి బయపడి తొలిసారిగా వరద రాజేశ్వర రావింటికి పొయ్ చూద్దునుగదా! ఆయన నామాదిరి పసివాడు గాదు. పెద్దాయన! అర్వైయ్యేండ్ల పైవాడు. ఇచ్చిత్రపొయ్ వచ్చిన పని చెప్పినా.

"ఏబీకేని తొందర పడొద్దని చెప్పండి. నన్ను తొందర బెట్టొద్దని చెప్పండి. ఆ పనిలోనే గదా వున్నానూ!" అని దీర్ఘం తీసినాడు వరద రాజేశ్వరరావు. నాపేరు అడిగి కనుక్కున్నాడు. కానీ నేను రాసేటివి చదవతా వుండానని ఆయన చెప్పక పోవడంతో నేను మూతిమూరడు పొడుగు బెట్టి నిష్ఠూరంగా కుచ్చుంటే ఛాయాదేవమ్మ వచ్చి టీ ఇచ్చింది. అది తాగేసి రాజేశ్వరరావును పరీక్షగా చూస్తే–ఆయన వుంగరం వేలికి వెంకటేశ్వరస్వామి వుంగరం!

నేను మా తిరప్తిలో వున్నంత ఆనందంగా, "నాకిప్పుడు బలే ఇదిగా వుండాది సార్. ఈ హైదరాబాద్ మొత్తం మీద మీ వేలికే చూస్తుండాను వెంకటేశ్వరస్వామి బొమ్మను. అయితే మీరు భక్తుడన్న మాట. ఈ హైదరాబాద్‌లో జానాబిత్తెడు నాకొడుకు గూడా దేముణ్నిపట్టుకోని తిట్టేవాడే!" అన్నాను.

దానికాయన తమాసగా నవ్వి, "దేముడు అనే భావం నాకు బాగుంటుంది. వెంకటేశ్వర స్వామి లేడు అనుకున్నా అన్నమయ్య చిత్రించిన ఒక పాత్రగా ఆయన కొక నమస్కారం పెడదాం. తప్పేముంది? మీ తిరుమల వెళ్లి స్వామిని 'హలో' అని పలికరించి వస్తే ఆ ఆనందమే వేరయ్యా! గాడిద కొడుకులకు అర్థం కావొద్దూ–అందులో వున్న ఇదీ!" అన్నాడు.

"అయితే మీతో సావాసం చెయ్యాల్సిందే!" అనేసి లేచొచ్చేసి నాను.

వుండంగా వుండంగా నేను ఆయనకు బాగా దగ్గిరై పొయ్‌నాను. ఆయన నన్ను మిరూ మిరూ అనడం మానేసి నువ్వూ నువ్వూ అనడానికొచ్చేసినాడు.

మేమిద్దరం మూడు నెల్లు రాసేసరికల్లా కొంతమంది మావి నచ్చని వాళ్ళు ఆయన ముందు అనే ధైర్యం లేక నన్ను బట్టుకుని, "నువ్వూ వరద రాజేశ్వరరావూ జనాల్ని చావదొబ్బేస్తుండారయ్యా ఎంతసేపూ మానాయినా మానాయినా అని ఆయనా, ఎంతసేపూ మాయమ్మా మాయమ్మా అని

నువ్వూ ఇంకా ఎంతకాలం వాయిస్తారు?" అనేవాళ్లు.

ఈ రకం విమర్శ వినిపించినప్పుడల్లా నాకెంత గొప్పయిపొయ్యేదో చెప్పలేను! వరద రాజేశ్వరరావునూ నన్నూ కలిపి తిట్టడం! అబ్బూరి రామకృష్ణారావునూ సినక్కానూ కలిపి తలకాయ నెప్పి అనుకోవడం!!

ఒరెడెఖా! ఇంతకంటే భాగ్యమా!

ఒకసారి ఈ మాటనెత్తకపొయ్ నేను రాజేశ్వరరావు దగ్గిర చెప్పినాను. ఆయన దీనికి, "గాడిద కొడుకులు!" అన్నాడు. అదాయనికి వూతపదం! నేనాయన్ని నవ్విపిద్దామని చెప్పి, "గాడిద కొడుకుల్ని పల్లెటూళ్ళల్లో పోతు గాడిదలు అని అంటారు. పోతు గాడిదలు-పెంటి గాడిదలకంటె గూడా నాణ్యంగా వుంటాయి. మ్మరీ అవి పుట్టినప్పుడు చూడాల. కాబట్టి మీరు వాళ్ళను గాడిద కొడుకులు అని గాకుండా ఇంకేమన్నా అనండి, తమాషాగా!" అన్నాను. కడుపులో నుంచీ నవ్వేసినాడు. మేం మాటల్లో వుండంగానే రిట్జ్ హోటల్ వాడొకడు సూటూ కోటూ బూటూ యేసొక్కొని వొచ్చేసినాడు. వాడు రాంగానే ఇంగ్లీషులో ఏందో దంచి వొదిలి పెట్టేసినాడు. ఈయన వాడి జాట్లో దూరిపొయ్ ఇంగ్లీషులో వాయించిడిసి పెట్టేసినాడు. ఆయనింగ్లీషును చూసి నాకు బిత్తరెత్తుకునింది. నేను చూసినప్పుడల్లా వరద రాజేశ్వరరావు పొన్నూరు పంచా, ఖద్దరు చొక్కా యేసొక్కొని అచ్చం తెలుగోడు మాదిరిగా వుండేవోడు. మాయమ్మా నాయన వాసనతో నేనేదో రాస్తున్నట్టు ఆయన గూడా వాళ్ళ నాయన వాసనతో ఏదో రాసి గెలా యిస్తున్నాడనుకున్నానే గావి ఇంగ్లీషు అంత ధాటీగా మాట్లాడ్తాడని నాకేం తెల్సు?

రిట్జ్ హోటలాయన అట్లాపోంగానే, "ఏంది సార్, బెదరగొట్టేసినారే నన్ను-ఇంగ్లీషు అట్లా మాట్లాడి! మీకింత ఇంగ్లీషు వొస్తిందని నేననుకోలా" అన్నా.

"అదేందయ్యా నామినీ! నాకు ఇంగ్లీషు రాకపోవడం ఏందీ? నేను అల్లయిడ్ పబ్లిషర్స్‌కి ఎడిటర్‌గా చేశానయ్యా! అసలు నా గురించి నీకేమీ తెలీదా?" అనడిగినా నవ్వతా.

నేను, "మీరా! అల్లీడ్ పబ్లిషర్స్ అనే దానికి ఎడిటరుగా చేసినారా! మీరూ మా మామా ఒకటే అయితే. చిన్నకత జెప్తావినండి. ఆర్నెల్ల క్రితం నాకు పెండ్లయ్యింది గదా. ఒక్కానా కొడుక్కీ నేను పెండ్లి పత్రిక ఇవ్వలేక పొయ్‌నాను. పెండ్లి పత్రికల కట్ట రిజిస్టరు పోస్టులో నాకు అందిన వెంటనే శుభలేఖలవి గూడా ఎంచకుండా పరపరా చింపెయ్యాల్సొచ్చింది. ఎందుకంటే వరుడు-నామిని సుబ్రమణ్యం నాయుడు. పేరు పక్కాన చీఫ్ ఎడిటర్, ఉదయం-అని అచ్చెయ్యించేసి నాడు నాకు పిల్లనియ్యబొయ్యే మామ! ఆ పత్రికను మావోనర్ చూస్తే మళ్లేమన్నావుందా! సబ్ ఎడిటర్‌ను కూడా జనాలు చీఫ్ ఎడిటర్ అనుకుంటారు. అట్లా వుంది మీరు చెప్పేది. ఇప్పుడూ సబ్ ఎడిటరూ దాని తర్వాత సీనియర్ సబ్ఎడిటరూ ఆ తర్వాత చీఫ్ సబ్ ఎడిటరూ-ఇట్లా వుంటాయి..." అని వాగేసినాను. ఆయన పడీ పడీ నవ్వతావుండాడు. ఇంక నవ్వితే చచ్చిపోతాడేమో అనిపించే అంత ఇదిగా-

"ఏం సా, అట్టనవ్వతారు! నిజం, సబ్ ఎడిటర్‌కీ చీఫ్ ఎడిటర్‌కీ-నక్కాకీ నాగలోకానికీ ఉన్నంత తేడా!"

ఆయన నామాటలకు ఇంకా ఇంకా నవ్వేదానికి బెట్టుకున్నాడు. ఆ తర్వాత నాకు సురేంద్ర

రాజా చెప్తే తెలిసింది-ఆయన నిజంగానే అలైడ్ పబ్లిషర్సుకి చీఫ్ ఎడిటరంట. ఆయన జర్నలిస్టుగా చానా పేరు మోసినోడంట, ఇండియన్ ఎక్స్‌ప్రెస్‌లో గూడా చేసినాడంట.

సురేంద్రరాజు చెప్పిందాన్ని బట్టి "ఘటికుడు గా వుండాడే ముసిలోడు!" అనుకున్నా.

ఇంకొక దఫా ఇంకొకటి జరిగింది. నేను రాజేశ్వరరావు వాళ్ళింట్లో హాల్లో కూర్చొని వుండంగా కాలింగ్ బెల్ మోగింది. తలుపు తీస్తే ఎదురుగుండా కోట్ల విజీభాస్కరరెడ్డి! నీక్కావాల్సిన ఇల్లు ఇదై య్యుండదన్నట్టు-ఆయన కడ్డంగా నిలబడి, "ఇది అబ్బూరి వరద రాజేశ్వరరావిల్లు. మీకెవరు గావాలసా?" దీనికి విజీ భాస్కర రెడ్డి నవ్వు మొకంతో "నాగ్గావాల్సింది గూడా రాజేశ్వర రావిల్లే లేవయ్యా, పద!" అని లోపలి కొచ్చి సోఫామింద కూచ్చొని "లేడా ఆయన?" అన్నాడు. ఇంట్లో నుంచి వరద రాజేశ్వరరావు హాల్లో కొచ్చినాక "అయితే నేనొస్తాన్ సా" అన్నాను. "పనే మన్నావుంటే వెళ్ళు. భాస్కరరెడ్డి మనకు బెస్ట్‌ఫ్రెండ్ లే. వుండు. ఫర్వాలేదు" అన్నాడు. విజీ భాస్కరరెడ్డి అరగంట వుండి వెళ్ళిపోయినాడు. ఆయనట్ల పోంగానే, "ఆయన రాజకీయ నాయకుడు గదసార్. మీకెట్లా పరిచయం?" అన్నాను.

"ఏమిటి నామినీ అట్లా అడుగుతావు? మనకు రాజకీయాలు కొత్తా ఏమిటి? ఇప్పుడు-నాకు నెహ్రూ పరిచయం లేదని గ్యారంటీ ఇవ్వగలవా?" అన్నాడు. ఆయన తల పొగురుకు నేను కొప్పడి పోయ్ గమ్మునుండండి సా. నెహ్రూకూమీకు ఏం సమందం?" అన్నాను.

"అయ్యోరామా!" అని ఆయన చెప్పింది విని ఇచ్చిత్రపోయ్ ఆయనంటే బయం ఎత్తుకొనింది.

ఇదట్లా పోతే, నవ్వడం, నవ్వించడం రాజేశ్వరరావు విద్య. ఆయన దగ్గిర నేనెప్పుడూ భేదం బెట్టుకుని మాట్లాళ్ళేదు. కడుపులో ఏం వుంటే అది అనేసేవాణ్ణి. ఒక రోజు "నేనిన్నిదినాలుగా మీ ఇంటి కొస్తుండాను. మీ పిల్లల్నిగురించి ఎప్పుడూ చెప్పలేదు. ఎంత మంది పిల్లలూ ఏం చేస్తుంటారూ అది చెప్పండి" అనడిగాను. "మాకు పిల్లల్లేరు నామినీ!" అన్నాడు. నాకు పెండ్లయి తొమ్మిది నెలలయినా నా పెళ్ళాం ఇంకా అంటు తప్పక పొయ్యే సరికి దిగులుపడి దాన్ని దినానికొక డాక్టరు దగ్గిరికి తిప్పుతున్న రోజులవి.

"అదేంది సార్ డాక్టర్ల దగ్గిర చూపించుకోక పోయినారా!" అన్నాను.

"పెళ్ళికాగానే మేం ఆపరేషను చెయ్యించుకున్నాం-పిల్లలు కలక్కుండా! మాదేశసేవ ఏదన్నా వుంటే ఇదేనయ్యా!" అన్నాడు.

నాకు చానా బాధై పొయ్యింది. గమ్మునగదావుండాల.

"ప్చ్, చానా తప్పు పని చేసినారు" అన్నాను, దాన్ని సాగలాగి. ఇంతలో ఇంట్లోనుంచి పిల్లి దాని పిల్లల్ని నాలుగిట్ని వెంటేసుకుని హాల్లో కొచ్చింది.

"మాకు నాలుగు పిల్లలు నామినీ! నువ్వేమీ దిగులుపడకూ!" అన్నాడు. ఆయన తమాసకు ఛాయాదేవమ్మా నేనూ గూడా ఓ అని నవ్వేసినాం.

ఇంగొకసారి ఇంకొక తమాషా చేసినాడు. నేను చార్మినార్ సిగరెట్ల ఫ్యాక్టరీ దగ్గిరుండే 'ఉదయం' నుంచి బంజారాహిల్స్ 'ఆంధ్రజ్యోతి'కి మారుకున్నాను. ప్రయాణం జాస్తి. 20 రోజులు ఆయన్ని చూళ్ళేదు. ఒకసారి ఆంధ్రజ్యోతికి ఫోను చేసి, "సాయంకాలం డ్యూటీ నుంచి దిగేసి చక్కా ఇంటికిరా, చక్కటి ఆయిడియా ఒగటొచ్చింది. నీకు చెప్పాలి" అన్నాడు.

ఇంటికొస్తే ఆయన అయిడియా ఇదీ:

"సిటీ కవులకందరికీ డిన్నర్ ఇప్పిద్దామనుకుంటున్నాను. అందరూ మాంచి తిండిలో వుండంగా పోలీసుల్ని పిలిపించి లాఠీ చార్జి చెయ్‌మంటే సరి!"

ఆయన మాటలకి ఆయనే ఎంత నవ్వినాడో!

ఆయనకి ఇప్పుడొచ్చే కవిత్వం అంటేమంట.

"చేత వెన్నముద్ద చెంగల్వ పూదండ మాదిరి పద్యాన్ని రాసిన వాణ్ణి ఒక్కణ్ణి చూపించు నామినీ!

వాడి పాదాలు కడిగి నెత్తిన చల్లుకుంటాను. పోనీ–నాకు చేత వెన్న ముద్ద పద్యమంటే ఇష్టం అని చెప్పగలిగే కవి వుంటే పట్టుకురా! రిట్జ్‌హొటల్‌లో సన్మానం చెయ్‌పిద్దాం!" అనేవాడు. "ఇప్పుడు రాసేవాళ్ళు కవులు కాదు కౌలు. కౌలు అంటే కౌస్ అనుకునేవు. కౌస్ అంటే ఆవులు గదా! అవి పాలిస్తాయి, మంచివి. కౌలు అంటే భావాల్ని 'కౌలుకి తెచ్చుకునే వాళ్ళు అని! తెలుగుదనం ఒక పద్యంలో వుందా" ఇదీ ఆయన వాటం!

అయితే ఆయన ఎవరి మీదా ద్వేషం కక్కేవాడు గాదు. ఆయనొక్కడూ బావ అయినట్టూ మిగతా అందరూ మరదళ్ళయినట్టూ, జడపట్టి లాగినట్టుగా వేళాకోళం చేసేవాడేగాని–కిరసనాయిలు పోసి అగ్గిపుల్ల గీసి ముట్టించి నట్టుండేది గాదు. ఆయన అందర్నీ ఎగతాళి చెయ్యంగా విన్నానే గాని ఒక్కర్ని కూడా తిట్టంగా విన్లేదు.

నాకు హైదరాబాదు నుంచి తిరప్తికి ట్రాన్స్‌ఫర్ అయిన వెంటనే ఆయనింట్లో వూడిపడి, "మీకూ నాకూ రుణం తీరిపొయ్యింది సా. ఇంక రెండు రోజుల్లో నేను మావూరు పోతుండాను. నాకు సెలవివ్వాలి" అన్నాను.

"మీ తల్లీ తండ్రిని చేరుకుంటున్నావన్నమాట, చాలా సంతోషం నామినీ!" అన్నాడు.

నాకు దుఃఖం వచ్చింది. ఆయన పాదాల మింద పడితే వికారంగా వుంటాదని చెప్పి చేతులు పట్టుకుని, "మిమ్మల్ని ఏది పడితే అది అనేసినాను. శ్రీనివాసరావు నా బెస్ట్‌ఫ్రెండ్ అంటే శ్రీ శ్రీ మీకు ఫ్రెండా' గొప్పలు చెప్పుకోవడంలో మీకు మీరే అన్నాను. మీరింగ్లీషు మాట్లాడితే ఇచ్చిత్రపాయ్ మీకు ఇంగ్లీషొచ్చా అనడిగినాను. నెహ్రూ నాకు తెలుసు అన్నప్పుడు నేన్నమ్మనవి కుచ్చున్నా మీరు మన్నించినారు. మీ గొప్పతనం ఏమాత్రం తెలుసుకోకుండా..."

"ఏం నామినీ! నీ వైఫ్‌తో వెళ్ళి తెలుగు సిన్మాగాని చూసొచ్చావా? ఏంది నీ పిచ్చి మాటలు?" అని భుజం తట్టినాడు.

"నేనొస్తాన్ సార్" అంటే రానివ్వలేదు.

"మరొక గంట వుండు, పోదువుగాని!" అన్నాడు.

"లేదు సా, వూరెళ్ళే పని గదా! నన్ను చూడంగానే మాయమ్మ తల పెరిగి పొయ్యిందేందిరా అంటాది. ముందు తల కత్తిరించుకోవాలం. ఇంకపోతా!" అన్నాను.

"నీకు తెలుసా? నేనెప్పుడూ నా తల మంగలికి అప్పగించను. నేనే కత్తిరించుకుంటాను. పది నిమిషాలు పెరట్లోకిరా. నీతల కత్తిరిస్తాను. రెండు రూపాయలివ్వు. చాలు"అని నవ్వేపిచ్చినాడు.

నేనింక కదలబోతుంటే ఇంట్లోకి పోయి ఒక పాకెట్టులో తిరిగొచ్చి, "నీ వచ్చినాకు సాక్షిగా

అంతా చదివానయ్యా! రంగారావు మిసెస్ సుశీల చెప్పింది నీ కథల గొప్పతనం! ఏల్చూరి సుబ్రహ్మణ్యం చెప్పినా నేను పట్టించుకోలేదు. సుశీల చెప్పాక నీ పుస్తకం చదివా. మీ అమ్మసరేగాని నాకు మీ నాన్నగారంటే ఇష్టం. నువ్వెప్పుడూ నా పొన్నూరు పంచెను పొగుడుతుంటావు గదా! ఇది అదే! మీ నాన్నకు కటబెట్టు. నా నమస్కారాలు చెప్పు" అనేసి ఆ ప్యాకెట్టు నా చేతుల్లో బెట్టి కావిలించుకుని వీధి దాకా వొచ్చినన్ను సాగనంపినాడు.

నా బిడ్డ బిడ్డకూ నేను వరద రాజేశ్వరరావు గురించి చెప్పుకుంటా.

('ఆంధ్రజ్యోతి', ఆదివారం, 20 జూన్, 1993)





నగ్నముని తో 'వరద'

## మా బాంధవ్యం ఆధునికత

నగ్నముని

అబ్బూరి వరద రాజేశ్వరరావు నాకెప్పుడూ అసాధారణమైన వ్యక్తిగా, అపురూపమైన శక్తిగా

కనిపిస్తాడు.

కవిగా, మేధావిగా, బహుభాషావేత్తగా, ప్రచురణరంగంలో సంపాదకుడిగా, ప్రాతికేయునిగా, ఇలా ఎన్నో రంగాల్లో ప్రవేశించి తనదైన శైలిని ప్రవేశపెట్టి అద్భుతమైన విలువలు నిలబెట్టి, ఫలితాలు సాధించిన వాడు వరద.

ఉదాహరణకి, జాతీయోద్యమంలో ఆయన రాజకీయ కార్యకర్తృత్వాన్ని, నాటకరంగాన్ని ఉద్యమంగా మార్చి 'నటాలి' ద్వారా ఆయన జరిపిన కృషినీ చరిత్రకారుడు గమనించే ఉంటాడని నేననుకుంటున్నాను.

అలాగే, వరద పత్రికా రంగంలోకి ప్రవేశించి 'హైదరాబాదు యూనియన్ ఆఫ్ వర్కింగ్ జర్నలిస్ట్స్' సంస్థను స్థాపించిన సంగతీ, 'యాన్ ఇంట్రొడక్షన్ టు పబ్లిక్ రిలేషన్స్' అని భారతదేశంలోనే ప్రజాసంబంధాల విషయంలో వ్రాయబడిన మొట్టమొదటి పుస్తకం ఆయన రచించిన సంగతి చరిత్రకారుడు గమనించే ఉంటాడని నేననుకుంటున్నాను.

ఇవన్నీ ఒక ఎత్తు; నా దృష్టిలో వరద కవిగా సాహితీ రంగంలో చేసిన కృషి ఒక ఎత్తు. నిత్యం స్వయంగా ఛందస్సులలో ఎన్నో ప్రయోగాలు చేస్తూ కవిత్వాన్ని సుసంపన్నం చెయ్యడమే గాక, 'కవితా' సంచికల ప్రచురణ ప్రారంభించి ఆధునిక కవితా ప్రవాహం పరవళ్లు తొక్కుతూ ముందుకు మున్ముందుకు కదలడానికి కృషి చేసినవాడు వరద రాజేశ్వరరావు.

అయితే, నేను ఛందస్సుల కవినికాను. వరద ఛందస్సుల కవి. అయినా అతనిలోని ఆకర్షణ– ఆధునికతకోసం అతడు చేసే కృషి, నిస్వార్థంగా ఆధునిక కవులకో వేదిక కోసం అతడు చేసిన ప్రయత్నం, గురజాడ మీద ప్రేమ, నాటకం మీద ప్రేమ, ఆధునిక కవిత్వం మీద ప్రేమ, అతని తపస్సు ప్రపంచ కవిత్వం తెలుగువాడి దగ్గరికి తీసుకురావాలని. అందులో కొంత సాధించాడు వరద. వివరాలు తెలుసుకోవడానికి 1954 సంవత్సరానికి వెళ్లాలి.

1954 సంవత్సరంలో ఆధునిక కవిత్వం ప్రచురణ నిమిత్తం అబ్బూరి ఛాయాదేవి సంపాదకత్వాన 'కవిత' అని రెండు సంచికలు వెలువడ్డాయి. వీటిలో తెలుగు కవుల కవితలతో పాటు జాతీయ, అంతర్జాతీయ కవితలను అనువాదం ద్వారా తెలుగువాడి దగ్గరకి తీసుకురావడం కూడా ఒక భాగం. ఈ సంచికలు సంప్రదాయ కవితకు దీటుగా ఆధునిక కవిత్వానికి గొప్ప వ్యక్తిత్వాన్నిచ్చాయి.

రెండు సంచికల్లో వున్న తెలుగు కవులు–అ. రామకృష్ణారావుగారు, శ్రీ శ్రీ, ఆరుద్ర, అజంతా, ఆంజనేయులు, బెల్లంకొండ రామదాసు, ఏల్చూరి సుబ్రహ్మణ్యం, బాలగంగాధర తిలక్, రాజశేఖర్, కవిరాజమూర్తి, హిందీ నుండి అనువాదం–రామధారీ సింహ [దినకర్] కవిత; ఇంగ్లీషు నుండి –ఆస్కార్‌వైల్డ్, డిలాన్‌థామస్, ఆటలా, టి.ఇ. హ్యూమ్, డి.హెచ్.లారెన్స్, రాంబో, బాద్‌లేర్, ఎమిలీ డికిసన్ కవితలు.

కవిత్వం గురించి కవితలో ఆరుద్ర, వరద గంభీరంగా చర్చచేశారు. ఇదొక కొత్త ప్రయోగం. కవితా సంభాషణం. అనువాదాల ఆషామాషీ కాదు, అనుకృతిగా చేశారు. తదనంతర కాలంలో అనువాద రచన ఒక విభాగంగా పెరగడానికి ఇది తోడ్పడింది.

వరద అంటే నాకు అభిమానం, ఆకర్షణ. ఎందుకంటే అతడు ప్రామాణికత కోసం పడేతపన. ఇది గొప్ప విలువ. కవితల సెలక్షను, అనువాదాల స్థాయిమొదలైన ఎన్నో అంశాల్లో రాజీ

పడకుండా కవితా సంచికలు తీసుకురావడం కష్టం. అయినా వరద సాధించాడు. నిజానికి ఇది ఏదైనా యూనివర్శిటీయో, ఎకాడమీయో చేయవలసిన పని.

ఆ రోజుల్లో 'భారతి', 'తెలుగు స్వతంత్ర' పత్రికల్లో రచన పడితే ఆ రచయిత ఎంతో గౌరవించబడేవాడు. మంచి రచయిత అని పేరు వచ్చేది. అయితే ప్రామాణికత విషయంలో గ్యారంటీ మాత్రం ఇవ్వలేదు. కొంత మంది కవుల, రచయితల అంతగా లోతులేని రచనలు ఎలా 'భారతి', 'తెలుగు స్వతంత్ర'లో అచ్చయాయోనని ఆశ్చర్యం కలిగిన సందర్భాలున్నాయి. గౌరవం, ప్రామాణికత రెండూ 'కవిత' సంచికలలో అచ్చయిన కవులకు దొరికింది. అంతేగాక, ఆ రోజుల్లో ఈ సంచికలను ఎంతో మంది ప్రాణప్రదంగా దాచుకోవడం జరిగింది. ఆధునిక కవితకు ఇవి పాఠ్యగ్రంథాలవలె కనిపించేవి. కవితా సంచికలు వట్టి కవితా సంచికలు కాదు. నిశ్శబ్దంగా ఉద్యమం వలె పని చేసినవి. ఆధునిక కవిత్వానికి చక్కని గౌరవము, నిజాయితీ, పాండిత్యము, ప్రామాణికత మొదలైనవన్నీ సమకూర్చి పెట్టినవి. ఇందులోని కవులకు తిరుగులేని పేరు తెచ్చినవి. సాధారణంగా కవితా సంకలనం వెలువడి, సమీక్షలు వెలువడి నలుగురు దృష్టిలోకి వచ్చిన కవికీ సంకలనం వెలువడని కవికీ నలుగురి పరిగణనలో తేడా ఉండేది. సంకలనాలు వెలువడిన కవులు సీనియర్ కవులు అయిపోతూ ఉండేవాళ్లు. కానీ, సంకలనాలు వెలువడక పోయినా కవితా సంచికలలో రచనలు వెలువడిన కవులకు సీనియర్ కవుల వంటి ఆదరణ లభించింది. ఉదాహరణకు అజంతా, బాలగంగాధర తిలక్‌ల పేర్లు చెప్పుకోవచ్చు.

మరో ముఖ్య విషయం ఉంది. 1950-60 దశాబ్దంలో కవితారంగంలో స్తబ్దత ఏర్పడింది. మహోద్యమంగా శ్రీ శ్రీ వంటి కవులతో ఆంధ్రదేశమంతా అంటుకుని ఉన్న అభ్యుదయోద్యమం వేగం తగ్గింది. స్తబ్దత ఆవరించింది. చాలామంది రచయితలూ, కవులూ సినీరంగంలోకి వెళ్ళి పోవడంతో కవిత్వాన్ని గురించీ, విలువల గురించీ చర్చించే వాళ్ళే లేకపోయారు. సంప్రదాయవాదులకు తిరిగి బలాన్ని సమకూర్చిపెడుతున్న రోజులవి.

ఆ రోజుల్లో కవిత సంచికల ప్రచురణ ఆధునికతకు ఎంతో బలాన్ని తీసుకు వచ్చింది. చర్చలను కొనసాగించడానికి వేదికగా ఉపయోగపడింది. అందువల్ల స్తబ్దతను తరిమి వెయ్యడంలో, ఆధునికతను పరిరక్షించడానికి 'కవిత' సంచికల ద్వారా వరద ఎంతో కృషి చేశాడనేది గుర్తించడం చాలా అవసరం. ఈ విషయాన్ని చరిత్రకారులు గుర్తించిందీ, లేనిదీ కవితా సంచికలకు ఎటువంటి స్థానం ఇచ్చిందీ తెలుసుకోవలసిన అవసరముంది. 'కవిత' సంచికలు కవితా రంగంలో ఆధునికతను పరిరక్షించక పోయి ఉన్నట్లయితే, వచనకవితా రూపానికి తగిన స్థానం ఇవ్వక పోయినట్లయితే మరో ప్రమాదం జరిగి ఉండేది. కొంతమంది కవులను సీరియస్‌గా తీసుకునే స్థితి ఉండేది కాదు. ఉదాహరణకు అభ్యుదయోద్యమంలో పల్లెకు, పాటకు ప్రాధాన్యం ఉండడం వల్ల, బుర్రకథల వంటి మాధ్యమాలకు ప్రాధాన్యం ఉండడం వల్ల మధ్య తరగతికి తగిన ఆదరణ లేక పోవడం వలన, మధ్య తరగతి విప్లవానికి అడ్డు వస్తుందనే ఆలోచన కూడా ఉండడం వలన మధ్య తరగతికి చెందిందనుకునే వచన కవితకు తగిన గౌరవం, ప్రాధాన్యం ఇచ్చి ఉండేవాళ్లు కాదు.

మరొక అంశం దృష్ట్యా కూడా వరదలో నాకు ఆకర్షణ ఉంది. కవితానువాదాల ద్వారా ప్రపంచ కవిత్వాన్ని తెలుగువాడి దగ్గరకు తీసుకువచ్చి, తెలుగువాడికి ప్రపంచ కవితను గాఢంగా పరిచయం

చెయ్యాలనే ఆలోచనతోబాటు, తెలుగువాడి కవిత్వాన్ని భారతీయుడి కవిత్వాన్ని అనువాదాల ద్వారా ప్రపంచదృష్టిలోకి తీసుకువెళ్ళాలనే తపన కూడా వరదకు ఉండేది. దానికి ఎంతో కృషి చేశాడు వరద. ఇది కూడా మరో 'నిశ్శబ్ద' ఉద్యమంలా నడిచింది.

కవిత ప్రచురణల క్రింద ప్రధాన సంపాదకుడిగా వరద రాజేశ్వరరావు, సంపాదకురాలిగా ఛాయాదేవి 'మోడర్న్ తెలుగు పోయెట్రీ' [1956] తీసుకువచ్చారు. 'మోడర్న్ ఇండియన్ పోయెట్రీ' [1958] తీసుకువచ్చారు. ఇందులో భారతీయ భాషల అనువాదాలున్నాయి. 'మోడర్న్ ఇండో-ఆంగ్లియన్ పోయెట్రీ' [1959]-భారతీయ భాషల్లో ఇంగ్లీషును కూడా ఒక భాషగా పరిగణించి సంచిక వెయ్యడం ఇంగ్లీషులో రాస్తున్న కవులకు ఎంతో సహాయం చేసినట్లయింది. ఆప్రోద్బలంతో కలకత్తా నుండి రైటర్స్ వర్క్షాపు నిర్వహిస్తూ ఎందరో కవుల గ్రంథాలను అచ్చులోకి తీసుకురావడానికి శ్రీ పి.లాల్ కృషి చేశాడు. దానికి వరద ప్రచురణలు దారి చూపించాయి. భారతీయ భాషల్లో ఉన్న కవితను ఇంగ్లీషు ద్వారా ఒకరికి ఒకరు పరిచయం చేసుకుంటే ఏకత్వం సాధించవచ్చునని, భారతీయత పటిష్ఠమవుతుందనే ఆలోచనతో 'మోడర్న్ అస్సామీస్ పోయెట్రీ' [1960] ప్రచురించడం జరిగింది. ఇవి బృహత్తర కార్యక్రమాలు. ప్రభుత్వం, ఎకాడమీల వంటి పెద్ద పెద్ద సంస్థలు చెయ్యవలసిన పనులు. కానీ ఆధునిక భారతాన్ని పునర్నిర్మించడానికి ప్రపంచం దృష్టికి భారతీయ భాషల్లోని కవిత్వాన్ని తీసుకువెళ్లడానికి తీవ్రంగా కృషి చేశాడు వరద.

తెలుగువాడు చారిత్రాత్మకమైన పనులు చేస్తున్నందుకు ఒక తెలుగువాడిగా నేను స్ఫూర్తిని పొందుతూ ఉంటాను. సాధారణంగా ఇంగ్లీషులో పాండిత్యం ఉన్నవాళ్లు తమ రచనలు మాత్రమే అంతర్జాతీయవేదిక మీదకు తీసుకు వెళ్లడానికి ప్రయత్నిస్తారు. వరద ఎప్పుడూ అలా చేయలేదు. తెలుగు వాడినీ, భారతీయుణ్ణీ ముందు నిలబెడతాడు. ఏ రంగంలో చూసినా వరద ఈ వైఖరి అవలంబిస్తాడు. ఈ విషయంలో కూడా ఎప్పుడన్నా చరిత్ర కారుణ్ణి కలుసు కోవాలని ఉంది. ఏం చేస్తున్నాడో, ఏం రాస్తున్నాడో తెలుసుకోవాలని ఉంది.

.... వరదకీ నాకూ వయసులో తేడా ఉంది. క్రమక్రమంగా నేనతన్ని చేరుకోడానికి ప్రయత్నించినప్పుడు వయస్సు అడ్డం రాలేదు. వరద ఢిల్లీలో ఉండేవాడు. రామకృష్ణారావుగారు హైదరాబాదులో ఉండేవారు. నాకు మొదట అబ్బూరి గోపాలకృష్ణతో పరిచయం. గొప్ప మోడర్న్ ఆర్టిస్టు. నా మొదటి కవితా సంపుటి 'ఉదయించని ఉదయాలు' [1962] కవర్ మీద ఆర్ట్ అతనిదే. పారిస్‌లో ఆధునిక చిత్రకళ, కవితా రంగాలలో ఉద్యమాలెలా పెనవేసుకుని ఉండేవో అలా ఆ రోజుల్లో మేం కలిసి తిరిగే వాళ్లం. అతనిలో కవీ, రచయితా కూడా ఉన్నారు. ...హైదరాబాదు వచ్చేవాడు వరద. నేను దూరంగా ఉండి చూస్తూ ఉండేవాణ్ణి. అతను సాధించినవి కాస్తకాస్త తెలుస్తుండేవి. అతను తెలుగు కవిలాగా కనిపించేవాడు కాదు, ఎందుకంటే, ఇప్పటికీ తెలుగు సినిమాల్లో తెలుగుకవీ, తెలుగు పండితుడు గొడుగు, పిలకతో బఫూనరీ చేస్తూ ఉంటాడు. కళ్లల్లో ఆదర్శం, చేతిలో ఖడ్గం, కదలికలో పాదరసం చురుకు, గుర్రమెక్కి మంత్రతంత్ర ప్రదేశాల్ని దాటుకుంటూ పోయే జానపద కథల్లో కథానాయకుడులా కనిపించేవాడు. అతని చిరునవ్వు స్నేహపూర్వకంగా ఉండేది.

1960-65 సంవత్సరాల్లో వచన కవిత అనే ఖడ్గాన్ని పట్టుకుని నేను కొన్ని విజయాలు సాధించాను. పద్యానికీ, పాటకీ వచన కవిత సాటిరాదని కొందరు అనే వాళ్లు. కవి సమ్మేళనాల్లో మైకుముందు చేతిలో కాగితం లేకుండా వచనకవి చదవలేడు అనేవాళ్లు. కవిత్వం చెప్పలేడు అనేవాళ్లు. కాగితం లేకుండా పద్యకవి మాత్రమే కవిత్వం చెప్పగలడు అనేవాళ్లు. పాటకవి మాత్రమే కాగితం లేకుండా పాడగలడు అనేవాళ్లు. ఆ రోజుల్లో యీసవాలు ఎదుర్కోవడానికి నేను ప్రయత్నించాను. చేతిలో కాగితం లేకుండా, పద్యంలోని ఛందస్సు అందించే సంగీతం లేకుండా, పాటలో సంగీతం లేకుండా, ఇటువంటి సమాయ సహకారాలేమీ లేకుండా ఎన్నోసార్లు నేను దీర్ఘకవితలు కాగితం లేకుండా వినిపించాను. నాకున్న కంచుకంఠంతో వచన కవిత వినిపిస్తుంటే ఆహూతులు సంతోషించేవాళ్లు. మరింత బలాన్ని యిచ్చేవాళ్లు. పద్యం, పాటల సవాళ్లను నేను వేదిక మీద వచన కవితతో ఎదుర్కొనేవాణ్ణి వినమ్రంగా.

నాసాహసంవెనక ఒక ఆలోచన సాగుతూ వుండేది. ఇది పద్యానికీ, పాటకీ, వచన కవితకీ పోటీ కాదు. ఇదంతా ప్రజల హృదయంలో చోటు చేసుకోవాలనే ప్రయత్నం. ఈ దారిలో పద్యం ఎప్పుడూ నన్ను భయపెట్టింది కాదు. కారణం-పండితుల వల్ల పద్యం, పండితుల చేత పద్యం, పండితుల కొరకు పద్యం కనుక పండితుల మధ్య పద్యం పెరిగింది కనుక ప్రజల హృదయంలో చోటు చేసుకోవాలంటే పద్యం ఎన్నో కోటలు దాటవలసి వుంటుందని నా ధైర్యం. ఆ ధైర్యంతో వచన కవితకి దృఢమైన బాట వేసుకుంటూ ప్రయాణిస్తున్నాను.

మానేపల్లి హృషీకేశవరావు నగ్నమునిగా మారిన తర్వాత నేను వచన కవితకు ఉద్యమ స్వరూప స్వభావాలు యివ్వడం జరిగింది. రోడ్ల మీదకు వెళ్లి దిగంబర కవుల సంచికలు ఆవిష్కరింపజేసి, జన సమూహాల్లో వచన కవితను ఉద్వేగంగా వినిపించడం జరిగింది.

చాలా సమావేశాల్లో 'పాలు ఎర్రబడ్డాయి' లాంటి కవితలు చదవమని కోరేవాళ్లు. 'కొయ్యగుర్రం' లోంచి వినిపించమనే వాళ్లు. వచన కవితకు ఆదరణ సంపాదించడంలో నా కంచు కంఠం, చదివే పద్ధతి చాలా ఉపయోగపడ్డాయి. ఇవన్నీ ఢిల్లీలో వున్న వరదకు తెలుస్తున్నాయి.

అప్పటికే చాలా జరిగింది.

శ్రీ శ్రీ దిగంబర కవుల్ని అభిమానించడమే గాక, వీళ్లు కవులు అని ప్రకటించడమే గాక ఇంగ్లీషులోనికి కొన్ని కవితలు అనువదించారు. చలంగారు అరుణాచలం నుండి ప్రోత్సహిస్తూ వుత్తరం రాశారు. అబ్బూరి రామకృష్ణారావు గారు ఉద్యమాన్ని విశ్లేషిస్తూ మార్గాన్ని మరింతగా తెలిపే అంశాలు మాట్లాడారు. ఇవన్నీ వరదకు తెలుస్తున్నాయి.

ఆదారిలో మాకు పరిచయం అయింది. వరద ఛందస్సుల కవి అనీ, నేను ఛందస్సుల బందోబస్తులు లేని కవిననీ నాకు తెలుసు. మా యిద్దరినీ కలిపే సూత్రం ఆధునికత.

వరదలో కొన్ని విచిత్రమైన లక్షణాలున్నాయి. అతని మాటల్లో నిరాశ వుంటుంది. అయితే అతడు చేతలో ఆశావాదిగా అద్భుతంగా బయటికి వస్తాడు. అతని వ్యక్తిత్వంలో యిదొక వైరుధ్యం.

నాకెంతో నచ్చిన అతని యిటీవలి రచనలు 'కవన కుతూహలం', 'వరద కాలం'. ఇవి నిరాశనిండిన రచయిత రాసినట్లుండవు. వాస్తవచిత్రణ తెలిసిన పరిణతి పొందిన గొప్ప రచయిత రాసినవిగా తోస్తాయి. అతడి వాక్యాల్లోగానీ, అతడు చిత్రిస్తున్న ఏ వ్యక్తి మీద గానీ, నిరాశ లేశం కూడా

ప్రసరించదు. ఇది ఒక వైరుధ్యం. ఇలా ఎన్నో చెప్పవచ్చు. వరద ఆశాజీవి. మాటల్లో ఆశ చూపించి చేతల్లో నిరాశ కలిగించడం మంచిదికాదు. మాటల్లో నిరాశ వినిపించి, చేతల్లో ఆశను పండించడం గొప్పవిషయం. భాష మీద అధికారం, విద్వత్తు ఉంటే తప్ప యిది సాధ్యమయ్యేపనికాదు.

ఇదే వేదిక మీదకి ఛందస్సులతో ప్రవేశిస్తే అష్టావధానం, శతావధానం అనే రూపు దాలుస్తుంది. అతని సంభాషణం ఒక క్రీడ. వాక్యాన్ని విల్లంబుగా చేసి మాటలు బాణాలుగా విడిచి పెడతాడు వరద. అనుసరించే వాళ్లకి యిది ఒక విందు.

అతని పన్ పద చాతుర్యం ఒక్కోసారి ముళ్లులాగుచ్చుకుంటుంది. నిజానికి అతను పువ్వు లాంటివాడు. అందుకే అతను నాకు మొగిలిపువ్వు లా కనిపిస్తాడు.

శ్రీ శ్రీ యీ చాతుర్యాన్ని పజిల్స్‌లో చూపించాడు. వరద విద్వత్తుతో విద్యుత్ తెప్పిస్తాడు. వరద చేసిన పనులూ, వాటి ప్రమాణాలూ సదా వెలుగుతూనే వుంటాయి.

(సాహితీగవాక్షం, 'ఆంధ్రప్రభ', సోమవారం, జూన్ 7, 1993)

## వరద జ్ఞాపకాల వరదలో.....

ఆరుద్ర

కవన కుతూహలం కన్ను మూసింది. వరదకాలం కాలం చేసింది. ఆత్మీయులందరికీ అనుభవాలూ జ్ఞాపకాలూ మిగిల్చి అబ్బూరి వరద రాజేశ్వరరావు కీర్తి శేషుల్లో కలిసి పోయాడు.

నాకు జ్ఞాపకం వచ్చినప్పటినుంచీ అంటే అరవై సంవత్సరాల కిందట నుంచీ వరదను చూస్తూ వుండేవాడిని. విశాఖపట్నానికి ఆంధ్రాయూనివర్శిటీ వచ్చాక అబ్బూరి రామకృష్ణారావుగారూ, పింగళి లక్ష్మీకాంతంగారూ మొదలైన వాళ్ళంతా మొదట మా వీధిలోని ఇళ్ళలోనే వుండేవారు. ఆ రోజుల్లో మా వీధి ఒక సాహిత్యవేదిక.

వరద నాకన్నా మహా అయితే మూడు నాలుగేళ్ళు పెద్దవాడు. అయినా చిన్నప్పుడు మా ఇద్దరికీ ఒక తరం అంతరం ఉండేది. ఎందుచేత నంటే అతని స్నేహితులందరూ నాకన్నా, అతని కన్నా కొన్నేళ్ల సీనియర్లు. మాబాబయ్యగారు భాగవతుల నారాయణరావు (మానాన్నగారి రెండో తమ్ముడు) వరదకు బెస్ట్‌ఫ్రెండ్. (రావి శాస్త్రికి కూడా). ఆరాధ్యుల అన్నాజీవరావు (మా చిన్నమేనత్త భర్త), పూడిపెద్ది హాహారావు (మా పిన్నికి అక్కగారి కొడుకు). శ్రీ రంగం సుబ్బారావు (వృద్ధిలోకి వస్తున్నప్పుడే దుర్మరణం చెందిన యువకథకుడు, శ్రీరంగం రాజేశ్వరరావు తండ్రి) మొదలైన వాళ్ళందరూ వరదకు స్నేహితులు. వీళ్ళందరూ నాకు జ్ఞానం వచ్చినప్పటికి కాంగ్రెసు వాదులు. 1935-36 లో శాసనసభ ఎన్నికలు జరిగినప్పుడు కాంగ్రెస్ తరఫున ప్రచారం చేసేవారు. రమారమి రెండేసి రోజులకు ఒక పత్రం రాసి అచ్చువేసి పంచిపెట్టేవారు. ఆ రచన మాతాతగారి ఆఫీసు ఇంట్లోనే వరద చేతి మీద గానే జరిగేది. ఒక కర పత్రంలో జస్టిస్ పార్టీవారిలో ఎవరినో ఉద్దేశించి 'తొండం అప్పారావుకి తుస్' అని హెడ్డింగ్ పెట్టాడు. చివర ఓ రెండు గేయాలు కూడా రాశాడు. "సముద్రుడే మనకు సాక్షికదరా" అన్న చివరి పాదమే నాకు ఇప్పుడు జ్ఞాపకం. అయినా ఆ కరపత్రాలన్నీ నాకు చిన్నప్పుడు కంఠోపాఠమే. వాటిని చదివి ఎంతో ఉత్తేజితుణ్ణయాను. వాటి

ప్రభావం వల్లనే నేనూ ఓ కరపత్రం రాశాను. నేను చదువుకుంటున్న శివరామయ్య బడిలో నేను అన్యాయాలను కొన్న విషయాల మీద "రావుత్రయం" అన్న పేరుతో నేను రాసిన కరపత్రం మా హెడ్‌మాస్టర్ చేతిలో పడింది. ప్రతి ఫలం రెండు అరచేతులూ చిట్లిరక్తం వచ్చేటంత వేపబెత్తం దెబ్బలు. వెంకటేశం గిరీశంతో "నీ వల్ల నా కొచ్చిందల్లా చుట్టకాల్చడం ఒక్కటే" అన్నట్లు వరద మూలంగా నా రచనలకు దెబ్బలు తినడం ఒక్కటే వచ్చిందని చమత్కరించవచ్చుగాని రాసిన దానికి బాధ్యత వహించడం అన్నది చిన్నప్పుడే గుణపాఠం అయింది.

కొన్నాళ్లకి వరద రాయిస్టయాడు. అతనితో పాటు అతని స్నేహితులందరూ అటువైపే మొగ్గారు. ముఖ్యంగా మా బాబయ్యగారు. ఎమ్.ఎన్. రాయ్ పత్రిక 'ఇండిపెండెంట్ ఇండియా'కు ఎందరో చందాదారులను వరద చేర్పించాడు. వాళ్లకు వారం వారం పత్రికల్ని తన సైకిల్‌పై పెట్టుకొని తీసుకెళ్ళి ఇవ్వడం మా బాబయ్యగారి డ్యూటీ. మున్సిపల్ ఆఫీసులో ఉన్న కాంగ్రెస్ వాళ్ళకి రాయిస్టుల మీద అక్కసు పెరిగింది. టేక్సుకట్టలేదన్న నెపంతో సైకిల్‌ను జప్తు చేశారు. వరద తన స్నేహితులందరి దగ్గరా చందాలు దండి సైకిల్‌ను విడిపించాడు.

కొన్నాళ్ళకు అబ్బూరి మేష్టారు వాల్తేరుకి మకాం మార్చారు. వరద వాల్తేరు నుండి రోజూ తెల్లవారు జామున మేమంతా నిద్ర పోతున్నప్పుడు తలుపు తట్టి మా బాబయ్య గారిని లేపేవాడు. ఆయన లేచి వరదతో కలిసి ఆ ప్రాతఃకాలాన ఎక్కడికో వెళ్ళిపోయే వాడు. ఎక్కడికి వెళ్ళేవారో ఎందుకు వెళ్ళేవారో ఆ చిన్న వయస్సులో నాకు తెలిసేది కాదు. అయినా ఆ కారణం వరదతో నాకు సాన్నిహిత్యం పెరిగిన నలభై సంవత్సరాల తర్వాత తెలిసింది.

విశాఖపట్టణం వదిలి వెళ్ళిపోయినా ఆ వూళ్లో పెంచుకున్న అభిరుచులూ, రుచులూ వరదను వదిలి వెళ్ళిపోలేదు. ముఖ్యంగా రుచులు ఎన్నేళ్ళయినా అతని నోరూరించేవి. జట్కా చేయించుకొని వేకువ జామునే వాల్తేరు నుంచి మా వీధులకు రావడానికి ముఖ్యకారణం పెసరట్టు. విశాఖపట్నంలో ఆ రోజుల్లో శంకరవిలాస్, కోమల విలాస్ వంటి పెద్ద పెద్ద కాఫీ హోటేళ్ళు వుండేవి గానీ అతని గమ్య స్థానం అవి మాత్రం కాదు. పప్పుల వీధిలో మెయిన్ రోడ్డుకు చేరువగా వున్న కోమట్ల పెసరట్ల దుకాణాలే. వాట్లలో మూడు రకాల అట్లు వేసేవారు. పెసరట్టూ, పుల్లట్టూ, కలిపినట్టూ అని వాటి పేర్లు. పెసరట్టు పిండి కొంతా, పుల్లట్టు పిండి కొంతా కలిపి కలిపినట్టు వేసేవారు. ఆ అట్లు నంజుకోడానికి ఉల్లికారం చేసేవారు. దానికో ప్రత్యేకత వుండేది. దాని రుచి మరెక్కడా వుండేది కాదు. పెసరట్లకోసం ముఖ్యంగా అట్లు కారం కోసం వరద 'ప్రత్యూష పవనాంకురాలు పైకొనువేళ' వచ్చేవాడు.

1950 దశకం ప్రథమార్థంలో అనుకొంటాను, నేను ఒకసారి హైదరాబాదు వెళ్ళినప్పుడు వరద నన్ను వారం రోజుల పాటు తన ఇంట్లోంచి కదలనివ్వలేదు. ఛాయాదేవిగారికి పెసరట్లు వేయడం అంటే వచ్చుగాని, విశాఖపట్నం పప్పుల వీధి ఉల్లికారం చేయడం పట్టుబడలేదు. అదెలా చేస్తారో వరదకు కూడా తెలీదు. అది చేసే విధానం ఏమిటో నీకు తెలుసా అని వరద నన్ను అడిగాడు. ఎన్నోసార్లు దాన్ని రుచి చేశాను. దాని ఆకారం చూశాను గానీ అదెలా చేస్తారో నాకూ తెలీదు. అయితే ఆ ఉల్లికారంలో శనగపిండి రమారమీ జావలాగా వుంటుందని గుర్తుంది. ఉజ్జాయింపుగా ఆ ఉల్లికారం ఎలా చేస్తారో ఊహించి వివరించాను. ఛాయాదేవి గారూ, వరదా కలిసి ఆ వంటకాన్ని

తయారుచేశారు. మొదట విశాఖపట్నం ఉల్లికారానికి వేలు విడిచిన బంధువులాగా వున్నా, అభ్యాసం వల్ల ఛాయాదేవిగారు అసలు రుచిని సాధించగలిగారు.

హైదరాబాదు హిమాయత్‌నగరులోని వరద ఇల్లు రోజూ పొద్దుట విశాఖపట్నం పప్పులవీధిలోని పెసరట్ల దుకాణం అవతారం దాల్చేది. చిన్నప్పటి రుచులను గానీ, మిత్రులను గానీ వరద ఎన్నడూ మరిచిపోలేదు. చిన్నప్పటి కుర్రతనాన్ని ఎంత వయస్సు వచ్చినా పచ్చగా వుంచుకోగలగడం ఒక ప్రజ్ఞే.

నేను ఒక్కణ్ణే వెళ్ళినప్పడే కాదు, శ్రీ శ్రీ, నేనూ కలిసి హైదరాబాదు వెళ్ళినప్పుడల్లా మేము వరద అతిథులుగా కనీసం నాలుగైదు రోజులు అతని ఇంట్లో వుండిపోవలసిందే. మేము ఏ సాహిత్య సంస్థ ఆహ్వానం మీద వెళ్ళినా సభ ముగియగానే వరద మమ్మల్ని కారులో ఎక్కించుకొని వాళ్ళింటికి తీసుకుపోయేవాడు. నేను, శ్రీ శ్రీ, వరద, ఏల్చూరి, రాయప్రోలు రాజశేఖర్ మొదలైన వాళ్ళం రోజూ సాయంత్రాలు కలుసుకొనే వాళ్ళం. రాజశేఖర్ రేడియోలో వుండేవాడు. అతనితో చెప్పి వరద నాకో రెండు కాంట్రాక్టులూ, శ్రీ శ్రీకో రెండు కాంట్రాక్టులూ ఇప్పించి రేడియో కార్యక్రమాలు ఏర్పాటు చేసి వెనువెంటనే చెక్కులు ఇప్పించేవాడు. అవి క్యాష్ చేసుకొనే సౌకర్యాలు కల్పించేవాడు.

అతని అతిధులు గావున్నప్పుడు పొద్దున్నే కాఫీ, టిఫెన్లు కాగానే శ్రీ శ్రీనీ, నన్నూ చూసి పద్యాలు రాద్దాం అనేవాడు. తాను కాగితాలూ, కలం పట్టుకొనే వాడు. ఒకసారి శ్రీ శ్రీ ఎవరో ఇంగ్లీషు కవి చెప్పిన "We are the widows of God" అన్న పాదాన్ని చదివి "భగవంతుని వితంతువులం" అని అనువదించాడు. నేను "మృత్యువు పెరట్లో మందార పువ్వులం" అన్నాను వరద. "సిరిసిరి మువ్వలం, చెరిగిన దువ్వలం" అన్నాడు. మొదట తన పాదాలూ, తర్వాతనావీ, శ్రీ శ్రీవీ వరసగా కాగితం మీద పెట్టాడు. "కరుణకుమా బ్రతుకు" అన్నాడు శ్రీ శ్రీ. (ఈ విశాల విశ్వంలో నేకొరెడిదేమున్నది. ఒక దోసెడు తీరుబాటు, ఒక పిడికెడు సానుభూతి అనే పాదాలకు ప్రతిధ్వని). నేను "కవనం మామెతుకు" అన్నాను (అందమైన బ్రా-కొంతమెతుకుతో నిండుతుందిలే అన్న నా పాత భావానికి కుదింపు) ఈ రెండు పాదాలూ వరద కాగితం మీద పెట్టాడు. ఎనిమిది లైన్ల పద్యం తయారైంది.

ఆ పద్యం సంవిధానం తోనే సాయంత్రం దాకా చెప్పుకొంటూ పోయాం. మూడో లైన్లో మృత్యువు, అయిదో పాదంలో భగవంతుడూ వచ్చితీరాలని నేను నిర్దేశించాను. మోనాటనీ లేకుండా వుండడానికి మధ్య మధ్య ఆరులైన్ల పద్యం ఒకటి వుంటే బాగుంటుందని అనుకున్నాం. అవీ చెప్పాం. వరద సాపు రాశాడు. ఆ సాయంత్రం ఏల్చూరి సుబ్రహ్మణ్యం గారు తదితర మిత్రులూ కలుసుకొన్నాక మానహరచన సుబ్రహ్మణ్యంగారికి అంకితం ఇస్తూ ముగ్గురం కంద పద్యాలు చెప్పాం. కాగితం మీద వరద పెట్టాడు.

ఆ రచన ఆ మర్నాడే నేనూ, శ్రీ శ్రీ మరిచిపోయాం. వరద ఆ కాగితాలను భద్రంగా దాచి, చక్కగా సాపుచేసి, నాతో గానీ, శ్రీ శ్రీ తో గానీ చెప్పకుండా ఎవరో పబ్లిషరుకిచ్చి "మేమే" అన్న శీర్షికతో పుస్తకరూపంలో ప్రచురించాడు . నేను ఆశ్చర్యపోయాను. "ఏమిటిలా చేశావు" అని అడిగితే తనకు సహజమైన నవ్వు విరగబడి నవ్వి "ముగ్గురు ప్రఖ్యాత కవుల రచన కాగితాల్లో

మూలుగుతూ వుండాలా? అచ్చుపోసి వదిలేస్తే విచ్చలవిడిగా తిరుగుతుంది" అన్నాడు. "దీనివల్ల మనకి అపఖ్యాతే గాని ఖ్యాతి రాదు" అన్నాను. సరిగ్గా అంతే అయింది. అయినా శ్రీ శ్రీ గానీ, నేను గానీ వరదను ఏమీ అనలేకపోయాం.

ఇంకో సారి నేను హైదరాబాదు వెళ్ళినప్పుడు యథాప్రకారం వరద అతిథిగా ఓ మూడు రోజులు వాళ్ళింట్లో వుండి పోక తప్పలేదు. పెసరట్లూ ఉల్లికారం తిన్నాక కాగితాలూ పెన్నూ పట్టుకుని వరద పద్యాలు రాద్దాం అన్నాడు. ఆ రోజుల్లో ఛాయాదేవిగారి సంపాదకత్వంలో 'కవిత' అనే పత్రికను వరద ప్రారంభించాడు. "ఇప్పుడు రాసేవి సరదాకు కాదు, అచ్చువేయడానికే" అని ముందుగానే హెచ్చరించాడు. ఇద్దరం కవిత్వ రూపంలో సాహిత్యచర్చ చేశాం. అది 'కవిత'లో తొలిసారి ప్రచురితమైంది. దాన్నే నేను 'సినీవాలి' కావ్యంలో సాహిత్యోపనిషత్తులో చేర్చుకున్నాను.

వరదా, నేనూ కలుసుకున్నప్పుడల్లా మా వ్యాపకం సాహిత్యం, మా వ్యాసంగం కవిత్వం. మా జ్ఞాపకాలు సాహిత్య వ్యక్తుల గురించే, మా చర్చలు డిటో-డిటో. మా మిత్రులు సాహితీ పరులే. అతనితో వున్నంత సేపూ నేను సినిమాలో పనిచేస్తున్న విషయమే మరిచి పోయేవాడిని. అతడు ఎక్కడ ఏ ఉద్యోగం చేస్తున్నాడో నేను ఉత్తరోత్తరా ఎప్పుడూ అడగలేదు. అడిగి ఇబ్బంది పెట్టడం ఇష్టం లేకనే అడిగే వాడిని కాదు. చాలా ఉద్యోగాలు చేశాడు.

వరద నైజాం కొలువులో వున్నప్పుడు నేను నా తెలంగాణా రణ గీతాలూ, త్వమేవాహమ్ రాస్తూ వుండేవాడిని. ఆ రోజుల్లో ఒకసారి వరదని "ఇంతకన్నా మంచి ఉద్యోగం నీకు దొరకదా? నువ్వీ నేకరీ చేస్తే చేస్తున్నావుగానీ శ్రీ శ్రీని కూడా లాక్కుపోతున్నావేం?" అని అడిగాను. వరద బాధపడ్డాడు. ఆ తర్వాత నుంచీ అతడు ఎక్కడ ఏ ఉద్యోగం చేస్తున్నదీ ప్రశ్నించడం మానేశాను.

పోలీసు యాక్షన్ తర్వాత నైజాం కొలువులో పెద్ద ఉద్యోగాలు చేసిన వాళ్ళని అరెస్టు చేశారు. వరదకి కారాగారం ప్రాప్తించింది. అప్పుడే 'చెరకాలం' అనే కవితా సంకలనం వరద రచించాడు. దాన్ని 'అందాక' అనే పేరుతో ప్రచురించాడు. ఈ పుస్తకానికి శ్రీ శ్రీ ఆరేడు కంద పద్యాల పీఠిక రాశాడు. అందులో నాలుగే వరద అచ్చువేశాడు. 'అందాక' ప్రతి ఒకటి నాకు వరద ఇచ్చాడో, పంపించాడో అందులోని పద్యాలు జ్ఞాపకాల మరుగుల సొరుగుల్లోకి వెళ్ళిపోయాయి.

వరద జ్ఞాపకాలు ఇన్నీ అన్నీకావు. కొన్ని మధురానుభూతులు, కొన్ని మదిరానుభూతులు. కొన్ని ఎప్పుడూ మరిచి పోలేనివి. కొన్ని ఎప్పుడైనా రికార్డు చేయవలసినవి. నేను రాస్తున్న శ్రీ శ్రీ జీవిత చరిత్రలో వరద కూడా ఒక ప్రముఖ పాత్రదారి. అప్పుడు అతని గురించి రాయవలసినవి రాస్తాను. ప్రస్తుతానికి ప్రస్తుతించదగ్గది స్నేహితుల పట్ల ముఖ్యంగా అప్పులను కున్న వాళ్ళ పట్ల అతని అచంచల విశ్వాసం. అటువంటి ఆత్మీయత చాలా అరుదైనది.

– ('ఆంధ్రజ్యోతి,' ఆదివారం, 30 మే 1993)

## అంకితభావం

## ఆయన రచనల జీవం!

## అబ్బూరికి 'కోట్ల' నివాళి

[ఆంధ్రప్రభ ప్రతినిధి]. హైదరాబాద్, జూన్ 3.

ప్రముఖ రచయిత, జర్నలిస్టు, విమర్శకుడు, అధికార భాషా సంఘం మాజీ ఛైర్మన్ శ్రీ అబ్బూరి వరద రాజేశ్వరరావు మరణం తెలుగు వారికి తీరని లోటు మిగిల్చిందని ముఖ్యమంత్రి శ్రీ కోట్ల విజయభాస్కరరెడ్డి అన్నారు.

బుధవారం నాడిక్కడ "ఫోరం ఫర్ ఫ్రీడమ్ ఆఫ్ ఎక్స్‌ప్రెషన్" ఏర్పాటు చేసిన అబ్బూరి వరద రాజేశ్వరరావు సంస్మరణ సభలో ప్రసంగించిన ముఖ్యమంత్రి తన దివంగత మిత్రునికి ఘనంగా నివాళులర్పించారు.

అతి కొద్ది మంది వ్యక్తిగత మిత్రులలో శ్రీ అబ్బూరి ఒకరని, ఆయన మరణం తనకు ఎనలేని నష్టాన్ని కల్గించిందని శ్రీ విజయ భాస్కరరెడ్డి విచారం వ్యక్తం చేశారు.

1955లో రాష్ట్ర కాంగ్రెస్ రాజకీయాలలో అప్పుడే ప్రవేశించిన తనకు శ్రీ అబ్బూరితో పరిచయం ఏర్పడిందని, ఆ తరువాత పెరిగిన మిత్రత్వం ఆయన చనిపోయేవరకు కొనసాగిందని ముఖ్యమంత్రి చెప్పారు. 1977లో తాను పార్లమెంట్‌కు ఎన్నికై ఢిల్లీకి పోయినా తమ మధ్య సంబంధాలు కొనసాగాయని అన్నారు.

రచయితగా ముఖ్యంగా హాస్య రచయితగా శ్రీ అబ్బూరికి గల ప్రాశస్త్యాన్ని తాను వివరించనవసరం లేదంటూ "ఆయన రచనల్నింటిలోనూ తాను నమ్మిన విలువలు, సిద్ధాంతాల పట్ల అంకిత భావం కనిపించేది" అని ఆయన చెప్పారు.

గత 10, 15 ఏళ్ళుగా శ్రీ అబ్బూరి బయటి కార్యక్రమాలలో పెద్దగా పాల్గొనకపోయినా తనను కలిసిన సన్నిహిత మిత్రులతో ఎంతో ఆసక్తితో చర్చల్లో మునిగి పోయేవారని ముఖ్యమంత్రి గుర్తు చేసుకున్నారు.



"నాకు ఇక్కడ [రాజకీయాలలో] ఏవైనా ఒత్తిడులు వచ్చినప్పుడు అబ్బూరి దగ్గరకు వెళ్లేవాడిని, ప్రతినెలకో, రెండు నెలల కోసారో మేం తప్పక కలుస్తూండేవాళ్ళం" అని తమ మధ్యగల సంబంధాన్ని శ్రీ విజయభాస్కర రెడ్డి వివరించారు.

సాహిత్యం, భాష గురించి ఎంతో తెలిసిన వ్యక్తి కనుకనే ఆయనకు అధికార భాషా సంఘం ఛైర్మన్ పదవిని ఇచ్చానని ముఖ్యమంత్రి చెప్పారు.

"పాపం, ఆయన ఛార్జి తీసుకున్నా ఏమీ చేయలేకపోయారు. ఆయన ఉండి ఉంటే రాష్ట్రానికి, తెలుగు భాషకు ఎంతో సేవ చేసేవారు." అని ఆయన అన్నారు....

పత్రికారంగంలో శ్రీ అబ్బూరి సేవలను కొనియాడిన శ్రీ పి. వామన్‌రావు....ప్రముఖ సంపాదకులు శ్రీ ఎ.బి. కె. ప్రసాద్ మాట్లాడుతూ వచన రచనలో శ్రీ అబ్బూరిశైలి, స్పష్టత యువతరానికి ఆదర్శనీయమన్నారు. తాను ఇదివరకు పనిచేసిన పత్రికల కోసం అడిగినదే తడవుగా "వరదకాలం", "జ్ఞాపకాల వరద" అనే కాలమ్‌లకోసం శ్రీ అబ్బూరి రచనలు పంపారని....వ్యక్తం చేశారు. శ్రీ ఏల్చూరి సుబ్రహ్మణ్యం మాట్లాడుతూ సాంప్రదాయక ప్రక్రియల్లో ఆధునిక భావాలను పలికించడంలో శ్రీ అబ్బూరి అనన్య ప్రావీణ్యం కనబరచేవారని ప్రశంసించారు. శ్రీ అబ్బూరి నివాస గృహం కవులకు రసవత్తర వేదికగా ఉండేదని, నూతన భావాలు ఎక్కడి నుంచి వచ్చినా ఆయన ఆదరించేవారనీ చెప్పారు. శ్రీ నగ్నముని మాట్లాడుతూ "మమ్మల్ని ఉత్తేజపరచిన వ్యక్తి శ్రీ అబ్బూరి" అన్నారు. తెలుగువాడు దేశానికి, ప్రపంచానికి సేవ చేసేందుకు ఎంత సాహసమైనా చేయగలడు అని రుజువు చేసిన వ్యక్తి అబ్బూరి అని ఆయన చెప్పారు. భారతీయ భాషల, ఆంగ్ల కవితలను దేశప్రజానీకానికి అందించేందుకు అబ్బూరి చేసిన కృషిని శ్రీ నగ్నముని ఘనంగా కొనియాడారు. తన తండ్రి శ్రీ అబ్బూరి రామకృష్ణారావుకు కూడా పేరు తెచ్చిన శ్రీ అబ్బూరి వరద రాజేశ్వరరావు ఆధునికత, అభ్యుదయం మూర్తిభవించినవాడు అని ఆయన అన్నారు. శ్రీ ఎం.వి. రామమూర్తి మాట్లాడుతూ శ్రీ అబ్బూరి రాడికల్ డెమొక్రాట్ అని, అయితే ఆయన మాటల్లో నైరాశ్యపుపార కన్పించేదని అన్నారు. శ్రీ పి. జనార్ధన్ రెడ్డి మాట్లాడుతూ శ్రీ అబ్బూరికి తెలంగాణా ప్రజలపై, రాజకీయాలపై ఎంతో మక్కువ ఉండేదని, అయితే ఎందువల్లనో ఆయన రాజకీయాలకు దూరమయ్యారని అన్నారు.

శ్రీ పన్నూరి రామారావు, శ్రీ బూదరాజు రాధాకృష్ణ కూడా శ్రీ అబ్బూరి వివిధ రంగాలలో, ముఖ్యంగా నాటకరంగంలో చేసిన కృషిని వివరించారు. సభకు జాతీయ 'భూ భౌతిక పరిశోధనా సంస్థ' మాజీ శాస్త్రజ్ఞులు శ్రీ మావిళ్ళపల్లి చక్రవర్తి అధ్యక్షత వహించారు.

ఫోరం కన్వీనర్ శ్రీ పి. సురేంద్రరాజు మాట్లాడుతూ పత్రికారంగానికి ఎంతో సేవ చేసిన శ్రీ అబ్బూరి పేరిట జర్నలిస్టుల కాలనీలో ఒక ప్లాటు కేటాయించాలని ముఖ్యమంత్రిని కోరారు. శ్రీ ఎం. లక్ష్మయ్య వందన సమర్పణ చేశారు.

('ఆంధ్రప్రభ', జూన్ 4, 1993)

నివాళి

# తెలుగు సాహిత్యానికి మళ్ళీ వరద రావాలి

సురేంద్రరాజు

"ఈ ప్రపంచం ఒక పెద్ద కారాగారం. అందుకే ఏకాంత నిర్బంధం ఇక్కడ సర్వోత్కృష్టం" – కార్ల్‌క్రాజ్.

అబ్బూరి వరద రాజేశ్వరరావుగారు బతికినన్నాళ్ళూ లోకంతో రాసుకుంటూ, పూసుకుంటూ తిరిగారు. ఒడ్డును ఒరుసుకుంటూ సాగింది వారి జీవితం. కదిలీ కదలకుండా, నింపాదిగా పారే ఏటినీటి వాలుపై చేవ్రాలు ఆయన జీవనగమనం. చలిస్తూనే నిశ్చలంగా వుండే ప్రశాంత సరసి, వారి జీవన విహాయసానికి అద్దం పడుతుంది. అందుకే అంతటా వుంటూనే ఆయన ఎక్కడా వుండరు. సర్వత్రా కనిపించినట్టే కనిపించి ఎక్కడా కనబడకుండా మాయమవుతారు. గట్టిగా వెదికితే తప్ప ఆయన ఉనికిని కనిపెట్టడం కష్టం.

గత అర్థశతాబ్ది ఆంధ్రదేశపు సాహిత్య చరిత్రలోని ప్రతిమలుపు వద్ద ఆయన ఉన్నారు. అయితే క్షణకాలం మెరిసి మరుగున పడతారు. పనులు తలపెట్టడం, కొత్త కొత్త పనులు, వేరెవరికీ ఊహకైనా అందక ముందే చేపట్టడం, చేపట్టిన పని అప్పటికి పూర్తి కావడానికి చేయాల్సిందంతా చేయడం మీద వున్న ఆసక్తి, అభినివేశం ఆ పనిని కొంత కాలమైన కొనసాగించడం పట్ల ఆయనకు లేవు. నిలకడగా ఒక చోట నిల్చోవడం ఆయనకు గిట్టదు. కొద్దిరోజుల్లోనే ఆయనకు ఆ పని విసుగేస్తుంది. మళ్ళీ మరో కొత్త పనిలో పడతారు. ఏ పని మీదైనా మోజు ఎక్కువ కాలం వుండక పోవడమే దీనికి కారణం కావచ్చు. ప్రతి ఆచరణలో ముందు ఉత్సాహం, తరువాత నిర్లిప్తత వెంట వెంటే వుండే వ్యక్తిత్వం కావడం వల్లే కాబోలు 'నాందీ ప్రస్తావన' తర్వాత ఆయన అయిపు వుండదు. అందుకే 'సూత్రధారి' పాత్ర పోషణపై వున్న ఆసక్తి 'ప్రయోక్త' కావడం పట్ల ఆయనలో మనకు కనిపించదు. ఎంతటి కార్యాచరణ అయినా నిష్ఫలమేనన్న ఒక బలీయమైన విశ్వాసం అంతరాంతరాల్లో ఎరిగిగాని, ఎరగకగాని ఆయనకు వుండే వనుకుంటాను. నిస్పృహ, నిర్వేదం, నిరాశ ఆయన మాటల్లో ఎప్పుడూ ప్రతిఫలించడం ఇందుకే ననుకుంటాను. (ఆయన సెన్సాఫ్ హ్యూమర్‌ను ఈ నిర్వేదానికి విరుగుడు గానే చూడాలేమో.) తన 'ప్రతిమ'లను పెంచి పోషించడం మనకు ఆయనలో కనిపించదు. అంతటి సహనం ఆయనకు లేదు. చేయకముందు ఒక పనిపై వుండే ఆసక్తి, చేసిన తరువాత వుండకపోవడం అందరికీ అనుభవమే. ఈ సర్వసాధారణ అనుభవాన్ని అబ్బూరి వారు ఒక అసాధారణ రీతిలో గాఢంగా అనుభవించారు కాబట్టే దానికి ఒక తాత్వికస్థాయి సమకూరింది. ఎక్కువ ఇష్టపడే పనులను పక్కన పెట్టి, పెద్దగా ఇష్టపడని, లేదా తక్కువ ఇష్టపడే పనులను ముందు చేయడం కూడా అబ్బూరికి అలవాటు. అత్యధికంగా ఇష్టపడే పనులను ఎంత కష్టపడ్డా సంతృప్తికరంగా చేయలేనేమో నన్నభయం, కొద్దిగా ఇష్టపడే పనులను సులువుగా చేసేయవచ్చనే నమ్మకం బహుశా కారణమై వుంటుంది.

బెల్లం కొండ రామదాసు కవితా సంకలనం తేవడం ఆయనకు ఎంతో ఇష్టం. కానీ తేలేదు. అలాగే 'కవిత' రెండు సంపుటాల పునర్ముద్రణ కూడా చాలా ఇష్టం. అదీ చేయలేదు. బెల్లం కొండరామదాసుతో పాటు శ్రీ శ్రీ, శిష్ట్లా, నారాయణబాబు, బైరాగి, అజంతావంటి తనకు ఇష్టమైన అతి కొద్దిమంది కవుల పెద్దసైజు ఫొటోలతో, అంతే పెద్దసైజులో ('భారతి' సైజు) వారి సెలెక్టెడ్ పోయమ్స్‌ను (ఫొటో, పోయం ఎదురెదురుగా) వేయాలని ఆయనకు ఎంతో కోరికగా వుండేది. ఇందుకోసం ఆయన కొంత పరిశ్రమించారు కూడా. కవితలు ఎంపిక చేసి పెట్టారు. ఫొటోలకోసం గాలించారు. లోపరహితంగా, పర్‌ఫెక్ట్‌గా ఒక పనిచేయలేనప్పుడు, ఆ పని చేయకపోవడమే మంచిదనుకోవడం వల్ల కూడా బహుశా ఆయన ఈ మూడు ముఖ్యమైన పనులు పక్కన పెట్టి వుంటారు. జాతీయ స్థాయిలోనే ఎన్నదగిన కవితా సంపాదకుడు-అందుకే మిన్నకుండి రచయిత ముందు కొచ్చాడు...

....లోకంలోకి వెళ్ళి ఎన్నెన్ని పనులు చేసినా, ఆయన ఏకాంతాన్నే ఎక్కువగా కోరుకున్నారు. ప్రపంచమార్గం మీద ఆయనకు పెద్దగా ఆశలులేవు. అధ్యయన శీలత, సాహిత్యానురక్తి, చిత్తశుద్ధి వున్న యువకులను ఆయన ప్రేమించారు. అలాగే మిడిమిడి జ్ఞానంతో కళ్లెగరేసేవారిని, మీడియోకర్స్‌ని ఆయన ద్వేషించారు. చివరి రోజుల్లో ఆయనను ఎందరో సంప్రదాయవాదిగా, సినిక్‌గా జమ కట్టారు. కాని నిజానికి ఆయన ఆ రెండూ కాదు. కాలంతో పాటు మారిపోయే దిగజారుడు తనానికి దూరంగా కొన్ని విలువలకు కట్టుబడి వున్నందునే ఆయన పాతతరం ప్రతినిధిలా కనిపించారు. ఆయన పైసినిక్ ముద్రవేయడానికి కూడా ఈ మారని తనమే కారణమైంది. అయితే తనకు నచ్చిందే కవిత్వం మిగతాది కాదు అనే వితండవాదం కూడా ఆయనలో తరచుకనిపించేది. కార్ల్‌క్రాజ్ లా ప్రపంచాన్ని కారాగారంలా భావించారు కనుకే ఆయన "చెరకాలం" కవి అయ్యారు. మందికి దూరంగా స్వచ్ఛందంగా తనపై తాను నిర్బంధాన్ని విధించుకున్నారు. "సంస్కృతి సజీవంగా వుందని చెప్పడానికి ఒకటే నిదర్శనం. సౌందర్యానికి చిహ్నంగా వుండే అద్భుతమైన లోహపాత్రకు, మూత్ర పాత్రకు మధ్య భేదాన్ని గుర్తెరగడమే ఆ నిదర్శనం. నేను చేసిందల్లా ఈ రెంటికీ మధ్య తేడా చూపించడం" అన్నాడు మహానుభావుడు కార్ల్‌క్రాజ్. అబ్బూరి వరద రాజేశ్వరరావుగారు కూడా ఆ పనే చేశారనుకుంటున్నాను. రెంటికీ మధ్య తేడా గుర్తెరగని వారు (వారిదే మెజారిటీ) దీని దానిగా, దాన్ని దీనిగా వాడుతున్న ప్రస్తుత క్షీణయుగంలో వరద రాజేశ్వరరావుగారు మళ్ళీపుట్టాలి.

('సుప్రభాతం', 5 జూన్ 1993)



జరిగిందని అందరూ అనుకుంటున్నారని. నాటకం చూచిన పెద్దలందరూ స్టేజి మీదికి వచ్చారు, మాష్టారుగారి నాటకాన్ని ఎంతో మెచ్చుకున్నారు. అదే ననుకుంటా "నటాలి high point. కొన్ని నెలల్లోనే మాష్టారుగారు పరివారంతో సహా తెనాలి వెళ్లిపోయారు. అక్కడ కూడ చాల రోజులు జరగలే, సపోర్టు లేక. యింకొన్ని నెలల్లో నేను గూడ మద్రాసు వదలి హైదరాబాదు పోయినాను, దారిలో తెనాలిలో ఒక రోజు వుండి.

•

హైదరాబాదులో వరద కలిసేవాడు అప్పుడప్పుడు ఫణి భూషణరావుతో కూడ. మహాసంధిగ్ధకాలం అది. ఇంకో రెండు సంవత్సరాల లోపలే దేశం స్వతంత్రం అవుతుందన్న నమ్మకం మాలో చాలామందికి వుండేది కాదు. ముఖ్యంగా హైదరాబాదులో ఏమవుతుందో న్న సంశయం వుండేది. Police action లాంటిది జరగవలసి వస్తుందనీ, హైదరాబాదు కూడ దేశంలో ఒక భాగం అవుతుందని నమ్మకం కూడ ఒకవైపు ఉండేది. ఆ రోజులలో జరిగిన ఒక చిన్న గమ్మత్తయిన విషయం జ్ఞాపకానికి వస్తుంది. నిజాం ప్రభుత్వం ఆఖరి రోజులలోనే కుందూరి ఈశ్వరదత్తుగారు అక్కడ Information adviser గా చేరారు. నేనప్పుడు నారాయణగూడ YMCA లో వుండేవాణ్ణి. అప్పటి సమస్యలను గురించి ఒక సభ జరిపించాలనుకున్నా YMCA లో. నేను దత్తుగారిని Lakeview Guest House లో కలిసి ఆ సభలో పాల్గొనమని కోరాను, అధ్యక్షుడిగా వారికి అభ్యంతరం లేకపోతే. కాదంటే, వచ్చి మాట్లాడినా మహాసంతోషం అని. ఆయన రావడానికి ఒప్పుకున్నట్టు జ్ఞాపకం. అట్లాగే, నేను అక్కడ అప్పుడు పని చేసే పత్రికలో ఒక ప్రకటన వేయించాము. దానివల్ల పెద్ద గొడవ అయినట్లు మర్నాడు, వరద, ఫణి వచ్చి చెప్పారు. ఆ సభకు దత్తుగారు రావడం లేదని రెండవరోజు పత్రికలో యింకో ప్రకటన వేయించవలసి వచ్చింది. అదయింతర్వాత వరద అప్పుడప్పుడు కనిపించేవాడు. అయితే యింకో సంవత్సరంలోపుగానే, అంటే Police Action ముందే, నేను హైదరాబాదు వదలి పోయినాను. అక్కడక్కడా తిరిగి ఇంకో 10, 12 ఏండ్ల తర్వాత ఢిల్లీ చేరితే, వరదను మళ్లీ కలుసుకోడం అయింది. ఈసారి పత్నీసహితం.

ఒక రోజు అనుకోకుండా కనిపించారు వరద, ఛాయ యిద్దరు, ఒక బస్సు క్యూలో. ఛాయను మొదటిసారి అదే చూడ్డం నేను. యింకో ఇరవై ఏళ్లపైగానే గడిచిపోయాయి ఢిల్లీలో మా అందరికి దగ్గరగా, దూరంగా.

ఢిల్లీలోనే మాష్టారు గారిని తిరగి కలవడం జరిగింది. మాయింటికి అప్పుడప్పుడు వచ్చి ఒకటి రెండు రోజులు వుండి పోయేవారు. మళ్లీ పాతకలవరాలు పైకొచ్చినట్లు, కడుపు కలియబెట్టినట్లు అయేది. మద్రాసులో మాష్టారితో గడిపిన రోజులలో కన్నకలలు కలలుగానే వుండి పోయినాయేనని, అందలేని అనుభూతులు అందలేనివిగానే వుండిపోయినా యేనని, కాలం అర్థం లేకుండా గడిచి పోతున్నదేనని, అజ్ఞాత బాధ ఎక్కడో పీకుతునే వుండేది. దాన్నంతా కిందికి నెట్టేసి, రోజు పనుల్లో మునిగిపోయి, అందులోనే మనశ్శాంతి వుందన్న ఇంకో భ్రమతో కాలం గడిపేవాళ్లం.

ఆ రోజుల్లో మాష్టారిలో కూడ ఒక విధమైన నిస్పృహ కనిపించేది, నిస్సహాయత కూడ.

వరద సంగతి చెప్పలేను. తననుకూడ ఏదో అశాంతి కొద్దిగానో గొప్పగానో వెంటాడేదని నా

సందేహం. ఏవో పనులు చేస్తూ కాలం గడిచి పోయినా, సార్థకమైనపని ఏమీ చెయ్యలేక పోయినామే అన్న ఆరాటం వెంటవస్తూనే వుందని అనిపించేది–ఇంకా అనిపిస్తూనే వుంటుంది. వరదకు కూడా అట్లాగే వుండేదేమో.

•

ఢిల్లీలో వరద వాళ్ల ఇంట్లో 1979 ఏప్రిల్ నెలలో మాష్టారుగారు పోయినప్పటి దృశ్యాలు, సంగతులు నిన్న మొన్న చూసి నట్టు యింకా వుంటుంది. జీవంలేని ఆయన దేహం వున్న గదిలో కొన్నిగంటలు నేను గడిపినట్టు జ్ఞాపకం, వాళ్లూ వీళ్లూ వస్తూ పోతూ వుంటే. మంచు గడ్డలను మారుస్తూ, చేరుస్తూ, అనుకొనేవాణ్ణి ఆ దేహానికి ఎక్కడ దెబ్బతగలకుండా వుండడం చాల అవసరమని. అక్కడనుంచొని, మాష్టారుగారితో మద్రాసు సముద్రతీరంలో, మౌంట్ రోడ్ లో గడిపిన గంటల గురించి అనుకుంటూ వుండేవాణ్ణి.

అదంతా అయింతర్వాత, ఒక విధంగా జీవం, జీవనం కుదుట బడినట్టయింది. వరద ఎట్లాంటి క్షోభపడ్డాడో నేను చెప్పలేను. కాని, తనకు కూడ ఇంకెక్కడి సంఘర్షణలే అని అనిపించిందేమో నన్న సందేహం నాకు వుండేది.

త్వరలోనే వరద, ఛాయలు ఢిల్లీ వదలి హైదరాబాదుపోయారు. నేను కూడ హైదరాబాదు చేరినప్పుడు, ఎప్పుడూ అర్థంకాని విషయాలు, మాష్టారుగారు చూపించిన మబ్బులోని శిఖరాలు మబ్బుల్లోనే ఎందుకు వుండి పోయాయన్న సంగతులు మాట్లాడుకోవచ్చనుకొనేవాణ్ణి. ఇప్పుడు వరద కూడ లేడు.

అయితే ఒక పెద్ద ప్రయత్నం చేసి పోయినాడు వరద. నిండయిన జీవితం నిండుగా గడపడానికి, మానవ సంస్కారం అవిభాజితమైనదన్నమాట అవగాహన చేసుకోడానికి, మాష్టారిలాంటి వారు చేసినపని, చూపించిన దారి ఎట్లా రూపొందిందో అందరికి తెలిసివచ్చేట్లు ఆనాటి అనుభూతులెన్నిటినో గురించి చక్కగా వ్రాశాడు. కొంతైనా తన బాధ్యత నిర్వహించుకున్నాడు.

ధన్యుడు, నాలాంటి వాళ్లకంటె.

['వరదస్మృతి' కోసం ప్రత్యేకంగా రాసిన వ్యాసం]



# 'ప్రతిమాసుందరి' కర్త 'వరద'

## ఎ.ఎల్. నరసింహారావు

అబ్బూరి రామకృష్ణారావుగారి కుటుంబంతో నాకు ఐదు దశాబ్దాలపైగా సన్నిహిత సంబంధం ఉంది. నన్ను గుంటూరు నుంచి కమ్యూనిస్టు పార్టీ విశాఖపట్నంలో పని చేయడానికి పంపింది. ఆ నాటి నుంచి నాకు ఆ కుటుంబంతో సన్నిహిత సంబంధం ఏర్పడింది. ఆ రోజుల్లో రామకృష్ణారావుగారికి ముగ్గురు పిల్లలు. పెద్దబ్బాయి వాణీకుమార్, రెండో అబ్బాయి పేరు వరద రాజేశ్వరరావు, అమ్మాయి పేరు రాజ్యలక్ష్మి. ఆ ముగ్గురూ ఆ రోజుల్లో హైస్కూల్ తరగతుల్లో చదువుతుండేవారు.1936 వరకూనాకు ఈ పిల్లలతో అంతగా పెద్ద సంబంధం ఉండేది కాదు. 1936 లో నేను, రామకృష్ణారావుగారు కమ్యూనిస్టు పార్టీనుంచి విడిపోయిన తర్వాత ఎమ్.ఎన్. రాయ్ గ్రూపుతో సంబంధం ఏర్పడింది. 1936 చివరి భాగంలో రాయ్ దంపతులను మేము విశాఖపట్నం ఆహ్వానించాం. పి.హెచ్. గుప్త గారి ఇంట్లో వారికి బస ఏర్పాటు చేశాం. అప్పట్నించీ నాకు వాణి, వరదరాజేశ్వరరావులతో సంబంధం ఏర్పడింది. అబ్బూరి వరద రాజేశ్వరరావు అంటే చాలా మందికి తెలీదు. 'వరద' అంటే బహుళ సంఖ్యాకులకు తెలుసు. ఇతను హైస్కూల్ విద్యార్థిగా ఉన్నప్పుడే హైస్కూల్ మేగజైన్‌లో చిన్నచిన్న కవితలు వ్రాసేవాడు.

రామకృష్ణారావుగారు మంచి కవిగా పేరు పొందారు. ఆయన వ్రాసింది తక్కువైనా పేరు ప్రఖ్యాతులుమాత్రం నేటికీ నిలచి ఉన్నవి. ఇంగువ కట్టిన గుడ్డ వాసన పోదన్నట్లు తండ్రి కవిత్వధోరణి 'వరద'కు అబ్బింది. అప్పట్లో వరదను బాలకవి అనేవారు. కుర్రవాడు అందంగాను, చురుకుగాను ఉండేవాడు. ఎ.వి.యన్.కాలేజీలో వరద విద్యార్థిగా ఉన్నప్పుడు సాంబమూర్తి సోమయాజులు గారు అనే ఒక టీచర్ ఉండేవారు. ఆయనకు రామకృష్ణారావు గారంటే ఎంతో భక్తిశ్రద్ధలు ఉండేవి. రామకృష్ణారావు గారి కొడుకు మీద కూడా ఆయనకు అభిమానం ఏర్పడింది.

రాయ్ దంపతులు విశాఖపట్నంలో అప్పుడు 3 వారాలున్నారు. శ్రీ ఎ.వి.భానోజీరావుగారు మున్సిపల్ ఛైర్మన్‌గా ఉండేవారు. పి.హెచ్. గుప్తగారు భానోజీరావుగారికి ఆప్తమిత్రులు. గుప్తగారి ప్రోద్బలంతో భానోజీరావుగారు ఎమ్.ఎన్.రాయ్‌కి మున్సిపల్ టౌన్‌హాల్‌లో పౌరసన్మానం ఏర్పాటు చేశారు. ఆ సభకు వరద, వాణి, వారి మిత్రులు అనేకమంది విద్యార్థులను సభకు తీసుకు వచ్చారు.సభ దిగ్విజయంగా జరిగింది.

ఆ తరువాత మేము యూత్‌లీగ్ అనే సంఘాన్ని ఏర్పాటు చేశాం.మొదటి అసెంబ్లీ ఎన్నికలలో తెన్నేటి విశ్వనాథంగారు కాంగ్రెస్ అభ్యర్థిగానూ, భానోజీరావుగారు జస్టిస్ పార్టీ అభ్యర్థిగానూ పోటీచేశారు. భానోజీరావుగారు ఓడిపోయారు.

ఆ తరువాత కొంతకాలానికి భానోజీరావు గారిలో ఒక మార్పు వచ్చింది. ఆయన కాంగ్రెస్‌లో చేరడానికి నిర్ణయించుకున్నారు. యూత్ లీగ్ తరఫున మేము టౌన్‌హాల్లో ఒక సభ భానోజీరావుగారి కోసం ప్రత్యేకంగా ఏర్పాటుచేశాం. అప్పుడు పి.హెచ్.గుప్తగారు టౌన్ కాంగ్రెస్ ప్రెసిడెంట్‌గా ఉండేవారు. ఆ మాసభకు గుప్తగారిని అధ్యక్షులుగా ఉండమన్నాం. ఆయన వెనకా ముందు ఆలోచించి అంగీకరించారు. ఆ సభకు యూత్‌లీగ్ సభ్యులను-యువకులను, విద్యార్థులను వందలాది మందిని సమీకరించడంలో వరద చేసిన కృషి ప్రశంసనీయమైనది.

అంతకుముందు ఎమ్.ఎన్. రాయ్‌ని ఎ.వి.యన్.కాలేజీ విద్యార్థుల సభలో ప్రసంగించడానికి వరద, మరి కొంతమంది విద్యార్థులు ఎంతో కృషిచేశారు. కొంతమంది కమ్యూనిస్టు సానుభూతి విద్యార్థులు ఈ మీటింగు జరగకుండా అవరోధాలు కల్పించడానికి ప్రయత్నించారు. సాంబమూర్తి సోమయాజులు గారి సహకారంతో వరద ఈ సభ దిగ్విజయంగా జరిగేట్లు కృషిచేశాడు.

1938లో నేను గుంటూరు వెళ్ళి పోయినాను. 1939 లో సెప్టెంబరు 1న రెండో ప్రపంచయుద్ధం మొదలైంది. 1940లో జపాను విశాఖపట్నం మీద బాంబులువేయడంతో ఆంధ్రవిశ్వవిద్యాలయం గుంటూరుకు మారింది. ఈ మధ్యకాలంలో అబ్బూరి కుటుంబంతో నాకు అంతగా సంబంధం లేకపోయింది.

ఆ తరువాత 1942 లో అనుకుంటాను. రామకృష్ణారావుగారు 'నటాలి' అను నాటక సమాజం ఏర్పాటు చేశారు. ఆ రోజుల్లో బ్రిటిష్ ప్రభుత్వం 'నేషనల్ వార్ ఫ్రంట్' అను ఒక సంస్థను ఏర్పాటుచేసింది. ఈ నేషనల్ వార్‌ఫ్రంట్‌తో నటాలి ఒక కాంట్రాక్టు కుదుర్చుకుంది. అది ఒక సంవత్సరం కాంట్రాక్టు. 'వరద' రాసిన 'ప్రతిమాసుందరి' నాటకాన్ని ప్రదర్శించడానికి నటాలి నేషనల్ వార్‌ఫ్రంట్ సహకారం తీసుకుంది. ఈ 'ప్రతిమాసుందరి' నాటకాన్ని రాయలసీమ మినహా మిగతా ఆంధ్ర రాష్ట్రమంతటా ప్రదర్శించాం. వరద, వాణి స్టేజి ఏర్పాట్లు చేయడంలో తీవ్రకృషి చేశారు. అంతకు పూర్వం రోజుల్లో హరిశ్చంద్ర నాటకానికీ, చింతామణి నాటకానికీ కూడా ఒకే రకపు కర్టెన్లు ఉండేవి. ఈ 'ప్రతిమాసుందరి' నాటకానికి కొత్తరకపు కర్టెన్లు, కొత్తరకపు సీనరీలు, కొత్తరకపు సెట్టింగ్‌లు ఏర్పాటుచేశారు. వరద ఇచ్చిన ఐడియాలతో అంతా కొత్తదనం కనిపించింది. అలాగే నటాలి ప్రదర్శించిన 'కన్యాశుల్కం' నాటకంలో కూడా సెట్టింగులు, సీనరీలు కొత్త ఫక్కీలో ప్రదర్శించారు. ఈ సీనరీలు, సెట్టింగ్‌లు మొదలైన వాటిని ఏర్పాటు చేయడంలో వరద, వాణి తమ తండ్రికి ఎంతో తోడ్పడ్డారు. 'ప్రతిమాసుందరి' నాటకం రిహార్సల్స్‌లో వరద ఎన్నో సూచనలు ఇచ్చేవాడు. 'ప్రతిమాసుందరి' నాటకం మూలంగా వరద పేరు ఎంతో ప్రచారంలోకి వచ్చింది.

ఆ తర్వాత వరద హైదరాబాదు వచ్చి కొంతకాలం సెటిలైనాడు. అప్పుడు హైదరాబాదు ముఖ్యమంత్రిగా డా. బూర్గుల రామకృష్ణారావుగారు ఉండేవారు. వి.బి.రాజు గారు కూడా ఒక మంత్రిగా ఉండేవారు. అప్పటికి ఆంధ్రప్రదేశ్ ఏర్పడలేదు. బిందు, మేల్కోటె వంటి ఇతర రాష్ట్రాల వాళ్ళు కూడా మంత్రులుగా ఉండేవారు. వీరందరితోనూ వరదకు సాన్నిహిత్యం ఉండేది. ఒకసారి అబ్బూరి రామకృష్ణారావుగారు బూర్గుల రామకృష్ణారావుగారిని కలుసుకోవలసి వచ్చింది. అబ్బూరి బూర్గులవారితో మాట్లాడిన తర్వాత ముఖ్యమంత్రి (బూర్గుల) 'వరదతో మాట్లాడతాలెండి' అన్నారుట. ఈ విషయాన్ని రామకృష్ణారావుగారు నాతో స్వయంగా చెప్పారు. రామకృష్ణారావుగారు వరదకుముఖ్యమంత్రి దగ్గర ఉన్న పలుకుబడితో ఆశ్చర్యపోయారు. ఆనాటి మంత్రులంతా కూడా వరదతో ఎంతో సన్నిహితంగా ఉండేవారు. హైదరాబాదులో ఉండగానే వరదకు ఛాయాదేవితో వివాహమైంది.

తరువాత ఈ దంపతులు ఢిల్లీ వెళ్ళిపోయారు. నేను ఢిల్లీలో నా రెండవకొడుకు బిజినెస్‌లో

ఉండగా చూడటానికి వెళ్లి వరదకు ఫోన్‌చేశాను. వరద నన్ను మధ్యాహ్నం తమ ఇంటికి లంచ్‌కి ఆహ్వానించారు. నాకు ఢిల్లీ కొత్తకావడంవల్ల నేను, మా అబ్బాయి ఇద్దరం వెళ్ళాము. ఛాయాదేవి మాకు ఎంతో ఆప్యాయంగా విందు భోజనం పెట్టింది.

ఆ తర్వాత మళ్లీ నేను, వరద హైదరాబాదు లోనే కలవడం తటస్థించింది. హైదరాబాదులో ప్రస్తుతం వారుంటున్న ఇల్లు కొనుక్కొని సెటిల్‌అయినారు. తండ్రిమాత్రం వరద ఢిల్లీలో ఉండగానే ఢిల్లీలోనే మరణించారు. వరదకు తన తండ్రి మీద అపారమైన భక్తి, గౌరవం ఉండేవి. అందుకే ఒక స్మారక గ్రంథం కూడా వేశారు. అందులో నా వ్యాసం కూడా ఉంది. 'వరద' నాకు ఒక ఆప్త మిత్రుడు, అతి సన్నిహితుడు.

["వరద స్మృతి" కోసం ప్రత్యేకంగా రాసిన వ్యాసం]



# ఒక స్మృతి

**అజంతా**

సుడిగాలిలో అక్షరాలు కొట్టుకొని పోతుండగా చూశాను
అతడు లేడు
శబ్దప్రపంచం మూర్ఛిల్లినదా!
బ్రతుకంతా ఒకే జ్వాల, ఒకే ధ్వని,ఒకే దృశ్యం,
ఒకే అన్వేషణ
ఒకేవిజృంభణ
అతడు ఎక్కడ ఉన్నా ఇంద్రధనుస్సులే,
స్వప్నసామ్రాజ్యాధిపతి కదా. కవిత్వానికి అర్ధరాజ్యం ఇచ్చాడు ఏనాడో
స్నేహానికి అర్ధసింహాసనం
కవిత్వం అంటే ఉన్మత్తధ్వని కదా
అశ్వశక్తి విశృంఖల ధ్వని కాదు
గుండె తలుపులు మెల్లగా తెరచుకొంటున్న మంత్రమయ ధ్వని
అతడు నిర్దేశించిన మార్గంలోనే ఎంతో దూరం నడిచాను నేను కూడా
నా చుట్టూ దీపాలు అతడు వెలిగించినవే
నా హృదయంలో ఒక భాగాన్ని అక్కడే నిక్షిప్తం చేశాను
బ్రతుకంతా కవిత్వ మహోత్సవం
ఒకే కల, ఒకే జ్వాల, ఒకే ఛందస్సు,
ఒకే అన్వేషణ
అన్వేషణ పూర్తికాక ముందే తాను వచ్చిన త్రోవ తానే తెరచుకొని
మంచు తెరలలో అదృశ్యమైపోయాడు మౌనంగా
నేను మాత్రం ఇంకా ఇక్కడే బ్రతుకు లోలోతులలో కూరుకొనిపోతున్నాను అనంకల్పితంగా
నిష్క్రమణ ద్వారం ఎప్పుడు తెరచుకొంటుందో మరి!
[ఆత్మీయుడు అబ్బూరిని తలచుకొని]

('ఆంధ్రప్రభ' అక్టోబరు 11, 1993.)

*



# అముద్రిత రచనలు

## దరిద్రుడి కథలు

*[ఈ కథలు వరద రాజేశ్వరరావు గారు 1943 నుంచి 1946 వరకూ మదరాసులో ఉన్నరోజుల్లో రచించినవి కావచ్చును. నాట్యగోష్ఠి ఉద్యమంలో భాగంగా దాదాపు అదే కాలంలో శ్రీ శ్రీతో కలిసి చేసిన అనువాదం 'సంపెంగతోట' నాటకం (ప్రచురణ:1947) వెనక అట్టమీద రాబోవు ప్రచురణలుగా "శ్రీ శ్రీ 'చరమరాత్రి' కథలు, వరద 'దరిద్రుడికథలు'" అని ప్రచురించడం జరిగింది.*

*ఇవి వరద రాజేశ్వరరావుగారి కాగితాల్లో లభించిన భాగాలు]*

ఒకసారి దరిద్రుడు కథలు రాయాలను కున్నాడు.

మెదణ్ని యెంత ఊదరకొట్టినా ఒక్క ముక్క ఊడిపడలేదు. కేవలం భావ దరిద్రుడయి పోయినాడు.

రోడ్డుమీద నిలబడి రెండు చేతుల మధ్యా తలయిరికించుకుని మధనపడుతున్నాడు. కథ రాయాలి. కథ రాయాలి. కథ రాసినా అచ్చు వేయించుకునే ఆనమాయతు దరిద్రుడికి లేదు. రాయటం మాత్రం తప్పదు. అచ్చు అల్పత్వానికి చిహ్నం. నిజంగా తనది మహాకావ్యమే అయితే మరోయుగంలో మహోజ్జ్వలంగా ప్రకటించి తీరతారు జనం. తనకా బాధ లేదు. తన బాధల్లా ప్రస్తుతం కథరాసుకోవాలనే.

ఇది పెద్ద సమస్య అయి పోయింది. కథక్కావలసిన సరంజామా యెక్కడ దొరుకుతుంది?

రోడ్డుమీద నిలబడ్డ దరిద్రుడికి వెనక నుంచి జట్కా వాడికేక వినిపించింది. పక్కకి తొలగి నిలుచున్నాడు. అక్కడ ప్రతీ కిళ్లీ దుకాణంలోనూ పత్రికల్ని మాలలుగా గుచ్చి వేలాడేశారు. వాటి మీద సూర్యరశ్మి జోరుగా తగులుతోంది. అవి కూడా తన లాగే యెండకు పసివాడి పోతున్నాయి.

వాటికేసి చూసినప్పుడల్లా దరిద్రుడికి కథ రాయాలనే ఆతురత యెక్కువవుతోంది. పత్రికల మీద యెందుకో జాలిపుట్టింది తనకు. అవి కూడా దరిద్రులలాగే యెక్కడో పుట్టి దయా దాక్షిణ్యం సంస్కారం లేని చేతుల్లోకి పోయిపడతయి. అక్కణ్ణుంచి అమ్ముడుపోయిన మరు క్షణం నుంచి వాటి బతుకులో మరో ఘట్టం ప్రారంభదవుతుంది.

తరవాత యేం జరుగుతుందో యెంత పెనుగులాడినా దరిద్రుడి ఊహకందలేదు.

ఆ పత్రికల్ని తిరగేసి చూడాలనీ ఆ దుకాణంలో వాటికి తగిలించిన ఉరికంబాలను తప్పించి తన చేతుల్లోకి తీసుకోవాలనీ అనుకున్నాడు. దుకాణం దగ్గరగా పోయి నిలుచున్నాడు. తన్ని యెవరూ చూడలేదు. దరిద్రుణ్ని చూసేదెవరు? ఏం కావాలో కనుక్కునేదెవరు?

ఇంతలోకి పక్కనుంచే ఓ పొడుగాటి, లావుపాటి లక్ష్మీపతిగారొచ్చి నకిలిస్తూ అక్కడ ఓ పత్రికను పుచ్చుకున్నాడు. గబగబా పేజీలు తిరగేస్తున్నాడు. అతని కాఠిన్యం చూస్తుంటే దరిద్రుడికెంత ఆవేశం వచ్చింది? వాడి బుజాల మీదికి యెరగనట్టు యెక్కిపోయి వాడితలకాయను కొరుక్కుతిందామన్నంత కోపం వొచ్చింది

దరిద్రుడికి కోపం వస్తుంది. కాని ఎంటనే నిస్త్రాణపడి పోతుంది. కోపానిక్కూడా ఆకలెక్కువ. ఆకలి తీరనప్పుడు కొపానికి తగినంత ఉద్రృతం ఉండదు.

ఆ పొడుగాటి, లావుపాటి లక్ష్మీపతిగారు జేబులోంచి మూడణాలు తీసి, మూడు సార్లు లెక్కపెట్టి దుకాణంలో పడేసి పత్రికను కొనుక్కున్నాడు.

అరె, వెలయాలా, పత్రిక? ఇవి కేవలం డబ్బు సంచికలనుకున్నాడు. అవి మూర్ఖామన్న ఆశకూడా చంపుకున్నాడు.

**కథ రాయడవెలాగ?** ఏం సాధన?

కాగితాలయితే దొంగతనం చెయ్యగలడు. రాయటానికి కలమైతే రోడ్డు మీద పొయ్యే కుర్రాళ్ల జేబులో నుంచి కొట్టెయ్యగలడు. ఇన్నిసంపాయించుకూ్కుమవియేం రాస్తాడు? కథ యెక్కణ్ణించి కొట్టెయ్యగలడు?

ఇది వరకూ, యిప్పుడూ రాస్తున్నవాళ్ళు యెలా సంపాయించారు కథలు?

కథల్ని కూడా యెక్కణ్ణయినా అమ్ముతారేవో? ఎలా తెలుసుకోవటం?



పండగ పూట. పగలు. ఎండాకాలం సరిగ్గా మిట్ట మధ్యాహ్నం. ఊరిబయట గుడిసె గుమ్మంలో దరిద్రుడు కూర్చుని ఉన్నాడు. ఏదో కాస్త ఆలోచించాలని అనుకుంటున్నాడు. ఆలోచించాలంటే ఆకాశం వంక చూడాలి. ఎండాకాలంలో ఆకాశం వంక చూస్తే యేం కనబడదు. మెదడు కదలదు. అంచాత దరిద్రుడా పని మానుకున్నాడు.

దూరంగా ఊళ్లో కోలాహలం అడపా తడపా వినిపిస్తున్నది. అది వినిపించి నప్పుడల్లా దరిద్రుడాలోచించటానికి మథనపడుతున్నాడు.

దరిద్రుడి నెత్తిమీద ఒక పెద్ద కీకారణ్యం పెరిగింది. అందులో కష్టాలు కాపరం చేస్తయి. మెదడుని చిదుపుకుని తింటూంటయి. దరిద్రుడి మెదడు రోజు రోజుకీ సన్నగిల్లిపోతోంది. కష్టాలకీ గట్టు దాటే రోజులు దాపురిస్తున్నయి

దరిద్రుడు ఆలోచించటానికి ప్రయత్నం చెయ్యలేదు. వొద్దనుకున్నాడు.

మళ్లీ ఊళ్లో కోలాహలం వినిపించింది. దరిద్రుడు లేచినిలబడ్డాడు. ఎదురుగుండా తనలాగే ఆలోచించలేని తుమ్మచెట్టున్నది. తుమ్మ చెట్టు క్కూడా కష్టాలెక్కువ. తుమ్మ చెట్టుది ముళ్ళదారి. దాని వొంటి నిండా ముళ్లే. దరిద్రుడది చూశాడు. అయితే తుమ్మ చెట్టుకు ఊళ్లో పండగ సంగతి తెలుసునా అని అనుకున్నాడు. ఇప్పుడు తెలీకపోతే సాయంకాలమన్నా తెలుస్తుందనుకున్నాడు. తుమ్మచెట్టును ఊళ్లో పండగ జనం ఆ రాత్రికైనా ఉరితీయక తప్పదు. తుమ్మ చెట్టు నివురు గప్పిన నిప్పు. ఊళ్లో చలి యెక్కువ. దరిద్రుడదీ అనుకున్నాడు. తన్నలా ఉరి తీసే పండగ జనం యెక్కడనయినా దొరికితే బాగుండునను కున్నాడు. మళ్లీ కూర్చున్నాడు.

దరిద్రుడికి ఆకలెక్కువ. దాహం యెక్కువ. రెండూ తీర్చే పండగ జనం యెక్కడ

కనపడతారో ననుకున్నాడు.

ఇంతలోకి జగ్గాయ్ వొచ్చాడు. జగ్గాయ్ మొహాన ఆ వేళటి యెండల్లా కనిపిస్తోంది. జగ్గాయ్ కళ్లు యెర్రగా ఉన్నాయి. జగ్గాయ్ తాగొచ్చాడు.

జగ్గాయ్‌ని చూసీ చూడనట్లు ఊరుకున్నాడు దరిద్రుడు.

జగ్గాయ్‌కి కోపం వొచ్చింది.

"ఊరంతా ఉప్పెనలాగుంటే నువ్వేం కూర్చున్నావు" అన్నాడు.

దరిద్రుడు తలెత్తి చూశాడు. పలకలేదు.

జగ్గాయ్ దరిద్రుడ్ని చేయిపట్టుకుని పైకిలాగాడు. దరిద్రుడు లేచాడు. 'నడవరా, ముందుకి. ఇవాళ మందేరా పండగ" అని జగ్గాయ్ దరిద్రుణ్ణి సారా దుకాణానికి లాక్కొని పోయాడు. జగ్గాయ్ మళ్లీ తాగాడు. దరిద్రుడు తాగుతున్నాడు. దరిద్రుడి కళ్లు పెద్దవయినయి. దరిద్రుడు యింకా, యింకా తాగుతున్నాడు. దరిద్రుడు కళ్లెర్రనై మూసుకుపోతున్నాయి.

జగ్గాయ్ తూలుతున్నాడు. దరిద్రుడు మూలుగుతున్నాడు.

"పండగమందేరా-మందేరా పండగ" అని అన్నాడు జగ్గాయ్. మాట్లాడ్డానికి శక్తి లేక దరిద్రుడు తల ఊపాడు. "ఎలా వుందిరా అన్నా" అన్నాడు జగ్గాయ్. ఆకాశం వొంక చేత్తో చూపించాడు దరిద్రుడు.

"అదిరా పండగ - అక్కడికి పోవాలి రన్నా" అని జగ్గాయ్ పక్కన తడికెను పట్టుకుని లేవబోయి పడ్డాడు. దరిద్రుడు లేవకుండానే పడ్డాడు. "ఆకాశంలో యేముంటుందిరా జగ్గాయ్" అని అడిగాడు దరిద్రుడు. "స్వర్గం" అన్నాడు జగ్గాయ్. "అక్కడికి పోదాం పద రా" అన్నాడు దరిద్రుడు. మళ్లీ మాట్లాడలేదు.

ఇద్దరూ స్వర్గానికి బయలు దేరారు.

ఇద్దరూ పోతూంటే దార్లో మేఘాలు అడ్డం వొచ్చినై. జగ్గాయ్ నిలబడి పోయాడు. దరిద్రుడు వాటి మీదుగా దూకిపోదామనుకున్నాడు. ధైర్యం చాల్లేదు.



ఆ రోజు దరిద్రుడికి తిండి దొరకలేదు. తిండిలేదుకనక ఒళ్ళు చలనం లేకుండా నిలిచిపోయింది.

దారిపక్కన చెప్పులు కుట్టుకునే వాడిదగ్గిర చతికలబడ్డాడు. ఆకాశం మబ్బుగా ఉంది. ఏ నిమిషాన్నయినా జల్లుపడుతుంది. తను తడిసిపోతాడు. దారిపక్కన చెప్పులు కుట్టుకునేవాడికి కూడా ఆ రోజు తిండి దొరక్కుండా పోతుంది. ఏమిటీ కాలం అఘాయిత్యం?

దరిద్రుడు మాట్టాడకుండానే కూర్చున్నాడు. పక్కన చెప్పులు కుట్టుకుంటూ తలెత్తనే లేదు చెప్పులు కుట్టుకునేవాడు.

దరిద్రుడు తన కాళ్లకేసి చూసుకున్నాడు. అరికాళ్లు, పక్కన చెప్పులు కుట్టుకునే వాడిదగ్గర ఉన్న తోళ్లముక్కల్లా ఉన్నాయి. ఎందుచేతనని ఆలోచించాల్న నుకున్నాడు.

తలకాయ పనిచెయ్యనని భీష్మించు క్కూచుంది. తనేం చెయ్యగలడు.

"ఇవాళ మనిద్దరికీ పెద్ద రగడై పోతుంది" అని బెదిరించాడు.

తలకాయ కిక్కురుమనలేదు.

దరిద్రుడికి మరింత కోపంవొచ్చింది. తనకి తిండి తెచ్చి పెట్టలేకపోగా, బాధలన్నా చెప్పుకుని యేడవటానికి వీల్లేకుండా చేస్తోంది. మన దరిద్రానికి తోడు యిదొహటా? ననుకున్నాడు.

మళ్ళీ అరికాళ్లవంక చూసుకున్నాడు.

శుబ్బరంగా సానబెట్టి అరగదీసినట్లున్నాయి. అరికాలు కూర్చున్నపళంగానే, నేలకేసీ చరిచాడు.

చప్పుడు కాలేదు సరి కదా, నేల సిగ్గన్నా లేకుండా మొహం తుడిచేసుకుని చూస్తోంది.

మళ్ళీ అరికాలెత్తుకునీ చూసుకున్నాడు. అందులో యేం కనపడుతోంది?

భూచక్రం యిరుసు.

అంతే కాదు.

పేదరికం నైసర్గిక స్వరూపం, శీతోష్ణస్థితి–

దరిద్రుడికీ భూగోళ చరిత్ర అర్థం కాలేదు. అరికాలి మంట నెత్తికెక్కింది. తలకాయ పలకదు; ఉలకదు.

తలకాయ మాట్లాడకపోతేపాయె, పక్కనున్న చెప్పులు కుట్టుకునే వాడన్నా యెందుకు పలకడు?

దరిద్రుడి కర్థం కాలేదు.

తనే పలకరించాలనుకున్నాడు. తలకాయ వొప్పుకోలేదు.

ఆకాశం మరింత మబ్బు పడింది. కాస్సేపట్లో మేఘాలు తనువులు చాలిస్తయి. నేలకలిసి పోతయి.

దరిద్రుడాకాశం వంక అదే పనిగా కాస్సేపు చూశాడు.

తలకాయ చెక్కు చెదరలేదు.

దరిద్రుడి కళ్లకి ఆకాశం గంతలా కనిపించింది. కళ్లు మూసుకున్నాడు.

పక్కన యెవరో మాట్టాడినట్టు తోచింది. కళ్లు తెరుద్దామంటే ఓపిక లేకపోయింది. ఎందువల్లననుకున్నాడు. తిండి లేక పోవటం తనకు తెలుసును. తిండి లేక పోవటం చాల వొంట్లో బలం తగ్గి పోతుందని అప్పటి దాకా తలకాయ చెప్పనేలేదు.

ఆ సత్యం గ్రహించేటప్పటికి దరిద్రుడు మామూలు లోకంలో పడ్డాడు. కళ్లు తెరిచాడు.

పక్కన చెప్పులు కుట్టుకునే వాడితో యెవరో దెబ్బలాడుతున్నాడు. కిందటిసారి వాడుసరిగా చెప్పులు కుట్టలేదనీ మేకులు అరికాలిలో గుచ్చుకుని నెత్తురు వరదలై పారుతున్నదనీ గోల చేస్తున్నాడు.

దరిద్రుడి తలకాయ కొంచెం కదిలింది. దరిద్రుడు మళ్లీ తన అరికాలికేసి చూసుకున్నాడు.



ఒక సారి దరిద్రుడికి విరహం వొచ్చింది. ఎవరికోసం? అది తెలీదు. విరహానికి కావలసిన కథావస్తువు కనిపించలేదు.

చేలో తనకొక సారి చెప్పరానంత ఆనందం కనిపించింది. అక్కడ యెగిరే పిట్టలూ, వినిపించే గాలిరొదా, వేసే మట్టి వాసనా–ఒహెూ, బ్రహ్మానందంగా ఉంది!

అయితే చేచిక్కుతుందానన్న మహా విషమ సంధిలో దరిద్రుడు పడిపోయాడు. ఆ ఆనందం-చే-తాను పారవశ్యం పొందటం తనకే తెలీదు.

దరిద్రుడికి విరహం యెక్కువయింది. దారిన నడిచే ప్రతీ ఆడదాని అడుగుజాడల్లోనూ మడుగులై ప్రవహించిన తన విరహవాహిని! ఎవరిచే? అయ్యోరామ! మాచే! తెలియదటయ్యా నీ దరిద్రం కూల!

తన బాధ దాచేందుకు చోటు దొరకని కారణం చేత-ఆడదాని ఊపిరి తాగేందుకు శక్తి లేని బతుకు చేత-దరిద్రుడికి వొచ్చిపడిందయ్యా శ్రీ శ్రీ, విరహం!

ఆర్ద్ర కనిపిస్తే ఆడదాని అడ్రసునన్నా అడిగేవాడు.

ఆ వేళ ఉదయాన్నీ, సాయంకాలాన్నీ చూశాడు. విరహానికి విరుగుడు దొరకలేదు.

-చే చిక్కిందా, విరహానికి తెరువుంటుంది.

ఎవరయ్యా, చిన్నయసూరీ, రోడ్డుమీద పోయేది? ఆ గాలికెగిరే గిరజాలూ, పల్లకీలా వొంగిన బుజాలూ.



# స్టీఫాన్ జ్వీగ్

జర్మన్ కథకుల్లో స్టీఫాన్ జ్వీగ్‌ను మించిన వారు లేరు. అంతేకాదు. యావత్ప్రపంచం లోనూ, జ్వీగ్ సాధించిన శిల్పచాతుర్యం కానీ, ప్రతిపాదించిన మానవ మనస్తత్వం కానీ, ప్రసాదించిన కథన మాధుర్యంకానీ, మరెవ్వరికీ చేత కాలేదంటే అతిశయోక్తి కాదు.

జ్వీగ్ ప్రతిభ అక్షర వ్యక్తం చెయ్యటం కష్టం. అనుభవ యోగ్యం కావాలి.

## అనుసరణ కథ

*[జైల్లో ఉండగా స్టీఫాన్ జ్వీగ్ కథ "ఏమక్" కు చేసిన అనుసరణ (అసంపూర్ణం)]*

ఇరవై సంవత్సరాల క్రితం గోదావరి బ్రిడ్జి మీద పెద్ద రైలు ప్రమాదం జరిగింది. అప్పుడు పత్రికల్లో ఆ ప్రమాదాన్ని గురించి యెన్నో అసత్య వార్తలు పడ్డవి. ఆ ప్రమాదం జరిగినప్పుడు నేను స్వయంగా చూళ్లేదు. బెజవాడ వెళ్లాలని సాయంకాలం కొంచెం ఆలస్యంగా వచ్చేటప్పటికి వాల్తేరు స్టేషనులో ప్యాసంజరు వెళ్లిపోయింది. మళ్లీ మర్నాడు తెల్లవారు ఝామున తప్ప రైలు లేదు. ఇందుకోసం ఊళ్లోకి వెళ్లి తిరిగీ స్నేహితుడింట్లో తిష్టవెయ్యటం మనస్కరించలేదు. అప్పటికే వాళ్లింట్లో వారం రోజులాయి మకాం వేశాను. ఆ గృహిణి పాపం నా మీద యెంతో విసుక్కొని ఉంటుంది. నిరుద్యోగం, కవిత్వం, స్నేహితుల కొంపల్లో కాపరం–యెంతకాలం యెవరు సహిస్తారు? స్టేషను దగ్గిరగా ఉన్న హొటల్లో రెండు మెతుకులు భోంచేసి స్టేషనులోనే ఆ రాత్రి నిద్రపోవటానికి ప్రయత్నం చేద్దామని నిశ్చయించుకున్నాను. బాగా చీకటి పడేటప్పటికి భోంచేసుకుని వచ్చేశాను. వెయిటింగ్ రూములో నానా జనం, ఒకళ్ల మీద ఒకళ్లు పడి గురకలు పెడుతూ పడుకున్నారు. పోర్టరు చేతులో ఒక అర్ధ రూపాయి పెట్టి పడక్కుర్చీ ఒకటి సంపాయించి వరండాలో వేసుకుని పడుకున్నాను. ఉన్న ఒక్క పరుపూ దారి పొయ్యే వాళ్లకు దానం చేసేందుకు శక్తి లేక కాళ్ల కింద పెట్టుకున్నాను.

కలకత్తా నుంచి వస్తూ వాల్తేరులో దిగాను. పోతున్నప్పుడు మళ్లీ తెలుగు దేశానికి తిరిగి రాకూడదనే కృత నిశ్చయంతో బయలుదేరాను. అయితే అనుకున్నట్టు వ్యవహారం ఏదీ జరక్కపోవటం చాత, గత్యంతరం లేక కొన్నాళ్లపాటు ఉన్నచోటనే ఉందామని వచ్చేశాను. ఈ దేశంలో మనిషికి కావలసిన స్వేచ్ఛ లేదు. ఎప్పుడూ ఉండదేమో! నా బతుకు యిలా 'ఉండాలీ అనుకోవటానికి నాచేతుల్లో యేమీ లేక పోయెను. పరిస్థితులతో కొంత రాజీపడి, యేదో రకంగా కాలం వెళ్లబుచ్చుదామనుకున్నా వీలు కుదరదు. ఇలా బతికి యీ ప్రపంచంలో దేన్ని సాధించగలం?

ఇలా తలపోస్తూ కళ్లు మూద్దామని విశ్వప్రయత్నం చేస్తున్నాను. చుట్టు పక్కల యెవరూ లేరు. దోమలు తెగ పాడుతున్నాయి. వాటికెంత స్వేచ్ఛ! నిలవ నీడా, తిన తిండీ, వాటికైతే ప్రభుత్వం యెంతయినా సదుపాయం చేసింది! జాతీయ జీవనంలో అవి సంపాయించుకున్న విలవ మనిషికైనా లేదా యిరి. దూరాన్నుంచి దుర్గంధం, ఎదట నుంచి రైలింజన్ల చప్పుడూ, కార్మికుల కేకలూ–వీటి మధ్య నిద్ర పట్టేందుకు అవకాశం లేదు. మధ్య మధ్య భారతదేశ దారిద్ర్యాన్నంతా కబలించుకుని మనుషుల కాళ్లూ, కుర్చీల కాళ్లూ వాసన చూసే కుక్కలు వస్తూ పోతూన్నాయి.

బాగా పొద్దెక్కి పోయింది. ఆవలింత వొచ్చినప్పుడల్లా యిహ తప్పక నిద్ర వస్తుందనే ఆశ యెక్కువవుతోంది. అసలు నిజానికి నిద్రలేని మనిషి కన్న దుఃఖ జీవి మరొక్కడుండడు. నిద్ర పోలేని వాడే లోకంలో చెడతాడు. పరాయి దాంతో పోవటం, ముక్కలు చిరిగే దాకా పేకాట ఆడటం, ఖాళీ అయేదాకా సీసాలు తాగటం. ఇవన్నీ అందుకే! నవ్వొచ్చింది.

ఇంత తర్కం చేశాను. ఇందులో యెంత వరకు నిజం? మనదేశంలో యెంత అసహజంగా ప్రవర్తిస్తే మనిషి అంత విలవ కూడగట్టుకుంటాడు. అదే మన ఆధ్యాత్మిక సంపద.

విసుగొచ్చింది. మనస్సు వికలమై పోయింది. నిరాశా, నిస్పృహ-యివి తప్ప మరేదీ కనిపించదు.

కుర్చీలోంచి లేచి బయటికి వచ్చాను. ఆకాశం అతి ప్రశాంతంగా ఉంది. మిలమిల మెరిసే నక్షత్రాలను చూసేటప్పటికి ప్రాణం లేచొచ్చినట్లయింది. మంచి వెలుతురు కోసమే మనిషి బాధపడతాడు. కృత్రిమ దీపాల మధ్య కృత్రిమ జీవనం చేస్తూ, మనకు దగ్గరగా మన కారణంగా నిత్యం ఆక్రోశించే సాటి ప్రాణాలను లెక్కచెయ్యము. ఆ దుస్సహ దృశ్యాలను తప్పించుకోవటానికి ప్రయత్నం చేస్తాము కాని, వాటిని తుడిచి పెట్టేందుకు ప్రయత్నించం. దోమల్ని, ఈగల్ని నాశం చెయ్యకుండా జబ్బులకు మందులు కనిపెడతాము. మురికి కాలవలూ, ఒక దానికి ఒకటి ఆనుకున్న పూరిగుడిసెలూ, తిన తిండి లేని జనులూ, పాల సంగతి దేవుడెరుగును, పుట్టగానే ఊపిరికైనా నోచుకోని వాళ్ల పాపలూ-చిరంజీవులు. అంటు వ్యాధులు చెలరేగకుండా, ఉన్నత భవనాల్లో ఊరిమధ్య కాపరం చేసే నాగరక జనానికి బాధకలక్కుండా ఎన్ని శరీరాల్లో యినప సూదులు గుచ్చుతాము?ఒక పక్క వినాశం. మరొక పక్క వృద్ధి.

తల బిగుసుకు పోయింది. సిగరెట్టు కాల్చి మళ్లీ వెనక్కొచ్చి కుర్చీలో కూలబడ్డాను.

పక్కనే దగ్గు వినిపించింది. ఆ మసక చీకట్లో కొంచెం దూరంగా ఒక విగ్రహం కనిపించింది. కళ్లజోడూ, కాలే సిగరెట్టు కాంతీ, కుర్చీలో కూర్చున్నప్పుడు చెదరిన మనస్సు అన్యథా పని చెయ్యటం వల్ల యీపక్కనే ఉన్న ఆగంతుకుని గమనించ లేక పోయాను. మొదట్నుంచీ అతనక్కణ్నే కూర్చుని ఉండి ఉంటాడు. కొంచెం నెమ్మదిగా "ఎవరండీ మీరు" అన్నాను.

అతను దగ్గాడు.

"మాది బెజవాడ" అన్నాడు

అంతే ఒకళ్ల నొకళ్లను తదేక దృష్టితో చూసుకుంటున్నాము. మాట లేదు, మంతీ లేదు. నేనతని వంక చూస్తున్నాను కనక, నావంక అతను చూస్తున్నాడనే అనుకున్నాను. ఆ చీకట్లో మా ఆకారాలు మాత్రమే ఒకళ్ల కొకళ్లకి కనిపిస్తున్నాయి. అతను ఊపిరి తియ్యటం, సిగరెట్టు పొగ ఊదుతూండటం మాత్రం వింటున్నాను.

మా మౌన దశ దుర్భరంగా ఉంది. ఏం చడీ చప్పుడూ లేకుండా కుర్చీలోంచి లేచి వెళ్లిపోయేవాణ్నే. కాని యేం చెప్పకుండా వెళ్లిపోవటం మర్యాదగా ఉండదని తోచింది. సిగరెట్టు తీసి అగ్గిపుల్ల వెలిగించాను. ఒక క్షణం వెలుతురులో ఒకరి ముఖం ఒకరు చూసుకున్నాము. ఆ మనిషి కేవలం నాకు కొత్త. మనిషి యెలాంటివాడో పరిశీలిద్దామంటే నా అగ్గిపుల్ల వెలుతురు బతుకు క్షణికమాయెను. మళ్లీ ఆచీకట్లో ఆ ఆకారం, సిగరెట్టు నిప్పూ, కళ్ల జోడూ కనిపిస్తున్నాయి.

ఈ మౌన బాంధవ్యం–బెజవాడలో యెండాకాలం వస్తే వడగాడ్పుల మధ్య ఊపిరి సలప నివ్వని ఉక్క బాధలా ఉంది.

విసుగెత్తి లేచి నిలుచున్నాను.

"సెలవు" అన్నాను.

"సెలవు" అని వెంటనే కటువుగా జవాబు వొచ్చింది.

వరండాలో నించి బయటికి వొచ్చాను. రెండడుగులు ముందుకు వేసి నడిచానో లేదో, నా వెనకనే అడుగుల చప్పుడు వినవచ్చింది. ఆ వ్యక్తి కూడా నన్ననుసరిస్తున్నాడు. ఆ చీకట్లో అతని మనస్సులో యేదో చెప్పరాని ఆవేదనా, ఆందోళనా – అతని అడుగుల చప్పుడే చెపుతోంది.

తొట్రుపాటుతో మాటాడుతున్నాడు :

"మీరు .... క్షమిం ... చాలి." కొంచెం ఆగాడు. "కొన్ని కారణాల చేత యీ మూలగా చీకట్లో ఒంటరిగా కూచున్నాను. విచారంలో మునిగి కొట్టుకుంటున్నాను. అందుచాతనే యెవరితోనూ మాటాడటంలేదు. పలకరించటంలేదు. మీరొక్కరే నా వ్రతభంగం చేశారు. కేవలం కొన్ని సొంత కారణాలవల్లనే యిలా యేకాంతంగా కాలక్షేపం చెయ్యవలసి వచ్చింది. నామీద దయ ఉంచి మీరెవరినీ మీతో పాటు తీసుకొచ్చి యీ ప్రాంతంలో కూచోకండి". అని ఆగాడు. వెంటనే అతని కోరిక తప్పకుండా పాటిస్తానని హామీ యిచ్చాను. నేనేదో యాదాలాపగా ఆ వూళ్లో దిగాననీ, ఆ స్టేషనులో నాకెవ్వరూ స్నేహితులు లేరనీ చెప్పాను. నమస్కారం పెట్టి గాలిపీల్చుకుందామని ఆరుబయట పచార్లు చేస్తున్నాను. పెద్ద చప్పుడు చేసుకుంటూ గూడ్సుబండి ఒకటొచ్చి వెళ్లిపోయింది. ఆ యింజను పొగ ఆ చుట్టుపక్కల కమ్మేసింది. కాస్త శుభ్రమైన గాలి పీల్చేందుకైనా నోచుకోలేకపోయాను. మళ్లీ వెనక్కొచ్చి కుర్చీలో కూచోటానికి మనస్కరించలేదు. అలా ప్లాటుఫారం చివరి దాకా నడిచాను. వంతెనె మీదికి పోయి కూచున్నాను. కాని మనస్సునంతా ఆ వ్యక్తి ఆక్రమించుకుని కూచున్నాడు. ఎవరతను? ఏంఊరు? పేరు? ఎందుకలా అజ్ఞాతావ్నీ, యేకాంతం కోరుకుంటాడు. కళ్ళుమూతలు పడగానే పీడకలల్లా యేవేవో కనిపిస్తున్నాయి. లేచి కూచుని కళ్లు నలుపుకున్నాను. ఆ వ్యక్తి సంగతేమిటో కనుక్కోవాలనిపించింది. అక్కణ్నే అతన్నిపట్టుకుని అతని శరీరంలోని గుండెలాక్కుని అందులోంచి అతని రహస్యాన్ని బయటికిలాగెయ్యాలనుకున్నాను. దూరంగా కిల్లీ దుకాణాలుకట్టేస్తున్నారు. జనసమ్మర్దం తగ్గిపోతోంది. ఆ విచిత్రవ్యక్తి రహస్యం కనుక్కోవాలనే ఆతురత యెక్కువవుతోంది నాకు.

వెనక్కి వెళ్లాను. అతనక్కణ్నే ఆ మూల చీకట్లో సిగరెట్టు కాల్చుకుంటో కూర్చున్నాడు. ఆ చీకట్లో ఆ మూల ఒంటరిగా కూచునేందుకు కారణం యేమయిఉంటుంది? నరవాసనా, వెలుతురూ కోరని మనుషులుంటారా? అలా యెంతవరకుండగలడు . తెల్లవారుతుంది. అతని మనస్సులో రగిలే బాధ నల్లనల్లనయి ఆకాశాన్ని ఆవరించి సూర్యరశ్మినే దాచెయ్యగలదా? ఏం ధైర్యం! తెల్లవారు ఝామున పారిపోతాడు. ఉప్పుటేరులో ఆత్మహత్య చేసుకోవటానికి రాలేదుగద! అరె, మనిషీ! యెంత అధోగతి పాలయితివిరా! లోకాన్నెదిరించలేక చేతిలోని ప్రాణాన్ని చిదిపి నాశం చేసుకుంటావా? ఎవరినైనా నీ ఆశయసిద్ధికోసం హత్యచేసి ఉరికంబం యెక్కినా సహించగలను కాని ఆత్మహత్య చేసుకుంటివా, నాకు కలిగే అసహ్యానికంతులేదు.

అతను పలకరించక మానడని వెళ్లి నా కుర్చీ మీద నేను కూర్చున్నాను. ఆ చీకట్లో ఆ మూలనుంచి విన్నాను. "మళ్ళీ వొచ్చారా! టయిమెంతయిందండీ!"

"పదవుతుంది. మీకు కష్టమని తోస్తే వేరే చోట యీరాత్రి కాలక్షేపం చేస్తా" నన్నాను.

"క్షమించండి. మీకాశ్రమ నిచ్చేందుకిక్కడ నాకేం పెత్తనంలేదు. మీరున్నా యేంఫర్వాలేదు. నాబాధనాది"అని అన్నాడావ్యక్తి.

కుర్చీ మీద కూర్చున్నాను.

"మీరుంటే కొంచెం మనశ్శాంతి కలుగుతుందేమో కూడా. కూచోండి, ఫర్వాలేదు. ఎన్నాళ్లో అయింది, పరప్రాణాన్ని పలకరించి. యుగాలయినట్టుంది. నా బాధలనన్నిటినీ నా మనస్సు భరించేట్టులేదు. ఆ వెయిటింగ్ రూములో కూచోలేను. ఆ జనం మధ్య ఉండలేను. వాళ్ళు ఒకళ్ల కొకరు కొత్తే అయినా నిరంతరం మాటాడుతునే ఉంటారు. వాళ్ల అసంబద్ధ ప్రలాపాలు వింటోంటే నాకు పై ప్రాణం పైనపోతుంది. ఇక్కడకు కూడా వాళ్ళగోల వినపడుతూ ఉంటుంది. భరించలేక చెవులు మూసుకుంటాను. అయితే ఆ మాటాడే జనానికి మనుషులు దూరంగా ఉన్నా వాళ్ళకి చెవులుంటాయనీ, తమ వల్ల వాళ్లు బాధపడుతోంటారనీ తెలియదు. తెలిసినంత మాత్రాన ఊరుకుంటారని కాదు. ఈ లోకం పద్ధతే అది".

హఠాత్తుగా ఆగిపోయాడు. "నేను తెగ మాటాడుతున్నాను. మీకు తలనొప్పి వొచ్చి ఉంటుంది. ఈ రకంగా మాటాడే ఉద్దేశం నాకులేదు." నమస్కరించి వెళ్లిపోవటానికి లేవబోతుంటే, కూచోమని వొత్తిడి చేశాడు.

"మీరు మాటాడితే నాకేం బాధగా లేదు. అంతేకాదు. ఈ రాత్రి యిహ నిద్రపట్టే అవకాశం కనిపించటంలేదు. మీతో మాటాడటం యెంతో అదృష్టంగా భావిస్తున్నా" నన్నాను.

"సిగరెట్టు కాల్చరూ" అని తీసి యిచ్చాను.

సిగరెట్టు తీసుకు కాల్చుకుంటూంటే ఆ చిరుకాంతిలో మళ్లీ అతని ముఖవైఖరి చూశాను. ఇప్పుడా ముఖం యెంతోపరిచితంగా కనిపించింది. నిప్పు పుల్ల వెలుగుతున్నంతసేపూ గంభీరంగా గాఢంగా నావంక చూస్తున్నాడు.

కొంచెం జలదరించాను. ఆ వ్యక్తికి తనలోపల అణిచిపెట్టుకొన్న ఆర్ద్రగాథ నేదో నా ముందు చెప్పుకోవాల్నుంది. కాని యేదో బ్రహ్మాండమైన అవాంతరం అతన్ని చెప్పనివ్వటంలేదు. నేను మౌనం ధరించాను. నా మౌనం వల్లనే నాలో అతనికి యెంతయినా విశ్వాసం కలగగలదు. ఈతనికి మనస్సు విప్పి మాటాడే శక్తి కూడా దొరుకుతుంది.

అళాగే కూచున్నాము. సిగరెట్టు కాలుస్తున్న చెయ్యి వొణుకుతోంది. అతని లోపలి ఆవేదన బయటపడుతోంది. మేం పొగపీలుస్తున్నాము, వొదులుతున్నాము. ఒక్క మాటయినా అనుకోలేదు. చిట్టచివరికి అతనే నిశ్శబ్దాన్ని ఛేదించాడు. "మీరు అలిసిపొయ్యారా?"

"అణుమాత్రం కూడా లే" దన్నాను.

"మిమ్మల్ని ఒకటడగాల్నుంది." కొంచెం తటపటాయించాడు. "నిజం చెప్పాలంటే మీతో కొన్ని విషయాలు చెప్పుకోవాల్నుంది. ఏం పరిచయంలేకపోయినా, మిమ్మల్ని కలుసుకున్న మరుక్షణంలోనే యిలా నేను వాగటం నాకే సిగ్గుగా ఉంది. కాని మనస్సు బిగబట్టుకోలేకపోతున్నాను.

ఒక నిర్ణయానికి మాత్రం వచ్చేశాను. ఈ ఆవేదనలన్నీ యెవరికైనా చెప్పుకోనన్నా చెప్పుకోవాలి, లేదా పూర్తిగా వాటిని మనస్సులోనించి పారద్రోలాలి. మొదటనే మీరీ విషయం గ్రహించే ఉంటారు. నాకు మీరే విధంగానూ సహాయం చెయ్యలేరు. కాని యిలా మనస్సులో దాచుకోవటంవల్ల నేనెంతో బాధపడిపోతున్నాను. ఎవరయినా నన్ను చూసి యేదో దీర్ఘరోగంతో బాధపడుతున్నాననుకుంటారు."

నేనతని మాటలకడ్డం వొచ్చి అతనలా ఊహించుకుంటూ బాధపడవొద్దనీ, తన కథనివినిపించమనీ ప్రార్థించాను. "మీ సంగతేమిటో తెలియకుండా మీకెలా సహాయం చేస్తానని వాగ్దానం చెయ్యగలను? అయినా, నా చాతనయినంత వరకు మీకు సహాయం చేస్తానని చెబుతున్నాను. సాటిప్రాణాన్ని ఆపదలో నించి తప్పించటానికి సంసిద్ధత కనబరచటం విధ్యుక్త ధర్మంకాదూ? అందుకు ప్రయత్నమన్నా చెయ్యవచ్చునుకదా!"

"సహాయం చేస్తాననటం విధ్యుక్తధర్మం? ప్రయత్నమన్నా చెయ్యటం విధ్యుక్తధర్మం? సాటి ప్రాణాన్ని ఆపదలో నించి తప్పించటానికి సంసిద్ధత కనబరచటం విధ్యుక్తధర్మం?"

అలా నేనన్న ప్రతీవాక్యం తిరిగీ హేళనగా, రోషంతో పూత్కారిస్తూ పునశ్చరణచేశాడు. ఇందులోని అంతరార్థం తరవాత కాని నాకర్థం కాలేదు. కాని అతనలా అంటున్నపుడు మాత్రం, అతను పిచ్చివాడో, త్రాగుబోతో ననిపించిందింది. నా మనోభావాన్ని గ్రహించినట్లుగా అతను తగ్గి మళ్ళీ మామూలు ధోరణిలో మొదలు పెట్టాడు. "నామతి చలించిందేమో ననుకుని ఉంటారు మీరు. లేదా, నా ఒంటరి బతుకువల్ల యిలా మాటాడటం అలవాటయిందనుకుంటారు. అసలుసంగతి అదికాదు. నా మతి స్థిమితంగానే ఉన్నది. మీరొక మాట అన్నారు. ఒక సందర్భంలో మీరామాటని ఉపయోగించారు. దాంతో నాకు మండిపోయింది. విధ్యుక్తధర్మం అన్నారు. నాగుండె గాయం మీద కారం చల్లినట్లుంది. ఇన్నాళ్లూ నేను బాధపడటం, నాలోకుమిలి పోవటం దీనిమూలాన్నే."

కొంచెం వొళ్ళు విదిలించుకుని మరింత స్పష్టంగా చెబుతున్నాడు:

"నేను డాక్టరు నన్న సంగతి మీకు తెలియాలి. నాకథలో అది ముఖ్యమైన అంశం. వైద్యవృత్తిలో యెన్నో కేసులువొస్తూంటయి. వాటన్నిటిలోనూ మీరుచెప్పే విధ్యుక్తధర్మం మీరనుకున్నంత స్పష్టంగా ఉండదు. చచ్చే సందర్భాలుంటయి. అందులో ఒక్క ధర్మమే ఉండదు. పరస్పర వ్యతిరిక్తాలయిన ధర్మాలుంటయి. ఒకటి సాధారణధర్మం. ప్రభుత్వం పట్ల మన ధర్మానికి వ్యతిరేకంగా పోతుంది. రెండోది మన విజ్ఞానానికి వ్యతిరేకంగా పోతుంది. సాటి ప్రాణాన్ని ఆపదలోనించి తప్పించటానికి సంసిద్ధత కనబరచటం? తప్పకుండా కనబరచాల్సిందే. అందుకే మనిషి ఆ పక్కన ఉండటం. కాని అవన్నీ సిద్ధాంతాలే తప్ప ఆచరణ యోగ్యాలు కావు. ఆచరణలో అలాంటి సహాయం యెంతవరకు చెయ్యగలం? మీరిలా నాకు తటస్థపడ్డారు. పూర్వం మీరు నన్ను చూసి యెరగరు. నన్ను చూసినట్లు మీరెవ్వరితోనూ చెప్పరాదనీ, నా అజ్ఞాతాన్ని కాపాడవలసిందనీ మిమ్మల్నికోరాను. అలా కోరేందుకు మీ మీద నాకెటువంటి అధికారమూ లేదు. కాని మీరు బలవంతాన నోరు నొక్కుకుంటారు. ఎందువల్ల. నేనడిగిన సహాయాన్ని చెయ్యటం విధ్యుక్తధర్మంగా మీరెంచుకుంటారు కనక. మీరు మళ్ళీవొచ్చారునామౌనం నన్ను కొరుక్కుతింటోంది

కనక, నన్ను కాస్సేపు మీతో మాట్లాడనియ్యమని ప్రాధేయపడ్డాను. మీరు మంచి వారుకనక వింటున్నారు. అది పెద్ద కష్టసాధ్యమయిన పనికాదనుకోండి. కష్టతరమయిన సహాయాన్ని మీనుంచి దేనినీ కోరలేదు నేను. కాని ఒక వేళ మిమ్మల్ని "నన్ను పట్టుకుని ఆ పాయ్యే రైలుబండి కిందపడెయ్య" మని కోరాననుకోండి. మీరేమనుకుంటారు? మీరుచేసిన వాగ్దానాలూ అవీ గాలికెగిరి పోతయికాదూ? "సహాయం చెయ్యటం విధ్యుక్తధర్మంగా" దానిని మీరు భావించరనుకుంటాను. ఎక్కడోఅక్కడ దేనికయినా హద్దుండాలి. మీరు చెప్పే విధ్యుక్త ధర్మానికి కూడా హద్దుంటుంది. మీ జీవితానికే భంగకరంగా తోచినప్పుడో, తరతరాలుగా నెలకొలపబడ్డ సంఘవ్యవస్థకు ప్రతిబంధకంగా తోచినప్పుడో మీధర్మానికి హద్దు కనిపిస్తుంది. డాక్టర్ల విషయంలో మాత్రం యిలాంటి హద్దులు విధ్యుక్తధర్మానికి ఉండవేమో? ఒకడిగ్రీ సంపాయించుకున్నంత మాత్రాన, యీ నరజాతినంతా రక్షించే బాధ్యత డాక్టర్లకి సంక్రమిస్తుందా? ఆ కారణంచేత ఎవరైనా దారి మధ్యకనిపించి కరుణించమంటూ సహాయం చెయ్యమని ప్రాధేయపడితే, డాక్టరు తన జీవితాన్ని తృణప్రాయంగా విచ్ఛిన్నం చేసుకోవాల్సిందేనా? ఏ ధర్మానికైనా హద్దుంది. తన ప్రాణాంతకానికి వొచ్చేటప్పటికి మనిషికా హద్దు కనిపిస్తుంది."

అలాగే ఆవేశంతో, అంతరంగం నుంచి బయటపడే ఆవేదనతో మాటాడుతున్నాడు: "ఇంత ఆవేశంతో మాటాడుతున్నందుకు క్షమించండి నేను తాగి మాటాడటంలేదు. నేనింకా తాగలేదు. నిజం చెప్పాలి సాస్తే యీ మధ్య నేను తెగ తాగుతున్నాను. నిత్యం తాగుతునే ఉంటాను. నా ఒంటరి జీవితం అంత దుర్భరమయిపోయింది. మీరుకొంచెం ఆలోచించండి. ఏడుసంవత్సరాలపాటు అడివిమనుషుల మధ్య, జంతువుల మధ్య ఒక్కణ్నే బతుకుతున్నాను. అటువంటి పరిస్థితుల్లో జాగ్రత్తగా సజావుగా మాటాడటం మరిచిపోతాము. అప్పుడుఅదృష్టం వల్ల యెవరితోనన్నా మాటాడే అవకాశం వొస్తే వాడి నాలిక లబలబకొట్టుకుంటూ ఆగదు. నేనెక్కడ ఉండేవాణ్నని? మీకో ప్రశ్నవేస్తాను. మీ ముందు పెద్ద సమస్య ఒకటి తీసుకొచ్చి పెడతాను. స్వర్గంలో నించి ఊడిపడ్డ దేవతలా, సహాయపడటం – పరిస్థితులెలాంటివైనా సరే – మనుష్యధర్మమా, కాదా అని. అయితే యీ కథ పెద్దది. మీకు వినేందుకు ఓపిక ఉందో లేదో. మీకు విసుగురావటం లేదూ?"

"లేదండీ..." అన్నాను.

ఆ చీకట్లో చేతుల్తోయేమిటో వెతుక్కుంటున్నాడు. చప్పుడయింది.రెండు సీసాలని తెలుస్తోంది. ఒకటి తీసి గ్లాసులో పోసియిచ్చాడు. ఉత్త విస్కీ అది.

అలవాటులేకపోయినా, అతని మనస్సు నొప్పించేందుకు యిష్టం లేక తీసుకుని తాగుతున్నట్లు నటిస్తున్నాను. మరో గ్లాసు లేకపోవటం చాత అతను సీసా తోనే తాగుతున్నాడు. ఇంతలో స్టేషనులో గడియారం మోగింది. పన్నెండు కొట్టింది.

● ● ●

మీకు వ్యవహారంతెలియజేస్తాను. ఒక చిన్న పల్లెటూళ్లో డాక్టరు ప్రాక్టీసు చేస్తున్నాడనుకోండి. ఆ డాక్టరు –.."

ఆగాడు. మొదలు పెట్టాడు :

"ఎబ్బె, అదికాదు, మొత్తం మీకు తెలియాలి. అసలు యేం జరిగిందో, అందులో నాకేం

జరిగిందో మీకు చెప్పాలి. ఆమూలాగ్రం మీరంతా వినాలి. లేకపోతే మీకేమీ అర్థంకాదు. అనవసరంగా సిగ్గుపడి లాభంలేదు. దాచి ప్రయోజనం లేదు. నాదగ్గరికి యెవరయినా సలహా కొచ్చినవారు ఉన్న సంగతంతా నాకు చెపితేనే గాని ఊరుకోను. వాళ్ళకి నిజంగా నావల్ల యావన్మాత్రం సహాయం జరగాలంటే, యెంత రహస్యమైనా, యెంత అంతరంగికమైనా సరే, నాకు కావలసిన విషయాలన్నీ చెప్పెయ్యాలి. ఎవరికో, యెవరిమూలానో, మీరెరగని డాక్టరికో, యెక్కడో, యెప్పుడో యేమిటో జరిగిందని మీకు చెపితే ప్రయోజనంలేదు. నేను మీ దగ్గిరకి మందుకోసం వొచ్చిన రోగిలా, నా రహస్యాన్ని విప్పి చెపుతాను. ఇన్నాళ్లూ మారుమూల అజ్ఞానం మధ్య అడివిలో ఒంటరిగా కాలక్షేపం చెయ్యటంవల్ల, నాలో గౌరవం, మర్యాద తుడిచిపెట్టుకుని పోయినయి. ఆ ప్రదేశం, ఆ యేకాంతజీవనం నాలోని మార్దవాన్నీ, జ్ఞానాన్నీ చిదిపివేసినయి. నా హృదయాన్ని పీల్చి పిప్పిచేసినయి".

ఇలా అసలు విషయం వొదిలి మాటాడుతు నందువల్ల కొంచెం విసుకున్నాను.

"మీకు పల్లెటూళ్లంటే యెంతో అభిమానమని భావిస్తాను. ఆ నిరాడంబర జీవనం, అమాయకత్వమూ, పైరగాలీ, ఊరి వెలపల చెరువూ, ఉదయాస్తమానాలూ చెరువుదగ్గరికొచ్చే పల్లెపడుచులూ, మీలో యెంతయినా ఉత్తేజం, ఉత్సాహం కలగజేస్తయి కాబోలు. మీరువెళితే ఒక వారం రోజులుకన్నా యెక్కువ ఉండరు. ఏడుసంవత్సరాల క్రితం నేనూ మొదటిసారి అలానే అనుకున్నాను. అడివిమధ్య ఆ పల్లెల ప్రకృతి సౌందర్యానికి ముగ్ధులుకాని వారెవ్వరు? ఎప్పుడయినా షికారుకో, తోచకకాలక్షేపానికోపోతేఅలా ఆనందంగా అద్భుతంగా ఉంటుంది. అక్కడిజీవనాన్ని గురించి నేను యెన్నో కలలు కాశేవాణ్ణి. అక్కడవాళ్ళు మాట్లాడే భాష నేర్చుకోవాలని, అక్కడ నిరంతరం జనాన్ని పీడించే రోగాల విషయంలో పరిశోధనలు చెయ్యాలని, అక్కడి అరణ్యవాసుల మనస్తత్వాన్ని పరిశీలించాలని, వాళ్లనందర్నీ నాగరకులను చెయ్యాలని...

నిప్పుకనిపించని సెగ మధ్య ఉన్నట్టుంది నాకక్కడ. లోపలిశక్తినంతా పీల్చుకుతింటుంది. ఎంతయినా క్వినైనుమందువాడండి, జ్వరంతోవొళ్ళు కాలిపోతూంటుంది. మనిషి దమ్ములన్నీ ఆరిపోతయి. ఏంచెయ్యటానికీ తోచదు. ముడుచుకుపోయిఉంటాము. బద్ధకంతో చస్తుంటాము. శరీరం అంతా ఉడికిన వంకాయలా తయారవుతుంది. ఇటువేపు వాళ్లం ఆ పట్టణాలకు దూరంగా పల్లెలకు పోతేమనం మనుషులమనే మరిచి పోయే స్థితికి వస్తాము. కొన్నాళ్లకి చురుకుదనం పోతుంది. ఇవన్నీ మరిచి పోవటానికి కొందరు తాగుడు అలవాటు చేసుకుంటారు. మరికొందరు నల్లమందూ, గంజాయి అలవాటు చేసుకుంటారు. మరి కొందరికి చిత్త స్వాస్థ్యం తప్పి క్రౌర్యం, హింసాకాండా అలవరచుకుంటారు. ఇందరూ దారి తప్పిపోతారు. ఇల్లంటే యెంతో కుమిలిపోతూంటారు. పెద్ద పెద్ద మేడల మధ్య రోడ్ల మీద నడుస్తూండటం, చక్కని కిటికీలూ, గోడలూ ఉన్న గదిలో కూర్చోటం, మన వాళ్ల మధ్య ఉండటం! అలా అలా కాలం గడిచిపోతూ ఉంటుంది. ఇంటికి పోవటానికి వ్యవధి దొరికేటప్పటికి పోయేందుకు ఉత్సాహం కాస్తా ఊడ్చుకు పెట్టుకు పోతుంది. ఏం ప్రయోజనం. తన ఆత్మీయులూ, ఆప్తులూ తన్ని మరిచి పోయి ఉంటారు. వాళ్లకి తను జ్ఞాపకమే ఉండడు. అంచాత ఎక్కడ ఉండే వాడో అక్కణ్ణే అలా ఉండి పోతాడు, ఆ ఉష్ణకాసారం మధ్య, ఆవిరి కుండల ప్రక్కన. నా జీవితంలో ఆ అరణ్యప్రాంతాల మధ్య ఉద్యోగానికి

చెప్పుకున్న రోజు, నా శరీరాన్ని, నా ప్రాణాన్ని కాసిని డబ్బులకు అమ్మేసుకున్న రోజు, అంత నికృష్ట దినం మరిలేదు.

"ఇంటి కొకసారి పోయిరావటానికి వీలున్నా అది అంత సులభంకాదు. చెన్నపట్నంలో డాక్టరు పరీక్ష చదివాను. నేను చెన్నపట్నంలోనే పుట్టాను. డిగ్రీ పుచ్చుకోగానే అక్కణ్నే ఒక ఆస్పత్రిలో ఉద్యోగం సంపాయించాను. అప్పటికే వైద్యశాస్త్రంలో ఒక కొత్త ప్రయోగం చేసినందువల్ల, కొంచెం కీర్తి సంపాయించుకున్నాను. అంత అల్పకాలంలోనే పేరు సంపాయించటం చాత నన్ను గురించి యెందరో చెప్పుకునేవారు.

"అప్పుడొక ప్రణయ వ్యవహారంలో చిక్కుకోవటం చాత, నా జీవితంలోని అవకాశాలనన్నింటినీ జారవిడుచుకున్నాను. ఆసుపత్రిలో ఒక అమ్మాయితో సంబంధం యేర్పడింది. ఆ అమ్మాయికోసం ఒకతను పిచ్చెత్తి ఆత్మహత్య చేసుకోవాలని ప్రయత్నం చేశాడు. అతనితో ఆ అమ్మాయి చాలా కాలం కాపరం చేసింది. అతనెంత పిచ్చెత్తిపోయాడో ఆ అమ్మాయి కోసం నేనూ అంత పిచ్చెత్తి పోయాను. ఆ అమ్మాయికి తనకున్న అందం గురించీ, ఆకర్షణ శక్తి గురించీ యెంత గర్వపడేదనుకున్నారు? ఆ యవ్వనమదాన్నీ గర్వాన్నీ చూసి ముగ్ధుణ్నయి పోయేవాణ్ణి. నా బతుకూ, భవిష్యత్తూ అంతా ఆవిడ కోసమేననుకునేవాణ్ని. ఇంతగా ఆకర్షించి తన అందంతో, ఆకర్షణతో అధికారం చెలాయించే యే ఆడదానికైనా సరే నన్ను దాసుణ్ని చేసుకోవటం యెంతయినా సులభం. ఈ అమ్మాయి ముందు నా పౌరుషం అవశమయి పోయేది. ఆవిడ యేది కావాలంటే అది చేసేవాణ్ని. ఆవిడ కోసమే ఆసుపత్రిలో నించి డబ్బు కూడా దొంగతనం చేశాను. నా దొంగతనం యెన్నాళ్లో దాగలేదు. బయట పడింది. మా మేనమామ ఒకాయన ఆడబ్బు కాస్తా కట్టేశారు కాని నా ఉద్యోగం ఆనాటితో ఆఖరయిపోయింది.

ఆదే కాలంలో ఒరిస్సాలోని యేజన్సీ ప్రాంతాలలో పనిచెయ్యటానికి ప్రభుత్వానికి డాక్టర్లు కావలసి వొచ్చారు. అక్కడ ఈగలూ, చీమలూ చచ్చినట్లుగా మనుషులూ చస్తూంటారని నాకు తెలుసు. అయితే యవ్వనంలో ఉన్నవాడికి, తతిమ్మావారంతా మలేరియాతో, విషజ్వరాలతో చచ్చి తనొక్కడే మిగిలుతాడనిపిస్తుంది.

"నేనేమీ విపరీతంగా తర్కించుకోలేదు. వెంటనే దరఖాస్తు పెట్టాను. దారి ఖర్చులకూ, ఒక నెల జీతమూ డబ్బు పంపించేశారు. సగం మా మేనమామకు పంపించాను. మిగతా సగమూ నాతో రెండుగంటలపాటు సాహచర్యం చేసిన పిల్ల చేతిలో పెట్టాను. నా అధోగతికి కారణం అయిన ఆసుపత్రిలోని స్నేహితురాలిలాగే ఆ పిల్లమొహం కూడా కనిపించటంచాత ఉన్నదంతా యిచ్చేశాను. చేతిలో దమ్మిడీ లేకుండా, నిశ్చింతగా బయలుదేరాను. రైల్లో ఒంటరిగా కూర్చుని, నా కొత్త జీవనం గురించి తలపోస్తున్నాను. ఆ ఆనాగరక జనులూ, అరణ్య శోభా, అక్కడి నిత్య నిర్మలాకాశం–వాటి మధ్య యేకాంతాన్నీ ప్రశాంతాన్నీ అనుభవించాలనే ఆశతో వెళ్లాను.

నా కోరికలు కించిత్తు వ్యవధి లేకుండానే ఫలించినయి. నన్ను పట్టణంలో నియమించలేదు. పట్టణంలో అయితే చదువుకున్న జనం కొందరైనా ఉండేవారు. పుస్తకాలన్నా దొరికేవి. పేరేదయితేనేం, రైళ్లూ, బస్సులూ పోని మారుమూల పల్లెలో ఉండమన్నారు. తలకాయలేని యిద్దరు చిన్న ఉద్యోగస్థులూ, ఒక బంట్రోతూ నాతో ఉండేవారు. ఇరవైనాలుగ్గంటలూ వాళ్లతో

కాలక్షేపం. ఆ పల్లె చుట్టూ అనంతంగా ఆవరించుకున్న అడివీ, చెమ్మ ప్రదేశాలూ, వాటి మీదగా గాలికన్న యెక్కువగా వచ్చే దోమలూ, పచ్చని పంటలూ—ఎప్పుడు చూసినాయివే. వీటిలో యేం మార్పూ కనిపించదు.

ఇలా ఉన్నా కొత్తల్లో బాగానే ఉండేది. కొత్త ప్రదేశం కనక వింతగా ఉంటం చాత కాలం గడిచి పోయేది. కొన్నాళ్ళు విపరీతంగా చదువుకునేవాణ్ని. అప్పుడొకసారి యేజన్సీ సూపరెంటు తనిఖీకి వస్తూ కారు బోల్తా కొట్టటం చేత కాలు విరగ్గొట్టుకున్నాడు. ఆయన ఉత్తరాది మనిషి. ఆ చుట్టు పక్కల డాక్టరు లేక పోవటం చేత నేనే చికిత్స చెయ్యవలసి వచ్చింది. ఆపరేషను చేసి కుట్లు కుట్టి కొన్నాళ్లకు కాలు యథాప్రకారం పనిచేసేట్టు చేశాను. ఏజెన్సీ ప్రాంతానికల్లా అధికారి కావటం చాత, ఆయన నాకు ప్రత్యేకం చేసిన అభినందనలు నాకెంతో లాభకరం. మరికొన్నాళ్లు అరణ్యవాసులు ఉపయోగించే ఆయుధాల గురించి, విషరసాల గురించీ పరిశోధనలు చేశాను. అవి కూడా అయి పోయిన తరవాత, కాలక్షేపం కోసం మరెన్నో సంగతులను యేరి తెచ్చుకునే వాణ్ని.

నేను మా ఊరినుంచి తెచ్చుకున్న శక్తి అంతా సన్నగిలేంతవరకూ, యిలాగే విధ విధాలుగా యేదో నిత్యం చేస్తుండేవాణ్ని. ఆ తరవాత అక్కడి వాతావరణం నాకు పడలేదు. నాతో తిరిగే జనం అంటే విసుగొచ్చింది. వాళ్లని వదిలించుకోవటానికీ, నాలో నిద్ర పోతూన్న భావాలకు ప్రాణం పోసేందుకు తాగుడు అలవాటు చేసుకున్నాను. విపరీతంగా తాగటం మొదలుపెట్టాను. మరో రెండేళ్లు మాత్రమే నేను అక్కడ ఉండవలసి వచ్చింది. ఆ రెండేళ్ల తరవాత నా ఉద్యోగకాలం చెల్లయి పోతుంది. అప్పటి వరకు యెలా ఉన్నా కాచుక్కూచోవలసిందే. నేనుండే వాణ్ని అప్పటిదాకా. అయితే ఒక చిన్న సంఘటన జరిగింది. అదే నేను చెప్పబోతున్నాను.

చీకటి నిశ్శబ్దమయింది. దూరాన ఇంజన్లను కడుగుతున్న చప్పుడు స్పుటంగా వినిపిస్తోంది. సిగరెట్టు కాల్చుకోవాలని చూశాను కాని, మళ్లీ అగ్గిపుల్ల వెలిగిస్తే అతను వెలుతురు చూసి చలిస్తాడనీ, చెప్పేకథ మరిచిపోతాడనీ భయపడ్డాను.

కాస్సేపటి దాకా మేమిద్దరమూ నోరెత్తలేదు. అతను మనస్సు మార్చుకున్నాడా? మిగతా కథ వినిపించటం అంత బాగుండదని మానేశాడా?

అలా ఆలోచిస్తుండగా రెండుగంటలు కొట్టారు. కాస్త కదిలాడు అతను. మళ్లీ సీసా తీసుకుని కొంచెం తాగి గొంతు సవరించుకుని ఆవేశంతో చెప్పటం మొదలు పెట్టాడు.

"అలాగే కాలం గడిచిపోతుండేది. నెలల తరబడి ఆ పాడుప్రదేశంలో యేం చెయ్యకుండా నిస్తబ్ధుణ్నయి ఉండేవాణ్ని. సాలిపట్టు మధ్య నున్న సాలి పురుగులా నిశ్చలుణ్నయి పోయాను. వర్షాకాలం గడిచి పోయింది. వార వారాలుగా మా యింటి కప్పు మీద భోరుమంటూ కురిసే వర్షధార ప్రచండ ధ్వానాన్ని వింటుండే వాణ్ని. ఏ వ్యక్తీ మన ప్రాంతాల నుంచి వచ్చేవారు కాదు. నేనూ, నా సేవకులూ, ఆ యింట్లో ఉండేవాళ్లము. తోచక తాగే వాణ్ని. ఏదయినా కథల పుస్తకం తీసి చదివితే, అందులో మన వేపు జనం గురించీ, ప్రదేశాల గురించీ వర్ణనలు చూసి నా కాళ్లు వణికేవి. ఇంటికి పోవాలని ఆత్ర పడే వాణ్ని. మీరు వూళ్ళూ, దేశాలూ తిరుగుతారు. అక్కడ కాపరం చేసే జనం కన్న వాటి గురించి మీకేం యెక్కువ తెలియదు. పరిచయం లేని ముఖాలూ, అర్థం కాని భాషా, దూర దేశం, తెలుగు వాడి కంతకన్న యమయాతన యేముంటుంది? జాగ్రత్త పుస్తకాలు

తిరగేస్తూ వీలయినవీ, వీలు కానివీ, ప్రయాణాలను మనస్సులో యేర్పాటు చేసుకుంటున్నాను. అప్పుడు నా సేవకులిద్దరు పైకొచ్చి నా కోసం ఒకావిడ–మన వేపు వించే–వచ్చిందని ఆశ్చర్యంతో చెప్పారు.

నాకూ ఆశ్చర్య వేసింది. బండీ చప్పుడు కానీ, కారు చప్పుడు కాని నాకు వినిపించలేదు. ఈ అడవుల్లో ఆ తెలుగమ్మాయి యేం చేస్తోంది?

నేను మేడ మీద వరండాలో కూచుని ఉన్నాను. ఎవరన్నా పెద్ద మనుషులువొస్తేచూసేందుకు తగిన బట్టలు వేసుకుని లేను. రెండు నిమిషాల్లో బట్టలు మార్చుకో కలిగాను కాని, మనస్సులో విపరీతమయిన అలజడి బయలు దేరింది. మెల్లిగా కిందికి దిగివచ్చాను. ఎవరై ఉంటారు? నాకు స్నేహితులెవరూ లేరే? ఈ అడవుల్లో అజ్ఞాతంగా ఉన్న నన్ను చూసేందుకెవరు వొస్తారు?

నా ఆఫీసు గదిలో ఆవిడ కూర్చునుంది. ఆవిడ పక్కనే ఒక ఒరియా కుర్రాడు–ఆవిడ దగ్గిర పనిచేసే కుర్రాడులా ఉన్నాడు–నిలబడి ఉన్నాడు. ఆవిడ నన్ను చూడటంతోటే చప్పున లేచి నిలబడింది. తలమీద చీర కొంగుతో ముసుగువేసుకుంది. నేను ఒక్క మాటయినా అడకముందే ఆవిడ మాటాడటం మొదలు పెట్టింది.

"నమస్కారమండీ, డాక్టరుగారూ", తెలుగులో మాటాడుతోంది. తెలుగు విని యెన్నేళ్లయింది! "మీకు కబురు చెయ్యకుండా యిలా వచ్చినందుకు క్షమించాలి అండి, ఆవిడ గబగబా. "కాస్త టీ తాగుతారా," అన్నాను.

వొద్దండీ, డాక్టరుగారూ, నేనెంతో సేపుండటానికి వీల్లేదు. ఆరె, తెలుగు పుస్తకాలున్నాయ్. మీరు బాగా చదువుతారు. ఒక్క క్షణమూ ఊరికే పోనివ్వరు. సూపరెంటుగారు, మీ దగ్గిర తప్ప మరెవ్వరి దగ్గిరా మందు తాకనంటారు. మా పెద్ద డాక్టరు గారికి తెలిసిందల్లా పేకాట ఒక్కటే. కాని మీరు–మిమ్మల్ని యివాళ చూదామనుకున్నాను. కార్లో బయలుదేరి వెడుతుంటే యింత కన్న మంచి సమయం దొరకదని మీ దగ్గిరకి వచ్చాను". ఈ మాటలంటున్నపుడు మొహం యెత్తకుండా, నా వంక చూడకుండా, పుస్తకాల్ని తిరగేస్తూ మాటాడుతోంది. "మీరు చాలా పని తొందరలో వున్నట్టున్నారు. మీకు తీరిక ఉండి ఉండదు. అంచాత మరో సారి వస్తాను".

ఇప్పటికైనా తన మనస్సులోని మర్మం బయట పెడుతుందేమోనని ఆశించాను. నా భావాల్ని నాలో దాచుకుని, యెప్పుడైనా సరే ఆవిడకు కావలసిన సహాయం చెయ్యగలనని చెప్పాను.

"తీరా వొచ్చాను గనక –" అంటూ వెనక్కి తిరిగింది. బల్లమీద నుంచి తీసిన పుస్తకం తిరగేస్తోంది. "పెద్ద ప్రమాదకరమయిన వ్యవహారం కాదనుకోండి. సామాన్యంగా ఆడవాళ్లకు వొచ్చే బాధ లెండి. తలదిమ్మూ, మూర్ఛలూ, బలహీనతా. ఇవాళ పొద్దున కారు వీథిలో మలుపు తిరుగుతోంటే ఆకస్మాత్తుగా వొళ్లు అవశమయిపోయింది. పడి పోతుంటే మా కుర్రాడు పట్టుకున్నాడు. వాడు కాసిని మంచినీళ్లు తెచ్చియిచ్చాడు. దాంతో కొంచెం తేరుకున్నాను. డ్రైవరు కారుని యెంతో వేగంగా తోలి ఉంటాడు. అంతే నంటారా, డాక్టరు గారూ?"

"అలా చెప్పటం కష్టం. మీ కిదివరలో యెప్పుడైనా మూర్ఛలు వొస్తుండేవా"?

"లేదు. ఈ మధ్యనే రెండు మూడు వారాల నుంచి మరింత యెక్కువగా వొస్తున్నాయి. పొద్దున పూట సుస్తీగా ఉన్నట్లు బాధపడతాను."

మళ్లీ ఒల్ల దగ్గిరకి పోయింది. మరో పుస్తకం తీసి పేజీలు తిరగేస్తోంది. ఎందుకలా చిత్రంగా ప్రవర్తిస్తోంది? ఆ ముసుగు తీసి నా వంక చూడదేం? చెప్పకూడదని జవాబుచెప్పలేదు. నా జవాబు లేకుండా మాటాడకుండా ఆవిడ అలా నిలబడటంనాకు ఆనందం వేసింది. అంత చిత్రంగా ఆవిడ ప్రవర్తిస్తే, నేనూ అంత చిత్రంగానూ ప్రవర్తించగలను! మళ్ళీ కాశ్శేపు చూసి మొదలు పెట్టింది.

"మీరు ఒప్పుకుంటారు కదూ డాక్టరుగారూ, అదేం అంత ప్రమాదకరమైన రోగం కాదు. ఇటు వేపు వచ్చే రోగాల్లాంటిది కాదు. అంతేనా? పెద్ద ప్రమాదం యేమీ లేదు?

"మీ ఒంట్లో జ్వరమేమన్నా ఉందేమో, చూడాలి. మీ నాడి చూస్తే తెలుస్తుంది. మీ చేయ్యేదీ?"

ఆవిడ దగ్గిరకి సమీపించాను. వెనక్కి తగ్గింది.

"లేదండీ, డాక్టరుగారూ, నాకు తెలుసు. నాకు జ్వరం లేదు. రోజూ జ్వరం చూసుకునేదాన్ని-యీబాధ మొదలు పెట్టి నప్పట్నుంచీ, నార్మల్ పైన ఒక్క పాయింటూ లేదు. నాకు అన్నం కూడా బాగా జీర్ణం అవుతుంది."

కొంచెం సేపు తటపటాయించాను. ఈవిడ వింత ప్రవర్తన నాలోని అనుమానం రేకెత్తించింది. నా మనస్సులోనించే యేదో ఆవిడ లాగాలని ప్రయత్నిస్తోంది. దాదాపు అరవై దెబ్బయిమైళ్లు కారు మీద నాదగ్గిర కొచ్చిందంటే, తెలుగు పుస్తకాలను తిరగెయ్యటానికి కాదు. రెండు నిమిషాలు ఆగనిచ్చి, "ఒకటి రెండు సంగతులడుగుతాను, మీరేం అనుకోరుకదా! అని అన్నాను.

"తప్పక, తప్పక . డాక్టరు దగ్గిరకి దేని కొస్తారు?" అని మెల్లిగా అంది. మళ్లీ అటు వేపు తిరిగి పుస్తకాలు తిరగేస్తోంది.

"మీకు సంతానం కలిగిందా?"

" ఆ. ఒక అబ్బాయి."

"మీరు గర్భంతో ఉన్నప్పుడు కొత్తలో మీకిలాంటి బాధ ఉండేదా?

"ఆ".

అని ఖచ్చితంగా జవాబిచ్చింది. ఇప్పటి గొంతుకూ, వెనకటి గొంతుకూ ఎంతో భేదం ఉంది.

"అలా అయితే యిప్పుడూ మీకు సంతానం కలగబోతోందని యెందుకనుకో గూడదు?"

"అవును."

మళ్లీ వెంటనే ఖచ్చితంగా అన్నది.

"నా ఆసుపత్రి గదిలోకి రండి. మిమ్మల్ని పరీక్ష చేస్తే ఒక క్షణంలో సంగతి తేలుతుంది."

ఇప్పుడు నా యెదుటికి తిరిగింది. ఆ ముసుగు చాటునుంచి తీక్షణంగా నావంక చూస్తోంది.

"అనవసరమండీ, డాక్టరుగారూ! నా ఒంటి సంగతి నాకు బాగా తెలుసు".



కాశ్శేపు నిశ్శబ్దం.

అతను మళ్లీ ఒకసారి సీసా తీసుకుని తాగటం వినిపించింది. అప్పుడు కథ తిరిగీ సాగించాడు:

"మీ అంతట మీరు ఆలోచించండి. ఒంటరిగా ఆ అజ్ఞాత ప్రదేశంలో కుమిలి పోతున్నాను. ఎక్కణ్నుంచో యీ స్త్రీ-యేళ్ల తరబడి నాకు కనిపించని మనదేశం నుంచి వచ్చిన స్త్రీ-నా దగ్గిర

కొచ్చింది. ఏదో దుష్టశక్తి ప్రమాదం, నా గదిలో ప్రవేశించిందనిపించింది. నన్ను హెచ్చరించినయినా హెచ్చరించకుండా, నా మీద కత్తి విసిరినట్టుగా కోరిక నొకదాన్ని కోరింది. నా దగ్గర నుంచి ఆవిడ యేమిటి అభిలషించిందో ప్రస్ఫుటమయిపోయింది. అలాంటి కోరికలతో, ఆడవాళ్లు నాదగ్గిరకి రావటం అది మొదటి సారి కాదు. అయితే అలా వొచ్చిన వారంతా, యెంతో దీనంగా కన్నీళ్లతో నన్ను ప్రాధేయపడుతూ, తమ కష్టాన్నుంచి తప్పించమంటూ వేడుకున్నారు. కాని యీ మనిషి ప్రకృతి చిత్రంగా ఉంది. కృత నిశ్చయంతో, సాహసంతో వచ్చింది. మొట్టమొదట నుంచీ ఆవిడని చూడగానే, నాకన్న ఆవిడ శక్తి మంతురాలని గ్రహించాను. బహుశా తన యిష్టానుసారమే నాచేతపని చేయించుకోగలదని ఊహించాను. నా గదిలో దుష్ట శక్తి ప్రవేశించి ఉన్నట్లయితే, మగవాణ్ణయిన నాలోన్నూ ప్రవేశించి ఉంటుంది. నాలో ద్వేషం రేగింది. ఆవిడ మీద నాలో తిరుగు బాటు లేచింది. ఆవిడలో నాకు బ్రహ్మాండమైన శత్రు మూర్తి గోచరించింది.

కొంత సేపటి దాకా, మొండిగా మౌనం వహించాను. తన ముసుగులో నుంచి నావంక తీక్షణంగా చూస్తోందనీ, నన్ను ధిక్కరిస్తోందనీ భావించాను. నా చేత మాటాడించటానికి వొత్తిడి చేస్తోందని అనుకున్నాను. అయితే నేను లొంగ దలచుకోలేదు. నేను జవాబిచ్చినా, అసలు సంగతి వొదిలి, అప్రయత్నంగా, ఆవిడ సాహసాన్ని హేళన చేస్తూ మాటాడాను. ఆవిడ ఉద్దేశాన్ని అర్థం చేసుకోనట్లు నటించాను. నిర్మొగమాటంగా, స్ఫుటంగా ఆవిడ చేత తన మనస్సు విప్పి చెప్పించటానికి ప్రయత్నించాను. తతిమ్మా ఆడవాళ్లు నన్ను ప్రాధేయపడ్డట్టు,. యీవిడ కూడా ప్రాధేయపడాలని వాంఛించాను. నా దగ్గిర అంత ధీమాతో, ధిక్కారంతో మాటాడినందుకూ, అటువంటి ప్రకృతిముందు నేను దుర్బలుణ్ణవటం చేత, ఆవిడ దీనంగా కన్నీళ్లతో నన్ను వేడుకోవాలని కోరుకున్నాను.

అంచాత అసలు సంగతి వొదిలి తతిమ్మా విషయాలన్నీ మాటాడటం ప్రారంభించాను. ఆవిడ చెప్పిన రోగలక్షణాలు అంత ప్రమాదకరం గావనీ, కడుపుతో ఉన్న ఆడవాళ్లకు మొదటి రోజుల్లో అలా వికారంగా ఉంటూంటుందనీ, వాటివల్ల కీడు కన్నా, రాను రాను మేలు కలుగుతుందని కూడా చెప్పాను. నేను చూసిన కేసులూ, పుస్తకాల్లో చదివిన కేసులూ యేకరువు పెట్టాను. మొత్తం వ్యవహారాన్నంతా అతి చులకనగా తీసుకుని చెప్పాను. ఆవిడ మధ్య అడ్డుపడి మాటాడేదాకా మాటాడుతునే ఉన్నాను. ఇలా నేను మాటాడుతుంటే తప్పక అడ్డం వొచ్చి మాటాడుతుందని నాకు తెలుసు.

నేను చెప్పేది అనవసరమన్నట్లు చెయ్యి విసిరి మాటాడింది.

"అది కాదు డాక్టరుగారూ, నన్ను బాధించేది. ఇలా యిది వరకు బాధపడి ఉండలేదు. హృదయ దౌర్బల్యం కూడా ఉంది".

"గుండె జబ్బా!" ఇది వరలో చూపించని ఆత్రుతా ఆశ్చర్యమూ ప్రకటిస్తూ అన్నాను. "అది కూడా పరీక్షిస్తాను" అంటూ నా స్టెతాస్కోపు కోసం వెదుకుతున్నాను.

మళ్లీ ఆవిడ ధిక్కరిస్తూ, అధికార పూర్వకంగా అంటోంది! "నేను చెపితే చాలు, నాకు గుండె నొప్పి కూడా ఉందని అనవసరమయిన పరీక్షలతో మీకాలాన్ని, నా కాలాన్నీ వృథా పరచకండి. మీరు నేను చెప్పే మాటల్లో కొంచెం విశ్వాసం ఉంచండి. మిమ్మల్ని పూర్తిగా నమ్ముతున్నాను!"

కేవలం యుద్ధమే ప్రకటించింది. చేతిలో పుస్తకాన్ని బలవంతంగా బల్ల మీదకు విసిరేసింది.

"నమ్మకముంచట మంటే మనస్సు విప్పి మర్మం లేకుండా మాటాడాలి. అంచాత ఉన్న సంగతేదో దాచకుండా చెప్పండి. మీ మునుగుతీసి అలా కూర్చుని చెప్పండి. పుస్తకాలు తరవాత చూద్దురు గాని. డాక్టరు దగ్గరి కొచ్చి మునుగులో గుద్దులాట దేనికి?"

నదురూ బెదురూ లేకుండా ముందు కొచ్చి కుర్చీలాక్కుని కూర్చుంది. మునుగు తీసివేసింది. ఎటువంటి వ్యక్తిని చూస్తే నేను భయపడతానో అటువంటి వ్యక్తే యీవిడ. మనోభావాన్ని ముఖంలో వ్యక్తం కానియ్యదు. తెలుగుదేశంలో అంత సౌందర్యం అరుదుగా చూస్తాము. కాలాన్ని అధిగమించే ఆ వ్యక్తి సౌందర్యానికి ముగ్ధుణ్నయిన మాటమాత్రం నిజం. ఈవిడ వయస్సులో చిన్నది. యవ్వన భారంతో కుంగి పోతోంది. విశాల నేత్రాలూ, వాటిలో ప్రతి బింబించే ఆత్మ విశ్వాసమూ, అణిచి పెట్టుకున్న అవిరళ కామమూ యెవరినైనా చకితులను చెయ్యగలవు. ఆవిడ పెదిమలు జాగర్తగా పోత పోసినట్లున్నాయి. ఆవిడ మనస్సులో పెట్టుకున్న ఒక్క భావాన్నీ అవి బయట పడనియ్యవు. ఒక్క నిమిషం ఒకరి నొకరం గాఢంగా చూసుకున్నాము. ధైర్యంతో, ధిక్కారంతో దర్పంతో నన్నేదో అడుగుతున్నట్లు భయంకరంగా నావంక చూస్తున్నది. నా అంతట నేనే రెప్పలు వాల్చుకున్నాను.

బల్ల మీద వేళ్లతో, మెల్లిగా కొడుతున్నది. తనలోని వొణుకు దాచి పెట్టుకోలేక పోయింది. హఠాత్తుగా అన్నది:

"డాక్టరుగారూ, నేనేం అడుగుతున్నానో మీకు తెలిసిందా, తెలియలేదా?"

"కొంచెం ఊహించుకోగలిగాననుకుంటాను. సంగతేదో స్పష్టంగా మాట్లాడదాం. మీ ప్రస్తుత స్థితికి స్వస్తి చెప్పించుకోవాలను కుంటున్నారు. మీ మూర్ఛలూ, తల దిమ్మూ తగ్గిపోవాలంటున్నారు. ఈ రోగానికి మూలకారణమేదో చూసి తొలగించమంటున్నారు. అంతేనా?

"అవును".

అని చటుక్కున పదునైన కత్తి వ్రేటులా అన్నది.

"అటు వంటి వ్యవహారం మనిద్దరికీ అపాయకరమని మీరెరుగుదురా?

"తెలుసును".

"అలాంటి ఆపరేషను చట్ట విరుద్ధమని తెలుసునా?"

"కొన్ని పరిస్థితులలో అది చట్ట విరుద్ధం కాదని నాకు తెలుసు. అంతే కాదు, అలాంటిది అత్యావశ్యకమని వొప్పుకున్నారు.".

"అలా ఆవశ్యకమని చెప్పవలసిన పక్షంలో వైద్యశాస్త్ర రీత్యా తగినంత సాక్ష్యం చూపించాలి".

"అవును. మీరు డాక్టరు కనక మీరు తగినంత సాక్ష్యాన్నీ సంపాయించగలరు".

ఏ మాత్రం చలించకుండా యీ మాట అన్నది. ఆజ్ఞా సూచకమయిన ధోరణిలో అంటోంది. ఆ కృతనిశ్చయాన్నీ, ధీర హృదయాన్నీ చూసి, దుర్బలుణ్నీ కనక గాభరా పడుతూ వొణికిపోయాను. అప్పటికీ నా పట్టువిడవలేదు. నాకన్న శక్తిమంతురాల ననే నిజాన్ని ఆవిడ గ్రహించరాదు. "అంత తొందరగా కూడదు", అంటూ తలపోశాను. "అవాంతరాలు కల్పించి ఆవిణ్ని లోబరచుకోవా" లనుకున్నాను.

"తగినంత సాక్ష్యాన్ని ప్రతి డాక్టరూ సంపాయించటం కష్టం. నాతో పనిచేసే డాక్టర్లతో సంప్రదించి .......

"నాకితర్లతో నిమిత్తం లేదు. నేను మీతోనే సంప్రదించటానికి వచ్చాను."

"నేనే యెందుకు కావలసి వచ్చానో చెప్పగలరా?"

చుర చుర నావంక చూస్తూ అన్నది:"చెప్పటానికి నాకభ్యంతర మేమీ లేదు. ఒకళ్లతో సంబంధం లేకుండా మారుమూల మీరుంటున్నారు కనక; నన్నిది వరకెప్పుడూ మీరు చూసి ఉండలేదు కనక;" కాశ్శేపు తటపటాయించి, "మీరీ దేశంలో యెంతో కాలం ఉండబోరు కనక-అందులోనూ మీకు కావలసినంత ధన సహాయం లభించినప్పుడు తప్పకుండా యీ దేశం విడిచి వెళ్లి పోగలరు కనక".

నా నాడుల్లో విద్యుత్తు ప్రవహించినట్లయింది. ఈ వ్యాపార దృష్టి నాలోని మాంసాన్ని కుత కుత ఉడికించేసింది. కళ్ల నీళ్లు లేవు! ప్రాధేయపడటమూ లేదు. నా విలవ కొలిచింది. నా ధర కట్టేసింది. తనకు నమ్మిన బంటుగా నన్ను తీసుకోవటానికీ, తనిష్ట ప్రకారం నాచాత పనిచేయించు కోవటానికీ చూస్తోంది. నా పట్ల ఆవిడ చూపించిన దృష్టి నాలో పెద్దతుఫాను లేవదీసింది. నా ఆవేశాన్నీ, అను తాపాన్నీ లోపలనే అణిచి పెట్టుకునిహేలా పూర్వకంగా నిరర్థకంగా ప్రత్యుత్తరం చెప్పాను.

"ఇంత పెద్ద మొత్తాన్ని-యీ డబ్బు నాకిస్తానంటున్నారు , దేనికి...?"

"మీకు సహాయం చెయ్యటానికి, వెంటనే మీరు మీదేశం వెళ్లిపోవటానికి."

"నాజీతం, యితర భత్యాలూ, మొత్తం తుడిచి పెట్టుకు పోగలవని మీకు తెలుసు!"

"నేనిచ్చే డబ్బు కదో లెక్క కాదు."

"మీరు యెంతో మనస్సు విప్పి మాట్లాడుతున్నారు. మీరింత కన్నా విస్పష్టంగా మాట్లాడితే మంచిదనుకుంటాను. మీరెంత యివ్వదలచుకొన్నారు?"

"పదివేల రూపాయిలిస్తాను. బెజవాడ బ్యాంకులో మీరా డబ్బు వసూలు చేసుకోవలసి వొస్తుంది."

కోపంతోనూ, విస్మయంతోనూ వొణికి పోయాను. మొత్తం లెక్క వేసుకుని, నా విలవ కట్టింది. నా ఉద్యోగానికి తిలోదకాలిచ్చే షరతు మీద యింత పెద్ద మొత్తాన్నీ నాకు చెల్లిస్తానంటోంది. నన్ను చూడక పూర్వం, నన్నెరక్క పూర్వమే, నన్ను కొనేసింది. నేను వొప్పుకుంటాననే ధైర్యంతో యిలా చేసింది. ఈ విధంగా నన్ను నీచంగా భావించి అవమానించినందుకు, నా వొళ్ళు భగ భగ మండిపోయి, ఆవిడ చెంప పగిలేట్టు కొడదామన్నంత కోపం వొచ్చింది. కాని నేను కోపంతో లేచి నిలబడేటప్పటికి, (ఆవిడ కూడా లేచి నిలుచుంది) యే మాత్రం ప్రాధేయపడని, కర్కశమూ, గర్వాంకితమూ అయిన ఆవిడ అధరద్వయమూ, అహంకార లాలసాలయిన ఆవిడ నేత్రాలూ, నాలో మృగవాంఛ రేకెత్తించినై. అకస్మాత్తుగా నా యావచ్ఛరీరమూ, ఆవిడకోసం తపించి పోతోంది. నా ముఖభావంలో నా అంతరంగం ఆవిష్కృతమయి ఉంటుందనుకుంటాను. పీడించుకు తినే బిచ్చగానిని చూసినట్టుగా, ఆవిడ కనుబొమ్మలెత్తింది. ఆ క్షణంలో మేము ఒకరినొకరం అసహ్యించుకున్నాం. మాలో ఒకరి పట్ల ఒకరికి అలా నీచంగా చూసుకుంటున్నట్లు మా యిద్దరికీ తెలుసు. నన్ను ఉపయోగించుకోవలసి వచ్చినందుకుగాను ఆవిడకెంతయినా అసహ్యంగా ఉంది. నన్ను సహాయం కోసం యాచించటానికి బదులు, ధిక్కారంతో అడిగినందుకు

ఆవిడ మీద నాకసహ్యం వేసింది. ఈ మౌన క్షణాలలో మొట్టమొదటిసారిగా మేము పరస్పరం మనస్సు విప్పి మాటాడుకుంటున్నాము. ఏదో విపరీత విషసర్పం కాటువేసినట్లు, ఒక విపరీత 'భావం' నామనస్సులో ప్రవేశించింది. ఆవిడతో అన్నాను... ఆవిడతో అన్నాను...

"నేను చాలా తొందరగా చెబుతున్నాను. నన్ను మీరపార్థం చేసుకుంటారు. ఈ విపరీత భావానికి మూలకారణం ముందుగా మనవి చేస్తాను."

●

కాశ్యేపు ఆగాడు. మరి కొంచెం తాగాడు. మరింత గట్టిగా మాటాడుతున్నాడు.

"నే చేసిన పనికి తప్పించుకోవటానికి ప్రయత్నించటం లేదు. మీరు నన్ను అపార్థం మాత్రం చేసుకోకూడదు. నే నింతవరకెప్పుడూ పెద్ద మనిషినని వ్యవహరించలేదనుకుంటాను. కాని నా చాతనయినంత వరకు ఆపదలో ఉన్న వారికి సహాయం చెయ్యటానికి సిద్ధంగా ఉంటూనే వచ్చాను. అక్కడ నేనున్న దుర్భర వాతావరణంలో నేను సేకరించుకున్న విజ్ఞానాన్ని ఫలప్రదం చెయ్యటమే నాకు సంతోషం. నిర్ధనులై రోగపీడితులైన వారి జీవితాలలో కొత్త ఆశలను రేకెత్తించటమే నాకెంతో సంతోషదాయకమైన విషయం. అది కేవలం సృష్టి బద్ధమైన సంతోషం. తానొక దైవంగా భావించుకోదగ్గ సంగతి. ఒక కొండ జాతి వాణ్ణి తీసుకొచ్చారు. పాముకాటు వల్ల కాలు విపరీతంగా వాచిపోయింది. ఆ కాలు తీసి పారెయ్యవలసి వస్తుందేమోనన్న భయంతో వొణికి పోతున్నాడు. అతని జీవితాన్ని, ఆ అమూల్యాంగాన్నీ రక్షించకలిగాను. నాకది యెంత సంతోషం. జ్వరంతో బాధపడుతున్న కోయపడుచుకు మందివ్వటానికి ఆ అరణ్య ప్రదేశాలను ఛేదించుకుంటూ యెంత దూరం పోయాను? చెన్న పట్నంలో కూడా యిప్పుడు నా దగ్గరకు వచ్చిన మాదిరిగా యెందరో స్త్రీలు వచ్చినప్పుడు సహాయం చెయ్యటానికి సదా సంసిద్ధుణ్నాయి ఉండేవాణ్ని. కాని ఆ సమయంలో అలా వచ్చిన రోగులు యేదో విపత్తులో నుంచీ, రోగబాధ నుంచీ తప్పించుకోవాలనే ఆతురతతో వచ్చినట్లు భావించుకునే వాళ్లము. అటువంటి ఆక్రోశమే, నన్ను నిరంతరం సహాయపడేటట్లు చేసేది.

కాని యీ స్త్రీ-మీకే విధంగా నచ్చ చెప్పేది? నా యింట్లో కాలు పెట్టిన క్షణం నుంచీ నన్ను రెచ్చ గొట్టింది. ఏదో పోతూ పోతూ దార్లో నన్ను చూడటానికి వచ్చినట్లు చెప్పింది. ఆవిడ కనబరచిన అహంకారం, నాలోని అహంభావాన్ని రేపింది. ఆవిడ ప్రవర్తన, మనలో నిద్రించే భూతాన్ని, మృగతృష్ణనీ నాలో రేపింది. నా దగ్గరకి ఆడదాని నాజూకుతోనూ, తనది జీవన్మరణ సమస్య కాదన్నట్లుగానూ రావటం చూసి నేను మండి పోయాను. సంసార స్త్రీ అలాంటి బాధలో యీ విధంగా ప్రవర్తించదు. ఆవిడ నరాలు నన్ను తిరస్కరించినట్టుగా నటిస్తోంది. ఈ గర్వమూ, ధిక్కారమూ, ముకుళితాంతరంగమూ, నిరపేక్షా-తన చేతి కీలు బొమ్మగా నన్ను వుంచుకుని, తన అరికాలి దుమ్మైకైనా సాటిరానట్లు నన్ను చూస్తున్నయీ మనిషి రెండు మూడు నెల్ల క్రితం ఆవేశంతో తన నరాలకు లొంగి, తనునాశం చెయ్య కోరిన లోకం వెలుగెరుగని ఆ పసిపాప తండ్రి బాహుబంధంలో హత్తుకుపోయినట్లు విస్పష్టంగా నాలో నేను చిత్రణం చేసుకున్నాను. ఆ మనో భావమే నన్ను తలక్రిందులు చేసింది. నా పట్ల విపరీతమైన నైచ్య భావంతో నా దగ్గరకు వొచ్చింది. ఆ అజ్ఞాత సుందరిలోని కామ మదాన్నీ, ఆనందాన్ని నావిగా చేసుకుంటాను. ఇదే మిమ్మల్ని అర్థం

చేసుకోమని నేను కోరేది. నా జీవితంలో అంతవరకూ, నా వైద్య వృత్తిని పురస్కరించుకుని అటువంటి పనికి తలపడలేదు. ఇప్పుడలా చేశానంటే, కామం వల్ల కాదు, స్త్రీ సంయోగాన్ని కోరే మృగవాంఛవల్లనూ కాదు. అదేదీ కారణం కాదని మాత్రం మీకు హామీ యివ్వగలను. ఆవిడ గర్వాన్ని అణిచి వెయ్యాలనీ, మగవాడి పెద్దరికాన్ని చూపించాలనీ, నాలోని అహంభావాన్ని ఆవిడకి రుచి చూపించాలనీ–యీ బాధతోనే అలా చేశాను.

మీకిదివరకే చెప్పాను. అహంకారంతో, అచంచల హృదయంతో ఉండే స్త్రీలను చూస్తే నేను లొంగి పోతాను.. అంతేకాదు. యీసారి యేడు సంవత్సరాల తరవాత మొట్టమొదటి సారి మన ప్రాంతాల స్త్రీని చూశాను; నేను కోరిన యే స్త్రీ కూడా నన్ను కాదనలేదు. అక్కడి పిల్లలు మనల్ని చూస్తే సిగ్గుపడిపోతారు. అందులోనూ ఉద్యోగస్థులంటే వొణికి పోతారు. వినయంతోనూ, భయంతోనూ గడ్డకట్టుకుపోయి, కోరడమే తరవాయిగా మనకు లొంగిపోతారు. అందులో మాధుర్యంకానీ, ఆనందంకానీ లేదు. ఉత్తర హిందూస్థానీ పిల్లలు వేరు. ఒరియావాళ్లూ అంతే. కాని నేనుండేదీ సవరల మధ్య నాయిరి. ఇప్పుడర్థం అవుతుంది మీకు, యీ మనిషిని చూడగానే–అంత అహంకారంతో, దర్పంతో, దర్జాతో–నేనెందుకు పులకించానో. ఏదో రహస్యగాథతో యీమధ్యనే అనుభవించిన కామఫలంతో నవనవలాడే

[అసంపూర్ణం.]



# THE SKY

*[Varada Rajeswara Rau's short story 'Akasam', translated by the Author]*

The afternoon was very hot. The stranger sat huddled like a sack, farther from the crowd sitting around the burning pyre. His whole body convulsed now and again as a fresh sob shook him. Seen from behind it seemed as though he were caught in a dreadful fit of cough.

Why was he weeping so? Didn't he know that men die, and that they live never knowing how or when the end reaches them? That some die in their beds soundless, not leaving a single relative's moan behind them? That some die to the secret notes of death and others, blowing a farewell kiss? That some rest in their best chairs full of assurance, only to breathe their last? Death is not evitable.

The man was still sobbing. The priests went on chanting. Their accents rose and fell on the still mind like memory and its loss. The vedic hymns recited in the loud, sonorous sing-song, under the straight afternoon sky, hurt him like truth escaping the mind. The smoke rose from the crackling pyre, hung indecisively for a while, and then scattered itself into space, into the dead man's past of woes and dreams.

The man lifted his eyes at the sky. The sun was right over his head. The heat seemed to have grown considerably since the pyre was lit. A film gathered over his eyes. All of a sudden everything went dark. One looks for light and sees darkness, he thought, groping in the sudden blindness. Was it the secret behind creation? The line between life and death? He questioned himself, not waiting for an answer.

The darkness cleared. It was momentary. Thoughts fluttered in his mind. The dead man's life rose before his eyes. The pieces made a pattern. He was surprised. He had never seen it so. He peered closely. What a host of activities! It was an overcrowded life, really. Music, literature, public life, politics, sex, renunciation-he had an enormous appetite for them. And he had never stinted himself anything.

And yet, the man asked himself-what had the fellow really achieved-except that paltry death?

The fire had spread to the bamboo stretcher. The wood crackled. Like millions of squirrels breaking nuts with their little sharp teeth, he thought.

And then those last hours!

A woman's body had stood casting its shadow over the poor man's frenzied thoughts of renunciation. The wife and family waited like silent dolls, more distant than ever. God, it was awful! And the man had thirsted alternately for music and prayer.

A smell he had not noticed before, rose from the pyre. The crackling ceased. It was the stench he felt now, heavy and approaching. He put a thick towel over his head and walked in the direction of the village. As he passed along the narrow lane the villagers looked at him with quizzical sympathy as they do, sometime, at strangers.

When he reached the house, he noticed how silent it had grown. He stopped abruptly at the threshold;He wheeled round and entered the yard by the back door. The yard was full of trees, with a circular well in the middle. He remembered he had to take the ritual bath. It was hot and he was sweating. The girl was sitting by the well near a little flower shrub. The eldest daughter of the dead man. There were many people in the yard, collected in small groups. Everyone was engrossed, speaking in new, hushed tones.

The stranger's eyes sought the girl's face with an inquisite enquiry. The face gave away her utter helplessness. There was pity in his looks. Her eyes were blank of future and dry. His own were tear-stained. Had he, a stranger, the right to cry? may be the girl's sorrow had no visible form. he thought, with consideration.

His fingers lay on the fringe of the well. It was damp. He looked at it. There was a thick green coat of moss on the broken bricks. The ancient well. He wondered if the girl knew its age. He bent and peered down at the waters. Generations of men and women had drawn its waters, cleansed themselves, and quenched their thirst. It never got drained even once, he remembered the dead man telling him often.

Then it struck him that the girl was sitting by the well. So she had again stolen back to it. There was some secret attachment between them, the girl and the well. She always returned to it, when people failed her.

He thought of the last occasion. She had tried to end her life in it. And as she ficated on the waters, her eyes held by the sky, she had seen life mirrored in its blue. Sun and shower, night and day, thunder and lightning- the sky seemed to contain them all in in its vastness. The life on the earth was there painted across the sky. Bright, beautiful clouds, drifted with aimless elegance, and melted with a gradual suddenness.

She had-no friends, nor any hopes. Life had no meaning without them. The world was always crushing her. Life had no attractions for her. On the earth there was only death holding its mute invitation.

Thank heavens she did not die. It had at least revealed to her parents the gulf between her and the husband.

The neighbours scented that something was wrong. Everyone essayed a guess. But the girl's secret remained with- in her bosom. Maybe the well shared it too. Did the well remember it now, he wondered. He stared at the waters and answered himself. The old waters had been drawn out. The well must have lost its memory of the secret.

He looked at her again, and whispered to himself 'Thank Heavens she did not die! She had lived through the moment between dying and death, when the sky was neither a reality nor an illusion, and it had called to her tenderly, "Come my child! You are not scared by death? Not really? It is release for caged breath. Let your breath move in me, freely, freely, my child. Leave the body, my child. Bring your hopes to me, to me, my child".

Since then, the sight of the sky always set her heart quivering. Like a cloud troubled with the weight of waters. Whenever she was alone sitting in the open, she would glance at it stealthily. And that would set her quivering like a dry leaf. She would then hear the sky calling to her while under the feet, the earth lay with its mute invitation.

At the village fringe, the pyre was still burning. And by the well the girl sat, her head still bent, thoughts flitting across her mind. Her own thoughts.

The father is no more. They are penniless now. Girls to be married and boys to be educated. What would happen to them? Her brother was not young. But he was so inexperienced. She owed her plight largely to him. He had steered her childhood. They shared many dreams and many ideas even now. When they were children they had one dream between them-the shape and size of the heaven that was to be theirs. They spent all their time in their castles, high up in the air. To them the dream world was more clear than the visible one. They never heard the other world's foot-steps, coming nearer as they grew. They were engrossed in training themselves for the world they hoped to inherit.

The girl had her first rude awakening on the bridal night. The bedroom was her nightmare. Her words to him "I have come to offer you my body. The heart remains with me". She could always hear, her first words to her groom. And she could never feel differently with the passage of time.

The poor man had been taken aback. he had entered the room with a crowd of hopes-love, home, children, happiness. he felt as if the story one was reading had suddenly became real and one was being jostled by its characters.

That moment marked their separation. Between her mind and body a battle raged. The thick shadows which rose on that night remained like an unscalable wall.

As long as her father was alive she did as she wished. There was then only one problem for her. Now the problem was hereself. That large family had to be taken care of. Till then they had never bothered to know how the wheels revolved. His death would now open their eyes to unsuspected problems. They would never again live the way they did. never worrying. never knowing want. The present had become blank. God knew what the future held.

She searched her heart carefully. She had a duty to the family. What was

it? Her responsibilities now,what were they? The younger sisters have to be married.But what answer had she if any busybody asked her when she would be going to her husband's? There was the brother. He was a problem too, wanting to marry a married girl. The law would not allow it. Neither would society forgive such an act. But he was bent on marrying that girl, Sita. The sister had a secret sympathy for her brother's desire. Sita was a girl like herself, divorced from happiness. The prospect of her tasting the blessings of marriage once again was inspiring to herself. If it could happen! If only it did! None would dare again to speak to her of going back to the husband.

The stranger finished his bath. He saw her shaking like an aspen leaf. She did not have the courage to speak to him. Her eyes were fixed on the horizon. He stood a little aside and began, "It won't do any good if you lose courage. The children are young. They need your courage". He went on, not knowing what escaped his lips. She did not seem to listen. He continued, "Don't worry about yourself. Your are not responsible for what happened. Whatever your father had been, he never lacked courage. He did what he wished."

The girl rose. The skirts of her saree rustled with her trembling. Tears filled her eyes. She looked at him. How long would she go on staring like that? Maybe she was going out of her senses. What should he do if she suddenly lost her senses? He did not know. People slowly gathered at the house front. He could hear them. They had returned form the crematory. He turned on his heels and rushed into the house.

At last the night fell on the house of death. The girl sat with her two brothers making plans for the future. She would take up a job she declared. The elder brother's thoughts centred around Sita.

The younger one was only a half-brother. A widow's child. He had been brought up with the others in the same house. The mother had died at his birth. And to-day he had become fatherless. He lost more than the others. For him only the past remained. he had not the courage to take a hand in the decisive talk that went on. But he was thinking. And making silent resolutions. He would work hard. Very hard. He would help the family. His family. But was wish worth anything! Could he really do it? What was going to happen to them? to him? Had he a place still in that house now that the one link that held him to them was broken? His father had died and released him from the family circle. But the release had brought him no sense of freedom. He had a new resolution. It was the only thing to do. He should leave that house. They had lived as brothers and sisters in that house for so many years. He had become used to it. So he merely said. "I shall do as you may say". The stranger sat in the next room. It was dark. He was thinking too. Only love and sympathy, he thought, made men. All the rest was false and momentary. He had come so far because his friend had died. Only that small relationship, and

here he was worrying over that family's problems. He thought there was no way out for them. Their minds had not grown towards peace and understanding. There was no one in the family who was adult. Very early in life their thoughts had strayed into strange paths. Living in itself cannot be a problem. The servant folk have families-large ones frequently and they lived, not without happiness and satisfaction. Yes, the family would go on. He was sure of it.

They sat late into the night discussing. Life seemed to begin once again.

The tenth day marked the arrival of the girl's grandfather and the uncle, that is, the dead man's uncle and his son-in-law.

The old man was fond of advice. He had given it all his life. he never bore any responsibility. The uncle was one ahead of him. He notonly gave advice, but meddled in everything that went around him. All the people listening to him-that was his idea of happiness. He craved for it. And like his father-in-law, he too hated responsibility. He was the father of twelve children. He was always talking. He spoke without concern for others' sensibilities. He took a special delight in insulting strangers. And he took every opportunity of doing it by thought, word and deed.

They put their heads together. The family must be saved from a moral fall, they decided. That meant two things. Sending the girl by force if necessary, back to the husband and marrying the boy off immediately.

The uncle hated the girl for some reason. he always asked himself one question. That was: "Why does'nt she live with her husband"? And he would never give himself a satisfactory answer. He saw women as a contraption that brought forth children. The sight of a woman with lots of children pleased him. he felt like a gardener who sees his tree full of fruit. He never tried to know her mind. But he was always doling out advice to her. To force the girl to go and live with her husband was his deepest wish. He was willing to do anything to bring that about. He first argued that the girl was immoral. he dug out a ten-year-old incident and said that when the girl was at school, she had tried to run away with a boy. He said it was even doubtful whether she was really fitted for a woman's life. He listed the occasions when he had tried and she had thwarted his plans to send her back to her husband.

On the day when the relatives were departing he called for the girl and stated in front of everyone in very certain terms that she should return to her husband's home. "I wish to forget" was all that she said.

They had a doubt and they put it to her squarely. "You say you are seeking employment. Can you protect your self in a big city?" She made a promise then, that she would never bring diagrace to the family.

The uncle was not convinced. His thoughts shifted to the stranger who was moving about like one of the family. Who was he? Why had the fellow

come there? What right had he? Why did the girl's brother respect him so much? Doubts asailed him. To his eyes the stranger appeared as the wall that stood between the girl and her husband.

After the rites and ceremonies were over, the family returned to the city. As days went by, they thought less and less of the dead man. The boy's thoughts of Sita became insistent. Between himself and his people he saw a new gulf. That, deprived of selfishness, man's life dwindless into nothing, was the creed that manifested itself in his belief.

They somehow managed to make ends meet. But his dissatisfaction increased gradually. He acquired a fear of letting himself think. He at last surrendered himself to two friends. Of them, one was a distant relative of the family. He was a Govt. official, rich, friendless, full of strong desires, strange wishes but without courage. He had no confidant. It was his widowed sister that the dead man had loved till his death. he was married and has a son. To have a great love affair was his over whelming desire. He finally fell in love with a middle-aged widow who had four children. He spent hours sitting with her, talking for hours, not daring to reveal his desire. And he confided this love of his to the girl's brother.

He kept awake at nights wishing his wife were dead, wondering how much longer his old fatherwould live. His heart was like a heap of broken glass, each piece catching a glint and reflecting the fraction of a shape. If only a great love would enter his life, he would ask for nothing else. The days had no peace for him. As the evenings drew near he would go to their house and hold an endless conversation with the girl's brother. It was always about love affairs, and the attendant scandals. It was always he who spoke, hoping that the girl would overhear him. and that gave him a strange satisfaction. he suspected that she carried her morals lightly. He cultivated her brother's intimacy, in the hope of gaining access to her.

He had a nephew. Though nearly twenty years old, he was incredibly innocent. He always sought the company of women; they puzzled him greatly: He wondered about women the way a child was curious about dolls. he would sit among people talking about love and sexwide - eyedand thoroughly engrossed. he spent many an hour in the girl's company. He never let her go out of his sight. When she spoke to other men, his heart was shot with pain. He would twist the incident and note it down in a small diary which he carried in his breast pocket. He told her friends that she was an immoral slut, and to her he whispered that they were dangerous acquaintances. The neighbours were familiar with the brother's unspeakable affair and the dead man's notorious life. They wondered if the girls would never be married. The brother ransacked the town for eligible bachelors. When each attempt failed, he blamed it on his sister: "She is responsible for all this", he told everyone.

One day the uncle came and working himself up into a temper, made a scene before the entire neighbourhood. He shouted hysterically that the girl was beyond redemption, that the family would go to utter ruin if she did not leave them. And having said his heart's say, he left abruptly, as though he had done his mission in life. The brother and the others came to believe that the girl was in truth the great obstacle to their happiness. The love-mad friends of her brother fearing that the advent of others into the family would upset his own plans, began to declare that the girl's conduct was certainly suspicious. Like a crow protecting her nest, he fought the invisible strangers.

As the girl learnt these things, she was dazed. She thought for a moment that her leaving might really bring peace to them, since she had brought in all the unhappiness. But the family needed the money she was now earning. If she really went back to her husband, what would lhappen to her young sisters and the baby brother? She would not be able to help them any more. Besides, how could she go back to him? That whole night she cried.

Early the next day, she went to her brother and said "I am ready to do any sacrifice. I only want all of you to be happy. I'll pluck and throw my heart out. I'll go back to him. And forgive me, for all the pain I have caused".

The brother could not believe his ears. If she really went away he would have to run the family all by himself! He would never be able to do it. He had not thought of these consequences earlier. Suddenly cowardice overtook him. He did not want to express his fears to her. So he said: "How can we be certain that he will take you back"? and went on in a high voice, tinged with pain: "It's all over the town. That you re in love with that ..... that fellow. Maybe your husband has heard it too?".

When she heard his words she felt as though someone had suddenly slapped her very hard. She had not expected her brother of all people, to speak to her like that. Tears filled her eyes. She spoke in a low, broken voice: "He came to weep with us, because he was our father's friend. Have you also come to believe like the others"?

The brother said nothing. He stood up and left abruptly.

The girl went up to her room. Her heart was beating fast. She wanted to weep. There were some books on the bed. She took them up. A few sheets of note-paper fell down. She picked them up and glanced at the writing. She stopped short. It was a diary of her life logged by the innocent boy. She never suspected that he was shadowing her day and night and writing down such lies about her. Why did they all suspect her in that manner? What was her wrong?

She stood for a while with the papers in her hand. Before her was the mirror. She went close to it. She put up her hand to wipe the eyes. She saw the scar towards the left of the forehead. She touched it with her fingers,

softly. That was her scar, indelible. She began to remember the afternoon, years ago, when she had tried to drown herself. The Well, the sudden distaste for living, the struggle between the mind and body and her surrender came vividly to her memory. Tears stood in her eyes and did not drop.

Her knee shook with a surge of weakness. She could not stand any more before that mirror. She heard a voice calling to her from a distance: "Come out" it said "Come", it entreated. With faltering steps, she walked to the balcony. Her head dropped on the chest.

Again, the well, the attempt to drown herself, rose before her eyes. The waters seemed to be coming upto her waist. She was trying to raise herself out of the waters. And she was drowning, going deep under the water. The tender waters were lapping around her.

She lifted her moist eyes and looked once at the sky.

The earth under her feet trembled once more. The seven rivers of the sky fell like coloured cascades down on the earth. The clouds moved hurriedly. They seemed to be going nowhere. Light and darkness were flickering between moments.

The sky opened its face. A great tenderness spread all over. The girl made a sudden run, shouting "Mother, I'am coming. This time I'am coming". She dropped on to the ground.

The doctor examined and said in a serious voice: "The limbs are fractured".



# ఒక నవలకు ప్రారంభం

*[రచనాకాలం - 1966 ప్రాంతం - న్యూఢిల్లీలో '15 పూసారోడ్'లో ఉండగా రాసినది.]*

**ఒకటి**

కిటికీలన్నీ తెరిచి ఉన్నాయి. గదిలో దీపం వెలుగుతోంది. గదినిండిన గంధం వాసన పైకి పోలేక దీపం చుట్టూ తిరుగుతున్నది. గది వెనక పెరటి తోట. అరటి చెట్ల ఆకుల చప్పుడు తప్ప మరొకటి వినిపించడం లేదు. కిటికీ నుంచి పైకి చూస్తే గదిలో కన్న బయట చల్లదనం, వెలుగూ యెక్కువగా కనిపిస్తున్నది.

గదిలో దీపానికి దగ్గిరగా బల్లమీద తమలపాకులు సర్దుతున్న శ్రావణికి గదికి వెనక వెలుగెక్కువో, గదిలోపల వెలుగెక్కువో ఆలోచించే అవకాశం లేదు. శ్రావణి ముఖంలోనూ వెలుగులేదు.

నిజంగా ఆ రోజున ఆ క్షణంలో శ్రావణికి మనస్సు మనస్సులో లేదు. తనేం చేస్తోందో, తనేం మాట్లాడుతున్నదో తనకే తెలీదు. తనెవ్వరో, తనెవ్వరిదో కూడా అర్థం కావటం లేదు. ఆ గదికీ, ఆ దీపానికీ ఆ గంధం వాసనకీ తనకీ యేమిటి బాంధవ్యం?

తమలపాకులుచుట్టేసి వెండిపళ్లెంలో అమర్చి శ్రావణి గదిని నలుమూలలా కలయజూసింది. కిటికీల్లోనించి బయట వెన్నెల కనిపిస్తోంది. వెన్నెట్లో అరిటాకులు మెరుస్తున్నాయి. మెల్లిగా వెళ్ళి కిటికీ దగ్గిర నిలబడింది. ఆకాశం ప్రశాంతంగా ఉంది. ఒక్క మబ్బు తునక కూడా కనిపించటం లేదు. చంద్రుణ్ణి చెట్లు దాచేసినయి. ఒక్క శీతల కాంతి తప్ప మరేంలేదు.

శ్రావణి తలయెత్తి ఆకాశం వంక తదేకంగా చూస్తోంది. ప్రపంచంలో నైర్మల్యం ఒక్కసారిగా విరిసినట్లనిపిస్తున్నది. నేలమీద చెల్లాచెదురుగా పడిన నీడలు తన్ని వెక్కిరిస్తునట్లు తోచినయి. శ్రావణి మనస్సు చివుక్కుమన్నది.

ఆ క్రింతం రోజునే తనకు పెళ్లయింది. ఇవాళ భర్త సాహచర్యం ప్రారంభమవుతుంది. పొద్దున్నే మొదటిసారిగా యీ యింట్లో అడుగుపెట్టింది. ఇల్లంతా పరిచితంగా కనిపించడం వల్ల శ్రావణి మనస్సు ఆవేదనపడ్డది. ఆ ఊళ్లో శ్రావణి కాలు పెట్టిన యిల్లు అంతపెద్దదీ కాదు. అంతచిన్నదీ కాదు. ఇంటిచుట్టూ చక్కని ఆవరణం ఉన్నది. పెరట్లో తోట కూడా ఉన్నది. ఇంట్లో మాత్రం సందడిలేదు. ఇంట్లో ఆయన ఒక్కడే ఉంటున్నాడు. ఇంటి కాపలాకోసం మాలి వెంకన్న తోటలో ఉంటాడు. ఇలా యేకాంతంగా సందడిలేని చోట ఉండటం శ్రావణికిదే మొదటిసారి.

శ్రావణికి కళ్లు చెమర్చినయి. చీర కొంగులో కళ్లు అద్దుకున్నది. ఇంతలో వెనకతలుపు చప్పుడయింది. వెనక్కి తిరిగి చూసింది. వెంకట్రావు గదిలోకి వొచ్చాడు. అటూయిటూ చూసి మంచం మీద కూర్చున్నాడు. శ్రావణి మాట్లాడలేదు. ఒక్క నిమిషం నిశ్శబ్దం. శ్రావణి కదిలింది. తమలపాకుల పళ్లెం తీసుకొచ్చి వెంకట్రావు కూచున్న మంచం మీద పెట్టి, మంచానికి ఆనుకుని నిలబడ్డది.

వెంకట్రావు తమలపాకులు ఒకటొకటే వేసుకుంటున్నాడు.

'శ్రావణీ' అన్నాడు.

శ్రావణి తలయెత్తి వెంకట్రావు వంకచూసింది.

"నిన్ను శ్రావణీ – అనే పిలుస్తాను. చక్కని పేరు..." మళ్ళీ తమలపాకులు వేసుకుంటున్నాడు. ఏదో ఆలోచిస్తున్నాడు.

ఎదురుగుండా గోడవంక చూస్తూ – "శ్రావణీ! నీకీ వివాహం యిష్టమేనా!" అన్నాడు వెంకట్రావు.

శ్రావణి నేలమీదికి చూస్తూ తలవూపింది.

"నీకూ నాకూ యిరవయ్యేళ్లపైగా వ్యత్యాసం ఉంది. నీకుతెలుసా?"

శ్రావణి మందంగా తలవూపింది.

"నాకు మాత్రం యీ వివాహం చేసుకోవటం యిష్టం లేదు..."

శ్రావణి వొళ్లు జలదరించింది.

"నాకు నలభయి సంవత్సరాలు దాటుతున్నయి.. నా అనేవారు లేరు. బ్రతుకు బూజెక్కిపోయింది. ఈ ప్రపంచంలో నేను పెద్దగా ఆశించేదీ కనిపించటం లేదు...."

శ్రావణి వింటోంది. తల ఊపటం లేదు. ఊ కొట్టడం లేదు. శిలా ప్రతిమలా నిలబడిపోయింది.

వెంకట్రావు మొహంలో దైన్యం తప్ప మరేం గోచరించటంలేదు.

"... చూడుశ్రావణీ! మనిషి సుఖదుఃఖాలకు మమతే మూలకారణం. నువ్వెరివో, నేనెవర్నో రెండు రోజులక్రితం యెరగం. నువ్వేం కలకాశావో, నేనేంతలపోశానో – అవేవీ నిజంకాలేదు ...

శ్రావణి గుండెలో గుండుసూది గుచ్చుకున్నట్లయింది.

"మన బ్రతుకులన్నీ యింతకుపూర్వమే ఇదమిత్థమని నిర్ణీతాలయిపోయినవి. అందువల్లనే యీ క్షణం నుంచీ నీకూ నాకూ యెడతెగని బాంధవ్యం, అనురాగం. నీ మనస్సు బాధపడితే నా మనస్సూ బాధపడుతుంది. నీ కాలికి ముల్లు గుచ్చుకుంటే నా గుండెలో గుచ్చుకున్నట్టుగా బాధపడతాను. ఇదే జీవిత రహస్యం... ఒక్కొక్కప్పుడుఅనుకుంటూండేవాణ్ణి – మనిషికి మనోబాధ లేకుండా ఉండాలంటే వివాహబంధంలో చిక్కుకోదూడదు. స్వార్థానికీ, సంకుచిత దృష్టికీ సంసారం దారి తీస్తుంది..

అయినా యింట్లో నా అనేవారు కనిపించకపోతే ఆత్మహత్య చేసుకోవాలనిపిస్తుంది. అందుకనే యీ వివాహం తలపెట్టాను. ...శ్రావణీ! నీ సాహచర్యంలో నా బాధల్ని మరిచిపోవాలని కోరుకున్నాను..."

(అసంపూర్ణం)

## ఒక నాటకం

*[ఈ నాటకానికి పేరు రాయలేదు. రచనాకాలం – యుద్ధకాలంలో – 1942 ప్రాంతంలో – నాట్యగోష్ఠి ఉద్యమంలో భాగంగా 'నటాలి' కి అనుబంధంగా వరద రాజేశ్వరరావుగారు స్థాపించిన 'గుంటూరు నాట్యసమితి' కోసం రాసిన నాటకం అయి ఉంటుందని అంచనా.]*

1

*[కుడిచేతివేపు ఒక బల్లఉంటుంది. దాన్నిండా పుస్తకాలు, కాగితాలకట్టలు. దానికి రెండు వేపులా రెండు మూడుకుర్చీలు ఉంటవి. భగీరథరావు రాసుకుంటూ ఉంటాడు. బల్ల కెదురుగుండా ఉన్న పడక కుర్చీలో రాధ పడుకుని 'ఆంధ్రపత్రిక' చదువుతూ ఉంటుంది.]*

రాధ : *(మెల్లిగా లోపల చదువుకుంటూ ఉన్నట్లు)* 'నేటిరోజున అజాదు మైదానమందు గొప్ప బహిరంగసభ జరిగెను. వేలకొలది స్త్రీ పురుషులు వచ్చిరి. సరోజినీదేవి, వల్లభాయిపటేలు మొదలగు నాయకులు దేశములోని పరిస్థితుల గూర్చియు సత్యాగ్రహోద్యమము యొక్క కార్యక్రమమును గూర్చియు నుపన్యసించిరి. సరోజినీదేవిగారు భారతస్త్రీలను స్వాతంత్ర్యదీక్ష గొనవలెనని యుద్బోధించుచు నిట్లు చెప్పిరి' ... ఏ ‹మండో›యి, యిది వినండి.

భగీరథరావు : నాకు తీరికలేదు. ఆఫీసు పనిబోలెడంత ఉన్నది.

రాధ : విందురూ – రోజూ ఉండనే ఉంది యీ ఆఫీసుపని. రెండు నిమిషాలు.

భగీరథరావు : *(వినటానికి యిష్టం లేనట్టు)* పొయ్యి మీద అన్నం తగలేశావూ?

రాధ : చాలాసేపయింది ... వినండి మరి ... 'నేటి భారతీయులు తమ స్త్రీలను రాజకీయములందు'

భగీరథరావు : అన్నం మాడిపోతుందేమో, చూశావా?

రాధ : *(వినిపించుకోకుండా)* ప్రవేశపెట్టుటకు సంకోచించుచున్నారు. ఏమంటారు?

భగీరథరావు : ఏ ‹మంటారూ నాలాటి వాళ్లని అడుక్కుతినమంటారు. ఇంట్లో సంసారం దిద్దలేని అమ్మల్ని రాజకీయాల్లోకి దింపాలి. బాగుంది.

రాధ : రాజకీయాల్లో దిగినా దిగకపోయినా మన సంసారాలు తమలాంటి ఘనులున్నంతకాలమూ యిలాగ యేడవాలిసిందే.

భగీరథరావు : నీవంటి దేశసేవికలు కనురెప్పపాటు కాలంలో స్వరాజ్యాన్ని తీసుకొచ్చి మా వంటి అనాధుల్ని తరింపచేస్తారు .... *(ఎగతాళిగా)* అట్టి సుముహూర్తం ఎప్పుడు వచ్చునాక్కో ...

రాధ : మీరూ నేనూ యిలా సంసారం చేసేంతవరకూ రాదు.

భగీరథరావు : ఏం ... స్వరాజ్యం అంటే మిఠాయి ఉండ అనుకున్నావుటే ... బజార్లో పెట్టి అమ్ముతున్నా రనుకున్నావా?

రాధ : ఎబ్బే ... ఆకాశంలో చుక్క అనుకున్నాను. ఈ నాయకులందరూ పిచ్చివాళ్లనుకున్నాను.

[మధ్యలో కొన్ని పేజీలు లభ్యం కాలేదు.]

భగీరథరావు : *(మాట్లాడడు)*

రాధ : *(ఆలోచన అభినయిస్తుంది)*

అచ్యుతం : ఏ ( వమ్మా – నీకు రావాల్సొ౦ందా? మీనాన్న గారి మీద నాకున్న గౌరవం మీద వచ్చాను. ఆయన లాంటి దేశభక్తులు దేశంలో అరుదు.

రాధ : వారియిష్టం – ఈ కాలంలో ఆడదాని యిష్టం యెవరిక్కావాలి? ఎంత చదువుకుంటే ఏం ఫలం?

అచ్యుతం : ఏం భగీరథరావు –

భగీరథరావు : నేనెవడ్ని మధ్య – ఏదో చెపుతున్నారు. చెప్పండి – (రెండు నిమిషాలు మౌనం) ఇదుగో చెపుతున్నాను అచ్యుతం – నువ్వు బాధ్యత లేకుండా మాట్లాడుతున్నావు. నా మట్టుకు నాకు యీ politics అన్నది నచ్చలేదు. ఈ యింటికి నేనధికారిని. నేచెప్పినట్లు యింట్లో వినాలి. ఏ ( వంటావు?

అచ్యుతం: తప్పకుండా. కాని ఆడది తన మనస్సూ, స్వతంత్రాలోచనా మగవాడికి అర్పించుకుని కేవలం పాషాణం వలె కూర్చోమని యెక్కడుంది? కాబట్టి వాళ్ళకామాత్రం స్వేచ్ఛ యివ్వాలి. సంసారం దిద్దుకోవడంలో కలిసి పనిచెయ్యాలి. కాని ఆడది అంటే బానిసగాదు.

భగీరథరావు : 'నస్త్రీ స్వాతంత్ర్యమర్హతి' తెలుసుకో.

అచ్యుతం : ఇంకా నువ్వు వెయ్యి సంవత్సరాల వెనకనే ఉన్నావు. కాలం యెంతమారిపోయింది! గ్రహించకుండా ఉన్నావు.

భగీరథరావు : సరేలే! నేనూ నీలాగే పెళ్ళికాక మునుపు మా కాలేజీరోజుల్లో ఆడవాళ్ళకి స్వేచ్ఛయివ్వాలంటూ తెగ లెక్చర్లిచ్చాను. అప్పుడది అనుభవంలేని ఆరాటం ... కానీ, ఒక సంగతి ఆలోచించు. సంసారాల్లో తుపానులు చెలరేగకుండా ఉండాలంటే ఆడదానికీ, మగవాడికీ పరస్పరం మనస్సు కలవాలి. అభిప్రాయభేదం కూడదు. పోనీ ఆడదే తెలివితేటల్లో మించిందనుకో. మొగవాడే వట్టి పశువు అనుకో. ఏదోలోకధర్మం, మగవాడు వినకుండా ఉన్నాడు; రాయి, రప్ప, రాకాసివగైరా, మనం వాణ్ణి తీరా కట్టుకున్న తరవాత మనతాడెందుకు తెంచుకోవాలి అని బుద్ధిలేకపోతే దాని తెలివి తేటలెందుకోయ్?

అచ్యుతం : ఈ వరసన ఫుల్‌స్టాప్, కామా లేకుండా మాట్లాడగలిగే ప్రజ్ఞ నీదగ్గిర ఉందని వొప్పుకోవాలి! కాని అసలు విషయానికి దూరమయి పోతున్నాము. నేను చెప్పేది విను. రాధని యెందుకు పిలవాలిసి వొచ్చిందో చూడు. వాళ్ళ నాన్న గారు రేపోమాపో జయిల్లోకి పోతున్నారు. ఆయన కుటుంబం యావత్తూ సత్యాగ్రహం చేయబోతున్నది. రాధ కూడా యింత చదువుకున్నది. నువ్వు పెళ్లి చేసుకోవడం కేవలం నీ అదృష్టం. ఈ ఊళ్లో కాస్త రాధ దారి చూపిస్తే మా ఉద్యమం సఫలమవుతుందని ఆశ. అందుకని వేడుకుంటున్నాను. రాధని పంపించు. నీకేమీ అగౌరవం జరగదు.

భగీరథరావు : అచ్యుతం! ఒకటే సంగతి చెబుతున్నాను. నన్ను అర్థం చేసుకుని మాట్లాడు. నాకు మాత్రం యిష్టం లేదు. పైన దాని యిష్టం. ఎవరిరాత వారిది.

అచ్యుతం : అలా అన్నావు. బాగుంది. రాధమ్మా, వస్తాను. రేపు సాయంకాలం నాలుగ్గంటలకు సభ జరుగుతుంది. (నిష్క్రమణం)

భగీరథరావు : వెంకయ్యా!

వెంకయ్య : బాబూ! (ప్రవేశం)

భగీరథరావు : సైకిల్ తుడిచిపెట్టు. పోవాలి.

వెంకయ్యా : చిత్తం.
రాధ : (ప్రవేశించి) భోజనానికి లేవండి.
- తెర -

2

మర్నాడు. మధ్యాహ్నం మూడు గంటలు.
*[రాధ బల్ల సర్దుతూ ఉంటుంది. ఇంతలో తలుపు తోసుకుని సుందరమ్మగారూ, మరిద్దరు దేశసేవికలూ వొస్తారు.]*
రాధ : (చూసి) వెంకయ్యా! చాప తీసుకుర్రా. *(వెంకయ్య చాపతీసుకువొచ్చినేలమీద వేసిపోతాడు)* కూర్చోండి. *(వాళ్ళు కూర్చుంటారు.)*
సుందరమ్మ : ఇవాళ మీతోనే ఉంది సంగతంతాను. ఇప్పుడే ఊళ్ళో అందర్నీ మీటింగుకు రమ్మని చెప్పి వొచ్చాం. న్యాయం గా చాలా మంది రావాలి.
రాధ : నాతో యేఁవిటి? ఇవాళ నాకు వొంట్లో బాగాలేదు. రాలేనేమో కూడాను. అందులో అబ్బాయి ఒక్కటే పోరుపెడతాడు. నే దగ్గరలేక పోతే మరీను.
సుందరమ్మ : ఫరవాలేదు. అబ్బాయిని కూడా తీసుకు రండి. వీళ్లు ఆడిస్తారు. అయ్యో, మీరురాకపోవడం యేఁ విటి. మీమీద ఆధారపడిఉన్నాం.
ఒక దేశ సేవిక : అవునండీ. రేపొచ్చే స్త్రీ సత్యాగ్రహ దళాన్ని మీరేనడపాలి కూడాను. మీమీద కొండంత ఆశపెట్టుకుని ఉన్నాం.
రాధ : చూద్దాము లెండి. మా ఆయన యింకా రాలేదు.
సుందరమ్మ : ఇంకా 'ఆయన' యే ఁవిటి? కాగితాలు అచ్చువేయించారు. *(అవి చూపిస్తుంది)* మీరు రాక తప్పదు.
రాధ : ఆయన్ని ... మరి ...
సుందరమ్మ : ఇంకా యిలాంటి సమయంలో మొగాళ్ళ దగ్గిర నుంచి పర్మిషన్లూ ఆర్డర్లూటండీ. ఇవాళ పేపరు చూశారా? బొంబాయిలో ఒక ఆఫీసరు పెళ్లాం, సత్యాగ్రహంలో అరెస్టయిపోయింది. దేశంకోసం భర్తల్ని ఖాతరీ చేస్తామా? ఈ వరసన మొగాడి మాటలు వింటూ ఉంటే రేపు బాధపడేది మన బిడ్డలుకాక మరెవ్వరు? ... ఇంకా గంట వ్యవధి ఉంది.... తప్పకుండారండి. వొస్తాను. (నిష్క్రమిస్తారు)
రాధ : *(దీర్ఘంగా ఆలోచిస్తూ పక్కన ఉన్న పూలు తీసి దండ గుచ్చుతూ కూర్చుంటుంది. దూరం నించి 'జై 'భారతమాతకూ జయ్!' రాధ లేచి నిలబడుతుంది. కిటికీ దగ్గరకు పోతుంది వలంటీర్లు పాట పాడుతూ సమీపంగా పోతుంటారు)*
వలంటీర్లు :

*ఆకలి మంటల మలమలమండే*
*అనాథులందరు లేవండోయి!*
*ఏ పాపఫలమొ,*
*ఈ పేదబతుకు!*

మనకిచ్చె ప్రకృతి,
కనకభూతలము,
బలమున్న ప్రభువు
అపహరించాడు! /ఆకలిమంటల/
కరువురాకాసి
కంటి యెరువులకు
గురిచేశాడు
కొల్లగొట్టాడు / ఆకలిమంటల/

(పాట పోనుపోను సన్నగిలిపోతుంది : రాధ శిలాప్రతిమలా అలాగే నిలబడిపోతుంది)

వెంకయ్య :(ప్రవేశించి) అమ్మా!

రాధ:ఏం వెంకయ్యా! (పరధ్యానంగా) చూశావూ ఆ జనాన్ని! వాళ్లేమని పాడుతున్నారో విన్నావా?

వెంకయ్య : విన్నాను తల్లీ! నేను కూడా అల్లాపోదునా?

రాధ : తప్పకుండాను. నువ్వల్లా పోతే దేశం యెంత సంతోషిస్తుంది? కాని వెంకయ్యా ... నాకు మతి పోతున్నది. ఎందుకు బతికియ్యీ వరసన.దేశం మలమల మాడిచస్తుంటే అనుభవిస్తేనేమి, అనుభవించకపోతేనేమి? యీ పాడు జీవితం? మనిషి పుట్టింది చావడానికేనా? దేశం కోసం గాదూ బతకవలసింది? నీతమ్ముడు, నీపాప అరచేతుల్లో పొట్ట పట్టుకుని తిండి కోసం వీధి వీధీ అడుక్కతింటుంటే, నువ్వు మాత్రం కడుపు నాపుకుని ఊరుకుంటున్నావా? ఎంతఘోరం? వెంకయ్యా! ఇవాళ నా జీవితం కూడా తన పరమావధి నెరవేరుస్తుంది. నేను ఒకరి కోసం కళ్లుపాడుచుకోలేను; ప్రేమించి పెళ్లి చేసుకున్నాను. కాని హృదయాన్ని త్యాగం చెయ్యలేను. వెంకయ్యా! విను. బాగా విని అర్థం చేసుకో, నన్ను యెత్తి పెంచినవాడివి. తండ్రితో సమానుడివి. నా భర్త నన్ను దేశంకోసం నాశం కావద్దంటున్నారు. బాధ పడే ప్రజని మరిచిపొమ్మంటున్నారు; అన్యాయాన్ని న్యాయం అంటున్నారు; అధర్మాన్ని ధర్మం అంటూ తాత్పర్యం చెబుతున్నారు. నేను భరించలేను. సంసారాల్లో తుపానులు చెలరేగకుండా ఉండాలంటే భార్యాభర్తలు అన్యోన్యం అర్థంచేసుకుని నడుచుకోవాలి. ఏనాడయితే రెండు మనస్సులూ పెడదార్లు పట్టినవో ఆనాడే ఆ సంసారంలో శాంతీ, సుఖమూ మాయమయిపోయినవన్నమాట. శాంతి సుఖాలు లేని సంసారయాత్ర నరకకూపం. అటువంటప్పుడు వేరయిపోవడం మంచిది. నాకే జీవితంలో విశ్వాసం లేదు. ఈ ఐహిక వాంఛకోసరం పశువు కింద మారిపోలేను ............ (ఊరుకుని రెండు నిమిషాలు) వెంకయ్యా పిల్లాణ్ణి జాగర్తగా చూస్తూ ఉండు.నేను పైకి పోయి రావాలి. కొద్దిగా ఆలస్యమవుతుంది. బాబుగారు రాగానే అమ్మగారు సభకు పోయారని చెప్పు. (నిష్క్రమణ)

–తెర–

3

ఆవేళ సాయంకాలం. ఏడున్నర.

(భగీరథరావు అటూయిటూ పచారుచేస్తుంటాడు)

భగీరథరావు : ఒరే వెంకయ్యా అమ్మగారు యింకేమని చెప్పారు?

వెంకయ్య : ఇంకేం చెప్పారు కారు.
భగీరథరావు : సరే కాని వెంకయ్యా! రాధ ప్రవర్తన నీకు నచ్చిందీ?
వెంకయ్య : ఏం బాబూ? ఊరంతా ఒకటే పొగిడేస్తున్నారు అవిణ్ణి!
భగీరథరావు : అదికాదురా – భర్త భార్యకెలాంటివాడురా?
వెంకయ్య : మొగుడులాంటివాడు.
భగీరథరావు : విను. 'పతియెదైవంబు' ... దేవుడిలాంటివాడు. మొగుడి మాట తోసి యింకేం బాగుపడుతుందిరా అది? వీడు ఒక మనిషి అనీ, ఒక తలకాయ ఉన్నదనీ, వాడింత తెలిసిన వాడని యోచనే లేదు దానికి. వీడున్నా ఒకటే లేకున్నా ఒకటేఅన్న పద్ధతి కెదిగింది. అయితే నేను యెందుకురా యీ యింట్లో?
వెంకయ్య : అలా అనకండి బాబూ?
భగీరథరావు : నీకున్న బుద్ధి అన్నా లేదురా దానికి. పెళ్ళి చేసుకోవడం నాది పొరపాటు. ఇది యింత తెగిస్తుందని కల్లోకూడా అనుకోలేదు. నా మెడకే ఉరివేసిందే యిది! ఈ పెళ్లాన్ని పెట్టుకుని రేపు కలెక్టరు మొహం యే ఁవని చూసేదిరా? ... తనూ తన మొగుడూ, సంసారం అఖ్ఖర్లేదు కాని, దేశాన్ని ఉద్ధరిస్తుందిట యిది! దీనిమొహం! ఇవాళ అటోయిటో తేలాలి. నా గౌరవాన్ని నాశం చేసే యీ మనిషి నాకఖ్ఖర్లేదు. పోనీ ... పోతే పోనీ ... ఎవరి రాత వారిది ... ఒకళ్లు కారకులవుతారా? రానీ ... ఎంత మండిపోతున్నది ప్రాణం!
వెంకయ్య : తగ్గండి బాబూ, తగ్గండి, అమ్మగారొస్తుంటారు. భోంచేద్దురుగాని.
(వాకిట్లో చప్పుడు)
భగీరథరావు : అదుగో వస్తున్నది ... రానీ.
రాధ : (ప్రవేశిస్తుంది. చేతులనిండా పూలదండలు. తల వొంచి ముందుకొస్తుంది.) ఏ ఁవండీ, అబ్బాయి అల్లరి చేశాడా?
భగీరథరావు : అదెందుకు నీకు? నోరు మూసుకుని యింతవరకూ పోయిన దానివి పూర్తిగా వొదిలిపో! నేనేం పాపం చేశానని నన్నిలా దుఃఖపెడుతున్నావు?
రాధ : ఒకర్ని దుఃఖపెట్టడం నాచాత కాదు.
భగీరథరావు : కాని నేర్చుకున్నావు. బాగా తరిఫీదయ్యావు. నీ నుంచి నా వంశ ప్రతిష్ఠ నాశం అయిపోయింది. ఛండాలురాలా! వెళ్లిపో యింట్లోనుంచి. ఇవాళ నుంచి నీకూ నాకూ యే విధమైన సంబంధం లేదు. ఇదుగో జంఝుం తెంచేస్తున్నాను. ఫో.
రాధ : నేనేం అపరాధం చేశానని అలా అంటున్నారు?
భగీరథరావు : నేను వొద్దన్న పని చెయ్యడం కన్న తప్పుయింకేం వుందీ ప్రపంచంలో? నీకు భర్త అంటే లెఖ్ఖలేదాయెను. ముందు వెనుకలు చూడవాయెను. నువ్వు పోతేగాని యీ యిల్లు అసలు బాగుపడదు. నీ మొహం ... నీకు సత్యాగ్రహం యే ఁవిటి? ... ఎవరో నలుగురు కలిసి ఆ వెధవపని చేశారంటే నువ్వు కూడా చేస్తావా? ఎంత సిగ్గు ... ఛీ ... నేనుఒక సంగతి చెబుతున్నాను. నీకూ నాకూ యింకనుంచి యెలాంటి సంబంధం లేదు. నీ దారి నీది. నా దారి నాది.
రాధ : తప్పే నాదయితే క్షమించండి.

భగీరథరావు : ఒహో పోర్షన్ బాగ కంఠతః పెట్టావు. మళ్లీ చెబుతున్నాను. తక్షణం యీ యిల్లు విడిచిపో. ఎక్కడికి పోతావో పో! ఏ ఆశ్రమానికి పోతావో, ఏ జయిల్లో చస్తావో! ఎవడికి పట్టింది? నువ్వు మాత్రం మళ్లీ నా మొహం చూడకూడదు. తెలిసిందా?

రాధ : (ఏడుస్తూ) అవును, నాదే అపరాధం. నోరూ వాయీలేని కోటానుకోట్ల ప్రజ చస్తున్నది. ఆకలితో నశిస్తున్నది. వాళ్లని ఉద్ధరించడానికని లేవదీసిన ఉద్యమంలో నేను పాల్గొనకూడదు. ఏమీ? నేను మనిషిని కానా? హృదయం లేదా? బాధపడలేనా? నాకీ శాసనధిక్కారం యింట్లోనే వేయించారు. అవును నేను యీ యిల్లు విడిచిపోవాలి. మగవాడిదే ప్రభుత్వం. ఆడది బానిస, క్షుద్రజీవి, ఎందుకూ పనికిరాని బతుకు ... నా జీవితాన్నంతా స్త్రీల నుద్ధరించటాని క్కూడా వినియోగిస్తాను. అయితే వెళ్లిపోతున్నాను. నన్ను క్షమించడానికి మీకు ధైర్యం లేదు. నింద నామీద మోపారు. ఫరవాలేదు. అంత మాత్రాన నేను దోషిని కాజాలను. ఈ సంసారసుఖం అనుభవించేకన్నా దేశం కోసం ప్రాణాలు ధారపోయ్యడం సార్థకం.

భగీరథరావు : అందుకనే అలా యేడుస్తున్నావు. పో ... యింకాయిన్ని పూలదండలు మెళ్లో వేసుకుని ఊళ్లో ఊరేగు. ఆ బతుకు మరీ బాగుంటుంది. పో ... వెళ్లిపో ... ఆట్టే ప్రసంగం చేయక.

రాధ : (కన్నీళ్లతో) అయితే యిన్నాళ్లు మీతో సంసారం చేసిన నన్ను ఒక్కమాటతో వీధిలోకి గెంటేస్తున్నారు. భావ్యమేనా?

భగీరథరావు : అదుగో ... అధిక ప్రసంగం చేస్తున్నావు. వెళ్లు. నీ మొహాన రాసిన రాత నేనెల్లా చెరిపివెయ్యగలను?

పుట్టుకతో పుట్టిన బుద్ధి పుడకతో పోవాలి ... వెళ్లిపో!

రాధ : (దీనంగా) ప్రజ మిమ్మల్ని యేమంటుందో ...

భగీరథరావు : (గట్టిగా) చెపుతున్నాను. నువ్వు ముందు యిక్కణ్ణుంచి కదులు! నాకు కోపం వొచ్చిందంటే యిక్కడే చస్తావ్!

రాధ: (ఏడుస్తూ) అంత పాపం మీరు ఒడిగట్టుకోనక్కర్లేదు. నేనే వెళ్లిపోతున్నానులెండి. కాని యీ దీనురాల్ని జ్ఞాపకం ఉంచుకోండి. సెలవు ... నమస్కారం ... (వెనుదిరిగి నడుస్తూ ఆగుతుంది.)

భగీరథరావు : (చూసి) ఇహ నన్ను చంపి కాని పోవాయేం?

రాధ : అబ్బాయిని కూడా తీసుకుపోతాను. నిద్దరలేస్తే ... నాకోసం కక్కటిల్లుతాడు. నేలేకపోతే అబ్బాయిని చూసే దిక్కెవరు?

భగీరథరావు : అన్నీ తెగించిన దానికి కొడుకు కూడా యెందుకు? వాణ్ణి తీసుకువెళ్లడానికి వీల్లేదు. వాణ్ణికూడా చెడగొట్టి నావంశం నాశం చెయ్యకపో. (గట్టిగా అరుస్తూ) యింక మాట్లాడటానికి వీల్లేదు. వెళ్లిపో. వెళ్లిపో.

రాధ: (వెక్కివెక్కి యేడుస్తూ వెళ్లిపోతుంది.) భగీరథరావు దీర్ఘంగా ఆలోచిస్తూ పచారుచేస్తుంటాడు. చప్పున పోయి తలుపు దభాలున వేసి వస్తాడు. పిల్లాడు యేడుస్తాడు లోపల. రాధ తలుపు గట్టిగా తట్టుతూ, 'వేణూ, వేణూ', అని అంటుంది.)

భగీరథరావు : ఛీ! రాక్షసీ! యింకాఅరుస్తున్నావు. సిగ్గులేక!

(వీధిలో బిచ్చగాడు పాడుతుంటాడు)

ఈ పాడు సుఖమేమొ
ఎరుగకయె వెర్రివై
తిరుగాడనేలకే
ఓ కనులు తెరువవే మనసా!

దేశమంతా నిండె
పేద గుండెలమంట
నీచూపు సోకదా
నీరూపు వెలుగదా

4

(ఒక వారం రోజుల తరవాత. కచ్చేరి సావిడి భగీరథరావు యింట్లో. మధ్యబల్లా, చుట్టూ కుర్చీలు. ఇద్దరు యువకులు కూర్చుని ఉన్నారు. ఒక అతను వెంకట్రావు, రెండవ అతను శర్మ. ఆ యిద్దరూ కలెక్టరు ఆఫీసులో గుమాస్తాలు. ఇంకొక శాస్త్రులు గారు, మరొక రిటయిరైపోయిన జిల్లా జడ్జి (అరవయిసంవత్సరాలలోపు) కూర్చుని ఉన్నారు. లోకాభిరామాయణం మాట్లాడుతున్నారు)

వసంతరావు : ఏఁవోయ్ పంతులూ! నీ భార్యని అలా తరిఫీదు చేశావేమోయి! మొగుముండావాణ్ణి లెక్క చెయ్యకుండా వెళ్ళిపోయింది.

శాస్త్రులు : నేను చెపుతునే ఉన్నాను. మీరు వింటునే ఉన్నారు. గ్రంథాల్లో కూడా స్పష్టంగా రాశుంది. ఏఁవనీ : కలికాలం ఒక దశ చేరిందన్నప్పటికల్లా దేశం తారుమారవుతుంది; నిలబడిఉన్న బల్లలు తలక్రిందులవుతవి, ప్రజలు మూఢులై, పశువులై ఎందుకూ పనికిరాకుండా పోతారని.

శర్మ : ఏవో కొయ్యండి శాస్త్రులు గారూ!

శాస్త్రులు : ఏం నాయనా! కోతలాయివి. కళ్ళక్కట్టినట్టు జరుగుతున్నవే విషయాలు!

వెంకట్రావు : అలా అనకోయ్ శర్మా! మన వాళ్ళు రాసిన వాటిల్లో చాలా వరకు సత్యం లేకపోలేదు.

శాస్త్రులు : నాయనా మీ యింగ్లీషు చదువులు మా కొంపలు కూల్చేసినయి. మా వాడున్నాడా? వాడు యింటర్మీడియేట్ చదువుతున్నాడు. ఉద్యోగం రావాలా పెట్టాలా? ఏదో నలుగురుతో బాటు నారాయణగా అనడం తప్ప ఫలితం నిండుసున్న.

వసంతరావు : ఫరవాలేదులెండి. దేశాన్ని ఉద్ధరించటానికని కొందరు మొనగాళ్లు ఉద్యోగాలకే తిలోదకాలు యిచ్చారు. చాలా ఖాళీలు ఉన్నాయిలెండి. మీ వాణ్ణి కూడా యెక్కడో అక్కడ దూర్చేస్తాం.

భగీరథరావు : ఉద్యోగాలకేం కొదవలెండి అదృష్టం ఉండాలిగాని.

శర్మ : బాగా అన్నారు.

శాస్త్రులు : సరేకానీ, నా కర్థంకావడంలేదు ...యీ చదువుకున్న వెధవలకే పుట్టింది యీ బుద్ధి యేం చెప్మా అని విచారం గా ఉంది. దేశం ఉద్ధరించడం యేఁవిటండీ వీళ్ల పిండా కూడు!

వసంతరావు : నేను చెపుతున్నదేమిటి? నాలుగు లాఠీ దెబ్బలతో యింటికి చక్కా వొస్తారు. మీకా భయం అక్కర్లేదు.

వెంకట్రావు : నాకు నమ్మకం లేదు. ఆ మాత్రం త్యాగశీలం వాళ్లదగ్గర ఉంటుందనుకుంటాను.

శాస్త్రులు : త్యాగశీలం యేఁవిటండోయి అర్థంలేని మాట? ఈ త్యాగం యేడిశినట్టే ఉంది.

తేలుకొండెమీద వెలుపెట్టి త్యాగం చేశామంటేయెవరు హర్షించును?
**వసంతరావు :** అన్నిటికన్న విచిత్రమయిన విషయం యిందులో ఆడపిల్లలు కూడా వేలుపెట్టడం. పులుసులో ఉప్పూకారం సమపాళంగా వెయ్యలేరు గానీ యీ దేశాన్నుంచి యింగ్లీషు వాళ్లని తరిమేస్తారుట! (నవ్వును)

**శాస్త్రులు :** నాకు భగీరథరావు గారిని చూస్తే కడుపు తరుక్కుపోతోంది. ఏదోయింత సుఖంగా సంసారం గడపవలసిన వాడి గతి ఇలా అయిపోయిందేమా అని .

**వసంతరావు :** చదువులు ఆడవాళ్లకి పనికిరావని యెన్నాళ్లనుంచి మన వాళ్లంటున్నారు? అసలు యీ ప్రౌఢా వివాహాలు యేఁవిటి? ప్రేమించి పెళ్లి చేసుకోవడాలేఁవిటి? నేను మాత్రం నా పెళ్లాన్ని పెళ్లి పీటల మీద తప్ప అంతకు ముందు చూసిన పాపాన పోలేదు. గత నలభయి అయిదు సంవత్సరాల నుంచి యేదో సణిగినా, గొణిగినా, హాయిగా కాపరం చేస్తున్నాము.

**వీధిలో నుంచి :** పేపర్ సార్!

**వెంకట్రావు :** పేపరొచ్చింది కాబోలు! మన వాళ్ల సంగతి కూడా ఉంటుంది...

(భగీరథరావు పోయి పేపరుతెస్తాడు)

**వసంతరావు :** ఏది, భగీరథరావు, కాస్త చదివి వినిపించు.

**శాస్త్రులు :** ఈ సత్యాగ్రహం గురించి కూడా రాస్తారు కదూ? అదే ముందు చదవండి.

**శర్మ :** ఇలా యివ్వండి నేను చదువుతాను. (*పేపరు పుచ్చుకుని పేజీలు తిరగవేస్తూ*) ఇవాళ న్యూస్ విశేషంగా ఉందే ... 'దేశమందంతటను బహిరంగసభలు', 'నాయకుల గంభీరోపన్యాసములు', 'వేలకొలది ప్రజ శాసనోల్లంఘనముగావించుట', ... అరెస్టులు .... బొంబాయి, ఢిల్లీ, అలహాబాదు, బెనారెసు, కలకత్తా ...' అబ్బా! ఎంతమంది పోయారండి జయిళ్లకి! రెండు మూడురోజుల్లోనే యింత జరిగింది! చాలా గొప్ప విషయం!

**శాస్త్రులు :** జయిలుకు పోవడం కన్న అవమానకరమయిన విషయం యింకేముంది? గొప్ప విషయం అంటారేమిటి పైపెచ్చు?

**వసంతరావు :** ఆ ( చదవండి.

**శర్మ :** 'ఆంధ్ర దేశము ...' ఊ ఇదుగోనండి మన మన ఊరు ... అరరే...

**భగీరథరావు :** ఏదీ అదే .... చదువు.

**వసంతరావు :** గబగబా ....

**శర్మ :** 'నిన్నటి మధ్యాహ్నము, యిచ్చట గొప్ప బహిరంగసభ జరిగినది. వేలకొలది స్త్రీ పురుషులు సభకు హాజరయిరి. సభలో శ్రీ అచ్యుతరావుగారు దీర్ఘమయిన గంభీరోపన్యాసము గావించిరి.

**శాస్త్రులు :** వినండి ... ఆ మాటలు చూడండి ... దీర్ఘంట, గంభీరంట ... ఓహో ...పేపర్లకు రాసే వాళ్లకన్నా బుద్ధిలేదు.

**శర్మ :** 'తరువాత రాధాదేవిగారు సుమారు ఒక గంట వరకుసత్యాగ్రహోద్యమము గూర్చియు, భారతీయుల కర్తవ్యమును గూర్చియు నుపన్యసించిరి ..' అరె లాఠీ చార్జి కూడా అయిందండోయ్!

**వసంతరావు :** భేష్ ! ధర్మం యెక్కడికి పోతుంది ?

**శర్మ:** '21 సోమవారం . నేటి ఉదయము శ్రీ అచ్యుతరావుగారి నాయకత్వము క్రింద

బయలుదేరిన సత్యాగ్రహ దళము ఉప్పు తయారు చేయుట కారంభించెను. పోలీసు సబిన్స్పెక్టరుగారు వచ్చి ఆపు చేయవలెనని కోరిరి. కాని వలంటీర్లు నిరాకరించిరి. అంత, తీవ్రమయిన లాఠీ చార్జీ జరిగెను. వలంటీర్లకు బలమయిన గాయములు తగిలెను. ముఖ్యముగా స్త్రీ దళ నాయకురాలయిన

రాధాదేవిగారికి మొగముపై తీవ్రమయిన దెబ్బలు తగిలెను. చాల అపాయకరమయిన స్థితిలో నున్నారు. వారిని ప్రస్తుతము గవర్నమెంటు హాస్పిటలులో చేర్చిరి.'

**వసంతరావు :** ఏఁవోయ్ భగీరథరావు, మీ ఆవిడ కూడా కథానాయకురాలయిందే!

**శాస్త్రులు :** అయిందంటే ... పూర్వం చేసిన పాపఫలం అనండి. సరేకాని భగీరథరావుగారూ హోటలు తిండేనా ప్రస్తుతం.

**భగీరథరావు:** ఇంకోదారి యేదీ?

**వసంతరావు :** శుభ్రంగా మళ్లీ పెళ్లి చేసుకో బాగుపడతావు. స్త్రీ లేకుండా సంసారం యేఁవిటి; రేపు మంచం యెక్కితే చూసే దిక్కెవరు?

**శర్మ :** అదే అతనూ ఆలోచిస్తున్నాడు.

**శాస్త్రులు :** ఇంకా ఆలోచనేఁవిటి? మాన మర్యాదలు లేని ఆడదాన్ని బహిష్కరించమని శాస్త్రం చెబుతున్నది.

**వసంతరావు :** అవునోయ్! నువ్వేమీ సిగ్గుపడవలసిన అవసరం యిందులో యేఁవీలేదు. ఇంకా పై పెచ్చు పేరు కూడా వొస్తుంది. ఇటువంటి స్త్రీలకు గుణపాఠంనేర్పినట్లు కూడా అవుతుంది.

**భగీరథరావు :** ఆలోచిస్తానులెండి.

**వసంతరావు :** ఇంకవొస్తాను.(అని వెళిపోతాడు. అందరూ లేచి నిలబడతారు)

**శర్మ :** సాయంకాలం వొస్తాను మళ్లీ.

**శాస్త్రులు :** అబ్బ యెంత పొద్దు పోయిందండీ!

**వసంతరావు :** (తిరిగి వొచ్చి) చూశావా! రాధకి రెండేళ్లు కఠిన శిక్ష వేశారుట!

**వెంకట్రావు :** అరరె, పాపం!

**వసంతరావు :** పాపంలేదు గీపం లేదూ ... (అందరూ పోతారు.)

## 5

(భగీరథరావు యిల్లు. మేడమీద గది. గుమ్మాలు అలంకరించబడిఉన్నాయి. లోపల అప్పుడప్పుడు సన్నాయి మేళతాళాలు వినపడుతుంటయి. ఆ గదిలో ఒక మంచం వేసి ఉంటుంది. దాని మీద వేణు నిద్దరపోతున్నాడు. పక్కన చిన్న బెంచి ఉన్నది. వెంకయ్య అటూయిటూ పచారు చేస్తుంటాడు.)

**వెంకయ్య :** ఈ యింట్లో నించి నేను కూడా లేచి పోవలసిందే. కాని కుర్రాణ్ణి విడిచి యెల్లా పోగల్ను? ఈ యింటికి శని పట్టింది. చదువు కున్నవాడయితే మాత్రం మెదడు లేకుంటే యెలాగ? కట్టుకున్న పెళ్లాన్ని యింట్లోంచి గెంటెయ్యడం ధర్మవా? అసలు రాధమ్మ చేసిన తప్పేఁవిటి? నేను చిన్నప్పటినుండి యెత్తుకుని పెంచాను ఆ పిల్లను. ఎంత అమాయకురాలు.ఎంతసాధ్వి? ఈ సంగతి విని ఆయన యెంత విచారించాడు పాపం! శుభవా అని తలపెట్టాడు యీ రెండోపెళ్లి. ఎంత చెప్పినా విన్నాడు కాదు. ఎంతసేపూ రాధమ్మ కుర్రాణ్ణి చూస్తానని గోల పెడుతున్నది. పై పెచ్చు యిప్పుడే వొస్తానన్నది. (కింద చప్పుడవుతుంది.

వెంకయ్య గబగబా వెళ్లి రాధని తీసుకొస్తాడు మేడమీదికి. రాధకు కళ్లు లేవు)

**వెంకయ్య :** అయ్యో తల్లీ! ఎంత చిక్కిపోయావమ్మా! కుర్రవాణ్ణి చూసే అదృష్టం లేకుండా చేసుకున్నావు. ఈ దిక్కుమాలిన దేశం కోసం కళ్లెందుకు పోగొట్టుకున్నావు?

**రాధ :** (మెల్లిగా వచ్చి బెంచిమీద మంచం దగ్గిర కూర్చుని) వెంకయ్యా! అలా దేశాన్ని తిట్టకు. నావంటి ప్రాణాలు యెన్ని ధారపోస్తే విముక్తి కలగను? ఈ కళ్లే గాదు, నా ప్రాణం కూడా త్యాగం చెయ్యడానికి సిద్ధంగా ఉన్నాను ..... వేణూ! (మెల్లిగా) నాన్నా! వేణూ!

**వెంకయ్య :** లేపకు తల్లీ ! ఏడుస్తాడు.

**రాధ :** వెంకయ్యా! ఇప్పుడు వేణుకి బాగా మాటలు వొచ్చి ఉంటయి. అవునా?

**వెంకయ్య :** అవునమ్మా!

**రాధ :** నన్నెప్పుడన్నా తలుస్తూ ఉంటాడా?

**వెంకయ్య :** ఏదో చిన్నతనం. ఆ మాటా యీ మాటా చెప్పి మరిపిస్తుంటాను.

**రాధ :** వేణూ ! (కుర్రాణ్ణి చేత్తో నిమురుతూ) వేణూ ! మీ అమ్మని నేను, గుర్తు పట్టగలవూ? (కింద బాజా వినపడుతుంది) ఏం వెంకయ్యా! ఆ హడావుడి యేమిటి?

**వెంకయ్య :** ఏం లేదు తల్లీ !

**రాధ :** వేణుని నీ చేతుల్లో పదేశి పోయాను. జయిల్లో ఉన్నంతసేపూ మనసంతా వీడిమీదే ఉండేది. ఉత్తరంరాద్దామంటే కళ్లు అప్పటికి వొక మోస్తరు కనపడవు. ఇప్పుడు అది పూర్తిఅయింది. వేణూ! మీ అమ్మగుడ్డి తల్లి అయిపోయింది. విచారించకు. నిన్నెవరన్నా అలా అంటే మా అమ్మ దేశం కోసం కళ్లు త్యాగం చేసిందని చెప్పు. (కళ్లల్లో నీళ్లు తిరిగినయి) ఇలా మాట్లాడుతుంటే మెట్ల మీదచప్పుడు అవుతుంది. వెంకయ్య తత్తరపడతాడు. ఇంతలోనే భగీరధరావు ప్రవేశిస్తాడు

**భగీరధరావు :** (రాధను చప్పున చూసి) ఏంరా వెంకయ్యా! నీకేం పొయ్యేకాలం! ఈ సిగ్గుమాలిన దాన్ని మళ్లీ యీ యింట్లో ప్రవేశపెట్టావు?

**రాధ :** నాది అపరాధం (అంటూ ఆ యిద్దరి వెనక నించి మెట్లదగ్గిరకు వచ్చి నిలబడింది)

**భగీరధరావు :** నోరుముయ్! నీ ఉద్యోగం ఫయిసల్! ఫో! నువ్వు కూడా పోతే పీడా వొదిలి పోతుంది.

(అసంపూర్ణం)



# మరొక నాటకం

*[జైలు డైరీలో 1948 లో రాసిన నాటకం]*

| | | |
|---|---|---|
| శివం | : | గుమాస్తా |
| చంద్రం | : | స్నేహితుడు |
| సుందరయ్య | : | శివం తండ్రి |

1942 ఆగస్టు 12
1947 ఆగస్టు 15
1948 జూను

1. బజారు
2. శివం ఇల్లు
3. జయిలు

1

*(బజారు. దుకాణం ముందు. అటూ యిటూ జనం పోతూంటారు. లోపల్నించి మనుషుల కేకలూ, బళ్ల చప్పుడూ వింటాము. ఊరికే కలకలం.*
*దుకాణం ముందు కొంతమంది పెద్ద మనుషులు వస్తువులు కొనక్కోవడానికి వస్తూ పోతూంటారు. రంగస్థలానికి దుకాణం ఒక మూలగా ఉంటుంది. అన్ని వస్తువులూ అమ్మకానికి ఉంటయి.*
*శివం, చంద్రం వస్తారు.*
*శివం చేతిలో సంచి ఉంది. చంద్రం చేతిలో గొడుగు ఉంది. శివం పచ్చగా, అందంగా ఉంటాడు. వయస్సు యిరవై అయిదు లోపున. చంద్రం బక్కపలచగా ఉంటాడు. ప్రతీదీ తదేకదృష్టితో చూస్తుంటాడు. ఘట్టిగా మాటాడుతుంటాడు.*
*శివం రావటంతోటే దుకాణం మనిషి లేచి దండం పెట్టి నవ్వుతాడు. పక్కన ఉన్న జనం తప్పుకుంటారు. శివం దుకాణంలోపలికి పోతాడు. చంద్రం బయటనే నిలబడతాడు.)*

చంద్రం : కొనేదేదో తొందరగా కొనేసెయ్. యింకా దార్లో పనులున్నయి ..... శివం, శివం, లాంతర్లున్నయేమో అడుగు – మంచిదుంటే ఒకటి కొందాం.

పక్కనున్నమనిషి : ఈ రోజుల్లో మంచీచెడ్డా ఉందిటండీ. దొరకటమే పెద్ద అదృష్టం. కావలసిన.

వస్తువుందంటే చాలు, జనం యెగబడి కొంటున్నారు.

చంద్రం : సరేలెండి. మంచీ చెడ్డా చూడకపోతే మనుషులం మనమేం కావాలి? ఉన్నదాంట్లోనే కాస్త మేలురకం చూడాలంటారా, వద్దంటారా? ఎగబడి కొన్నంతమాత్రం చాల చెడ్డది మంచిది కాదుకద్దా?

మరో మనిషి : తర్కానికి యివి రోజులు కావు లెండి. పెద్దవాణ్ని చెబుతున్నాను. మొన్న మా యింట్లో పిల్లవాడికి పాలు పోసేందుకు పంచదార కావలిసొచ్చింది. నట్టెండలో కాళ్లీడ్చుకుంటూ నానా దుకాణాలు తిరిగి ఒక చోట చాటుగా కొన్నాను. ఇంటికి వొచ్చి పొట్లం విప్పానో లేదో

బియ్యపు రవ్వా, పంచదారా కలిపిచ్చారు. ఏం చెయ్యమంటారు. నోరు నొక్కుకుని లోపలి యేడ్చాను. పొట్లం విప్పనివ్వరా అంటేఆ భ్రష్టుడు వప్పుకోందే .... పోనీ ...
చంద్రం: నువ్వు చాతకానివాడివి కనక, నీకు దమ్ములేవు కనక, దబాయించలేవు కనక–అథవా అది లేకుండా కాలం గడపలేవు కనక – అందుకేనయ్యా యీ మోసం, కుచ్చితం చలామణీలోకొచ్చింది.

పక్కనున్న మనిషి: అయితే దీనికంతా లోపం యెవరిదంటారు?

చంద్రం: ఎవరిదా? నీదీ. నాదీ. యీాయన్దీ. ఆయన్దీ. ఇంకా యెవరిదంటావా? నిన్నూ నన్నూ యీయన్నూ, ఆయన్నూ పుట్టించినవాళ్లది. అనుభవించండయ్యా, యీ భారతదేశంలో పుట్టింది అనుభవించటానికే నయ్యా అష్టకష్టాలు.
మరోమనిషి: తమ ధోరణి మరీ బాగుంది. దారిద్ర్యమే అసలెక్కువ. అందులోకీ అవసరానికొక్కవలసిన వస్తువులైనా దొరక్కపోతే అందరూ అడుక్కుతినవలసి వస్తుంది.
చంద్రం: అందరూ అడుక్కుతినే రోజు వస్తేనే అందరికీ నిజంగా ముక్తి దొరుకుతుంది. ఇంతమంది జనాన్నీ పీడించుకుతినే రాజ్యం యెవరిదైతేనేం యెన్నాళ్లుంటుంది?
*(ఈ మాటలు విని పక్కనున్న మనిషి వెనక్కి తిరిగాడు. మరోమనిషి మరో మనిషిని పలకరించాలని ప్రయత్నిస్తున్నాడు.)*
చంద్రం: --- అసలు సంగతి వొచ్చేటప్పటికి యెవరూ మాట్లాడరు. భయం, భయం, భయం! ఎందుకండీ ఉన్న సంగతి చెప్పుకోవటానికి భయం?
మరోమనిషి: *(మెల్లిగా)* ఇదుగో, నాయనా రోజులు మంచివి కావు. నీకున్నంత ఆవేశం మాకు లేకకాదు. ఇలా రోడ్డుమీద యాగీ చేసుకుంటే యేఁవన్నా లాభం ఉందా? కుర్రాడివి.ఇంతటితో కట్టిపెట్టు.
శివం: *(లోపల్నించి)* ఆరే చంద్రం – యిలా చూడు లాంతరు కావాలన్నావే. *(లాంతరు పుచ్చుకుని ముందుకొచ్చి)* బాగానే ఉందిరాయిది.
చంద్రం: *(ముందుకు అడుగువేస్తూ)* బాగుంటే మనమేం చెయ్యగలంరా! అసలు ఖరీదెంతో అడుగూ – దాంతో మన వ్యవహారం తేలిపోతుంది.
*(ప్రక్కన కారు చప్పుడు. హారన్ మోగి ఆగిపోతుంది. పద్దెనిమిదేళ్ల అమ్మాయీ ఒక కుర్రాడూ దుకాణంలోకి వొస్తారు. చంద్రం పక్కకి తప్పుకుంటాడు. శివం యెదురుగుండా ఉంటంచాత పక్కకి తప్పుకోలేక పోయాడు. ఆ అమ్మాయి ఆగిపోతుంది. కుర్రాడు తోసుకుపోతాడు.)*
చంద్రం: ఏంరా, అలా చూస్తావేఁ, వచ్చేవాళ్ళకు దారివ్వద్దూ. దుకాణం నీదయినట్టు నిలబడతావేం. ముందుకన్నారా, వెనక్కన్నాపో ....
*(ఆ అమ్మాయి నవ్వుతుంది. శివం మొహంయెర్రబడుతుంది. ముందుకడుగువేసి పక్కకి తప్పుకుంటూండగా ఆ అమ్మాయి లోపలికి పోతుంది. పోయేటప్పుడు చెయ్యి విసురుడువల్ల శివం చేతిలోని లాంతరు నేలమీదపడి పగిలిపోతుంది. ఆ అమ్మాయి ఆగిపోతుంది. మరో మనిషి, పక్కనున్న మనిషీ దారిపొయ్యే పెద్ద మనిషీ అంతా మూగుతారు. దుకాణం మనిషి పైకొస్తాడు.)*
శివం: *(లేని నవ్వు తెచ్చుకుని)* చంద్రం, పొద్దున్నే యెవరి మొహం చూశాంరా? ... *(అంటూ*

అమ్మాయి వంక చూస్తాడు. అమ్మాయి మొహాన గీసినా నెత్తురు చుక్కలేదు)
చంద్రం : (విరగబడి నవ్వుతూ) చంద్రబింబంరా – యిహ వచ్చేశెయ్. ఈ నెలకి దుకాణానికి యిదే ఆఖరిసారి రావటం.
పక్కమనిషి : ఇలాగే యెగబడి వస్తుంటారు ఉన్నవాళ్లు కొనుక్కోవాలని (విరసంగా నవ్వుతాడు).
(లోపల గ్రామఫోను రికార్డుపాట . కుర్రాడు దూకుడుగా ముందుకు వస్తాడు. అందరూ తప్పుకుంటారు. ఆ అమ్మాయి దగ్గరికి పోతాడు)
కుర్రాడు : అక్కా, మాంఛిపాటే – కొత్తగా వొచ్చింది. విందువు గాని రావే....
పెద్దమనిషి : ముందు ఆ గాజు పెంకులు యేరి పారెయ్యండి. డబ్బు దండుగతో నెత్తురు దండుగ కూడా యెందుకు?
దుకాణం మనిషి :అరే రంగా! చీపురుతో తుడిచెయ్ యిక్కడ – (శివంతో) ముప్పయి అపశకునాలు పొద్దున్నే లేచేటప్పటికి–
చంద్రం :ఇచ్చేస్తాం లేవయ్యా ఖరీదు–మావాడిదే తప్పంతాను ...

ఆ అమ్మాయి : (దుకాణం మనిషితో) నేనిస్తానులెండి, వారికి కొత్తలాంతరు చూడండి.
చంద్రం : ఆవిడెందుకు నష్టపోవటం – నేనేయిస్తాను.
దుకాణం మనిషి : ఇదో లెఖ్కటండీ – పోతేపోయింది. ఎవరిస్తేనేం – యెవరో ఒకరిచ్చేద్దురుగాని అంతగా బాధపడితే.
కుర్రాడు పాట అయిపోతోంది. (దుకాణం మనిషితో) ఏదండీ, రికార్డు తిప్పి రెండో పాట పెట్టండి.
శివం : (అమ్మాయి వంక చూస్తూ) బలేపాట – మీరు లోపలికి పోయి రికార్డు కొనెయ్యండి.
(సంకోచిస్తూ ఆ అమ్మాయీ, కుర్రాడూ, దుకాణం మనిషీ లోపలికి వెళిపోతారు. రంగడు వొచ్చి గాజుముక్కల్ని యేరి చీపురుతో తుడుస్తుంటాడు.)
శివం : (చంద్రంతో) బలే పని అయిందిరా!
చంద్రం : ఇంతటితో యివాళటికి సెలవు తీసుకుందాం పద. ఆవిడే యిస్తానంటోంది ఖరీదు.
శివం : అన్నంతమాత్రాన పుచ్చుకుంటే యేం మర్యాదరా?
పక్కమనిషి : ఆ మర్యాదకాస్తా తమకే జరిగిందికనక తమరేయిచ్చుకోండి.
ఇయ్యంగలవారిప్పించండయ్యా!
లేనివాడెలాగూ యిచ్చుకోలేడు.
మరోమనిషి ఏవరమ్మాయి? మాంఛి గడుసుపిల్ల.
రంగడు : సుబ్బారాయుడిగారి కూతురండీ –ఎర్రరంగు పెద్దకారు వీళ్లదే – పైన చూడండి కనబడుతుంది.
చంద్రం : చెన్నపట్నం కిరస్తానీ దాన్ని పెళ్లాడిన సుబ్బారాయుడుగారా? ఓహో ఆవిడ పిల్లా యీ అమ్మాయి?
శివం :ఈ అమ్మాయే కాబోలురా – మొన్న కాలేజీలో గొడవ –

రంగడు : అవునండీ - మగకుర్రాణ్ని లాగి దవడమీద కొట్టింది. దాంతో కాలేజీ అంతా తారెత్తిపోయిందండీ!
శివం : అలా కనపడదే - చాలా నెమ్మది ...
పక్కమనిషి: ప్రపంచంలో యిదే గమ్మత్తు. నిజాయితీ ఉన్న వాళ్లెవరో కాని వాళ్లెవరో, కలేజా ఉన్న వాళ్లెవరో లేని వారెవరో, తెలుసుకోవటం కష్టం. తెలుసుకోకుండా తిరిగి యెందరో దెబ్బ తింటుంటారు.
చంద్రం: అందులో మా వాడూ ఒకడే లెండి. మనిషితత్త్వంలో మమకారం యెక్కువ. అంచాతనే అందర్నీ నమ్ముతాడు. ఆ అమ్మాయి గురించి యీ కథవిన్నామా, ఆ అమ్మాయిని చూశామా, మా వాడు ససేమిరా నమ్మడు.
శివం : ఊరికే గోలచెయ్యక - కథ కథ అంటున్నావు, యేఁవిటోయ్ నువ్వు విన్నకథా? ఇలాగే వినీ వినకుండా ప్రపంచంలో ప్రవాదాలూ ప్రబంధాలూ ప్రచారంలోకి వస్తయి. నిజానికీ కథకీ యెంతదూరఁవో యెవరన్నా ఆలోచిస్తారూ? మనిషికి మాటే ప్రధానంకాదు. మనస్సు దేనికండీ మనిషికి?
(లోపల్నించి రికార్డుపాట. చప్పున అందరూ ఆ పాట వినడంలో తన్మయులైపోతారు. పాట అయిపోతుంది.)
చంద్రం: ఏంరా, యేఁవిటాలస్యం. పోదాంపద, యింటి సంగతి బొత్తిగా మరిచిపోయినట్లున్నావ్. మీ నాన్న మందు మాట జ్ఞాపకం చెయ్యమంటావా? పద-
శివం : (నవ్వుతూ) లేదురా నాయనాలేదు. పోదాం పద- (ఆలోచించి) చెప్పి వస్తానుండు (లోపలికిపోతాడు.)
చంద్రం: (పక్కమనిషితో) మా వాడికున్న ఉద్రేకం మరెవ్వరికీ లేదంటే నమ్మండి. పెళ్లికానివాడు. గాలిమేడలు కట్టుకుంటాడు. బియ్యే చదువుకున్నాడా అండి. ఒకంతట ఉద్యోగం చేస్తేనా? ఆ తండ్రి గోలపెట్టగా పెట్టగా యీ నాటికి ఉద్యోగంలో చేరాడు. కుటుంబభారం అంతా తన మీదే పడిందా, ఆ స్వల్ప బాధ్యతని గుర్తించకుండా దేశం, ప్రపంచం అంటూ ఆవేశంతో గొంతుచించుకుంటాడు. ఎవరి మానాన వారు లోకం రివాజుని బట్టి పోతూండాలి. ఏఁవంటారు?
పక్కమనిషి : ఈ రోజుల్లో ప్రతీదీ విపరీతంగానే ఉంటోంది. ఇది ఖాయమనీ, కాదనీ మనం నిర్ణయించుకోలేంగదా! ఎవరి రాత యెలా ఉందో అలాగే జీవితం నడుస్తుంది. దీనికి కారకులెవరైతేనేం?
చంద్రం: రాతా గీతా అన్నమాట కాదుగానీ మనం ఒకరకం పద్ధతిలో ఉన్నాం. ఆ పద్ధతి మారేంత వరకూ యిలాగే ఉంటం బతక నేర్చిన లక్షణం. చూడండి మనం తింటూనే ఉంటాం. కాని పక్కనే మన పక్కనే మరో ప్రాణం కబళానికి కళ్లల్లో నెత్తురు నింపుకుని కూచుంటాడు. మనం అదీ చూస్తాము. ఏ మాత్రం చలించం. వాడి ఆకలికీ, మన తిండికీ యెక్కడుంది వ్యత్యాసం?
పక్కమనిషి :ఎక్కడుందని యెలా వెతకటం? మన దేశంలో దారిద్ర్యం కూడా పెద్ద వృత్తి అయిపోయికూచుంది.
చంద్రం: దరిద్రుల్ని పీడించుకు తినడం మరింత పెద్దవృత్తి. ఈ అన్యాయాన్ని చూస్తూ నెమరు వేయటం మనలాంటి వాళ్లవృత్తి. ఈ వృత్తులూ, ధర్మాలూ, తరతరంగా అమల్లో ఉంటున్నాయి

కనక మనం నోరెత్తటానికి వీల్లేదని చెప్పే హారిది మరోవృత్తి. దీనికి కారణం అందరమూను.
మరో మనిషి: (మెల్లిగా) ఇంగ్లీషు వాడి రాజ్యంలో కారణాలు వెదుకుతారేవిఁటి? మూల కారకుడు వాడే అయితే.
పక్కమనిషి: దమ్ముల్లేని వాళ్లంతా యిలానే చెబుతారు. మనకి శక్తి ఉంటే వాడెందుకుంటాడిక్కడ? అసలు సంగతి వొప్పుకోండి. మనకి ఆత్మాభిమానం, కరుణా, క్షమా యివన్నీ పోయినై...
*(దూరంగా బిచ్చగాడి పాట వినపడుతుంది.)*

ఆకలితో పక్కనే బాధపడే ప్రతీజీవికీ తాను తినే దాంట్లోనే యింతకబళం వేస్తే సగం సమస్య యీపాటికి తీరిపోయి ఉండేది. ఎవడింటి వాకిలి వాడు తుడుచేసుకుని, యెవరి డ్యూటీ వారు చేస్తే మునిసిపాలిటీలూ రంకుతనాలూ యెందుకుంటయి?
*(బిచ్చగాడు పాడుతూ ప్రవేశిస్తాడు. చిక్కి శల్యం అయిన శరీరం.)*

...ఇలా చెయ్యకూడదని యెవరన్నా ఆదేశించారా – (బిచ్చగాణ్ని చూసి) ఛీ – పోరా వేళాలేదు పాళా లేదు. ఎక్కడపడితే అక్కడ అడుక్కుతింటం. మీరిలా చేస్తున్నంత కాలమూ యీ దేశానికి ముక్తిలేదు. ఫో –
*(బిచ్చగాడు వెళిపోతాడు.)*
చంద్రం: ఇహ యీ దేశం బాగుపడదులెండి – ఒరేయ్‌శివం –

పక్కమనిషి: ఇదుగో మిగిలింది విస్ఫృహ.

*(శివం బయటికొచ్చాడు. పక్కన కుర్రాడున్నాడు.)*
చంద్రం: పోదాఁవా – యింకేఁవన్నా పనుందా?
శివం: ఈ కుర్రాడికి కాల్లో గాజుపెంకు గుచ్చుకుందిరా. కాస్త మందు వేయించిపోదాం.
చంద్రం: ఆవిడకి తమ్ముడా?
శివం: ఆఁ –
చంద్రం: వాళ్ల పనిమనిషి ఆ పని చేయించలేదూ? ఇంకా మనకి దార్లో పనులున్నాయి. నీతో చావొచ్చింది.
శివం: నువ్వొస్తేరా లేకపోతేలేదు.
*(దూరంగా రోడ్డుమీద జాతీయగీతం. ఆడవాళ్లూ, మగవాళ్లూ పాడుతున్నారు.)*
చంద్రం: ఏఁవిటా గందరగోళం?
దారిపొయ్యేమనిషి: నిన్ననే కదండీ నాయకుల్ని నిర్బంధించిది ప్రభుత్వం.

శివం: ఒహో –
మరోమనిషి: వెళిపొండి – వెళిపొండి. (మెల్లిగా) ఇవాళ పెద్దగందరగోళదయిపోతుంది. ఎవరిళ్ళల్లో వాళ్లుంటేమంచిది.
చంద్రం: (గట్టిగా) ఎవరిళ్లల్లో వాళ్లుంటే బతకటం యెలాగయ్యా?
*(మరోమనిషి పెదవి విరుచుకుంటూ వెళిపోతాడు. దూరంగా పాట పెద్దదవుతుంది. జనకోలాహలం యెక్కువవుతుంది.)*

**పక్కమనిషి :** (రోడ్డు మీదికి పోయి చూసివొచ్చి) ఇవాళతో ఆఖరు!

**చంద్రం :** ఏమిటది?

**పక్కమనిషి :** మొత్తం ఆఖరు! పాపం పండింది లెండి. (ఆవేశంతో) ప్రజల్ని ధిక్కరించి పరాయి వాడెన్నాళ్లని పాలిస్తాడూ? ఆఖరు! ఇంతటితో ఆఖరు!

*(దూరంగా పాట అయిపోతుంది. జయధ్వానాలు. ఎవరో ఉపన్యసిస్తున్నారు. దుకాణం ముందు జనం అంతా ఒక్కసారిగా నిశ్శబ్దం పాటిస్తారు.)*

**ఉపన్యాసం :** తరతరాలుగా పరదేశీయుల పాలనం కింద పతితమయిపోయిన భారతజాతి యీ నాటితో విముక్తి పొందపోతున్నది. ప్రచండ ప్రజావాహినికి ఎదురు నిలిచే శక్తి యెవరికీ లేదు. ఈనాడు యావజ్జనమూ ముక్తకంఠంతో ముష్కరులయిన పరదేశీయుల పరిపాలన అంతంకావలెనని ఉద్ఘోషిస్తున్నది. జన వాంఛకు విరుద్ధంగా ప్రవర్తించే ప్రజాశత్రువులను నేటితో తుదముట్టిస్తాము.

*(ప్రచండంగా జయధ్వానం)*

**పక్కమనిషి :** వినండి. వినండి. నేను చెప్పింది నిజం.

**చంద్రం :** (ఆవేశంతో) మనం కూడా పోదాం రండి. చూదాం యేం జరుగుతుందో ... మన కల యెన్నాళ్లకి నిజమవుతోంది!

**మరోమనిషి :** ఉండండి. ఒక్కరోజులో ముగిసిపోతుందా – వినండి. నిదానంగా యేం జరుగుతుందో చూడండి.

**చంద్రం :** నిదానంలేదు, గిదానం లేదు. చరిత్ర ప్రసవించింది. మరో అధ్యాయం జనించింది!

**శివం :** చంద్రం – నువ్విక్కణ్నే ఉండు మళ్లీ వొస్తాను. రెండు నిమిషాల్లో వొస్తాను. కలిసి పోదాం. *(కుర్రాడితో నిష్క్రమించాడు.)*

**ఉపన్యాసం:** సర్వస్వతంత్రతా, స్వేచ్ఛా, మనిషికి పుట్టుకతో వచ్చిన హక్కులు. ఈ పవిత్రమయిన హక్కుల్ని కాదనేందుకెవరికీ శక్తి లేదు. మా దేశంలో మమ్మల్ని బతకనివ్వండి, మా భవిష్యత్తుని మమ్మల్ని పాలించుకోనివ్వండి, మా భూముల్ని విడిచి తమ దేశం వెళ్లిపొండి – యిదే యీ నాడు మనం కోరేది. కౌటిల్యం క్రౌర్యం యిమిడిఉన్న మీ పాలనాన్ని మేం సహించం – యిదే యీనాడు మనం హెచ్చరించేది. ఈ హెచ్చరిక చేసినందుకు మహనీయులైన మన నాయకులు అజ్ఞాత కారాగారాల్లో బంధించబడ్డారు. దీనికి మన సమాధానం తెల్పుకునేందుకే యీ సమావేశం జరిపిస్తున్నాము. మన ప్రత్యుత్తర మేమిటి?

**జనం :** మా దేశం విడిచి వెళ్లిపో.

**పక్క మనిషి :** ఇంతగా జనం ఘోషిస్తుంటే వాడే మొహం పెట్టుకుని కూచున్నాడు, వెధవ. సిగ్గూ శరమూ లేని పశువు!

**మరోమనిషి :** వెళిపోదాం రండి. రోజులు అనుకూలంగాలేవు. పన్లేమన్నా ఉంటే తొందరగా తెముల్చుకోండి.

**చంద్రం :** వినాశం విరుచుకు పడుతుంటే పన్లతొందరేమిటి అవకాశం ఉంటే అందరమూ చేరుదాం యీ ఉద్యమంలో

*(వలంటీరు వస్తాడు. చేతినిండా కరపత్రాలు)*

**వలంటీరు :** (దుకాణం ముందుకుపోయి) బాబూ, నాయకుల్ని అరెస్టు చేశారు. వారి ఆదేశానుసారం

నడుచుకోవటమే మనధర్మం. ఇవాళపట్నంలో వ్యాపారం సాగించరాదని కోరుతున్నాము. సానుభూతితో మీ దుకాణాన్ని మూసెయ్యండి.
అందరు : (దుకాణాదారుతో) ముయ్యండి.
చంద్రం : ఇంతమంది యెందుకు చెప్పటం? ఆయనకి మాత్రం తెలియదూ? ఆయన పరాయివాడా?
(వలంటీరు వెళిపోతాడు. అందరూ దుకాణం వొంక చూస్తుంటారు. లోపల్నించి ఒకరిద్దరు పైకి వొచ్చేస్తారు. తలుపులు వేస్తున్న చప్పుడూ, పెట్టెలు సర్దుతున్న చప్పుడూ వింటాము.)
ఉపన్యాసం : అవును. మీ దేశం మీరు వెళిపొండి. తక్షణవే వెళిపొండి. విలంబనం చెయ్యకుండా వెళిపొండి. ఇదే మన నాయకులిచ్చిన ఆదేశం. ఇదే యీనాడు యావద్భారత ప్రజానీకమూ కోరుతున్నది. అభినవ భారతశక్తి అచంచలమైనది. అఖండమయినది. భారతమాతృ హృదయం పరాభవాగ్ని వల్ల దహించుకుని పోతున్నది. ప్రతీకారం ప్రతీకారం ఇదే ఆమె మహదాశయం. ఈ అంతిమ పోరాటంలో అందరూ పాల్గొనండి. మీ గుండె నెత్తురులు తర్పణచెయ్యండి. మీ విధ్యుక్త ధర్మాన్ని నెరవేర్చండి.
(ప్రచండ జయధ్వానం. లోపల్నించి దుకాణాదారూ, వెనక అమ్మాయీ గుమాస్తా వొస్తారు. అందరూ విడివిడిగా నిలబడి ఉంటారు. అందరూ ఉపన్యాసం వినవచ్చే దిక్కునే చూస్తుంటారు.)
అమ్మాయి : (చంద్రంతో) ఏవండీ, ఆయన వెళ్లారా?
చంద్రం : (ఉలిక్కిపడి) ఎవరాయన?
అమ్మాయి : లాంతరు పుచ్చుకున్నాయన.
చంద్రం : (నవ్వుతూ) లాంతరు పగలగొట్టుకుని చీకట్లోకి వెళిపోయాడు. వచ్చేదాకా నమ్మకం లేదు.
అమ్మాయి : (తలవొంచుకుని) మా తమ్ముణ్ణి తీసుకువెళ్లారు.
చంద్రం : ఇప్పుడే వస్తానన్నాడు. మీరు వెళ్లండి. మీ యింటికి పొమ్మంటానులెండి. మీ పేరు ...?
అమ్మాయి : అనూరాధ ...
ఉపన్యాసం : ఈ పవిత్రమైన మహోద్యమంలో ధైర్యవంతులు కావాలి. స్వార్థరహితులు కావాలి. మన ఆశయం సిద్ధించేంత వరకూ వెనుకంజవెయ్యరాదు. కోటానుకోట్ల పేదప్రజల రక్తం త్రాగి దురహంకారంతో దౌర్జన్యంతో మనపై పెత్తనం చెలాయించే శత్రువును తుదముట్టించాలి. ఇదే మన ఆఖరిపోరాటం. చావో బతుకో –
(*జయధ్వానం. తదనంతరం విపరీతంగా కలకలం. జనఘోష.*)
పక్కమనిషి : మెరపకాయలు కొనటం మరిచిపోయాను. ఇంటికి పోతే రభస అయిపోతుంది.
మరోమనిషి : బాగా జ్ఞాపకం చేశారు. ఇంట్లో బియ్యం లేవు. మీ గొడవలో పడి మతి పోగొట్టుకున్నాను. (దుకాణాదారుతో) ఏవండీ – ఎక్కడనన్నా కాసిని బియ్యం దొరుకుతయేమో – చూసిపెట్టండి.
దుకాణాదారు : దుకాణాలు మూసెయ్యమనేదీ మీరే – అవీయివీ కావాలని పీక్కుతినేదీ మీరే. దుకాణాలకి తోడు నోళ్లకీ తాళాలు వేయించండి. దేశంకోసం ఒక పూట ఉపవాసం చెయ్యలేరూ?

పక్కమనిషి : ఇంత ఉపన్యాసం దేనికయ్యా – ధర్మానికి చేస్తున్నావా వ్యాపారం?
దుకాణదారు : (కోపం తెచ్చుకొని) ధర్మానిక్కాక? మీకు బంట్రోతులనుకున్నారా? మీ అవసరం మీది. కావలిస్తే కొనుక్కుంటారు. లేకపోతే మానేస్తారు. మాకేం పోయింది.
చంద్రం : ఊరుకోవయ్యా – వెధవగొడవ.
దుకాణదారు : (మరింతకోపంతో) నువ్వే ఊరుకో – మీ గొడవతోనే మేం చస్తున్నాం.
చంద్రం : చచ్చిపో!
దుకాణదారు : నువ్వే చచ్చిపో – దేశాన్ని ఉద్ధరిస్తావుగా. (అనూరాధతో) అమ్మాయిగారూ, మీరు వెళిపొండి. అబ్బాయిని పంపిస్తాను.
అనూరాధ : ఫరవాలేదులెండి. వాడు వచ్చిన తరవాతనే పోతాను.
పక్కమనిషి : ఈ గొడవల్లో మీరెందుకమ్మా – యింటికి పొండి.
మరోమనిషి : కాస్త బియ్యం సంగతి చూడవయ్యా, పుణ్యం ఉంటుంది.
*(దూరంగా గోల. కేకలు – మధ్య మధ్య జయధ్వానాలు.)*
ఉపన్యాసం : ధైర్యంతో నిలబడండి. దౌర్జన్యాన్ని యెదుర్కొనండి. భారతదేశం గౌరవం నిలపండి.
*(మళ్లీ విపరీతంగా కలకలం. లాఠీదెబ్బల చప్పుడు. హాహాకారాలు జయధ్వానాలు.)*
మరోమనిషి : ఏడవండోయ్ శ్రుతిమించిపోయింది.
పక్కమనిషి : మనం యిక్కణ్ణే ఉంటం క్షేమకరంగాదు. తొందరగా దారి తొలగుతేనే మంచిదిలా తోస్తోంది.
అనూరాధ : ఆయన ఏదయిపోయినారో.
చంద్రం : చివరిదాకా చూద్దాం. ఇక్కణ్ణే అంతు తేలాలి.
దుకాణదారు : మేం పోతాంగాని నువ్వు చూసుకురా. (అనూరాధతో) అమ్మాయిగారూ పదండి – కావలిస్తే కారు మళ్లీ పంపిద్దురుగాని.
అనురాధ : మా తమ్ముణ్ని తీసుకుపోకుండా నేనెలా పోనండీ. వాడు వస్తేనే గాని మా నాన్న భోంచెయ్యరు.
*(జనం తోసుకొస్తుంటారు. కొందరు దారీతెన్నూ లేకుండా పారిపోతుంటారు. అందులో కొంతమందికి లాఠీ దెబ్బలవల్ల నెత్తురు కారుతోంది. జయధ్వానాలు వినవస్తునే ఉంటయి.)*
దుకాణదారు : ఇంకేముంది కొంపమునిగింది. తొందరగా తప్పుకుందాం పదండి.
చంద్రం : ఎన్నాళ్లయ్యా నువ్వు తప్పించుకు తిరగటం? అయిపోయింది. అయిపోయిందయ్యా సర్వనాశనం.
*(శివం కుర్రాణ్ణి యెత్తుకుని వస్తాడు. శివం వొళ్లంతా నెత్తురు. కుర్రాడు స్పృహతప్పి ఉన్నాడు. దూరంగా మెలిమెల్లిగా సద్దు అణిగిపోతోంది.)*
చంద్రం : (తత్తరపాటుతో) శివం!
పక్కమనిషి : అరె!
*(అందరూ వెనక్కి తగ్గుతారు. అనూరాధ వ్యాకులపాటుతో వెళ్లి కుర్రాణ్ని అందుకుంటుంది. శివం ఖిన్నవదనంతో కూలబడతాడు.)*

అనూరాధ : (ఏడుస్తూ) తమ్ముడూ –
చంద్రం : (శివంతో) ఏంరా, ఏం జరిగింది. (కుర్రాణ్ణి చూస్తూ) ఎవరన్నా డాక్టరున్నాడేమో చూడండి. తీసుకుపోదాం.
శివం : దారిని పోతూంటే మమ్మల్ని లాఠీ చార్జి చేశారు. కుర్రాడు వద్దన్నందుకు తెగ కొట్టారు.
పక్కమనిషి : అయినా రోజులు మంచివికావు.
దుకాణాదారు : (అనురాధతో) విచారపడకండమ్మా, నాన్నగారికి కబురుచేస్తాను.
చంద్రం : (ఆవేశంతో) నేనంటూనే ఉన్నాను. ఆఖరిదశయిదే. ఏ పాపం యెరగని కుర్రాడి రక్తాన్ని చూసిన రాజ్యం యెన్నాళ్లుంటుంది? దీనితో ఆఖరు. ప్రతీ మనిషి గుండెలోనూ ప్రతీకారమే ధ్వనిస్తోంది.
శివం : (అనురాధతో) అపరాధం నాది. తీరని బాధ కలిగించాను. మీరు నన్ను క్షమించరు. నాలోని ఆవేశాన్నీ, స్వాతంత్ర్యం మీది మమకారాన్నీ అణిచిపెట్టుకోలేకపోయాను. అందుకు ఫలితంగా యీ పసికందు నెత్తురు ధారపోశాడు.
*(అనూరాధ యేడుస్తూంటుంది.)*
అనూరాధ : మాయింటికి జేర్చి పుణ్యం కట్టుకోండి. మా నాన్నకి గుండె చెరువై పోతుంది.
*(జనంతోసుకొస్తారు. మళ్లీ కలకలం. మధ్యమధ్య జయధ్వానాలు వింటాము.)*
దుకాణాదారు : ఎంత తొందరగా యిక్కణ్నించి మనం వెళ్లిపోతే అంతమంచిది. రా అమ్మా, అబ్బాయిని రంగడెత్తుకుంటాడు. అటుపోయి బండెక్కుదాము.
*(జనం వెనకాల పోలీసులు వస్తారు.)*
అనూరాధ : (లేచినిలబడి) వచ్చారు. యమకింకరులు ...
*(పోలీసులు దగ్గరికొస్తారు.)*
అనూరాధ : ఛీ, పొండి. మీ కన్నా పశువులు నయం. ఏ పాపం యెరగని మా అబ్బాయి ప్రాణాలు తీద్దామనుకున్నారు. ఎన్నాళ్లు చెయ్యదలచుకున్నారిలాగ?
*(పోలీసుల్లో ఒకడు యీలవేస్తాడు. లారీ హారన్ వినబడుతుంది.)*
అతను : (అనురాధతో) మిమ్మల్ని అరెస్టు చేశాం. పదండి.
శివం : (ఆవేశంతో) ఎందుకు? ఆవిడేం చేసింది? మీ నిరంకుశత్వాన్ని యెదిరించింది నేను! మీ సర్వనాశనాన్ని కోరేది నేను! నన్ను పట్టుకుపొండి.
*(చంద్రం శివం భుజమ్మీద చెయ్యివేసి వెనక్కి లాగుతున్నాడు.)*
అతను : నిన్నుకూడా తీసుకుపోతాంలే – తొందరపడక.
నోరుమాత్రం కట్టుకో.
*(శివం చేతులు పట్టుకొని పోలీసులు వెళిపోతారు.)*
అనూరాధ : అన్యాయం! అన్యాయం! అపరాధం నాది. *(లోపల మళ్లీ కలకలం. చంద్రం కూడా కలకలం వినవచ్చే వేపుకు పోతాడు. 'శివం! శివం!!' అని అరుస్తూంటాడు. పోలీసు వస్తాడు.)*
పోలీసు : (దుకాణాదారుడితో) ఈ దుకాణం యెవరిది?
దుకాణాదారు : నాదే.

పోలీసు : (గట్టిగా) ఎందుకు మూశావు? చెప్పు.

దుకాణాదారు : (వణుకుతూ) మా యింట్లో ఆ–ఆడ–వాళ్లకి బాగులేదండి.

పోలీసు : (గద్దిస్తూ) తెరు – ఇవాళ దుకాణాలు మూయరాదు.

(దుకాణం తలుపులు మెల్లిగా తెరుస్తాడు. పోలీసు లోపలికి దుకాణాదారు వెనకనే నిలబడతాడు.)

పోలీసు : (చుట్టవెలిగించి) గ్రాంఫోను పెట్టు – రోజూ పెట్టడంలా పెట్టూ · (రికార్డుపాట)

(అనూరాధ కుర్రాణ్ణి యెత్తుకుని నిలబడుతుంది. పక్కమనిషి తీసుకు వెళతాడు లోపలికి.)

## 2

(శివం యిల్లు

ముందు వరండా.సాయంకాలం.

శివం తండ్రి నులకమంచం మీద పడుకుని ఉంటాడు. శివం తండ్రిపేరు శరభయ్యగారు. వృద్ధుడు. లేవలేని స్థితిలో ఉంటాడు. మధ్యమధ్య దగ్గుతూ ఉంటాడు.

ఆ మంచానికి ముందుగా బల్లమీద యిద్దరు పెద్ద మనుషులు కూర్చునుంటారు. అందులో ఒకాయన పక్కయింటాయన, వయస్సు యాభయిదాటి ఉంటయి. రాగాలు తీస్తూ మాటాడుతూంటాడు. రెండో ఆయన దూరపు బంధువు. ముప్పయి యేళ్ల వయస్సులో ఉంటాడు.

వీధిలో చప్పుడయినప్పుడల్లా శివం తండ్రి లేచి కూచోవాలని ప్రయత్నిస్తాడు. పెద్దమనుషులిద్దరూ వారిస్తూంటారు.

మధ్యమధ్య లోపల్నించి స్త్రీకంఠం వింటాము. శివం తండ్రి మాటలకి ప్రత్యుత్తరంగా వినబడుతుంది. చంద్రం వస్తాడు. చప్పుడు విని శివం తండ్రి మంచమ్మీదినించి లేవటానికి ప్రయత్నిస్తాడు.)

శరభయ్య : వచ్చాడా తండ్రి ...

పక్క యింటాయన: లేదు లేదు. పడుకోండి, చంద్రంగారొచ్చారు.

శరభయ్య : ఎప్పుడొస్తాడు? ... ఆ వచ్చిందెవరు?

చంద్రం : నేనండీ ... శివం వస్తున్నాడు.

పక్క యింటాయన:మీరు ముందుగా వచ్చేశారేం? మీరంతా కలిసి వస్తారని కాచుకూచున్నాం.

చంద్రం : కలిసిరావలసిందే ... స్నేహితులు రానిచ్చారు కాదు. ఇంకో అయిదారు నిమిషాల్లో వచ్చేస్తాడులెండి.

(అసంపూర్ణం)



# వాన్యా

[చెహొవ్ నాటకానికి అనుసరణ;

*రచనాకాలం – 1948 ప్రాంతంలో అయి ఉంటుంది]*

మాణిక్యం : *(గ్లాసులో టీ పోసి)* కాస్త పుచ్చుకో నాయనా!

కిరీటి : (నిర్లక్ష్యంగా గ్లాసు తీసుకుని) టీ సయించేట్టు లేదు.

మాణిక్యం : కొంచెం పాలు తెచ్చియివ్వనా?

కిరీటి : వొద్దు ఇవాళ తెగ వుక్క పోస్తున్నది.

*(కాసేపు ఆగి)* మాణిక్యం! ఎన్నాళ్లనించి మనిద్దరికీ పరిచయం?

మాణిక్యం : (ఆలోచిస్తూ) ఎన్నాళ్లనుంచా? దేవుడు మేలు చేస్తే ... యీ ప్రాంతాలకు నువ్వొచ్చింది .... ఎప్పుడూ? అప్పటికి సుందరమ్మ బతికే ఉంది. ఆవిడ మరి రెండేళ్లకి చచ్చిపోతుందనగా మమ్మల్ని చూట్టానికొచ్చావు... అంటే పదకొండేళ్లన్నమాట...(ఒక క్షణం ఆలోచించి) ఇంకా చూస్తే ఆపై మాటే!

కిరీటి : అప్పటికీ యిప్పటికీ నాలో యేదన్నా మార్పుందా?

మాణిక్యం : బాగా. అప్పుడంటే నవనవలాడుతుండేవాడివి. ఇప్పుడు బాగా యెదిగావు. మనిషిలో అప్పటి నాజూకు కూడా పోయింది. కొంచెం నల్లపడితివాయిరి.

కిరీటి : అవును ... పదేళ్లలో మరో మనిషిగా తేలాను. ఎందువల్ల నంటావు? పనెక్కువయి పోయింది విపరీతంగా. పొద్దుట్నుంచి నిలబడ్డ మనిషిని నిలబడి వుంటమే. ఒక క్షణం తీరికుండదు. ఏ పాపిష్ఠి రోగో వొచ్చి మీద పడతాడేమో నన్న భయంతో రాత్రిళ్లు పడక! ఇన్నాళ్ల నుంచి నన్ను నువ్వెరుగుదువు కద, ఒక్కనాడయినా తీరిక లేకపోయె. అవును మరి పెద్ద వాడిలా కనిపిస్తాను. అసలు ఆ రకం బతుకే అటువంటిది. పరమనీచం. ఆ వృత్తి యెవర్నయినా సరే తన పొట్టపెట్టుకుంటుంది. వాడి చుట్టూ విచిత్రదయిన మనుషులు పోగవుతారు. రెండు మూడేళ్లు వాళ్ల మధ్య ఉండేసరికి వీడుకూడా తనకి తెలీకుండానే విచిత్రంగా తయారవుతాడు. అది తప్పదు. (మీసం మెలివేస్తూ) ఇష్! ఎంతపెద్ద మీసం పెంచాను! చూసేవాళ్లకి మహా అసహ్యంగా ఉండి ఉండాలి. నేను కూడా విచిత్రంగా తయారయాను. అయితే దేవుడి దయవల్ల మతిచెడిపోలేదు. మెదడు మాత్రం యథాస్థానం లోనే ఉంది కాని బతుకు బండబారిపోయింది. ఈ లోకంలో నాక్కావలసింది లేదు; లెక్కచెయ్యదగ్గదీ లేదు. ఆప్తులూలేరు. నువ్వంటే మాత్రం నాకభిమానం. నా చిన్నతనంలో నీలాటి దాది ఒకతె ఉండేది.

మాణిక్యం : తింటానికి యేదన్నా తెమ్మంటావా?

కిరీటి : వొద్దు. కిందటి సంవత్సరం జయపురం వెళ్లాను. ఆ వూళ్లో ఓ పెద్ద అంటువ్యాధి బయలుదేరింది, మలేరియా. ప్రతీ కొంపలో ఒక డజను మంచాలు! ఊరంతా పాడుకంపు. మురికి.

ఆ రోజా రోజంతా ఒక్క నిమిషం కూర్చోలేదు. ఒక్క మెతుకు భోజనం లేదు. పోనీ యింటికి పోతే అక్కడా కాస్త తీరిక చిక్కనివ్వరే! ఎవరో ఒక ఆఫీసు బంట్రోతునితీసుకొచ్చారు. ఆపరేషన్ చెయ్యాలని బల్లమీద పడుకోబెట్టి క్లోరోఫారం యిచ్చానో లేదో గుటుక్కుమన్నాడు. వాళ్లు లేనంతసేపూ నా మనస్సులో పెద్ద బాధ లేస్తుంది., యేదో పని పెట్టుకుని వాణ్ణి చంపేశానని. కళ్లు మూనుక్కూర్చుని అనుకున్నాను: యెవరికయితే మనం సౌఖ్యం కలగజెయ్యాలని తాపత్రయపడుతుంటామో, వాళ్లు మనం పోయినతరవాత ఒక్క మంచి మాటయినా మన్ని గురించి అనుకుంటారా? .... కాని వాళ్లలా అనుకోరు.

**మాణిక్యం :** మనుష్యులయితే మరిచి పోతారు కాని దేవుడు జ్ఞాపకం వుంచుకుంటాడు.

**కిరీటి :** ఎంతబాగా చెప్పావమ్మా?

*(సారథి ప్రవేశం. ఇంట్లోంచి వస్తాడు. భోంచేసిం తరవాత నిద్దరతీసిన మొహం. వచ్చి రాతితిన్నె మీద కూర్చుంటాడు. చొక్కా సర్దుకుంటాడు జాగర్తగా)*

**సారధి :** అవును. నిజం.

**కిరీటి :** మంచినిద్దర తీశావా?

**సారథి :** అవును -- మంచినిద్ర. మేష్టరుగారూ ఆయన భార్యా వచ్చిం తరవాత మన సంగతి కిందా మీదూ అయింది. వేళగాని వేళ నిద్రపోవటం. భోజనం దగ్గిర నానా గడ్డీ తింటం. ఉన్న ఆరోగ్యం కాస్తా ఊడ్చుకు పెట్టుకుపోయేట్టున్నది. ఇది వరకంటే క్షణం తీరికుండేదికాదు. సరోజా నేనూ దర్జాగా కలిసి పని చేసేవాళ్లం. ఇప్పుడు సరోజ ఒక్కర్తె పని చేసుకుంటున్నది. మనం తింటం నిద్ర పోవటంతో సరిపోతున్నది.

**మాణిక్యం :** *(తలాడిస్తూ)* బహు చిత్రంగా ఉంది! మేష్టరుగారు పన్నెండుగంటలకి నిద్రనుంచి లేస్తారు. అప్పటిదాకా కాఫీనీళ్లు సలసలకాగుతూనే ఉంటయి. వారు రాకపూర్వం మనం మధ్యాహ్నం భోంచేసే వాళ్ళం. ఇప్పుడు పొద్దు గూకాలి. రాత్రల్లా వారు చదువుతూంటారు. రాస్తూంటారు. రెండు గంటలకేవో పెద్ద కేకేస్తారు – ఎందుకోతెలుసా? టీ కోసం! ఇంటిల్లిపాదీ యీయన టీకోసం నిద్రలు మానేసి లేచి కూర్చోవాలి. ఎలా గుందో చూశారా?

**కిరీటి :** ఇక్కడవారు చాలాకాలం ఉంటారా?

**సారథి :** ఓ శతాబ్దం! ఇక్కడే స్థిరంగా ఉంటానికి నిశ్చయిం చేనుకున్నారు.

**మాణిక్యం :** ఈ సంగతి చూడండి. టీ తీసుకొచ్చి రెండు గంటలయింది. వారేవో షికారు పోయారు.

**సారథి. :** వస్తున్నారు... వస్తున్నారు లే! గాభారాపడక.

*(కంఠస్వరాలు వినవస్తయి. తోటలో దూరం నుంచి పురుషోత్తం, సరోజ, నిర్మల అవధాన్లు తిరిగి వస్తుంటారు.)*

**పురుషోత్తం :** ఎంతబాగున్నదండీ ఆవేపు! ఇంత చక్కని ప్రదేశం నేను చూడలేదు.

**అవధాన్లు :** ఇహచెప్పారు కారు. మరేదనాలో తోచటంలేదు.

**సరోజ :** తోటలోకి రేపు తప్పకుండా వెడదాండండి నాన్నగారూ! అవునా?

సారథి : టీ చల్లారిపోతున్నది. పుచ్చుకోండి.
పురుషోత్తం : కొంచెం యేఁవీ అనుకోకుండా గదిలోకి పంపిస్తే సంతోషిస్తాను. బోలెడంత పనుంది.
సరోజ : తోటలోపలికిపోతే మరీ బాగుంటుంది.
*(పురుషోత్తం, నిర్మల, సరోజ, యింట్లోకి వెళిపోతారు. అవధాన్లు మాణిక్యం పక్కనే కూర్చుంటాడు).*

సారథి : ఇవాళ యింత వుక్కపెడుతూంటే మన పండితరాయలు శాలవ కప్పుకున్నాడు!
కిరీటి : దాన్ని బట్టి చూస్తే ఆయన తన విషయంలో యెంత శ్రద్ధ తీసుకుంటున్నదీ తెలుస్తుంది.
సారథి : ఆవిడ యెంతబాగుంది! ఏఁవి సౌందర్యం! ఇంత అందకత్తెను నేనెక్కడా చూడలేదు.
అవధాన్లు : ఆ పొలాల మధ్యకూచున్నా, ఈ తోటల్లో కాళ్ళేపు నడిచినా యెంతో హాయిగా ఉంటుంది నాకు. చక్కని గాలి. పక్షులు పాడుతున్నాయి. ప్రశాంతంగా సంతోషంగా మనం జీవిస్తున్నాం. ఇంతకంటె యెక్కువ యెవరిక్కావాలి? *(టీ గ్లాసు తీసుకుంటూ)* నువ్వు వెయ్యేళ్లు బతకాలమ్మా!
సారథి : *(స్వాప్నికావస్థలో)* ఆవిడకళ్ళు! ఎటువంటి మనోహరరూపం!
కిరీటి : ఏదన్నా సంగతులు చెప్పవోయ్?
సారథి : ఏం చెప్పమంటావు?
కిరీటి : కొత్త విషయాలేంలేవా?
సారథి : ఆఁ అన్నీ పాతవే. నేనిదివరకెలా ఉన్నానో యిప్పుడూ అలానే ఉన్నాను; కాస్త బద్ధకం అబ్బింది కాని, ఏదో నాలో సణుక్కుంటుంటాను. మా అమ్మ మాత్రం యింకావిడాకుల విషయమై ఆలోచిస్తున్నది. రేపో మాపో కాటిక్కాళ్లు జారెయ్యబోతూ యీ లోకం మరామత్తు కోసం పుస్తకాలు తిరగేస్తున్నది.
కిరీటి : మరి మేష్టారో?
సారథి : ఆయనా? తనగదిలో కూర్చుని రాత్రల్లా రాసుకుంటూంటారు. తలబద్దలు చేసుకుంటూ రాత్రింబవళ్లూ అదే పనిగా రాస్తావా, మన్ని గురించి చెప్పుకునే ముండాకొడుకు ఒహడూ కనిపించడు. ఈ శ్రమవ్యర్థం! శుబ్భరంగా స్వీయచరిత్ర రాసుకుంటే బాగుణ్ను. ఎంత చక్కని గ్రంథమవుతుంది! రిటయర్రైన పాతకాలపు నాటి మనిషి. తెగ చదివాడు. కీళ్లవాతంతో, మలేరియా జ్వరంతో, పరాయివాడంటే కిట్టకపోవడంతో వొళ్లు హూనం చేసుకున్నాడు. మొదటి భార్య ఆస్తి మీద జీవనం! తనకది యిష్టం లేదు. ఎందుకూ? పట్నవాసానికి శక్తి లేక! తన దురదృష్టాన్ని రకరకాలుగా వెళ్లబోసుకుంటాడు. అసలు రహస్యం తనంత అదృష్టవంతుడు లేనే లేడు. *(లొట్టుపాటులో)* కొంచెం ఆలోచించండి. ఏదో పేదరికంలో పుట్టి, మెల్లిగా ఓ పెద్ద కాలేజీలో ఆచార్య పీఠం కొట్టేశాడు. భయభక్తులతో యీనచుట్టూ వేలకొలదీ తిరిగే వాళ్లుండడం! ఓ చిన్న జమీందారు కల్లుడై నాడు. అదో గొప్ప విశేషం కాదనుకోండి; అయినా చూడండి. లలితకళల మీద పాతికేళ్లనుంచీ ఉపన్యాసాలు దంచుతున్నాడు; తెగరాస్తున్నాడు -- అసలాకళలంటే తనకేవీ తెలియకపోయినా. ఇతరులు రాసిపోయిన ఉద్గ్రంథాలు తిరగేసి వాళ్ల సిద్ధాంతాల మీద యీ పాతికేళ్లనుంచీ తన రాద్ధాంతం! కాస్త తెలిసిన వాళ్లు వీటి నెప్పుడో చూసేసి ఉంటారు. తెలివితక్కువ వెధవలసలా జోలికేపోరు. అలాంటప్పుడు పాతికేళ్లనుంచీ వాటి మీదలెక్కెర్లెందుకూ,

రాతలెందుకూ? శుద్ధ దండుగ! దీనికితోడుఓ దబాయింపు! నటన! రి...ుదయాడా, ఒఖ్ఖ ముండాకొడుగ్గూడా యూన్నెరగడు! అజ్ఞాతమ్మనిషి! ఈ పాతికేళ్లనించీ యూన చేసిన మహత్కార్యమేవిటయ్యా, నిజంగా పనికొచ్చే మరొహణ్ణి యెందుకూ కొరగాకుండా చెయ్యడం. ఇహ ఆయన్ని చూద్దుమా ఒహ అవతారపురుషుడిలా అఘోరిస్తాడు.

**కిరీటి :** నీకాయనంటే కిట్టనట్టుంది వ్యవహారం!

**పారధి :** తప్పక. ఇంట్లో ఆడవాళ్ల దగ్గర యూనకున్నపలుకుబడి –చెప్పతరంగాదు. ఈన మొదటిభార్య – మాఅక్కయ్య – ఎంత బాగుండేది! ఎంత అణకువ, ఎంత వినయం! మర్యాదకి మర్యాదా – ఈన దగ్గిర యెంతమంది కుర్రాళ్లు చదువుకున్నారో అంతకన్నా పదిరెట్లుకుర్రాళ్లు దాన్ని పెళ్లాడాలని తంటాలు పడ్డారు. ఎంతో నిర్మల హృదయంతో దేవకన్యలా యూన్ని ప్రేమించింది. మా అమ్మకి యూనంటే భక్తివిశ్వాసాలు. ఈన రెండో భార్య ఉందా అండీ – యిప్పుడే చూశారుగా – తన యవ్వనాన్నీ, అందాన్నీ, చదువూ అన్నీ త్యాగం చేసి వృద్ధాప్యంలో వున్న యూన్ని పెళ్లి చేసుకుంది. ఎందుకండీ యిదంతా? ఎందుకూ?

**కిరీటి :** భర్తగారంటే ఆవిడకు అనురాగంవా?

**పారధి :** ఆనందం లేని అనురాగం.

**కిరీటి :** అదేవిటి?

**పారధి :** మొదట్నుంచీ ఆ అనురాగం అబద్ధం. దాంట్లో యెంతయినా నీతి ఉందేమో కాని అర్థంలేదు. ముదుసలి మొగుడంటే పడక అతణ్ని మోసగించడం అవినీతికరం! కాని తన యవ్వనాన్ని వ్యర్థం చేసుకుని వాపోతూండడం నీతిసమ్మతం !

**అవధాన్లు :** *(గాద్గదికంగా)* పారధీ! నువ్విలా మాట్టాడడం నేను భరించలేకుండా ఉన్నాను. చెబుతున్నాను విను; ఎవరైనా సరే, భర్తకు గానీ, భార్యకు గానీ ద్రోహం చేసిరా, వాళ్లంత ద్రోహులు మరి ఉండరు.

**పారధి :** *(విసుగులో)* ఊరుకోయిహ – అంతటితో కట్టిపెట్టు.

**అవధాన్లు :** ఇటువినాలి. నాకు హోదా తక్కువని మా ఆవిడ యింకొహడితో లేచిపోయింది. కాని నేను మాత్రం ఆడినమాట తప్పలేదు. ఈ నాటి దాకా అదంటే నాకభిమానం పోలేదు. వీలుచిక్కినప్పుడల్లా దానికి సహాయం చేస్తునే ఉన్నాను. దాని పిల్లల చదువుకోసం ఉన్నదంతా యిచ్చేశాను. నాకా సుఖం అన్నదిపోయింది. ధీమామాత్రం మిగిలింది. దానికా యవ్వనం కాస్తా యెగిరిపోయింది. దాంతో పాటు ఆ అందమూ ఆరిపోయింది. కట్టుకున్న మొగుడా చచ్చాడు... అదేం మాటకట్టుకుందంటావు?

*(సరోజ, నిర్మల వచ్చికూర్చుంటారు. లక్ష్మీబాయమ్మ ఓ లావుపాటి పుస్తకం పుచ్చుకుని వచ్చి కూర్చుంటుంది. టీ యిస్తారు. ఆ వంక చూడకుండా తాగేస్తుంది.)*

**సరోజ :** దాదీ! ఎవళ్లో రైతు లొచ్చారు. వాళ్లతో మాటాడిరా. టీ సంగతి నేను చూస్తాను. *(మాణిక్యం వెళిపోయింది. నిర్మల టీ పుచ్చుకుని కూర్చుంటుంది.)*

**కిరీటి :** *(నిర్మలతో)* మీ ఆయన్ని చూట్టానికొచ్చాను. ఆయనకి చాలా హెచ్చుగా ఉందని రాశావు. తీరా వొస్తే నిక్షేపంలా ఉన్నట్లు కనపడుతున్నాడు.

నిర్మల : నిన్న రాత్రి చాలా యిదిగా ఉన్నారు. వొళ్లన్నీ నొప్పులని బాధపడ్డారు. ఇవాళ కొంచెం నయంగా ఉంది.

కిరీటి: కొంపలు కూలిపోతున్నట్టుగా పరిగెత్తుకొచ్చాను. సరే – అక్కడ – ఇది మొదటిసారి కాదనుకో. రేపల్లా ఉండి చూసిపోతాను.

సరోజ : భేష్! మీరిక్కడ రాత్రిళ్లు ఉంటం అరుదు. మీరింకా భోంచెయ్యలేదుకదూ!

కిరీటి : ఇంకాలేదు .

సరోజ : అలా అయితే మాతో కలిసి భోంచేద్దురుగాని. ఇంకోగంటలో వంటయిపోతుంది. (*టీ తాగి*) అరె! చల్లారిపోయింది!

అవధాన్లు : అంటే– టీలో వేడి రానురాను తగ్గిపోతుంది.

నిర్మల : ఏం మునిగిపోలేదు. పంతులుగారూ! మనం చల్లారిందే తాగుదాం.

అవధాన్లు: నాపేరదిగాదు. నా వ్యవహారాలను బట్టి నన్ను హనుమాన్లనీ అంటారు. నాపేరు అవధాన్లు. మీ ఆయన్ని బాగా యెరుగుదును. ప్రస్తుతం తమ ఆస్తి మీద జీవనం. తమకు బుద్ధి మరుపు లేకుండా ఉంటే నేను రోజూ అందరితో కలిసి భోంచెయ్యటం గమనించే ఉంటారు.

సరోజ : ఆయన మనకు చాలా కావలసిన వారు. (*ఆదరంతో*) ఇంకో కప్పు టీ యివ్వనాండీ!

లక్ష్మి బాయమ్మ : అరరె !.....

సరోజ : ఏమిటమ్మమ్మా!

లక్ష్మిబాయమ్మ : అబ్బాయితో చెప్పటం మరిచిపోయినాను. మతిమరుపొస్తున్నది. కొత్త పుస్తకం వొకటి వచ్చిందని చెన్నపట్నం నుంచి ఉత్తరం రాశారు.

కిరీటి : అది గొప్ప పుస్తకమా?

లక్ష్మిబాయమ్మ : ఓ మోస్తరు. వెనక తను చెప్పినవన్నీ యిప్పుడు కాదంటాడు. చిత్రం!

కిరీటి : ఏదంత చిత్రమయిన విషయంకాదు గాని నువ్వు టీ తాగు.

లక్ష్మిబాయమ్మ : నేను మాటాడుతున్నానా?

సారధి: గత యాభయి సంవత్సరాల్నుంచీ మాటాడుతునే ఉన్నాం. పుస్తకాలు తిరగేస్తునే ఉన్నాం. ఇహ యింతటితో ఆపొచ్చు.

లక్ష్మిబాయమ్మ : నేను మాటాడినప్పుడల్లా నువ్వలా చిటపటలాడ్డం యెందుకో నాకర్థం కావటంలేదు. ఇలా అంటున్నానని యేమీ అనుకోకు, కాని యీ రెండేళ్లల్లో నువ్వెంత మారిపోయావు! నీతి నియమాలతో నడిచేవాడివి! చక్కని ఉద్దేశాలుండేవి.

సారధి : అవునవును. మాంఛి ఉద్దేశాలే ఉండేవి. (*క్షణసేపు ఆగి*) ... చాలా చక్కని ఉద్దేశాలు! ఇంతకన్న మరి అవమానకరంగా నా గురించి మాటాడి ఉండవు. ప్రస్తుతం నాకు నలభై యేళ్లు దాటినై. కిందటేడాది దాకా నీలాగే నేనూ పుస్తకాలు చదివేవాణ్ణి ప్రపంచాన్ని మరిచిపోవటానికి అదే మంచి మార్గమనుకున్నాను. ఇప్పుడో! ఇంతకాలం వ్యర్థం చేసుకున్నాననే కోపంతో, బాధతో రాత్రిళ్లు నిద్రపట్టదు. ఇంతవయస్సు మీరిం తరవాత ఆశలన్నీ అడుగంటిపోక యేంచేస్తయి?

సరోజ : మావయ్యా! వింటుంటే తల నొప్పి వొస్తున్నది.

లక్ష్మిబాయమ్మ : (*సారధితో*)నీ వెనకటి నియమాల్ని గురించి విచారిస్తున్నట్టున్నావు. దాంట్లో

తప్పేంలేదు. తప్పంతా నీలో ఉంది. ఒఖ్ఖ నియమాల్తో లాభం ఉండదు. వాటిని సరిగా అనుసరించవలసి ఉంటుంది.

**పారధి :** అనుసరించటమా? మీ పండితరాయిల్లాగా ప్రతీ మనిషీ అదే పనిగా రాస్తుండలేడు.

**లక్ష్మిబాయమ్మ :** ఈ వ్యవహారం నా కర్థం గావడంలేదు.

**సరోజ :** *(జాలిగా)* ఊరుకో అమ్మమ్మా! మాదయ్యా! ఇటుచూడు.

**పారధి :** ఇహ నోరుమూసుకుంటాను. నోరు మూసుకుని క్షమార్పణ కోరుకుంటాను. *(కాస్సేపు నిశ్శబ్దం).*

**నిర్మల :** ఇవాళ హాయిగా ఉంది. అట్టే యెండలేదు..

**పారధి :** ఆత్మహత్య చేసుకోవటానికి మాత్రం యివాళ అద్భుతంగా ఉంది.

*(అవధాన్లు పాడతాడు. మాణిక్యం పచారు చేస్తుంటుంది. మధ్య మధ్య కుక్కపిల్లని పిలుస్తుంటుంది)*

**సరోజ :** దాదీ! రైతు లెందుకొచ్చారు?

**మాణిక్యం :** ఏదుందీ? పాతకథే! ఆ చవిటి నేలకోసం వచ్చారు. ఛ్ ! ఛ్!

**సరోజ :** దేన్ని పిలుస్తున్నావు?

**మాణిక్యం :** జానీ మేక వెనకాల పడ్డది పిలుస్తున్నాను. (వెళిపోతుంది)

(అవధాన్లు ఒక చక్కని పాట పాడతాడు. అంతా నిశ్శబ్దంగా వింటారు. పనివాడు ప్రవేశిస్తాడు)

**పనివాడు :** డాకిటేరున్నాడా. ఆరికోసం – యెవుళ్లో వొచ్చినారు.

**కిరీటి :** *(విసుగులో)* సరే మంచిది వెడుతున్నాను. (టోపీకోసం వెతుక్కొంటాడు) ఛీ, వెధవ జాతకం!

**సరోజ :** అవును. ఇది సమయం వాళ్లకి. భోజనానికి తప్పకుండారండి.

**[అసంపూర్ణం]**





# FUTURE OF THEATRE IN INDIA

*[written during 1962?]*

Modern Indian drama has been a haphazard growth during the last six or seven decades. Its roots do not stretch back into the distant past associated with Bharata, Bhasa and Kalidasa. Long centuries of alien invasions and social upheavals have succeeded in obliterating any living contact with our ancient traditions. The present day drama and theatrical practice is a legacy bestowed on us by some of the early European settlers who for their own entertainment enacted in improvised theatres certain old fashioned comedies with sets and costumes in the worst Victorian taste. It was only as a result of this impact that enlightened movements for building up a modern tradition in theatre and drama started functioning. Vishnupant Bhave of Bombay, Girishchandra Ghosh from Bengal and Krishnamachari from Madras-all of them accomplished writers and skilled producers and actors may be said to have laid the foundation of a renaissance in modern Indian drama.

But the great awakening heralded in the West by playwrights like Ibsen, Chekhov, Strindberg and artists of the theatre like Stainslawski, Meierhold and Craig, did not exert any lasting or even significant influence on the Indian theatre. Although Indian playwrights, in later days, visited the great centres of Western drama abroad and came into contact with its authentic forms they have not been able to bring about any radical change in the outlook of the play-goer or producer in India. The reason for this is not any lack of sincerity in the pioneering efforts of our playwrights, but the great distance that separates the theatre in India today from a coherent community which is ultimately the only support that can keep it alive.

We should remember that the theatre all over the world was created out of an inherent human need. It has nothing in common with the machanised forms of entertainment that have come into vogue in recent times. These forms do not pre-suppose a human need. They have not come into existence as a result of an insistent human demand. They merely provide some means of filling up a social vacuum in the complex pattern of modern community living. This was not the case with the theatre that grew out of a deep rooted desire on the part of a social community for some kind of healthful and fruitful corporate physical activity. Some of these spontaneous activities must have by efflux of time crystallized in an ordered ritual partly mime and

partly speech. Occasions like the harvest, the arrival of the rains, births and marriages in the community provided opportunities for the spontaneous expression of the social need in play and mime. These corporate physical activities which in course of time achieved an orderly form of play were born out of a passionate desire on the part of a well knit community for self-expression. We can safely conclude from this that even in modern times theatre can only flourish if it has some vital relationship with a community of men and women actuated by a deep desire to live and strive together for the achievement of a common objective. In the absence of a social reference of this kind it is not possible for a theatre to sustain itself and satisfy a vital need of the community, which it must seek to represent.

The earliest form of this communal self-expression is what is known as the folk play. A close study of this literary form has not so far been made in most of the modern Indian languages. This cannot be studied in isolation as a mere literary manifestation. Study of ethnology and anthropology in this regard is necessary for the light they can throw on folk ways and behaviour in various linguistic regions of this country. The folk-play has to be re-constructed from snatches of dialogue that are to be found in some of the old folk songs that have come down to us from the distant past. In addition to this the customs and folk-lore of compact tribal communities that are still holding together must be studied and their speech and play norms recorded before it is too late. This is a kind of work in which not only the lovers of theatre but also those social philosophers skilled in analysing complicated human behaviour must cooperate. The artist of the theatre is interested in recording folk-behaviour and folk-speech in their purity so that he may hold the mirror up to nature in the theatrical representations he is constantly contriving. It is in his interest that he should join hands with workers in the specialized fields of sociology and extract from their labours all that is conducive to the enrichment of his own special field of activity.

Unfortunately the writers and artists in this country have been working in isolation without a proper appreication of the great challenge that faced them. It is not merely a question of composing a stage-worthy play full of incident and animated talk and finding a suitable place to present it. The new dramatic compositions have all the appearance of their authentic counter-parts in the West but have failed to impress our play-goers to the extent it was expected. It was because the plays so composed were out of time with the great mass of people for whom they were intended. Out society is split up into a number of insignificant fractions separating one small group from another as a result of illiteracy, backwardness and an amazing disparity between the rich and the poor. The community of play-goers that generally visit a theatre of serious drama are not actuated even broadly by a common outlook. We have read that

during the great periods of drama in the West there existed great audiences too. The best of the Elizebethan or the Periclean drama could not have existed without a community of play-goers of great understanding and culture.

The many attempts that have been made today to improve the standards of acting and the building up of stage scenery and lighting and training our artists in the latest methods of voice control are necessary and should help in the general advancement of play technique and production in this country. But a real awakening in the field of drama and the theatre can only come in response to a deep desire on the part of a great healthy and literate community. Today we find such compact communities in the various educational and scientific institutions, in rural areas where vast numbers of the peasant community are engaged in agricultural enterprises and among the great industrial organisations that are coming up in various parts of the country. The changes in the culture patterns of these communities should be thoroughly studied by writers aspiring to create an authentic drama reflecting the life around.

The theatre plays hardly any part in the daily life of the overwhelming majority of the Indian people. This alone will explain the present anaemic condition of the theatre in our country. There is evidence of youthful enthusiasm for a creative up surge in drama all over the country. There is also proof of some patronage by the State for the development of theatre. In both the cases, there seems to be lack of direction either in the matter of resuscitating our own tradition or raising a national theatre commensurate with our own climate and spirit. Above all, the prevailing confusion in the minds of writers and actors and even the rulers regarding the relative values of the stage and the cinema is also responsible for arresting the growth of a genuine popular theatre in our country. For whatever little that is left in our theatrical tradition, it has been completely supplanted by the movie. A movie can never be equated with the theatre. The living actor provides the stage with an enormous advantage in audience creation over the more mechanised stimuli of the motion picture. There may be occasional good pictures, but the predominant use of mechanical instrumentation usually tends to a craft rather than to artistic excellence and the deeper satisfaction of the theatre. The crying need of the day is to create a play that would draw the public and make them respond to theatrical reflection of social consciousness. The relative values of the stage and the cinema can then be assessed and the theatre can be restored to its rightful place in the life of the nation. Until that time, the future of the theatre in India will continue to be dismal and disappointing.

# కథాకావ్యానికి వ్యూహరచన

*[ఈ వ్యూహరచన జైల్లో ఉండగా నోట్‌బుక్‌లో రాసుకున్నది.]*

1

చదువుకున్నవాడు. సంస్కారి.
ప్రపంచంతో నిమిత్తం లేకుండా తన ఉదరపోషణం చేసుకునేవాడు.
అరెస్ట్ చేశారు.
సబ్‌జెయిలు-తొలిసారిగా స్వేచ్ఛకు ప్రతిబంధకాలను చూశాడు.
వొదిలారు.
ప్రపంచం మారి పోయినట్లు భావించాడు.

2

మళ్లీ అరెస్టు చేశారు.
ఈసారి శిక్ష.
అభియోగం రాజకీయం. ప్రభుత్వాన్ని కూలదోసేందుకు ప్రయత్నించాడనీ-
తన లోపల విపరీతమయిన మనశ్చాంచల్యం-పరివర్తనం.
రాజకీయాలు అసలర్థం కాలేదు. చదవాలనీ, నేర్చుకోవాలనీ విశ్వప్రయత్నం. తన భవిష్యత్తంతా అంధకారావృతంగా కనిపిస్తోంది.

3

వొదిలేశారు. ఉద్యోగం దొరకలేదు. పెళ్లికి పిల్ల నిచ్చారుకాదెవరూ. అంచాత సంఘమ్మీదా, సంఘాన్ని కాపాడే ప్రభుత్వం మీదా ద్వేషం పెంచుకున్నాడు.

కులం చెడిన అమ్మాయిని పెళ్లి చేసుకున్నాడు. నిత్యమూ రేపటి సంగతే పెద్దబాధ అయికూచుంది.

వొళ్లుమండి పోయింది. ఇరవై నాలుగ్గంటలూ తన దేశాన్ని తిట్టుకుంటూండే వాడు. పిచ్చిగా మాటాడేవాడు.

ఎక్కడో ఒక చోట ఒక పెద్ద నాయకుణ్ని హత్య చేశారు.
హత్యాభియోగంలో యితణ్నీ యిరికించారు.

4

అరెస్టు
తీర్పు. ఉరిశిక్ష వేశారు.
ముందు భార్యతో మాటలు.

• • •

## 'CHERAKALAM'

*[Selected poems translated by the Author]*

A canto of cataclysm this universe
Wet of the tortured soul is the verse
Vain is your grief, blessed are we
Let us celebrate the great catastrophe

The drain that stinks in the lane
Gains of our gamble are stored threin
We cannot roll into a kit
So many men's tears for a profit.

Life is fettered; to know is to suffer
Man is free within the prison

• • •

The blue sky of yester year
Where's it now, mother?
The cool breeze of yester year
Doesn't blow now, mother!

Caged in the blue shadow
Of the dark wings of the bird of Time
I stand before the weeping eyes
of the midnight, mother!

The bracelets of Death
Sound with a bang, mother
I shivered in the presence
Of the final gloom.

In a life of dreams,
Castles in air have melted away.
Let me search for light
With eyes hollow, mother.

• • •

The blood that craved for freedom
has bled awhite, mother
I am the defeated
Adieu! mother!

Whose fault is it, mother
If I resist rancour
Who's crime is it, mother
If the world is out of its gear?

• • •

Put out the light
for our doomsday is today.
Put out the light
for today is our journey's end;

Let the biting winter's wind
break your spine,
but do not listen
to its word;

Our hollow eyes
Cannot look at light,
do not reveal the soul
even if you are hanged;

Behold! Look for mines
beyond the dark
for the hidden treasure
of life's secrets!

Creation has no death,
Be not dismayed.
It cuts short of our sight
A veil of wilderness
is dropped before us;
And our path is then lost.

This is endless;
Probe into the ends of dark:
It is a minaret lit by
multi-coloured lights;
And that's the danger.
Ask the living:
Life is a rosy land
of doubts.

Now is the time for the
hangman's ropes.
Sob and suffer and sob
In suffering, in the throat,
there is the secret of our being:
Sob and suffer and sob.

Here, in the game of life
Rules are violated
We should not die
The death of deception.

At last, a new universe
shall be created
And a new life
Shall blossom, it is not a bluff.

Now, they will hang
us by rope unto death
Weep, suffer and weep
In suffering and in the weeping voice
Life has its hidden secret.

*[Poems collected from the Author's rough notes.]*

### [THE BALLAD OF THE BASTARD]

An affair ago
The stake of somebody's mistake
whirling me into this world
Pawning me to the present.

In streets strange
And amidst voices alien
Here in the dark
Lone and forsaken
As I comb the the night's womb
The echo is heard
In the gutters far away.

In the lecherous lap
Of memories lost
Half awake half asleep
Once I dared to question
The very validity of life.

It was, once, true
I had a woman
Who damned her dimensions
In beds that breed tigers
in the eunach eye
Wintering her spurious warmth
While her Lethean thirst
Leads her bawdy load
Of bruised desires
and banished fires
In quest of carnal recreation.

Lit were then
Candles of scandal
Revealing ruffled raptures ruptured
And as the grinding wind
Wends its way through the dark
singing in sonorous monotone
The ballad of the bastard-
Her naked name baked.

The skin that senses
The fevers running through flesh,
Neither knows the unknown
Nor is aware of the infinite.
It is next to the kin
Of the restless bone
That burns all alone.

The wheel of blood
That drills the wound of love
And reels around the vast past
Of animal instinct
Enchained by the speed of the seed-
ling
Is the first resort
Of man's justification.

2

Time is when I quiver
Into a burning desire
For all that I cannot own
in the corner of crippled goals
In this tavern of tears.

As I look at the stellar code,
As carnivorous breezes caress

My volcanic brow
I am certain this is not the end
But only the start of the certain.

When trees decay and waters dry
It is the sinning sky that's silent
While my destitute dust
under the feet
spreads a mute invitation
For my prodigal return.

Yet I suspect
Beyond the present wonder
Would blood me the basis
For the parasites of God?

My doubt, then, weaves a web,
In which tangled I exclaim:
"Let us not rest in quest
Or raise a shelter.
The Times are shifting sands
The Times are awful bad.
Let us just meet and depart
Carrying our individual aches
Into the special night."

In hope I yet grope
For light to reveal
The manner of the myth,
Of my being and becoming
Of my zeal for the final deal
Of my lust for all that's crushed.

What avail if your spirit really lives
Wafted into some nook of space
Blind, dumb, neither warm nor cold
What means such an existence
Beyond a word hidden
with-in a meaning
Even the things we remember
By keeping alive what
death has taken
Your words look acts of love
All done while the body stood
sheltering
the Soul's thin flame!

Between dying and death
Secret and its revelation
There lay the lingering breath
Caged in a frail frame
On an April early hours

*

This morning
I was awakened
As arrows of your tears
struck the silent breasts
Of the Earth;
A moment later
You came naked and beautiful
Touched my blood
with wings of water.
While lured by
Your lewd leaden
I loved and craved
For a morning with you
And I did not know
That in your foot steps
Death's virgin secrecy
Is revealed.

*

A moment mirrored
In the horror of my being
Is a lavish wish
The bright nightmare
Of an inconclusive affair
So past, so premature,
Nurtured in its fractured bosom
For the present, I hold.

To you my love
This signatured broken heart
I offer; and sing you a song
In declines and dead lives

As the Pegasus of my posthumous
passion
Leaps like petulant Peceadillo
That is neither returned
Nor rejected.

To you my love
To night I offer
................................

Every home has a hole
Every dame has a name
Every corner its crack
Every beast its feast
I of all the awake
Am the one with the oblivion.

This, my love
A token of my agony
Ancient, green, clean
I offer you
Not as a measure
Of my passion or a memento
Of a certain tailored feeling
Or dough of my desperate bidding
In the vein-glorious rough rustle
Of our red unison.

Bemoan, O moon,
I the eye of the dark
Beseech you
For a silent solicitude
In your heart
For I am dying
An ethical death
under the vicarious shadow
Of days not to come
In this valley of noon.

Of my lone long walks
In the lanes of yester loves
unveiling the rhymes
Flowing thro' my veins
Conversing in silence
With winds that grind my thoughts
You know,
And you remember
Bemoan, O moon,
The stare of stars
Torturing my winged eye
Annotates their agony
Ancient, green and grown
Aluring my ailing years
Against rising rivers
Of my singular attempt
To rape the shape of the eternal

Yet this city
of trimmed manners, of tailored feel-
ings
Is in a well tailored trance.

If there is any merit,
bless me with a word of encourage-
ment
if it is not worth the trouble
You take reading them, you will
pardon me.
A line from you is all that I
lavishly solicit.

* * *

## THE INCOMING

The clock
glows in your bosom
The second
breeds terrors in your veins
Rage of pain ransacks the red
of your lips
And I am here for you dear fear
Playing on lyre soft notes
of my own funeral pyre.

Choose then between rain and ruin
Where seed sprouts and blood crawls
We cannot alter the becoming

And the eye's faltering.

Before the rush of flood
and the gush of blood
Let me raise my shelter of doom
And I will light it with
the broomstick of my passion

Where peace is measured
by pace of whirlwind's voice
And where the end is treasured.

Crazy winds of winter
clap in horror
The choice is one way
While the breath battles for another
spot
And the dreams of dust beat
the retreat
Drowning in the midwater
Said she to the child
Whose infant teeth
pierced thro' her nipple
And whose life lasted earlier:
'It's dual and painful
this death, son!
Life is sweeter in sweat
and dirt or lavender.
Alive we are diverse
traversing in trouble
Dead we are all one
and ever,
It is true I could not feed you
Since I was raped by my own flesh
It's true you had a voice
that was beautiful
And no words could bring your
hunger nearer to me.

And our death is in fulfilment
of the Socialist pattern, son!

*

At the north end of the dark
The man weighed forty stones
He clung hard to a strand
And could not cry aloud
For he swallowed three tons
of water.

And in his death,
Was seen a practical joke
How man could croak.

* * *

Close the doors
Raise the windows
Look down upon the lane
Not from the balcony
But from your bed-room.

* * *

*[Poems collected from the Author's rough notes]*



# ఆధునిక కవిత్వం – ఒక విశ్లేషణ

[*రచనాకాలం – 1956*]

ఆధునిక కవిత్వం కేవలం సమకాలీన కవిత్వం కాదు. కవితలో ఆధునికత కర్థం అనేక రూపాల్లో ఉంటుంది. ఒక ప్రత్యేక పద్ధతిలో వ్రాయటంకానీ, ఒక ప్రత్యేక వస్తువును వాడుకోవటం కానీ; పాత ఛందోమార్గాలను పరిత్యజించటం కానీ, ఛందస్సులో విశృంఖల విహారంగానీ; లేదా నూతన ఛందస్సునుసృష్టించటమో, ప్రాచీన ఛందస్సులను నూతన మార్గంలో నడిపించటమో – ప్రతీవారి మనస్సులో ఆధునికత అంటే యేమిటో యేదో విధంగా ఒక నిర్వచనం, ఒక సిద్ధాంతం, ఒక నిర్ణయం యీపాటికి సిద్ధించే ఉంటుంది.

గురజాడ అప్పారావు వ్యవహారిక భాషలో ముత్యాలసరాలు వ్రాశారు కనక, ఆయన కవితలో ఆధునికతస్ఫురిస్తుంది. అవతల రాయప్రోలు సుబ్బారావు సాంప్రదాయిక ఛందస్సునేయెక్కువగా ఉపయోగించటం జరిగింది. అబ్బూరి రామకృష్ణారావు భుజంగప్రయాతం వంటి ప్రాచీన ఛందస్సులనే వాటి లక్షణాలను అధిగమించి వాడటం తెలుసును. ఆధునికత అంటే కేవలం యీనాడు బహుళ ప్రచారంలో ఉన్నదని కానీ, బహు జనాంగీకృత మైనదని కానీ కాదు.

నేటి ఆధునికత – ఒక లక్ష్యంగా – రేపు పురాతనం అయిపోయే అవకాశం లేకపోలేదు. నేటి కవిత్వం – నిజం చెప్పాలంటే 1920 నాటి కవిత్వం కన్న యేమంత ఆధునికం కాదు. 1956 సంవత్సరం లోని మనం, 1900 నాటి కవితా విప్లవాన్ని మించి యేమీ సాధించలేనిమాట వాస్తవం.

ఆధునిక కవితా పరిణామంలో మూడు దశలుః మొదటిది : ఛందస్సులో విప్లవం. రెండోది : ఆధునిక వస్తువును కవిత్వంలోకి ప్రవేశపెట్టటం. మూడోది : ఆధునిక కవిత్వంలో అంతర్గతమై ఉన్న అనుభవాల పట్ల ఆధునిక హృదయ స్పందనాన్ని పెంపొందించటం–

ముందు సాంప్రదాయిక ఛందస్సులను ఉల్లంఘించటంతో ఆదునికత ప్రారంభమయింది. ఆ తరవాత, ఛందస్సులో నూతన పద్ధతులను కనుగొనడం, ప్రాసలో, గమకంలో విభిన్నరీతులను ప్రయోగించటం జరిగింది. కవిత్వంలో వచ్చే పరివర్తనం, సామాజిక పరివర్తనాన్ని బట్టి ఉంటుంది. పాత ఛందస్సుల్ని పరిత్యజించటంలో అంతరార్థం, సమకాలీన జీవితంలో లభ్యమయ్యే ష ్యను కవిత్వ బద్ధం చేసేందుకు ఆ ఛందస్సులు అనుకూలించవు. ఆధునిక పరిస్థితులకు అనుకూలంగా ఉండేందుకు నూతన ఛందోమార్గాలను అన్వేషించటం, వాటి ఃధిక్యతను పెంపొందించటం జరుగుతుంది.

గురజాడ అప్పారావు ఆధునిక విప్లవంలో మహనీయమైన దృష్టాంతం. సాంప్రదాయికంగా హైందవ సమాజంలో అంతర్భాగమైన తెలుగు జాతి అంతరాంతరంగా అనుభవిస్తున్న ఆవేదనలను, అవరోధాలనూ అవగతం చేసుకుని కవిత్వంలో ప్రతిపాదించారు. ఆయన లేవనెత్తిన భాషా విప్లవం భారతదేశంలో రానున్న స్వాతంత్ర్యసమరానికి చిహ్నం. తెలుక్కి స్వయంగా కవితా రీతి ఉండ వలెననే ఆకాంక్ష ఆయన చేసిన ప్రయోగాల్లో వ్యక్తమవుతుంది.

లక్షణంలోనూ, భాషా ప్రయోగంలోనూ ఆయన తెచ్చిన పరివర్తనం అపురూపమైనది. అయితే ఆయన గీతాల్లో కవితా సంపత్తి యెక్కువగా ఉందని చెప్పలేము. వస్తువు మాత్రం సమకాలీన సమాజంగాప్రతిబింబించినా, ఆయన కవిత అమోఘమన్నజాలం.

# శ్రీ శ్రీ యుగం

*[రచనాకాలం – 1969]*

శ్రీ శ్రీ పట్ల నాకున్న పక్షపాతం జగద్విదితం. అంచాత అతన్ని గురించి నేనేం రాసినా ప్రస్తుత సాహితీ వాతావరణంలో అంత సమంజసంగా కనిపించదు. అదీకాక శ్రీ శ్రీ మన కత్యంత సమకాలికుడూ సన్నిహితుడూను. తెలుగు సాహిత్యంలో అతని స్థానాన్ని నిర్ణయించటానికి యిప్పుడప్పుడే వీలుపడదు.

ఇరవయి అయిదేళ్ల క్రితం మదరాసు నగరంలో ఒకరోజు, నేనూ, బెల్లంకొండరామదాసూ తిరువళిక్కేణి సముద్రతీరాన నడుస్తున్నాము. అతనికి కవిత్వం మీద అట్టే విశ్వాసం ఉండేది కాదు. తెలుగు సాహిత్యం గురించి చర్చిస్తున్నాము. నన్నడిగాడు: శ్రీ శ్రీ రచన యెన్నాళ్లపాటు నిలుస్తుందని– నేను జవాబివ్వకపూర్వమే అతనే 'మనం బతికున్నంతకాలం' అని సమాధానం చెప్పాడు.

ఇరవయి అయిదేళ్ల తరవాత తెలుగుకవిత పరిణామాన్ని తిలకిస్తుంటే ఆ రోజున రామదాసు అన్నమాటల్లో యెంత నిజం ఉందో నాకే ఆశ్చర్యం వేస్తుంది. ఇదే అభిప్రాయాన్ని ఆ తరవాత యెన్నాళ్లకో యెంతో విచారంతో బాలగంగాధర తిలక్ నా ముందు వెలిబుచ్చాడు.

శ్రీ శ్రీ యే పరిస్థితుల్లో తెలుగు కవితా క్షేత్రంలో అడుగుపెట్టాడో, యే మార్గాన్ని అవలంబించాడో, యే ఆదర్శాన్ని అన్వేషించాడో, అతన్ని గాఢంగా అభిమానించే సన్మాన కోవిదులకు తెలియదు. ఇప్పుడిప్పుడుద్భవించే తరానికి శ్రీ శ్రీ కి పూర్వం ప్రచారంలో ఉన్న సాహిత్యంతో కాని, కనీసం శ్రీ శ్రీ సాహిత్యంతో కాని సంపర్కంలేదు– నిజం చెప్పాలంటే శ్రీ శ్రీని భజించేవారికీ అతని కవిత్వానికీ యేమాత్రం బాంధవ్యం లేదు. శ్రీ శ్రీకి ప్రస్తుతం జరుగుతున్న అపచారం అదే.

ఇలాంటి అపచారానికి ఫలితంగా తెలుగుదేశాన ప్రభవించిన 'వచనకవిత' ను పరిశీలిస్తే ప్రస్తుత కవితా పరిస్థితి విశదమవుతుంది– శ్రీ శ్రీ అవతరణవల్ల సాహితీ ప్రియులలో రేకెత్తిన ఆశ యెంతవరకు ఫలప్రదమయిందో తెలుస్తుంది.

'సిరిసిరిమువ్వ' శతకానికి పరిచయం రాయమని శ్రీ శ్రీ కోరితే ఓ డజను కందాలు మా నాన్నగారు చెప్పారు – శతక ప్రచురణ ఆలస్యం కావటంలో ఆ కందాల కాగితాన్ని శ్రీ శ్రీ పారేసుకున్నాడు. ఓ కందం నాకిప్పటికీ గుర్తు. ●

---

*["ఈ గుర్తు '●' ఉన్నచోటకాగితం చింపేసి ఉంది. నాలుగు చరణాలపద్యమూ, మరొకవాక్యమూరాయడానికి చాలినంత జాగా చింపేసిన బాగంలో ఉంది. బహుశా ఉదాహరించిన అబ్బూరి రామకృష్ణారావుగారి పద్యం – సిరిసిరిమువ్వ శతకానికి ఇంట్రోగా–*

*'అబ్బూరి సంస్మరణ' సంపుటంలోని వ్యాసంలో శ్రీ కె.వి. రమణారెడ్డి గారు ఉదహరించిన పద్యమై ఉండవచ్చు.*

*"అతి వాస్తవికాగ్రేసరు*
*లతులిత శబ్దప్రయోజనాతీతులు పం*
*డితభీరులు అగుకొందరు*
*మతిచెడి విహరించుచుండ్రు మహిలో శ్రీ శ్రీ".*

*డా. గోపాలకృష్ణ అబ్బూరి]*

కవులుగా వ్యవహరిద్దామనుకున్న వారందరూ తమ అజ్ఞానాన్నీ పద్యాలల్లటంలో తమ చాతకానితనాన్నీ కప్పిపుచ్చుకోవటానికి పాండిత్యాన్ని ద్వేషించేవారు. ప్రాచీన కవిత్వం అంటే అసహ్యించుకునే వారు. ఛందస్సంటే యీసడించుకునే వారు– 'భావకవిత్వ' మంటే యేహ్యభావంతో చూసేవాళ్లు – రానురాను రాజకీయాల ప్రాబల్యంతో కవిత్వం జనస్వామ్యబద్ధ మయిపోయింది వీరందరికీ– తెలుగుభాష అంటే అభిమానం కానీ, భాషమీద అధికారం కానీ లేని వాళ్లంతా కవితా క్షేత్రంలో వ్యవసాయానికి దిగారు. ఇలాంటి కవితా ధోరణిని శ్రీ శ్రీ యుగంగా కొందరు చిత్తశుద్ధితోనే భావిస్తున్నారు. ఇంతకన్న శ్రీరంగం శ్రీనివాసరావుకు అవమానకరమయిన విషయము మరొకటుండదు.

శ్రీ శ్రీ ప్రాబల్యం అతనురాసే రోజుల్లోనే ముప్ఫయ్యేళ్ల క్రితం కొంతమంది రచయితల మీద ప్రసరించటమూ వారూ కొన్ని చిరకాల యోగ్యమయిన ప్రయోగాలు చెయ్యడమూ జరిగింది. ఆ తరవాత అందులో చాలామంది నిజమయిన కాల్పనిక కవితా ప్రయోగానికి సమకాలీన సంస్కార వాతావరణంలో ఆస్కారం లేదనుకున్నారో యేమో రచనా వ్యాసంగం నుంచి తప్పించుకోవటమో, తప్పించుకోకపోయినా, రాసింది ప్రకటించకపోవటమో జరిగింది. వారితో శ్రీ శ్రీ 'యుగం' అంతరించింది.



# శ్రీ శ్రీ

*[రచనాకాలం : 1990]*

మరో పదేళ్లల్లో యీ శతాబ్దం అయిపోతుంది. ఆ తరవాత యీ శతాబ్దంలో తెలుగుసాహిత్యంలో యేదన్నా విశిష్టత కానీ విభిన్నత కానీ ఉందేమో విశ్లేషించటం ప్రారంభమవుతుంది. ఆ విశ్లేషణలో తెలుగు సాహిత్యంలో 1910 సంవత్సరం ప్రముఖంగా కనిపిస్తుంది. ఆ సంవత్సరంలో గురజాడ, రాయప్రోలు, అబ్బూరి ఒక నవ్యపథ నిర్దేశకులయారు. అలాగే మరో పాతికేళ్లకు 1934-35 శ్రీరంగం శ్రీనివాసరావుతెలుగు సాహిత్యంలో - కవిత్వంలో మరో మార్గం అనుసరించి మార్గదర్శకుడయాడు. శ్రీనివాసరావు చదువుకున్న వాడు. సంస్కారి. తెలుగు భాషమీద అమోఘమయిన అధికారాన్ని సంపాయించినవాడు. ఛందస్సు మీద అద్భుతమయిన అధికారాన్ని సంపాయించిన వాడు. విచిత్రమైన భావశబలతకలవాడు. భావకవిత్వం పేరుతో ప్రచారం పొందిన కవిత్వం పాతికేళ్లకన్నా బతకలేకపోయింది. ఎంచాతనంటే ప్రతిభావంతులయిన కవులు లేకపోవటంచాత. అలాగే శ్రీనివాసరావు నిర్దేశించిన మార్గాన అనుసరించేవారూ ఏ కొద్దిమందో తప్ప ప్రతిభావంతులు కాకపోవటం చాత శ్రీనివాసరావు మార్కు కవిత్వమూ ఓ పాతికేళ్లే బతికిందని విజ్ఞులకు తెలుసు. ఆ తరవాత వచ్చిన కవిత్వానికి గురజాడా బాధ్యుడుకాదూ, శ్రీనివాసరావూ కాదూ. యవరి మానాన వారు రాసుకొంటున్నారు. రాసే ప్రతికవీ మార్గదర్శకుడే, యుగ్గకర్తే, ద్రష్టే. మహాప్రస్థానం తరవాత మంచి పద్యం మళ్లీ రాయలేకపోయాడు శ్రీ శ్రీ. రాయాలని తపన వుండేది. నాకు తెలుసు - మా సాహిత్య సంసారం ఇరవయ్యేళ్ల సంసారం. ఆ తరవాత చివరిదాకా సన్నిహితులం. మదరాసులో తండ్రి రమణయ్య మేష్టారు పరమపదించినప్పుడు శ్రీనివాసరావు పడిన మనోవేదన అంతా యింతాకాదు. నాకు తెలుసు. ప్రపంచంలో తనకు అన్నీ ఆయనే! అప్పుడు ఒక అర్ధరాత్రి దుఃఖంలో సదసత్సంశయం అని రాయటం ప్రారంభించాడు. మొదటి యెనిమిది పద్యాలనూ మర్నాడు నాకు వినిపించాడు. ఒక అద్భుత కావ్యంగారాస్తానన్నాడు. నిజం. ఆ పద్యాలు విన్న తరవాత తెలుగు సాహిత్యంలో ఒక్క శ్రీనివాసరావే నన్నయాదుల తరవాత చిరంజీవి అనుకున్నాను. అతననుకున్నట్టుగా ఆ కావ్యం సాగలేదు. కారణాలు చెప్పటం అనవసరం. అదే మన దౌర్భాగ్యం.

అతను రాసిన విదూషకుడి ఆత్మహత్య అనే పద్యం స్వీయకథకు మకుటాయమానం అనుకుంటాను.

ఏదయినా శ్రీ శ్రీ మార్గదర్శకుడు. వైతాళికుడు.

## వరదోక్తులు

'ఆవిష్కర్మ'–ఈ మధ్య ప్రతి రచయితా తన పుస్తకానికి ఆవిష్కరణ మహోత్సవం, సభాముఖంగా జరిపించుకోవడం ఆనవాయితీ అయింది. ఎవరిదో పుస్తకాన్ని ఆవిష్కరించమని ఆయన్ని కోరినప్పుడు, "ఇది ఆవిష్కరణ కాదు–'ఆవిష్కర్మ' అని చమత్కరించారు!

'శబ్దరత్నాకరం' – న్యూఢిల్లీలో వరద రాజేశ్వరరావుగారు చాలాకాలం పాటు నివసించిన ఇల్లు '15 పూసారోడ్' ప్రధానమార్గం పక్కన ఉండేది. ఆ మార్గాన నిరంతరం పోయే వాహనాలు చేసే శబ్దాల వల్ల ఒక్క క్షణం నిశ్శబ్దంగా ఉండేది కాదు. అయినా అది ఆయనకు చాలా నచ్చిన ఇల్లు. దానికి ఆయన ముద్దుగా 'శబ్దరత్నాకరం' అని పేరు పెట్టారు.

'దోయాతీన్ బస్'–విరివిగా కవితలు రాసే వారి గురించి ఉద్దేశిస్తూ 'కవిత్వానికి కూడా 'దోయాతీన్ బస్' అనే రూలు ప్రవేశపెట్టాలని చమత్కరించారు.

'అప్నా ఉచ్చవ్'– దూరదర్శన్ నేషనల్ నెట్ వర్క్‌లో 'అప్నాఉత్సవ్ కార్యక్రమాన్ని చూపిస్తున్న రోజుల్లో ఎవరైనా 'బాత్ రూమ్' కి వెళ్లినప్పుడల్లా 'అప్నాఉచ్చవ్'కి వెళ్లారని వ్యాఖ్యానించేవారు!

'దేవుడిగోచీ'–'ఉదయం సపరివార పత్రిక'లో కొన్ని వారాలపాటు 'బాపు'గారి భాగవతం చిత్రాలు వచ్చాయి–వారానికొకటి చొప్పున. వాటిని నేను వరసగా పొడుగ్గా ఒక బట్ట మీద అతికించి, చిత్రాలు ఒక దాని మీద ఒకటి వచ్చేటట్టు మడతలు పెట్టి ఒక రిబ్బనుతో కట్టకట్టాను. ఎవరికైనా చూపించవలసి వచ్చినప్పుడు కట్టవిప్పితే కృష్ణలీలలన్నీ వరసగా పొడుగ్గా పరుచుకునేవి. దాన్ని చూసి, దానికి "దేవుడిగోచీ' అని పేరు పెట్టారు!

గుర్ఖా–మూర్ఖా–ఆయన చీటికీ మాటికీ తన స్నేహితులతో కలిసి బయట తిరగడానికి వెడుతూ నన్ను 'తలుపేసుకో' అనేవారు వెళ్లేటప్పుడు. ఓ రోజున నాకు ఒళ్ళుమండి, "నేను ఇంట్లో 'గూర్ఖా'లా పడి ఉండాలా?" అన్నాను. ఆయన నవ్వి, "నేను 'ముర్ఖా'లా బయటకి పోవడం లేదా?" అన్నారు!

'నీసువాసన'– ఓసారి మా అన్నయ్య కూతురు వచ్చింది మా ఇంటికి హాస్టల్ నుంచి. నేను దానితో కూర్చుని మాట్లాడుతున్నాను. ఆయన లోపలి నుంచి అక్కడకి వస్తూనే "ఏమిటే నీసువాసన వేస్తోంది?" అన్నారు మొహం అదోలాపెట్టి. మేమిద్దరం ఇటూ అటూ వాసన పీల్చి చూశాం. ఏమీ అనిపించలేదు. "మీకెక్కడ నుంచి వేస్తోంది మావయ్యగారూ"? అంది మా అన్నయ్య కూతురు. "నువ్వు 'నీస్'వి కదుటే, నువ్వు రాగానే 'నీసువాసన' వెయ్యదూ?" అన్నారు నవ్వుతూ.

'సావనీరు...'– మరో మేనకోడలు–మాఆడపడుచు కూతురు నృత్య ప్రదర్శనకి చేస్తున్న ఏర్పాట్లలో 'సావనీర్' ప్రచురించటం ఆలస్యం అయింది. చీటికీ మాటికీ మా ఆడబడుచూ వాళ్లూ 'సావనీర్' ఎంత వరకు వచ్చిందో అడుగుతూంటే విసుక్కుంటూ "వీళ్లు నన్ను సావనీరు, బతకనీరు' అన్నారు!

'అక్కడా క్రేక్సే'- మాఆఖరి ఆడబడుచు భర్త ఎటామిక్ పవర్ ప్రాజెక్ట్‌లో పనిచేసేవాడు పెళ్ళయిన కొత్తలో. ఆ ప్రాజెక్ట్ గురించి మాట్లాడుతూ, వాళ్ల కన్‌స్ట్రక్షన్ లోపల 'క్రేక్స్'(బీటలు) వచ్చాయనీ, ఇది రాబోయే పార్లమెంట్ సమావేశంలో చర్చనీయాంశం కావచ్చుననీ, "కొందరు సభ్యులు...."అంటూ ఆందోళనకరంగా చెబుతూంటే, "మరేం భయంలేదు, అక్కడా క్రేక్సే!" అన్నారాయన!

'వెర్రిపబ్లిక్ డే'- న్యూఢిల్లీలో 'రిపబ్లిక్ డే పెరేడ్' చూడటానికి అంత చలిలోనూ జనం వేలంవెర్రిగా వెళ్లడం, గంటల తరబడి పేవ్‌మెంట్లమీద పడిగాపులు పడి ఉండటం చూసి 'ఇది వెర్రి పబ్లిక్ డే' అనేవారు!

'చారుశీల'- ఏ గృహిణి అయినా 'చారు' రుచిగా చేస్తే 'చారుశీల' అనిబిరుదిచ్చేవారు.

'లడ్డూ వెంకటేశ్వర'- తిరుపతిలో లడ్డూల కోసం క్యూలో నిలబడటం, లడ్డూల కోసం ఎగబడటం, లడ్డూల ఖరీదు అంతకంతకి పెరిగిపోవడం చూసి "ఈయన్ని లార్డ్ వెంకటేశ్వరా కాదు, లడ్డూ వెంకటేశ్వరా అనాలి' అన్నారు!

'సతీ డొక్కుబాయి'- పెళ్లయిన కొత్తలో జబ్బు చేసి బాగా చిక్కిపోయాను. నన్ను చూసి 'సతీ డొక్కుబాయి' అని వ్యాఖ్యానించేవారు.

'వెంకటరంగయ్యగారిలా'- గృహస్థుడయాక, ఇంటికి 'నేమ్‌ప్లేట్' తయారు చెయ్యడానికి ఆర్డరిచ్చారు. అక్షరాలు ఇంగ్లీషులో రాసి ఇచ్చారు. ఆయన చెప్పిన బోర్డ్ సైజులో ఆయన పేరు సరిపోక, అక్షరాల్ని సన్నగా పొడుగ్గా చేసి ఎలాగో సరిపెట్టి పట్టుకొచ్చాడు బోర్డు చేసినతను. ఆ అక్షరాల్ని చూడగానే "ఇవి మామిడి పూడి వెంకటరంగయ్యగారిలా ఉన్నాయి! అని వ్యాఖ్యానించారు! (ఆయన వాళ్ల గురువుగారే).

'కలరా'- న్యూస్ పేపర్లలో కలర్ ప్రింటింగ్ ప్రవేశ పెట్టిన కొత్తలో కొన్నిసార్లు రంగులు ముట్టుకుంటే అంటుకునేలా చవకబారుగా 'గాడీ'గా కనిపించేవి. అవి చూసి "ఈ రోజుల్లో పేపర్లు ముట్టుకుంటే 'కలరా' వచ్చేట్టుంది! అన్నారు.

'అగ్లీగా....'- నేను చేసిన ఒక బొమ్మని ఆయనకి చూపించి 'ఏమండీ, 'అగ్లీ'గా ఉందా?' అని అడిగాను-లేదులే, ఫరవాలేదు అంటారని ఆశిస్తూ. "అగ్లీగా ఉన్నవాళ్లు మాత్రం లోకంలో లేరుటే!" అన్నారు తాపీగా.

'ఓ, దోమాస్!'- దోమలు కుడుతూంటే 'ఓడొమాస్' రాసుకోమని సలహా ఇస్తే, 'వాటిని 'ఓ, దోమాస్!' అని పిలుస్తూంటే కుట్టకుండా ఉంటాయా'అన్నారు!

'కేపిటల్ దాసులు'- మార్క్సిస్టులమని చెప్పుకునే కొందరు ధనికవర్గం వారినీ, 'దాస్‌కేపిటల్'ని చీటికీ మాటికీ ఉదహరించేవారినీ 'కేపిటల్ దాసులని' చమత్కరించేవారు.

'పద్మదూషణ్'-ఎప్పుడూ ఎవరినో ఒకరిని తీవ్రంగా విమర్శించడం అలవాటున్న ఒక మిత్రుడికి "పద్మదూషణ్" అని బిరుదిచ్చారు!

'శ్రీనాయ్‌రేకులు'-మా రెండవ మరిది శ్రీనాథ్ పెళ్లి జరుగుతూంటే పెద్దవాన మొదలై, వాన చప్పుడుకి పెళ్లిమంత్రాలు వినిపించడం లేదు. "హాలు పైన సీనా రేకులు వెయ్యడం మూలాన్ని మరీ చప్పుడవుతోంది" అన్నారు ఎవరో. వెంటనే ఈయన 'సీనా రేకులు

కాదు, 'శ్రీనాయ్' రేకులు! అన్నారు-తమ్ముడి పేరు ఇరికించి.

'హమ్‌క్యామేహై'-ఎవరైనా బంధుమిత్రులు కలిసినప్పుడు "ఎలాఉన్నారు"? అని ఈయన్ని కుశల ప్రశ్నవేస్తే, "హమ్‌క్యామేహై" అనేవారు (టెలిఫోన్ ఎక్స్ఛేంజ్ వాళ్ల 'ఆప్‌క్యామేహై' అన్నట్లు).

'కట్టెలే చుట్టాలు'- ఈయనకి రకరకాల చేతికర్రలు పోగుచెయ్యడం ఒక సరదా. ఒక సభకి చేతికర్రతో వెళ్లారు. ఆయన్ని చూసి ఎవరో 'అప్పుడే కర్రపట్టుకున్నారేమిటి?' అన్నారు. వెంటనే ఈయన 'కట్టెలే చుట్టాలు కదా' అన్నారు!

'రంభ' - అధికార భాషా సంఘం అధ్యక్షపదవి లభించినందుకు ఒక మిత్రుడు అభినందిస్తే, "ఈ వయస్సులో రంభనిస్తే ఏం చేసుకోను?' అన్నారు!

'పాతచింతకాయ పచ్చడి'- అదే సందర్భంలో మరో మిత్రుడితో 'అది పాతచింతకాయ పచ్చడి, జబ్బువాళ్లకే ఇస్తారు' అన్నారు!

'వైద్యోనారాయణోహరి'-"అంటే, వైద్యుడు వచ్చి 'నారాయణ' అంటాడు, పేషెంట్ 'హరీ' అంటాడు" అని అర్థం చెప్పేవారు!

['అ.ఛా.]



## మరికొన్ని 'వరదోక్తులు'

### సామెతల శైలిలో

- 'బ్రహ్మ జ్ఞానులు వచ్చారు బట్ట గుడ్డలు భద్రం
  మహానాయకులొచ్చారు మనీపర్సులు భద్రం'.
- 'బాపడికి పప్పాశ, మంత్రికి మందాశ, అల్లుడికి అత్తాశ'
- 'పదవి పోయినవాడూ పదం పాడిన వాడూ ఒకటే'.
- 'భిక్షానికి వచ్చినా బిగుమానం చావలేదు
  చందాకు వచ్చినా హుందా చావలేదు'.
- 'భోజనం చేసిన వానికి అన్నం వేడుక,
  ఎం ఎల్ ఏ కు ఎన్నికల వేడుక
  బోడితలవానికి తలంటువేడుక'.
- 'మంచి ఎం ఎల్ ఏ అని దండం పెడితే
  శ్రీఘ్రమేవపయోజన పుత్రప్రాప్తిరస్తు అన్నారట'.

[నోట్‌బుక్స్‌లో దొరికినవి]



# అనుబంధం

## నామసూచిక

[ఇందులోని లేఖలూ, వ్యాసాలూ, పత్రాలూ, సమీక్షలూ మొదలైనవి రాసిన వారి నామసూచిక]

ఆనాటి స్వర్ణయుగంలో భాగం గానే పరిగణించాలి....మొత్తంపై అందరు నేడు స్మృతి మాత్రులు గా మిగిలినవారే.

వరద రాజేశ్వరరావు గారు ఈ స్కెచ్‌లను ఆయాకవుల జీవిత చరిత్రలుగా ఉద్దేశించలేదు. కేవలం వారి గురించిన తన జ్ఞాపకాల కథనంగానే ఉద్దేశించారు. అయినా ఈ వ్యాసాలలో ఆ కవుల విభిన్నవ్యక్తిత్వాలు సజీవంగా, సచేతనంగా రూపుకడతాయి. ముఖ్యంగా రచయిత కథనం బందరు, బెజవాడ, తెనాలి, విశాఖ, మద్రాసుల చుట్టూ తిరిగింది. ఆ రోజుల నాటి ఆ పట్టణాలు, ఆ వాతావరణం ఈ పుస్తకం పేజీలలో మన కళ్ళకు కడతాయి.

అందరిలోకీ ఎక్కువగా శ్రీ శ్రీతో వరద రాజేశ్వరరావుగారి మైత్రి మరీ గాఢం. శ్రీ శ్రీ రామకృష్ణారావుగారి అభిమాని, శిష్యప్రాయుడు. వరద రాజేశ్వరరావు ఆయన కుమారుడు. కనుక వారిది చిరకాలమైత్రి. అయినప్పుడు శ్రీ శ్రీ గురించి మరి కొంచెం విపులంగా వ్రాయవలసింది. అందరిలోకీ తక్కువ వ్రాసింది శ్రీ శ్రీ గురించే. రెండు పేజీల లోనే సరిపెట్టారు. అయితే, శ్రీ శ్రీ ఇతర కవులకు సంబంధించిన వ్యాసాలలో తరచుగా ప్రత్యక్షమవుతూనే వుంటాడు. అబ్బూరి, విశ్వనాథ, దేవులపల్లి, జలసూత్రం, కొంపెల్ల వంటి కొందరిపై వ్రాసినవి మరీ మరీ బాగున్నాయి.

అడవి బాపిరాజు గారి కవితను ఉద్దేశించి "మీకు రాయడమే ప్రధానంగా కనిపిస్తోంది" అని తాను అన్నట్టు రచయిత వ్రాశారు. బాపిరాజుగారు కవిగా కంటె నవలా రచయితగానే ఎక్కువ స్మరణీయులు. కాని, ముద్దుకృష్ణ వైతాళికులలోచేర్చిన రావోయి చిన్నవాడా, ఉప్పొంగి పోయింది, వంటి అయిదారు గీతాలు చాలవా బాపిరాజుగారిని ఉత్తమ కవిగా నిలపడానికి?

నారాయణబాబు గురించి వరద రాజేశ్వరరావుగారి వ్యాఖ్యలతో ఏకీభవించని వారికంటె ఏకీభవించేవారే ఎక్కువగా వుంటారు. ...

వరద రాజేశ్వరరావు గారితో ఒకందుకు కొంచెం తీవ్రంగాను, దీర్ఘంగాను విభేదించక తప్పదు. వృత్త ఛందస్సుపట్ల ఆయనకు వల్లమాలిన అభిమానం.ముక్త ఛందస్సుపట్ల అంతే వల్లమాలిన వైముఖ్యం.

సాంప్రదాయిక పద్య ప్రక్రియ పట్ల ఆయన కున్న అభిమానంతో ఎవరికీ పేచీ వుండదు. దాదాపు వెయ్యేళ్ళపాటు నన్నయ పెట్టిన ఒరవడి తెలుగు కవిత్వ స్వరూపాన్ని శాసించింది. తెలుగువాడు పద్యం కట్టే పద్ధతి పూర్తిగా తెలుగు వాడిదే. వృత్త ఛందస్సు సంస్కృతం నుంచి దిగుమతి అయినా, కన్నడంలో మనకంటె ముందుగానే పద్యచ్ఛందస్సువున్నా, పద్యం తెలుగువాడి ప్రత్యేకత. నిజమే, కాని, తెలుగు పద్యం మీద మమకారంతో ఈనాటి వచన కవితను త్రుణీకరించవలసిన అవసరం లేదు.

రోజులు మారినప్పుడు కొత్త పరిస్థితులు, కొత్త జీవనవిధానం వచ్చినప్పుడు కవిత్వ స్వరూప, స్వభావాలు కూడా మారుతాయి. పద్యాన్ని ఎల్లకాలానికి పట్టుకుని వేళ్లాడాలనడం గుండుగీయించుకుని పిలకా, బొట్టూ పెట్టుకుని, సూటూ బూటూ ధరించడం లాంటిది. యుగధర్మం అని ఒకటుంటుంది. ఇప్పటికీ రామాయణ, భారతాలను, పురాణాలను పురాణశైలిలోనే వ్రాసేవారు వుండవచ్చు. కాని, అవి ఈ యుగధర్మాన్ని ప్రతిబింబించలేవు. ఇప్పటికీ మన దేశంలో ఎడ్లబళ్ళున్నాయి. కొన్ని సందర్భాల్లో వాటి అవసరాన్ని కాదనలేముకూడా. కాని, అవి చనిపోయిన యుగం తాలూకు